


చెన్నపట్టణము ౧౯౨౭ ఆగస్టు

సంపుటము ౪ ప్రభవ సంవత్సరము శ్రావణమాసము సంఖ్య ౮

# హృదయావేదనము

జనమంచి సీతారామస్వామి గారు

మతము లనేకముల్ గలిగె మానవలోకమునందుఁగాని, యే
మతమును నిన్నుఁ బూర్ణముగ మాకెఱిఁగింపఁగఁజాలదయ్యె నే
గతినిఁక నీమహామహిమఁ గన్గొని ధన్యుఁడనౌదుఁ దెల్పవే
మతిఁగల సందియంబులనుమాన్పవె సర్వజగద్గురూత్తమా.

మ. జనకాదుల్ మునువన్నెకెక్కిరఁట సంసారంబునందుండియున్
ఘనసుజ్ఞానులుగాఁగ నక్కథలు నిక్కంబో యబద్ధంబులో
యనుసందేహము దీరకున్నయది దేవా, ఘోరమౌసంసృతిన్
మనువాఁ డెట్టులు తద్విచారశతముల్ మాన్పించుకోఁజాలెడిన్.

చ. ఘనతర శంభుకార్ముకము గ్రక్కున రాముఁడు ప్రక్కలించి సీ
తను మును పెండ్లిచేసికొనుదాఁక విచారము నొందకుండెనే
జనకుఁడు కూఁతుఁగూర్చి; యిఁకసంసరణంబున నన్యులెవ్విధిన్
మనఁగలరయ్య శాంతియుతమానసులై సతతంబు నీశ్వరా.

ఉ. కుమ్మరపుర్వు పంకమునఁ గ్రుమ్మరుచుండియు నెప్డుఁదన్కళం
కమ్మును బొందకుండెడిని గావున జ్ఞానియు నట్లె నిర్వికా
రమ్మున సంసృతి న్గరము రాజిలవచ్చునటండ్రు గాని, సా
ధ్యమ్మగునో క్కొ. యూర్ముల మహాబ్ధివిలంఘనకార్య మీశ్వరా.

చ. సిరిగలయప్డు నీపయిని జిత్తము నిల్వదటండ్రుగాని, పే
దఱికముమాత్ర మేపగిది దానిని నీపయి నిల్పు! మత్తతన్
సిరిగలవాఁడు మైమఱపుఁ జెందిన, బీదగృహస్థు దీనతన్
బరజనయాచనాద్యమిత బాధలఁ జెందకయున్నె రక్షకా.

ఉ. కోరిక లుజ్జగించిన నకుంఠిత మానసశాంతిఁ బొందఁగా
నేరుచు మానవుం డదియె నిక్కపుసాధన మింక నేదియున్
ధారుణి లేదులేదనుచుఁ దద్జ్ఞులు పల్కఁగ వింటిఁగాని యే
కోరికలేని యున్కి సమకూరు విధం బదియేది యీశ్వరా.

చ. అడుగుటకంటె ఘోరతరమైన విపత్తిలఁ గల్గనేర దె
న్నఁడుఁ జెయిసాఁచకుండఁగ దినంబుల బుచ్చుటె కష్టమంచుఁ దోఁ
చెడిని గుటుంబపోషణము చేయుట తప్పదుగాన! నాకు నీ
యడుగులు గొల్వ శాంతి యెటు లబ్బును నీకృపలేక రక్షకా.

చ. సిరులను రోసి సంతతముఁ జిత్తము నీపయి నెట్లు నిల్పెనో
పరమకవిత్వ హృద్యముగ భాగవతం బెటు తెల్గుచేసెనో
వెఱఁగు జనించుఁ బోతన కవీంద్రుచరిత్ర దలంచుకొన్న; నీ
కరుణయె కాక యందులకుఁ గారణ మింకెది యున్నదీశ్వరా.

ఉ. అందఱుఁ బోతరాజకవు లౌదురె యెంతగ దేవులాడినన్?
మందులు మాదృశు ల్గలరు తక్ష్మాతలమందు ననేకు లెంత యుం
గుందుచు దారపుత్త్రులనుగూర్చి; భవత్పదసేవ మాకునే
చందమునన్ లభించు నెటు సార్థకజన్ములమౌదు మీశ్వరా.

చ. ఎపుడును నంతరాత్మకు ననిష్టములౌ పనులే యొనర్చుచున్
గపటపుమాటలాడుచును గాలముఁ బుచ్చుచునుంటి నే యటం
చపరిమితార్తిఁ గుందుదు యథార్థముగా మదిలోనఁగాని మా
నుపుకొనఁజాల నాపల ననూన బలాఢ్యములౌట నక్కటా!

మ. మనసారన్ నినునొక్కసారి స్మరియింప న్నాకుఁ జేకూరెడున్
ఘనమోదంబు; సతమ్ము నీభజననేఁగావింపఁగా నేర్చినన్
గనునానంద మదెట్టిదో నుడువశక్యంబే ప్రభూ, కాని నె
మ్మనమున్ నిశ్చలమైనదాని నొనరింపంజాలు టెట్లీశ్వరా.

ఉ. ఎంతగఁ గొట్టుకొన్న మన సెన్నఁడు నీపయి నిల్వలే దయో
చింతల మున్గుచుండుఁ బలుచిక్కులఁ ద్రోయుచునుండు నెప్డు దు
ర్భ్రాంతులఁబట్టియుండును విరామము లేక యథేచ్ఛఁ దిర్గఁ గా
నంత సుఖంబులేదు నిజమయ్య కృపామతిఁగావు మీశ్వరా.

ఉ. నీకృపలేనిచో సలుపనేరఁడు మానవుఁ డెట్టి కార్యమున్
వాకొక్కమైన నెన్నఁడును బల్కఁగఁజాలఁడు; కా ల్కదల్పలేఁ
డే కరణిన్ జగజ్జనక; యెంతయు భక్తిని నిన్నుఁ గొల్చినన్
జేకుఱు భద్రముల్ గనుకఁ జేతులు మోడ్తును నీకు రక్షకా.

మ. సదయాత్ముండవు గాన నెప్పుడును మాసంరక్షణార్థంబె చే
యుదువే కార్యమునేనియున్ ధరణి మేమున్నంతకాలంబు; నా
కదియీ వేయిదియీవె యంచు మనుజుం డజ్ఞానియై నిన్నుఁదా
మదిఁ బ్రార్థింపఁగ నేల నీ వెఱుఁగవే మాకేది మేలో ప్రభూ.

ఉ. జీవమె యస్థిరంబనినఁ జెప్పఁగ నేల ధనాదు లెట్టివో
కావున వానిఁగూర్చి తనకాలము వ్యర్థముఁ జేయఁ బోక స
ద్భావముతోడ నిన్గొలువ ధర్మము మర్త్యునకండ్రు గాని, యీ
జీవము పాయునందనుకఁ జిక్కులు తప్పవె మాకు రక్షకా.

శా. స్వామీ! నీవెటు మమ్ముఁ ద్రిప్పిన నటుల్ వర్తింతుమయ్యా సదా;
కామాదుల్ విడిపించుకోఁగలమె నీకారుణ్యమే లేనిచో?
భామాభాగ్యవిమోహవాగురను జేఁపల్ వోలెఁ బొర్లాడుచున్
మేమేరీతి నినున్ భజింపఁగలమో నీవే యెఱింగింపుమా.

మ. ధనమో, లేకధికారమో గలిగినన్ దర్పాంధులై మన్నుమి
న్నును గానర్గద మానవుల్; తమకు మేనుల్ శాశ్వతంబానొకో
ఘనతల్ కాటికిఁగూడఁ దోడ్కొని చనంగా నేర్చినారో కటా!
మనుమూన్నాళ్లును దాముధర్మపథముం బాటింపలే రీశ్వరా!

చ. దినమున కొక్కపూఁటయినఁ దిండికి లేని దరిద్రులెందఱో
కనఁబడుచుండ, వారలకు గంజియుఁ బోయక, రెండుపూఁటలున్
దినిన సతృప్తులై కడుపె దేవుఁడుగా మనుచుండుదుర్ధనుల్
ఘనులఁట! యెట్టిదుర్దశనుగాంచెనో లోకము చెప్పశక్యమే?

శా. పైవేషంబును బట్టినూాదినయెడన్ బ్రహ్మణ్యులే యందఱున్;
నీవాడాబుకుఁ బొంగిపోదువనుచున్ నేనమ్మలేనైన, స
ద్భావంబు న్గలవారి కేల యిడుమల్ ప్రాపించునో, యెప్డు నీ
సేవల్చేయనివారికేల కలుముల్ చేకూరునో చెప్పవా?

మ. పగలున్ రాత్రియు నిర్ధనుండు పడుతాపం బెట్లుచల్లారెడున్?
భగవద్గీత పఠించినన్ దనకుటుంబం బొంగునే యన్నమున్?
జగమెల్లం ఘనమిథ్య బ్రహ్మమొకఁడే సత్యం బయన్తత్త్వమున్
దగబోధింపఁగవచ్చుఁగాని చలచిత్తం బోర్వఁగా శక్యమే?

చ. ఒకరిని దేహియంచడుగ కొక్కరి సేతఱినైన నిందసే
యక, యొకరిన్ స్వలాభమునకై నుతిసేయక ధాత్రి సర్వదా
యకలుషమానసుండనయి యన్నివిధంబుల నీకుఁ బ్రీతిగ
ల్గుకరణి నేను వర్తిలఁగఁ గోరితిఁ దోడ్పడవయ్య రక్షకా.

మ. ధనమిమ్మంచు నొకప్పుడున్, యశము నొందం జేయుమం చింకొక
ప్డును, నారోగ్యమొసంగుమం చొకతఱిన్, బుణ్యాత్ముఁ గావింపవే
యని వేఱొక్కనిమేషమందును, నినుం బ్రార్థించు చున్నందుకున్
ననుఁదండ్రీ! క్షమియింపవే. విసుగుఁ జెందంబోక సర్వేశ్వరా.

శా. నిన్నే తల్లిగఁ దండ్రిగా సఖునిఁగా, నిన్నే గురూత్తంసుఁ గా,
నిన్నే రాజవరేణ్యుఁగాఁ దలఁచుచున్ నీప్రాపె యర్థించుచున్
నిన్నే సర్వవిధంబులం బొగడుచున్ నీయిష్టమే సల్పుచున్
నిన్నే నమ్మికయున్నఁగాని సుఖమున్నేమాకు సర్వేశ్వరా.

ఉ. ఎందఱులేరు నాటకము లెన్నో రచించినవారు భూమిపై;
నందెది యేనియున్ భవదనంతరసాంచిత విశ్వనాటకం
బందలి పాత్రపోషణమహాద్భుతకౌశలరామణీయకం
బందు శతాంశమైనఁగలదా కవియన్నను నీవెకా ప్రభూ!

---

# నాచికేత శబ్ద వ్యుత్పత్తి

డా. గుండేరావు గారు

ఇదివరకు అక్షయ సం. వుష్యమాస భారతి సంచికయందు కవివరేణ్య దగ్గుబల్లి దుగ్గనగారి నాసికేతోపాఖ్యానమును గురించి శ్రీయుత ఓకుమళ్ల అచ్యుతరావు యం.ఏ., యల్. టి. గారు సూక్ష్మనిరీక్షణపూర్వకముగా విమర్శించియున్నారు. అందు కఠోపనిషత్తు మహాభారతములందు వర్ణింపఁబడిన నాచికేతోపాఖ్యానముయొక్క సారాంశములను తులనాత్మకదృష్టిచే ననువాదమును చేసి దగ్గనకవీశ్వరుని నాసికేతోపాఖ్యానముయొక్క మూలకథనుగూడ సంగ్రహించివ్రాసియున్నారు. మఱియుఁ గథాసందర్భమునుబట్టి నాచికేతశబ్దముయొక్క వ్యుత్పత్తిని విమర్శించి నాచికేతోపాఖ్యానము కాదనియు నాసికేతోపాఖ్యానమే శుద్ధమనియుఁ బ్రతిపాదించి యున్నారు. ఇట్టిసమర్థనము క్రిందనుదాహరించిన కారణములనుబట్టి విచారణీయమే కాక నాచికేతమనుశబ్దమె సమంజసమని నాకుఁ దోఁచుచున్నది.

శ్రీయుత వ్యాసకర్తలు నాచికేత-నాచికేతు-నాసికేత యని మూడుప్రకారములుగానీ శబ్దము వ్యవహరింపఁబడుచున్నదని చూపి, కథాంశమునుబట్టి నాసిక + ఇతః = ముక్కు (ద్వారా) ప్రవేశించిన (వాఁడు) అని విగ్రహము చూపి నాసికేతశబ్దసాధుత్వమును దృఢీకరించియున్నారు. ఇంతియకాక ప్రొఫెసర్ క్లేయస్ గారు "నాసికేతరిచరిత్ర" అని వ్రాసియున్నారనియు, మఱియు డాక్టర్ భాండార్కర్ గారి గ్రంథభాండాగారమునందు రెండు సంస్కృత లిఖితగ్రంథములలో "నాసికేతః" అను శబ్దమే యున్నదనియుఁ బ్రమాణములఁ జూపియున్నారు. మఱియు నీశ్లోకమునుగూడ నుదాహరించి యున్నారు:

శ్లో. నాసికాంత స్సముద్భూతః సర్వలక్షణసంయుతః,
నాసికేతు రితి ఖ్యాతః మునిభిః కృతమంగలః.

సంస్కృతవాఙ్మయమునందు నాసికా శబ్దము ఆకారాంతముగనె పఠితమయియున్నదిగాని అదన్తమనగా హ్రస్వాకారాన్తముగా నెచ్చటను కానుపించదు. అమరకోశకారుఁడు కూడ—

శ్లో. క్లీబే ఘ్రాణం గంధవహా ఘోణా నాసా చ నాసికా

అని స్పష్టముగా వ్రాసియున్నాడు. "ఇతః" అనుశబ్దము "పుట్టియున్నది" అను నర్థముగల "తదస్య సంజాతం తారకాదిభ్య ఇతచ్." పాణిని సూ. 5-2-36-ప్రకారముగా తద్ధిత ప్రత్యయమా, లేక "పో" అను నర్థముగల "ఇణ్" ధాతువువలన "కర్త్రర్థక క్త ప్రత్యయము" చేర్చగా నిష్పన్నమైన రూపమా? మొదటి పక్ష

ము నవలంబించినయెడ, మొదట ముక్కు లేని వాఁడు, తర్వాత ముక్కు గల్గినవాఁ డని యర్థము కాఁగలదు. ఇంతి మకారాక "నాసికితః" అనియె శబ్దరూపము నిష్పన్నమగును గాని నాసికేతః అనురూపము కలుగఁజాలదు. మఱియు "ఇతచ్" ప్రత్యయమె యయినయెడల తారకాద్యాకృతిగణమునందు పఠింపఁబడినశబ్దములకే యీప్రత్యయము కలుగును గాని తదితరశబ్దములమీఁద నీప్రత్యయమును పెట్టుటకు వీలులేదు. తారకాద్యాకృతిగణమునందు నాచికేత-నాసికేతశబ్దము పఠింపంబడ లేదు.

రెండవపక్షము నవలంబించిన యెడల "ఇతః" అనఁగాఁ బోయినవాఁ డని యర్థము కాఁగలదు గాని ప్రవేశించినవాఁ డని యర్థము గాఁజాలదు. ఇదె యర్థము నిజమయిన యెడల "నాసికేతః" అను శబ్దమునకు క్రిందఁ జూపిన ప్రకారముగా వ్యుత్పత్తి కలుగవలయును: నాసికాయాః + ఇతః=ముక్కువలన బయలు దేరినవాఁడు; ఈయర్థము పై నుదాహరించిన శ్లోకతాత్పర్యమునకు నత్యంతానుకూలముగా నున్నదిగాని ఆశ్లోకమందు "నాసికేతుః" అను శబ్దము ప్రయోగింపంబడియున్నది. క్త ప్రత్యయమునకు "ఉ" కారము పుట్టినట్లు ఇదివరకు నెక్కడనువినుటలేదు. నాసికా + ఇతుఃఅనియు నొకవిగ్రహ మూహింపవచ్చును గాని"ఇతుః" అనునది ప్రత్యయమా? కృదంతమా? సుబంతమా? అవ్యయమా? ఈకారణము వలననే తారానాథ్ తర్కవాచస్పతిగారు నాచికేతుః అనుశబ్దమునకుఁగూడ లిపి కరప్రమాదజనితమని నిశ్చయించియుండవచ్చును. నాసికాశబ్దమునకు నీరీతిగా నర్థసందర్భము, అదియు దుగ్గనకవీశ్వరుల నాసికేతోపాఖ్యానకథా సందర్భమెంతమాత్రము అనుకూలముగానున్న నుశబ్దసాధుత్వము బొత్తిగా కుదరనట్లున్నది. క[illegible] నాసికవలన పోయినవాఁడని యర్థముచేసినను, "నాసికేత ఇతి ఖ్యాతః మునిభిఃకృతమంగలః" అనియె శుద్ధపాఠము సమంజసము. వర్ణోచ్చారవిషయమందు భారతేతర శర్మిణ్యాది దేశీయవిద్వాంసుల వచనములు ప్రమాణార్హములు కావని వేరుగాఁ జెప్ప నవసరము లేదు. మనభారతవర్షమునందే దేశభేదము వలన వర్ణోచ్చారభేదము ప్రత్యక్షముగా ననుభూత మయియున్నది. విశేషతః తెనుఁగు భాషయందు సకారము ఇతర భాషలయందున్న చకారమునకు తప్పక వినిమయమని చెప్పవచ్చును.

ప్రాచీన లిపిగ్రంథములయందు నాసికేతః అనుశబ్ద మున్నదని అదియే సాధువు అని చెప్పుటకు సాధ్యముకాదు. అటులయినచో "పురాణ మిత్యేవ న సాధు సర్వం" అనుప్రాచీన న్యాయము వ్యర్థము కాఁగలదు.

శ్రీయుత వ్యాసకర్తలు నాసిక + ఇతః అను వ్యుత్పత్తినిచూపి నాసికశబ్దమునకు ముక్కుద్వారా అనుఅర్థము విశదీకరించియున్నారు. కాని యీయర్థము నాసికశబ్దమునకు వాచ్యార్థము కాదు. లక్ష్యార్థ మనుటకు నేవిధ మయిన అనుపపత్తి కానుపించదు. వ్యంగ్యార్థము అనినయెడల అట్టిసందర్భము బొత్తిగాఁ గనుపింపదు. ఇదే రీతిగా"ఇతః"అనుశబ్దమునకు

ప్రవేశించినవాఁ డనుఅర్థము చెప్పుటయందు అసందర్భములు గలుగును.

కఠోపనిషత్తునందు తైత్తిరీయబ్రాహ్మణ తృతీయాష్టక ఏకాదశప్రపాఠకమునందు "నచికేతస్" అనుశబ్దమే పఠింపఁబడియున్నది. మఱియు "చి"కారము స్వరితస్వరములో నున్నది. శంకరాచార్యప్రభృతి భాష్యకారులు కూడ "నచికేతసా ప్రాప్తం = నాచికేతం" అనియే వ్రాసియున్నారు. మహాభారతమునం దనుశాసనికపర్వము 106 అధ్యాయములో నాచికేతః అను అకారాంతశబ్దము ప్రయోగింపఁబడియున్నది. ఎటులయినను అజన్తహలన్తములకే వ్యత్యాసము కనుపించుచున్నది కాని చకారమునకు సకారము మార్చినట్టు కనుపింపదు. నాసికేతశబ్దమే శుద్ధశబ్ద మని గ్రహించి, నాసికాశబ్దమునకే "పద్దన్నో మాస్" అనుపాణిని 6-1-63 సూత్రప్రకారము నస్ ఆదేశమయి, నసికేతః అనుశబ్దము పుట్టి, తదనంతరము నచికేతస్శబ్దము పుట్టిన దని కల్పించుటకు కూడ అవకాశము లేదు. ఎందుకనగా నిట్టిపరిస్థితిలో నీసూత్రమునకు ప్రసక్తియే కలుగదు. మఱియు ముక్కు-ద్వారా పుట్టినవాఁడని యౌగికార్థమే నిజమయినయెడల నీయర్థము మూలశబ్దము, అనగా "నచికేతాః" అనుశబ్దమందే సమావేశము కావలయును. అది సంభవింపదు. దీనికిఁగూడ మీఁద చెప్పిన సూత్రమే ప్రమాణము. ఇట్టి యసందర్భస్థితియందు కేవల మర్వాచీనకవికల్పనామూలక యౌగికార్థసమర్థనార్థమే శబ్దశాస్త్రప్రసిద్ధమగు "నచికేతాః" అనుశబ్దప్రక్రియను తిరస్కరించుట చాల శోచనీయముగా నున్నది. కఠోపనిషత్తునందలి నాచికేతుఁడు తనజనకునితో "సర్వస్వయాగముఁ జేసితివి; నన్ను ఎవనికి దానము చేయఁగలవు" అని స్వయముగ ప్రశ్న చేసియున్నట్లు చెప్పఁబడియున్నది. మఱియు నాచికేతుఁడు యమపురికి వెళ్లినప్పుడు యముఁడు తన మందిరమునందు లేనట్లు, యమునిరాకకు మూఁడుదినము లుపవాసముండి ప్రతీక్షించుచుండఁగా యముఁడు వచ్చి తనయతిథి యైన నాచికేతుఁడు ఆతిథ్యరహితుఁడయియున్నాఁడని పరితపించి మూఁడువరముల నొసంగినట్లు వర్ణింపఁబడియున్నది. దీనికి విరుద్ధముగ భారతమునందు ఔద్దాలకి తనకుమారునికి "కలశమును, దర్భలను, పుష్పములను నదీతీరమునందు మరచి వచ్చి నాను; త్వరితముగ వెళ్లి తీసికొని రమ్ము" అని చెప్పఁగ నాచికేతుఁడు నదీతీరమునకుఁ బోయి చూడనవి యన్నియు నదీవేగముచేఁ గొట్టుకపోయియుండుటచే తిరిగివచ్చి లేవని చెప్పఁగ, ఆఁకలి గొనియున్న ఔద్దాలకి క్రోధావేశముచేఁ దనకుమారునికి మరణశాప మొసంగె ననియు, తదనంతరము నాచికేతుండు యమసభఁ బ్రవేశింపఁగా యముఁడు వానిని ఆసనార్ఘ్యోపాయనములచే సత్కరించె ననియు వ్రాయఁబడియున్నది. కఠోపనిషత్తునందు యముఁ డొసంగిన మూఁడవ వరమనఁగా జీవ-బ్రహ్మ-జ్ఞానోపదేశమే ముఖ్యవిషయము. భారతమునందు ఈ కథ గోదానప్రశంసావసరమున నుదాహరణముగఁ జెప్పఁబడియున్నది. యముండు నాచికేతునిఁ దనసువర్ణశకటమునందుఁ గూర్చుండఁ

బెట్టుకొని దివ్య తేజోమయమయిన ప్రాసాదాదులను జూపి, ఇట్టిమహాభోగములు గోదానములు చేయువారికి లభించు నని చెప్పెను.

ప్రతిపాద్యవిషయమహాత్మ్యమునుబట్టి కథాముఖ్యాంశములయందు భేదము అయియుండవచ్చును. కాని కథానాయకునినామము మార్చుటకు అవకాశము లేకపోయెను. దుగ్గనకవీశ్వరుల వారి మూలకథను జూడఁగ మహర్షియాశ్రమమున చంద్రావతీప్రసూతి, మఱియు నాసారంధ్రమువలన శిశూత్పత్తి- ఈ రెండువిషయములు రామాయణ, మహాభారత కథాచ్ఛాయను నిస్పష్టముగా తెలుపుచున్నవి. కనుకదుగ్గనగారి నాసికేతోపాఖ్యానముయొక్క- మూలసంస్కృతమాతృక యెంతప్రాచీనమైనను మహాభారతమునకు పూర్వముగాదనిసంస్కృతవాఙ్మయేతిహాసక్రమము ననుసరించి కూడ చెప్పవచ్చును. ప్రస్తుత కథాభాగము ననుసరించి కథానాయకుని నామమునందు స్వరవర్ణ విపర్యాసము కూడ సహృదయహృదయామోదకరమె కాని శబ్దసాధుత్వము కలుగనపుడు ఈ చారుతాతిశయము క్షమ్యముగాదనితోఁచుచున్నది. ఈకారణమువలన నీకథామాతృకకూడఅర్వాచీనమనియే నిశ్చయించుటకుసందేహము లేదు. అథర్వోపనిషద్బ్రాహ్మణములయందు, తదనుసారి భారతమునందుప్రయోగింపఁబడిన నచికేతస్ నాచికేత శబ్దములే సాధువులు గాని, నాసికేత నాసికేతు నాచికేతు అను శబ్దములు శాస్త్రసిద్ధములు కావు.



## గుసగుసలు (బధిరగీతి)

ఈశ్వరగారు

ఏదియో నాలోని-గుసగుస లివి—తమోని
లీనగంభీర నీరవ నిశానిశీథి
పొరపొరలు విచ్చుకొను తొలిపూతపొడుపు
టూరుపుంగన్నె ఢాకకే తేరుకొనెడు-
ఏదియో నాలోని గుసగుసలివి—విలోల
తారకాలోకమందస్మితంపు జిలుఁగుఁ
గదలికలలోని యమృతంపు గళికలూది
యూది విశ్వాంచలమ్ముల కొత్తిగిలెడు.
ఏదియో నాలోని గుసగుస లివి—ఎఱుంగ
రానిసడి లోననే సడిలేనిపలుకు
లందుకొని యందుకొని యీయనంతబధిర
జీవితాశాంతిగీతి రచించుకొనెడు.

---




(గసడదవాదేశ స్థానసశబ్ద విచారము)

నడకుదుటి వీరరాజు పంతులు గారు

పూర్వము లక్షణగ్రంథకర్తలు పొందుచు వచ్చిన చిక్కులు పెక్కులు. గ్రంథసంపాదన సౌకర్యము లక్కాలమున మిక్కిలి తక్కువ. ఒక్కొక్క గ్రంథమున కొక్కొక్క ప్రతిని గడించుటకే యప్పుడు త్రిప్పలు గలుగుచుండెడివి. మఱియు నిప్పటి వలె వాదోపవాదములు గల వ్యాసరాజములచే నొప్పుపత్త్రికల ప్రచారములుగాని, తెల్లని కాగితములపై నల్లనగు నక్షరములతో, యతి ప్రాసములు విశదములగునట్లు పాదవిభజనము చేయఁబడిన పద్యములు గల ముద్రిత పుస్తకములుగాని యానాఁడు లేవు. గంటముతో వ్రాయఁబడిన దీర్ఘములగు తాళపత్త్రి గ్రంథములే వారికి శరణ్యములు. అయిననేమి? ఆ తాటియాకుఁ బొత్తములనే మనయార్యమహాశయులు తమముందు పడవైచుకొని మిక్కిలి యోపికతో వానియందుగల మహాకవిప్రయోగములను వెదకికొనుచు దొరకినవాని నెల్ల సమన్వయించుకొనుచు, నీరీతిని రాత్రులయందు (గాలికిఁ గదలియాడెడి యాముదపు దీపముల వెలుతురున) సైతము విసుపులేకుండఁ బరిశోధించుకొనుచుఁ బ్రమాణసహితములగు లక్షణముల నేర్పఱచుకొని మిక్కిలివేఁలైన లక్షణగ్రంథములను వ్రాసిపెట్టి కవిపండిత విద్యార్థిలోకమునకుఁ బరమోపకారమును గూర్చియున్నారు.

అభినవవాగనుశాసనబిరుదాభిరాముఁడగు కూచిమంచి తిమ్మకవి సార్వభౌముని సర్వలక్షణసారసంగ్రహము పైరీతిని వ్రాయఁబడిన యుత్తమాంధ్రలక్షణగ్రంథములలో నొక్కటి. ఆవిద్వత్కవి విశేష పరిశ్రమముమై ననేక పూర్వకోశములను బరిశీలించి చక్కని విభాగములతో బహులక్ష్యసమన్వితమగు లక్షణగ్రంథమును రచియించి యాంధ్రమహాజనుల కృతజ్ఞతకుఁ బాత్రుఁడయ్యెను.

ఏతద్గ్రంథమునుగూర్చి - రాజమహేంద్రవరమునుండి వెలువడు వజ్రాయుధపత్త్రిక 2 వ సంపుటము 3 వ సంచికయందు "సర్వలక్షణసారసంగ్రహము-సందేహములు" అను శీర్షికతో నొకవ్యాసము ప్రకటింపఁబడియెను. ఆంధ్రవిద్యార్థుల యుపయోగము పొంటె నందుగల సందేహములలో ముఖ్యములైనవానికి రెండిటికిమాత్ర మిందు సమాధానము లీయఁబడుచున్నవి.

### గసడదవాదేశ విచారము

1 "న విక్కృతిశబ్దాత్పరతః సాంస్కృతికానాం భవన్తి గసడదవాః"

(తెలుఁగుశబ్దములకుఁ బరమైన సంస్కృతపదముల కచటతపలకు గసడదవలు రావు.)

అను నాంధ్రశబ్దచింతామణి సూత్రము నకువిరుద్ధముగ గసడదవాదేశము గలిగిన యీ క్రింది మహాకవి ప్రయోగములను మూఁటిని మన లక్షణగ్రంథకర్త తన గ్రంథమున నుదాహరించెను:—

"(1) అవిముక్తం బవిముక్తం
బవిముక్తం బనుచుఁ బ్రాతరారంభములం
దవధానపరత నెవ్వం
డు పఠించును వాఁడు ధన్యుఁడు మునిప్రవరా!"
—శ్రీనాథుని కాశీఖండము.

"(2) అది మొదలుగాఁగ విష్ణుని
మది నిల్పి యతండు నాకు మగఁ డగు నని యి
ట్లు దపంబు సేయుచుండెద
నిది నా తెఱఁగనిన దానవేశ్వరుఁ డనియెన్."
—నిర్వచనోత్తరరామాయణము.

"(3) వివిధోర్వీపతులన్ జగన్నుతుల మున్వీక్షింపమో
వారి పెంపు వరీక్షింపమొ........."
—వసుచరిత్రము.

పైపద్యములయందు,

(1) ఎవ్వండు + పఠించు = ఎవ్వండు వఠించు అనియు,

(2) ఇట్లు + తపంబు = ఇట్లు దపంబు అనియు,

(3) పెంపు + పరీక్షింపమొ = పెంపు వరీక్షింపమొ అనియు,

తెలుఁగులపై వచ్చిన సాంస్కృతికంబుల పతప లకు వదవ లాదేశంబు లయ్యెను.

(ఈయాదేశము నిత్యమనుటకుఁ దగినప్రాఁపస్థాన ప్రయోగములనే మన తిమ్మకవి యిచ్చెను.)

ఈప్రయోగములను సమ్మతింపక వజ్రాయుధపత్త్రికావ్యాసవిలేఖకు లీ క్రిందిరీతిని సవరణలను జూపి, తిమ్మకవివ్రాఁత సముచితముగాదనిరి.

(1) ఎవ్వండు పఠించు—దీనిని 'ఎవ్వండు వచించు' అని సవరించిరి.

పై (మొదటి)పద్యమున 'అవిముక్త'మను నది మంత్రమని శ్రీనాథమహాకవి యాశయమైనట్లు స్పష్టమగుచున్నది. మంత్రము పఠించు, మంత్రము వచించు—వీనిలోని పదస్వారస్యమును బరికించునది.

(2) రెండవ పద్యమున, 'ఇట్లు దపంబు' అనుటకన్న 'భక్తిఁదపంబు' అని కాని, 'ఇచ్చఁ దపంబు' అనికాని సవరించిన సరిపడదా?— అని ప్రశ్నించిరి.

ఈసవరణలు సరిపడినను సరిపడకున్నను కవిబ్రహ్మయందు సబిందుక నిర్బిందుక ప్రాస సాంకర్యదోషము మాత్రము సరిగా పడును.

(3) 'పెంపు వరీక్షింపమొ' అను మూఁడవ యుదాహరణమును 'పెంపువిమర్శింపమొ' అని వీరు సవరించిరి. ఇంతకు మున్నే దీనిని 'విచారింపమొ' అని యొకరును, 'వితర్కింపమొ' అని మఱియొకరును, 'విలోకింపమొ' అని వేఱొకరును దోఁచినరీతిని సవరణలను బ్రతిపాదించియే యున్నారు!

తొల్లి మనవారు, ఏదే నొకప్రయోగమునకు లక్షణము నేర్పఱుపవలసివచ్చినప్పుడు, అద్దాని కాధారముగా మఱికొన్ని ప్రయోగములను జూచికొని, పిమ్మట దానిని స్థిరపఱుచుకొనెడివారు. అంతియ కాని, తమజ్ఞానమునకు సరిపడునట్టుగా, కనఁబడినవాని నన్నిటిని దోఁచి

నల్లిల్ల దిద్దునట్టి సాహసము వారికి లేకపోయె డిది. ప్రకృతకాలమున మనకు లభించెడు భారతాది ముద్రితగ్రంథములెల్ల నిట్టి పాటు లకు లోనైనవియే.

వికృతిపదములపై వచ్చు సంస్కృతశబ్దం బుల పరుషంబులకునయితేము గసడదవాదేశ ము నిత్యమే యనుటకు, సవరింప ననువుపడక యున్న 'శిలాక్షర' ప్రయోగములను గొన్ని టిని, గ్రంథస్థములై యున్న మహాకవిప్రయో గములను మఱికొన్నిటిని నిచ్చటఁ జూపు చున్నాను.

(1) యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము:-

"అనఘుండు నేకొని యిందు వ్రత్యక్షమై"

—౨౫, ౨౬ పంక్తులు.

ఇందు—ఇందు వ్రత్యక్షమై-అని 'ఇందు' అను తెలుఁగుశబ్దముపై వచ్చిన 'ప్రత్యక్షము' అను సంస్కృతపదము మొదట నున్న పకార మునకు వకారమాదేశమైనరూపము శిలపై స్పష్టముగాఁ జెక్కఁబడియున్నది.*

(2) ఓపిలిసిద్ధిరాజు కొణిదెన శిలాశాసనము:-

(a) క. ఇనుఁ డుదయమైనయట్టులు
మను వుదయంబైనయట్లు మఱి రఘురాముల్
జనియించినట్లు గలద
ర్ధనుఁ డోపిలిసిద్ధినిభుఁడు దా నుదయించెన్.

—౧౧౦ పంక్తి. ౧వ పద్యము.

ఇందును- 'అట్లు + కులవర్ధనుఁడు=అట్ల గులవర్ధనుఁడు' అనియు,

(b) చ. ...పిన్నసిద్ధనకు నమ్ముగదమ్ముఁడు వ్రతాపమ నన్..."
౧౩౦, ౧౩౧ పంక్తులు, ౨౩ ప

"తమ్ముఁడు + ప్రతాపమునన్ = తమ్ముఁడు వ్రతాపమునన్" అనియుఁ దెలుఁగులపై సాంస్కృతికంబులకు గవాదేశము క్రమముగ నయినట్లు చెక్కఁబడియున్నది.

(చూ. ఆంధ్రసా. పరిషత్పత్రిక, సంపు.౭, సం.౫,౬.)

పైమూఁడు నిచ్చకు వచ్చినట్లు దిద్ద ననువుపడని శిలాశాసనాక్షరములు.

మఱియు, ప్రౌఢవ్యాకరణకర్తలగు సీతా రామాచార్యులవారును నీగసడదవాదేశము నకు సూత్రము నేర్పఱిచి యీక్రిందిప్రయో గముల నొసఁగియేయున్నారు:—

(3) (a) సర్వజ్ఞసోమనాథుని యుత్తరహరివంశ ము, చతుర్థాశ్వాసము—

"శా. వాల్గం జెల్లెసి........ ...వీ
ర ల్గోపించిన..................."

వీరల్ + కోపించిన=వీరల్గోపించిన అ గాదేశము గావింపఁబడినది.†

(b) అభినవదండి విజ్ఞానేశ్వరము, ప్రాయ శ్చిత్తకాండము, 49 పద్యము—

* యుద్ధమల్లుని బెజవాడశాసనమును బ్రకటించిన జయంతి రామయ్యపంతులుగారు, 'ఇందు' శబ్దము ప్ర ప్రకృతిక మను భ్రాంతిచేఁగాఁబోలు, ఆపత్రము 32 వ పారటయందు— "ప్రత్యక్షము—వకారము తప్పు. ఓం పూర్వకబకార ముండవలయును." అని వ్రాసినారు 'ఇందు' కళ. కాన నది యొప్పే.

† తరువాతి వ్రాయునపత్రికలో దీనికి 'వీరల్గోపిల్లిన' అనుసవరణ చూపఁబడినది. పూర్వము, అము గ్రంథచింతామణిపత్రికయందు బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారు, 'వీరల్గ జూచి' అని సవరి చియున్నారు. పైసవరణకంటె నిది కొంతవఱకుసోమునికవనమును బోలియున్నది గాని మనపండితు లీవిధముగాఁ కవిత్వమును బూర్వకవనమునందు దూర్పఁయత్నించుటమాత్రము శోచనీయముగా నున్నది.

"క. భూవల్లభు, వేసవిదుని,
దైవతేమును దిట్టినతఁడు దండువు పేరఁగ
వేవణముల నెనిమిదిటిని........."

వే + పణములు = వేవణములు (ఇది వేగే తులవంటిది): ఇచ్చట వాదేశ మయ్యెను.

ఇట్టి పూర్వకవిప్రయోగము లనేకము లుండుటచేతనే విన్నకోట పెద్దనకవీంద్రుఁడు తన కావ్యాలంకారచూడామణి నవమోల్లాసము సంధిపరిచ్ఛేదమున,

"క. రుచిరముగఁ బలుకుచోటను
బ్రమరంబుగఁ బ్రకృతులపైఁ బ్రకృతులం దెను న
క్కృతులకుసంబులపట్టం
బ్రమరించుం గసడదవలు పరిపాటి మెయిన్."

అనులక్షణము సెప్పి,

"గీ. విశ్వవిభుఁడు గడిఁదికోరుండు ప్రకురుండు
దక్కుఁ డెక్కు లేని చొక్కులాఁడు
దత్త్వవిదుఁడు ప్రరవిదారణశీలుండు
ననఁగ దెనుఁగుసంధి నలరు నిట్లు.

అను తనలక్ష్యముతో 'చొక్కులాఁడు' అనువికృతి పదముపై వచ్చిన 'తత్త్వవిదుఁడు' అను సాంస్కృతికంబునకు సరళా (దా) దేశమును జూపియున్నాఁడు.

ఇవి గాక,

(1) "క. మార్గ కుమార్గము...దు,
ర్మార్గపనవర్తు లగువా
మార్గవులన్............."
—కవిరాజశిఖామణికుమారసంభవము, 1 ఆ. 28 ప.

(మాఱు + కవులు = మార్గవులు.)

(2) "చ. జగముల నెల్లెడన్.... ఎం
తగుమతులైన......"
—కవిబ్రహ్మ యుద్యోగపర్వము, ప్రథ. 286

(ఎంత + కుమతులు = ఎంతగుమతులు.)

ఇత్యాది సమాసములలోని సరళాదేశమున కాధారము సైతము పైనిత్యసంధివిధియే యని యెఱుంగనగును.

పై యనివార్యలక్ష్యలక్షణములను బట్టి యెల్లప్రథమలమీఁదను వచ్చు నెల్లశబ్దంబుల పరుషంబులకును నెల్లచోట్లను * గసడదవాదేశము నిత్యమే యనియు, కావుననే తిమ్మకవిచంద్రుని లక్షణము ప్రమాణయుక్తమనియు, దానం జేసి "నవికృతిశబ్దాత్ పరతః సాంస్కృతికానాం భవన్తి గసడదవాః" అను సూత్ర మాధారరహిత మనియు సిద్ధాంతమగుచున్నది.

స్నానశబ్దవిచారము

II. సంయుక్తాక్షరయతికి లక్షణమును జెప్పుసందర్భమునఁ దిమ్మకవి, 'స్నాన' శబ్దము స, త, న కారములలో దేనికైనను యతి సెల్లునని వ్రాసి,

"స్నానముఁ జేసి ధాతపరి + ధానముఁ గట్టి"
—హరవిలాసము.

"స్నానమును సంధ్యయును బిత్రు + తర్పణంబు"
—విష్ణుభజనానందము.

* గసడదవాదేశము ప్రాసములయెడమాత్రె మగుననియు, వళులయందు గా దనియుఁ గొందఱు వ్రాసియున్నారు. కాని, పైశిలాశాసనాదులం బట్టియు, 'సీ.పా...వేణి సరస్వతి + పెన్న'—పెన్న అనుటకు బెన్న అని యతిస్థానమున వాదేశముం గావించిన భట్టారకమహాశయుని (సభాపర్వ. 1 ఆ. 71 ప.) సుప్రయోగమును బట్టియు నీగసడదవాదేశ మెల్లచోట్లను నిత్యమే యని నిర్ధారిత మగుచున్నది.

"స్త్నానంబు దీర్చి ధౌ
+తములైన వస్త్రముల్."

—మత్స్యపురాణము.

అను మూఁడులక్ష్యముల నిచ్చెను. దీనిని విమర్శించుపట్టున వజ్రాయుధపత్త్రికా వ్యాస విలేఖకులు "స్నానశబ్దమునకు స్త్నానశబ్దమును (తిమ్మకవి) కల్పించినాఁ"డని వ్రాసినారు.

మహాకవిప్రయుక్తము లగు మూఁడు భిన్నలక్ష్యములను జూచికొని యాతఁడు లక్షణము నిచ్చియుండఁగా స్త్నానశబ్దము నాతఁడు గల్పించెననుటయం దర్థ మేమియును గానరాదు. కలిగినశబ్దమును దెలిసికొనుటకే కాని లేనిశబ్ద(పదమును) గల్పించుటకు మనుష్యమాత్రుఁ డెన్నఁడును సమర్థుఁడు గాఁజాలఁడు. శబ్దసిద్ధికి లోకమే యాధారము.

పిమ్మట నీవిమర్శకులు "స్త్నానశబ్ద మని యతిని సమర్థించుకొనుటకంటె 'తాన' యని తెలుఁగుపదము చేర్చుకొనరాదా? యతిపోవునా? ప్రాసము పోవునా? ఇది సమాస గర్భితమా?" అని ప్రశ్నించుకొనిరి.

పై ప్రయోగములలోని కడపటి రెంటి యందును 'తాన'మును చేర్చినను నేదియుఁ బోదు గాని మొదలు స్త్నానశబ్దమునందు తకారమే లేదనినచో 'తాన' మను (అప్లవార్థక) వికృతపదమునకుఁ గల యుత్పత్తి మూలమే నశించిపోవును. ఇఁక 'సమాస గర్భితమా?' అను తమ ప్రశ్నమునకు,

ఉ. ధీనిధి పెట్టి నంబి తన
+దేహమునిండ విభూతి మంగళ
స్త్నానముఁ జేసి ధౌతపరి
+ధానముఁ గట్టి........."

అని స్త్నానమనునది సమాసగర్భిత మైయుండుటంజేసి 'తాన' మనుదాని నచ్చటఁ జొప్పింప ననువుపడక కాఁబోలు, "మంగళస్త్నాన మనునది సమాసగర్భితమే యని చెప్పవత్తురేమో! శాస్త్రనిషిద్ధపదమును శ్రీనాథుఁ డేల ప్రయోగించును?" అని తామే సమాధానము చెప్పికొని,

'స్నానముఁజేసి ధౌతవస
+నంబు ధరించి'

అని శ్రీనాథుఁడు వ్రాసియుండు నని లోకమునకుఁ దెలిపిరి. దీనినిబట్టి లేఖకులు స్నానశబ్దమున లేని తకారమును బెట్టి వీరుచెప్పిన శ్రీనాథుని ప్రయోగమునుమార్చివేసి యతిని సమర్థించుటకై 'పరిధానము'ను జేర్చినట్లు మన కర్థమగుచున్నది గదా!

"స్త్నానశబ్దమున 'తకారము' గలదనుట విచార్యము"అని పెద్దపెద్దపండితులే సంశయించుచుండఁగా, సామాన్య లేఖకుఁ డొకఁడు (దానియందు తకార మున్నదో లేదో యెఱుఁగని వ్రాయసకాఁడు) స్నానశబ్దమున 'తకారము'ను దూర్చి దాని యతిని సరిపుచ్చుటకై 'ధౌతపరిధానము' అని సవరించి యాప్రయోగదోషమును శ్రీనాథ మహాకవిపైఁ బారలించియుండు ననుకొనుట యెంతయు నసంగత మని వేఱుగ వ్రాయనక్కఱ లేదు. ఇంకను లేఖకులు స్త్నానశబ్దమున తకార ముండుట నెఱుంగక దానిని వదలివేసి రనుట యుక్తియుక్తముగా నుండును గాని లేనిదానిని బెట్టి

రనుట యుక్తముగాదు. స్తానశబ్దమున తకారము గలదనుటకు మఱి రెండు మహాకవి ప్రయోగముల నిచ్చట నిచ్చుచున్నాను.

"స్తానమొనర్చి ధౌతపరి
+ధానయుగమ్ ధరియించి ....... "
ప్రౌఢకవిమల్లన రుక్మాంగదచరిత్రము, 1 ఆశ్వా. 95 ప.

"స్తానమహిమంబు భక్తితో
+శృర్యగరిమ......"
—శ్రీనాథుని కాశీఖండము, సప్త. 114 ప.

ఈరీతిని మహాకవులు స్తాన శబ్దమును తకారమునకు యతి సెల్లునట్లు ప్రయోగించియుండ, లేఖకమహాశయులు తమయజ్ఞానముచే నందున్న తకారమును విడిచిపెట్టి 'స్నాన'మనియే వ్రాతప్రతులయందు లిఖించినారు. కావుననే పైపొత్తములను ముద్రింపించిన పండితులు స్తానశబ్దమును తకార రహితముగనే (స్నాన-అని యతిని బరికింపకయే) యచ్చొత్తించినారు. (చూ. వావిళ్లవారి రుక్మాంగద, కాశీఖండములు; సరస్వతీపత్రికనుండి వెలువడిన హరవిలాసము. 1901.) మఱియు, "స్తానంబు దీర్చి..." అను మత్స్యపురాణ ప్రయోగమును లేఖకులు తకారశూన్యముగ వ్రాసియుండుటచేతనే, కవితాపత్రికయందు మత్స్యపురాణమును బ్రకటించిన శ్రీవేంకటరామకృష్ణకవులో, వారికి లభించిన తాటియాకుఁబ్రతిని వ్రాసిన లేఖకుఁడో దానియతి కుదరకపోవుటచేఁగాఁబోలు, (సీసపాదమగుటంజేసి) 'తానంబుదీర్చి' అని సవరించి యతిని సరిపుచ్చినారు!

ఇంతమందికవులు*స్తానశబ్దమును తకారయుక్తముగఁ బ్రయోగించియుండఁగా, ఇంతమంది లేఖకులు దానిలోని తకారమును వదలివేసియుండఁగా స్తానశబ్దమున తకారము నెవ్వరో చేర్చినా రని తలంచుట యసమంజసము గాదా?

కావున తిమ్మకవి యిచ్చిన మూఁడుప్రయోగములనుబట్టియు, పై కాశీఖండ, రుక్మాంగదచరిత్రముల ప్రయోగములను బట్టియు స్తానశబ్దమున తకారము గలదనుట సిద్ధాంతమగుచున్నది.

ఇఁక "శాస్త్రనిషిద్ధపదమును శ్రీనాథుఁడేల ప్రయోగించును?" అను పేరిసందేహమునుగూర్చి విచారింతము.

స్తానశబ్దము వ్యాకరణశాస్త్రనిషిద్ధపదమని పేరియాశయము. దీనినిగూర్చిన విశేషవాదమున కిందు చోటు లేదు. ఇది వేదవిధిసమ్మతమగుపదము. ఈవిషయము సీవిమర్శ

* శ్రీ పీఠికాపురసంస్థానాధీశ్వరులు సన్నిచోడనికుమారసంభవము వ్రాఁతప్రతినొకదానిని గొంతకాలముక్రింద వ్రాయించి తెప్పించియున్నారు. ఆప్రతియందు దశమాశ్వాసము 77-వ పద్యమున, "క. ఆహారి నిశిచి నిసర్గ, స్తైనహాంబునఁ బాలుతెంచెఁ జెచ్చెర........." అని స్తైనహశబ్దము తకారయుక్తముగ వ్రాయఁబడియున్నది. (ముద్రితపుస్తకమున తకారము తొలఁగింపఁబడినది. చూ. 10 ఆ., 442 పద్యము.) దీని యతిస్థానము తకారమును దెలుపకున్నను, ఆసొత్తము బూర్వమునుండియుఁ బరంపరగా వ్రాయుచువచ్చిన లేఖకులు మాతృకాపాఠ స్తైనహమును మాత్రము విసువక యందున్నతకారము వదలి యుంచుచువచ్చిన దాని కెంతయుసంతసింపవలసి యున్నది.

తెలుసయితేను "స్త్నాన మని వేదములో నున్న దని కొంద అందురు. అది నిరాకృత నే." అని సూచించినారు. ఇట్లు వేదోక్తపద మును వీరు నిరాకరించినను వ్యాకరణశాస్త్ర ము మాత్రము నిరాకరింపఁజాలదు. ఏలయన, వ్యాకరణము వేదమున కొకయంగము. అది దీనికి నమస్కరించును. శ్రీనాథాదులు సకల శాస్త్రపారంగతులును, వేదవిధిపరిజ్ఞాతలును నైన మహాకవిసత్తములు. కావుననే స్త్నాన శబ్దమును దమగ్రంథములయందు తకారము నకు యతి సెల్లునట్లు ప్రయోగించినారు.

స్త్నానశబ్దమున తకారము గల దనుట కాధారమైన ప్రాతిశాఖ్యసూత్రము నిచ్చట సంగ్రహముగ వివరించుచున్నాను:—

"అఘోషా దూష్మణః పరః ప్రథమోఽభినిధానః
ఉత్తమపరాత్ తస్య స స్థానః."
—(ఇది ప్లాక్షాయణుని సిద్ధాంతసూత్రము.)

[ఘోష=హకారము; శషసహ=ఊష్మములు.]

"హకారభిన్నమైన యూష్మమునకంటె, అనఁగా శషసలలో (దేనికైన) నొకదానికి, ఉత్తమవర్ణము (వర్గపంచమాక్షరము = అను నాసికము) పరమైనప్పుడు, ఆయూష్మము జని యించినస్థానమునందు పుట్టినవర్ణములలో అభి నిధాన మనుపేరు గల మొదటివర్ణము ఆగమ ముగా వచ్చును." అని పైసూత్రమునకుఁ దాత్పర్యము.

దీని వివరణ మెట్లన,

(1) చ ఛ జ ఝ ఞ య శ—తాలుజములు.
(2) ట ఠ డ ఢ ణ ర ష—మూర్ధజములు.
(3) త థ ద ధ న ల స—దంతజములు.

ఇందు, (1) తాలుజమైన శవర్ణమున దాని యుత్తమవర్ణ (అనునాసిక)మైన 'ఞ'అ నది పరమైనప్పుడు తత్స్థానవర్ణప్రథమాక్ష మగు చకార మాగమముగా వచ్చును.

ఉదా:—పద్భ్యాముదరేణ శిశ్చ్ఞా, అగ్నింహా అశ్చ్ఞే త్యస్మిత్రో న దూరాత్.

ఇట్లే (2) మూర్ధజమైన షకారమునకు ణవర్ణము పరము కాఁగా దాని ప్రథమాక్ష మగు టకారము వచ్చును. ఉదా:—తద్విష్ట పరమంపదమ్, కృష్ట్ణవర్త్మా మొదలగునవి. *

(3) కడపటిదైన దంత్యములలోని యూ ష్మమగు సకారమునకు దానియనునాసికమై నకారము పరమైనప్పుడు తత్స్థానప్రథమవ మగు తకార మాగమముగా వచ్చియే స్త్నా నాదిశబ్దంబు లేర్పడియెను.

ఇట్టి యుత్కృష్టమగు వేదవిధిని నిరా కరింప నెవ్వరితరము? దీని నెఱింగియే శ్రీ నాథాదిమహాకవులు స్త్నానశబ్దము నంత స్వే చ్ఛగా నుపయోగించియున్నారు. ఏతాదృ సుప్రయోగములను గావని మనయిచ్ఛ వచ్చినట్లు దిద్దఁ బ్రయత్నించుట న్యాయమా ప్రాతిశాఖ్య యనునది వేదములోని ప్రయోగ ములకు లక్షణము సెప్పునేకాని వ్యాకరణ శాస్త్రము దాని నంగీకరింప దని వీ రంద రేమో! అతివిస్తరమేల? వేదస్వరోచ్చరితప ములను, వేదోదితశబ్దములను, వేదపరిభాష యుక్తవాక్యములను మనయాంధ్రమహాకవుల

* "విష్ణు కృష్ణశబ్దములలో టకారము గలియనుచ్చరింతు"రని తరువాతివ జాయునప త్రిక వ్రాసియేయున్న

నిరంకుశముగా వాడిన ప్రయోగములలోఁ గొన్నిటినిమాత్ర మిందు వివరించుచు నీ విషయ మింతటితో విరమించుచున్నాను.

(1) తే. కలికి తెలుఁగ్గెంబు గొంపాడి + తానపాడి
దిగ్గియలచేరువలను బూ + దియయలందు
కాలమునఁ బల్కెను త్రియంబ + కం బ్రుబామ
హే యటంచును జలపక్షు + లెల్లరొడల"
—తెనాలి రామకృష్ణకవి యుద్భటారాధ్యచరిత్రము.

ఇందు మహయాంధ్రకవి సంస్కృతకవి యగుకాళిదాసువలెనే వేదస్వరము ననుసరించి 'త్రియంబకమ్' అని ప్రయోగించెను.

(2) ఉ. గోపబృహద్వ్యయాహితున
కుక్ షభుఁడైన పిశంగిలాంబుజా
క్షీపతి నంకరంగమునఁ
జెల్వుగఁ గాంచిన యాపిలిప్పిలా
చాపలలోచనేను నని
శంబు భగంబుగఁ జేయు దేవరక్
బ్రాపుగఁ దెండ్లియాడుపతి
పార్వతిముద్దులపట్టిఁ గొల్చెదన్.

ఈపద్యమున బృహద్వ్యయము (వాహనము), పిశంగిల (రాత్రి), పిలిప్పిల (లక్ష్మి) అను వేదోక్తపదములు ప్రయోగింపఁబడినవి.

(౧) గోపబృహద్వ్యయాహితుఁడు = వృషభవాహనుఁడగు శివునకు వైరి=మరుఁడు.

(౨) పిశంగిలాంబుజాక్షీపతి= రాత్రియను పద్మపడఁతికి భర్త=చంద్రుఁడు.

(౩) పిలిప్పిలాచాపలలోచనేనుక్ = లక్ష్మీదేవికిఁ బ్రభువు=విష్ణుఁడు.

పైపదములు, 'అశ్వోవైబృహద్వయః, రాత్రిర్వై పిశంగిలా, శ్రీర్వై పిలిప్పిలా' అను యాజుషబ్రాహ్మణప్రయోగములను బట్టి కైకొనఁబడినవి.

(౪) "సీ. అంశుమత్ఫలకు మ + ధ్యంబు తథ్యముగ నై
తత్స్వాముగాయ మో + తరుణ యజ్వ
సారంగివదనంబు + సారంగలాంఛను
యద్దేవ సేయునో + యాయజూక
చంద్రమఃకళ నాభి + చంద మింద్రోవల
స్య సమాన మౌహావి + ర్వ్యాజివస్య
అష్టాపదగృహంబు + నందె కదా యిరా
త్రియాము సుభ్రుం చమే + యాహితాగ్ని
యనుచు మందాకినీతీర + మునను దాన
మున కనుఁగాలమునఁ గూడి + కొనిన క్రొత్త
సోమయాజులు స్థాలికల్ + దోమికొనుచు
నార్ష్యపరిభాష భాషింతు + రనటు నెపుడు.
—మహేంద్రవిజయము, తృతీయా. ౧౪ ప.

ఇందు కేవలము వేదపరిభాష వాడఁబడినది. ఎట్లన—

(౧) 'పీతత్స్వాము గాయన్నాస్తే' అను నుపనిష ద్వాక్యములోని 'నాస్తి' (లేదు!) అనునది స్ఫురించు నట్లు 'పీతత్స్వాముగాయ' మనునది ప్రయోగింపఁబడినది. [ఆస్త్రీకి నడుము (నాస్తి) లే దని భావము.]

(౨) యద్దేవసేయుఁడో = హేళనము సేయును "యద్దేవా దేవహేళనమ్." —యజురారణ్యకద్వితీ.

(౩) ఇంద్రోవలస్య సమానము = బిలసమానము, "ఇన్ద్రో వలస్య బిలమ్." —యజుస్సంహిత, ద్వి. కాం.

(౪) సుభ్రుం చమే=శయనము, "సుశ్చ్యంచమే శయనశ్చమే." —యజుస్సంహిత, చతుర్థకాం.

ఈరీతి మహాకవులు నిరంకుశులై యొనర్చిన వేదశబ్దప్రయోగముల నేశబ్దశాస్త్రము నిరాకరింపఁగలదు? సాధింపఁగలదు? ఇట్టివానిం గాంచి కవులప్రజ్ఞలనుగని యెంతయు సంతసిం

పవలసియుండును గాని శాస్త్రనిషిద్ధము లని యాక్షేపింపఁజెల్లను.

వజ్రాయుధపత్త్రికలోని తక్కినసందేహము ... లు ముఖ్యము లైనవి గావు. కాని, "నదీశబ్దము ఇకారాంతము, ఈకారాంతము నని సంస్కృతజ్ఞానము గల యెల్లరకును దెలియు" నని వ్రాయుటయు; నది, పురంధ్రి - ఇవి ఇకార ఈకారాంతము లని నామలింగానుశాసనమేని చదివినఁ దెలియదో?" అని వ్రాయుటయు మాత్రము వింతను గలుగఁజేయుచున్నవి.

---

# ఆతిథ్యము

పెనుమర్తి వెంకటరత్నము గారు (యువకవిమండలి)

౧

ఆనిశాకాల శాంతిశయ్యలఁ బరుండి
　　సుఖమధుస్వప్నములు గనుచున్న నేను
నిశ్చలనర స్తరంగ నిర్నిద్ర రవము
నాలకించి ద్వారముపొంత కరిగినాను!
సూక్ష్మగతివచ్చి వడివడి సుళ్లురేగి
జగము గ్రమ్మిన ప్రబల ఝంఝామరుత్తు
నాకుటీరకవాట బంధన మెడల్చి
కన్నుఁగవలోఁ బరాగమేఘములు గప్పె.
ఆసమయమందు సకల దిశాంతరాళ
విపులతామస గహ్వరవీథులందు
నొకటి రెండుచుక్కలు మహావ్యోమవీథి
నుండియును లేకపోయిన నొక్కటయ్యె!
*　　*　　*　　*
వికృతహాసకరాళ దంష్ట్రికలు మెఱయ
...కైశికకాళిమ మ్మొలగింప
ఒక్కయెడ విస్ఫులింగము లుమిసికొనుచు
తొంగిచూచుచునున్నది! దుఃఖదేవి.
మ్మొదటచూచినయంతలో మోద మెడలి
'ఓసి దౌర్భాగ్యురాల! ఈవేసమేల!
ఏమియు'ను లేని నన్ను వరింపవచ్చి
ఏమనుభవింప వచ్చినావేమె!—యనగ.

౨

'ఓయిమోహన! దిశలెల్ల నొక్కపెట్టు
తిరిగివచ్చితి నీవంటి వరుఁడు లేఁడు!
నీహృదయవీథికా నవనీత మింత
కరఁగిపోయిన నేనును కరగిపోదు!
'నీవు ప్రేమప్రపూర్ణమందిరమవోయి;
భగభగని మండు నాస్వరూపమ్ముకొఱకు
ఎంతమాధుర్యపీఠి నీయీమనస్సు!
దాఁగుకొనియెద నంతరాంతరములందు!
'అబ్ధిగర్భంబులో బడబాగ్ని కలదు:
నేను నీగర్భమందున నిలిచిపోదు!
మారుమాటాడఁబోకురా, మండిపోవు
హృదయతృష్ణ శమింపఁజేసెదవు నీవు!
*　　*　　*　　*
బాష్పబిందూత్కరమ్ముల పాద్య మిచ్చి,
వేఁడినిట్టూర్పుగాడ్పులు వీవనలుగ,
కౌఁగిటఁ గదించుకొంటి! నాకాళరాత్రి
అంజనాచల వర్ణము లధికమయ్యె.

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

శ్రీమాన్ యీయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులు గారు

పైశీర్షికతో రుధిరోద్గారి సంవత్సరాదిసంచికయం దొక వ్యాసమును బ్రచురించియుంటిని. పిమ్మట నన్నిఘంటువిషయమున శబ్దార్థాదుల వ్రాయుపంక్తులు గమనింపవలసిన నియమములను, దత్సంపాదకులు తత్సముపదార్థములతోఁ బ్రకటించిన మచ్చుకాగితములను (Specimen Copy) జూచితిని. తరువాత నాకుఁ గొన్ని యభిప్రాయములు గలిగినవి. నాకు సాహిత్యము గాని, పాండిత్యము గాని చాలినంత లేకున్నను భాషాసేవావిషయమున సాహసమునకు లోటులేదు. అందుచే నిందుపయుక్తాంశము లేమైన నున్నయెడల వానిం గైకొని పండితులు నన్ను చరితార్థునిఁ జేయుదురుగాక.

I. ఉద్ధృతగ్రంథము లేసంవత్సరమున, నేపట్టణమున, నెవరిచేఁ బ్రకటింపఁబడినవో గ్రంథసంకేతవివేచనాపట్టికలో వ్రాయవలెను. ఒకప్పు డట్టిగ్రంథ మముద్రితముగు నెడల నాసంగతి "అము" అని వివరించునది. లేనియెడల, నిఘంటుకార్యాలయపండితులు 19-వ శతాబ్దిలో ముద్రితములగు నాంధ్రభారతములోని ప్రయోగము నిచ్చిన యెడల, నాప్రయోగము నేఁడు విశేషప్రచారముగల 'వావిళ్లవారి' ప్రతిలోఁ గాని, 'ఆనందాశ్రమము' వారి ప్రతిలోఁ గాని భిన్నముగా నుండవచ్చును. అందుచే నాప్రయోగము విశేషోపకారకము కాఁజాలదు.

ఈవిషయమును బంతించి యల్. ఆర్. వైద్యుని గీర్వాణాంగ్లనిఘంటువు ("The Standard Sanskrit English Dictionary" of Professor L. R. Vaidya, SecondEdition, Bombay 1916)నుండి యుదాహరించెదను.

| | |
|---|---|
| 1. Am. S.-Amrusataka | Published in Kavyasangraha, Calcutta 1872. |
| 2. Bhartr.-Bhartriharisatakatraya | i. Kavya sangraha ii. and iii Telang's Edition 1885. |
| 3. Bh. V.-Bhamini Vilasa | Vaidya's Edition 1887. |
| 4. Bt.-Bhatti Kavya | Majumdar's Series, Calcutta 1878. |
| 5. K. D.-Kavyadarsa | Bibliotheca Indica Series, Calcutta 1863. |
| 6. K. S.-Kumarasambhava | Nirnayasagar Edition, Bombay 1886. |

II. పర్వ కాండ స్కంధ ఆశ్వాసాదుల కుపయోగించు నంకె లుదాహృతపద్యగద్యముల కుపయోగించు నంకెలకంటె భిన్నముగా నుండవలెను.

ఉ. "అంకపాళి నటద్ధుమాలాంచలములు."—మను.

చ. I ఆ. 3 ప. లేక ౧ ఆ. 3 ప.

నిఘంటుసంపాదకులు ప్రచురించిన మచ్చుకాగితము (Specimen Copy) లో అంకపాళిశబ్దమునకు "తావద్గాఢం వితర సకృదప్యంకపాళిం ప్రసీద"

—మాలతీ. ౮. ౨. ౨.

అని ప్రయోగము చూపఁబడినది. ఇందు మూఁడంకెలు నొకవిధముగానే యున్నవి. ఎన్నవయంక[illegible], మెన్నవ శ్లోకమో సందిగ్ధముగా నున్నది. పోనీ, ౮ వ యంకము, ౨ వ శ్లోకమనుకొందమా, తరువాతనున్న ౨ వ యంకె దేనిం దెలుపును? అందుచే నావ్యాసమునకు నుదాహరింపఁబడిన ప్రయోగములకు వేఱువేఱంకె లుపయోగింపవలెను. శబ్దరత్నాకరములో 'కిన్నరుఁడు' అను




శ్రీమాన్ యియ్యుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులు గారు

పైశీర్షికతో రుధిరోద్గారి సంవత్సరాదిసంచికయం దొక వ్యాసమును బ్రచురించియుంటిని. పిమ్మట నన్నిఘంటువిషయమున శబ్దార్థాదుల వ్రాయుపండితులు గమనింపవలసిన నియమములను, దత్సంపాదకులు తత్సముపబార్థములతోఁ బ్రకటించిన మచ్చుకాగితములను (Specimen Copy) జూచితిని. తరువాత నాకుఁ గొన్నియభిప్రాయములు గలిగినవి. నాకు సాహిత్యము గాని, పాండిత్యము గాని చాలినంత లేకున్నను భాషాసేవావిషయమున సాహసమునకు లోటులేదు. అందుచే నిందుపయుక్తాంశము లేమైన నున్నయెడల వానిం గైకొని పండితులు నన్ను చరితార్థునిం జేయుదురుగాక.

I. ఉద్ధృతగ్రంథము లేసంవత్సరమున, నేపట్టణమున, నెవరిచేఁ బ్రకటింపఁబడినవో గ్రంథసంకేతవివేచనాపట్టికలో వ్రాయవలెను. ఒకప్పుడట్టిగ్రంథ మముద్రితమగు నెడల నాసంగతి "అము" అని వివరించునది. లేనియెడల, నిఘంటుకార్యాలయపండితులు 19-వ శతాబ్దిలో ముద్రితమగు నాంధ్రభారతములోని ప్రయోగము నిచ్చినయెడల, నాప్రయోగము నేఁడు విశేషప్రచారముగల 'వావిళ్లవారి' ప్రతిలోఁ గాని, 'ఆనందాశ్రమము' వారి ప్రతిలోఁ గాని భిన్నముగా నుండవచ్చును. అందుచే నా ప్రయోగము విశేషోపకారకము కాఁజాలదు.

ఈవిషయమును బండిత యల్. ఆర్. వైద్యుని గీర్వాణాంగ్లనిఘంటువు ("The Standard Sanskrit English Dictionary" of Professor L. R. Vaidya, Second Edition, Bombay 1916) నుండి యుదాహరించెదను.

| | |
|---|---|
| 1. Am. S.-Amarusataka | Published in Kavyasangraha, Calcutta 1872. |
| 2. Bhartr.-Bhartrihari-satakatraya | i. Kavya sangraha ii. and iii Telang's-Edition 1885. |
| 3. Bh. V.-Bhamini Vilasa | Vaidya's Edition 1887. |
| 4. Bt.-Bhatti Kavya | Majumdar's Series, Calcutta 1878. |
| 5. K. D.-Kavyadarsa | Bibliotheca Indica Series, Calcutta 1863. |
| 6. K. S.-Kumarasambhava | Nirnayasagar Edition, Bombay 1886. |

II. సర్వ కాండ స్కంధ ఖాశ్వాసాదుల కుపయోగించు నంకె లుదాహృతపద్యగద్యముల కుపయోగించు నంకెలకంటె భిన్నముగా నుండవలెను.

ఉ. "అంకపాళి నటద్ధుహూలాంచలములు." — మను.

వ. I ఆ. 3 ప. లేక ౧ ఆ. 3 ప.

నిఘంటుసంపాదకులు ప్రచురించిన మచ్చుకాగితము (Specimen Copy) లో అంకపాళిశబ్దమునకు "తావద్గాఢం వితర సకృదప్యంకపాళీం ప్రసీద"

—మాలతీ. ౮. ౨. ౨.

అని ప్రయోగము చూపఁబడినది. ఇందు మూఁడంకెలు నొకవిధముగానే యున్నవి. ఎన్నవయం[illegible], యెన్నవ శ్లోకమో సందిగ్ధముగా నున్నది. పోనీ, ౮ వ యంకము, ౨ వ శ్లోకమనుకొందుమా, తరువాతనున్న ౨ వ యంకె దేనిం దెలుపును? అందుచే నాశ్వాసమునకు నుదాహరింపఁబడిన ప్రయోగమునకు వేఱువేఱంకె లుపయోగింపవలెను. శబ్దరత్నాకరములో 'కిన్నరుఁడు' అను

శబ్దమునకుఁ గానంబరినుండి, "గ. కి మ జేన గృహీన తే వా కిన్నరయుగళేన ప్రయోజన మిద ముపక్రుత మశ్వముఖద్వయ" మ్మని యుదాహరణ మీఁబడె. ఆవాక్య [..]ప గ్రంథమునఁ జూచుకొనవలెనన్న, నది యేపుటలో నున్నదో, యేసంవత్సరమున, నెవరిచే, నెక్కడ ముద్రింపఁబడిన ప్రతియో తెలియక చిక్కుగా నుండును.

III. ఒకశబ్దమునకుఁ బ్రయోగము లొకటిరెండు చూపి, తక్కిన ప్రయోగముల కాయాగ్రంథములనామముల పొడియక్షరములు, వాక్యాసాదులు సూచించునది. ఇందువలనఁ బండితుల ప్రయోగసంపాదనశ్రమ ఫలించును. శబ్దార్థములు బాగుగా విశదమగును. వైద్యపండితు లీలాగునఁనే ప్రయోగములఁ జూపిరి.

ఉదా:—

వారినిఘంటువున పుట 222— క్షేమము :—

1. Safety; peace; happiness; well-being. "దిశతు వః క్షేమం కటాక్షోర్మయః"—Git. G. III.

"వికసతి క్షేమ మదేవమాతృకా శ్చిరాయ తస్మి న్కురవ శ్చకాసతే"-Kir.I. 17; Sivanandalahari, Sloka 44.

IV. ఒకప్పు డవతృతి (quotation) లేకయే గ్రంథాదుల సూచింపవను. Vide Prof. Vaidya's "Standard Sanskrit English Dictionary."

ఖ్యా:— (P. 228) Pass. (ఖ్యాయతే) To be known; to be named. Bhatti Kavya VI-97.

Caus (ఖ్యాపయతి, తే) 1. To make known; to proclaim; to relate; to declare. Manusmriti. VII-201; XI-99.

ఖన్:—(P. 226) ఉత్ఖన్=To dig out, to root out, to eradicate (literally and figuratively). Raghu. IV-33; 36; IV-37; XIV-73; Bhatti Kavya XII-5; XV-55; Meghaduta I-52.

V. ప్రయోగములఁ జూపునపు డొకపదము యొక్క భిన్నార్థములకు భిన్నప్రయోగములఁ జూపుటకంటె నాశబ్దము శ్లేషగా నుపయోగింపఁబడిన ప్రయోగ మెక్కుడుపయోగకరము.

1. ఉ. మార్గణ:—1. బాణము 2. వి. (అ. ఈ. అ.) యాచకుడు.

"శ్లో. అపూర్వోయం ధనుర్విద్యా భవతా శిక్షితా కథం
మార్గణౌఘః సమాయాతి గుణో యాతి దిగన్తరం."

—కవిశేఖరః (భోజమహారాజచరితమ్.) P. 70. (Edited by Vedam Venkataraya Sastri Madras 1909).

2. శ్లేషయమకచక్రవర్తి వేంకటాధ్వరిమహాకవి.

"శ్లో. రసికాళిక్లి రాస్వాద్యం
రమ్యం శ్రీకరవిలసదలంకరణం,
వికసతు సూర్యాలోకా
త్పద్మగివానే సహస్రపత్ర మివ."

—లక్ష్మీసహస్రం I ప్రారంభస్తబకః. 29 శ్లో. (పృష్ఠః 28; ద్వివేదిమహాదేవశాస్త్రిసంపాదితము. 1907. కాకరపర్రు.)

3. అరి=(1) చక్రము (2) శత్రువు.

ఉదా:—

(నరసభూపాలీయము. V ఆ. 165 ప. 96 పుట.)

ప్రకృతాప్రకృతశ్లేషము

క. అరివరకరుఁడై సుమనో
వరధరణీధురీణుఁడై యవారితలక్ష్మీ
స్థిరవాసభాసురుండై
నరసింహుండు వొల్చు నాదినరసింహుఁ డనన్.

ఈశ్లేషప్రయోగ మాధునికమైన యుదాహరణమునకుఁ జూపుచున్నాను. (దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి: మహేంద్రవిజయము. III ఆ. 132 ప.)

క. అరివరకరుఁ డసురారి యుపు
డరివరకరుఁ డగుచు నీకు నభయం బిడునో
సురవర దానవరిపుభా
సురవరకారుణ్యగరిమ చొప్పడఁగ వో శౌ.

4. అంబరాంబరుఁడు=ఈశ్వరుఁడు. [అంబరమే (ఆకాశమే) అంబరము (వస్త్రము) గాఁ గలవాఁడు.]

ఈపైవిషయము నంబరమునొద్ద వివరించునది.

అంబరము=(1) ఆకాశము (2) వస్త్రము.

ఉదా:—

అంబరాంబరుఁడు.

VI. అనైఘంటుకపదములు; అనైఘంటుకార్థములు.

1. యోగభారకము=మాత్రాభారికము. (హర్షచరితవ్యాఖ్యాత: శంకరుఁడు.)

ఉదా:—

"ఘూలపశా మూత్రనియన్త్రిత పుస్తికాపూలకేన వామకరస్య లేన యోగభారకేణాధ్యాపితస్కన్ధం"

(Page 153, line 10; Fuhrer's Edition, Bombay, 1909) and (P. 75, line 16; Sri Iswara Chandra Vidyasagar's Edition, Calcutta, 1883.)

2. ఇక్షురసము:—

"శ్లో. తవామృతస్యందిని పాదపంకజే
నివేశితాత్మా కథ మన్య దిచ్ఛతి
స్థితేఽరవిందే మకరందనిర్భరే
మధువ్రతో నేక్షురకం హి వీక్షతే."

(శ్రీయామునాచార్యులవారు: (ఆళ్‌వందార్‌స్తోత్రమ్‌ 27 శ్లో.) ఈశ్లోకము నప్పయదీక్షితులు 'కువలయానందము' లో నుటంకించిరి.

3. పరశురాముఁడు=(1) భార్గవరాముఁడు(2)అగ్నిహోత్రుఁడు. (పరశు వనఁగా వేది; అందు రమించువాఁడు గావునఁ బరశురాముఁడు.)

4. వినాయకుఁడు=(1) విఘ్నేశ్వరుఁడు (2) గరుత్మంతుఁడు ఈయర్థమునకుఁ బ్రమాణముగా "సుగతే చ వినాయకః" అమరము, III కాం. 162 శ్లో. అని చూపుటకంటె,

"శ్లో. వాహీకృత మహాభోగ గణాధిప వినాయకా,
భవతాం భవతాం భూత్యై పార్వతీప, రమేశ్వరౌ."
—కొలచెల పెద్దిభట్టకృతమ్‌.

ఇట్టిప్రయోగములఁ జూపుట మంచిది.

5. వివాహోపనయనములు—హరిహరులు:—

(వివాహః=పక్షివాహః; ఉపనయనః=వృషవాహః.)

6. విధవ:—(1) పెనిమిటిలేనిస్త్రీ. (2) విధవః=విధవుఁడు.

ఉదా:—

"శ్లో. విధవాగమనం విశేష కార్యం
విబుధానా మపి విష్ణుసేవకానాం
విధవాగమనేన దాశరథ్యోః
గళితో ఽభూ త్కిల నాగపాశబంధః."

(అప్పయదీక్షితులకు, దొడ్డయాచార్యులవారికి జరిగిన సంవాదము.)

7. దశరథుఁడు:—(1) ఒకమహారాజు; శ్రీరాముని తండ్రి. (2) (దశ = అనఁగాఁ బక్షియే; రథుఁడు = రథము లేక వాహనముగాఁ గలవాఁడు) శ్రీమహావిష్ణువు.

ఉదా:—

"శ్లో. రామం దశరథం విద్ధి మాంవిద్ధి జనకాత్మజాం,
అయోధ్యామటవీం విద్ధి గచ్ఛ తాత యథాసుఖం."
—శ్రీమద్వాల్మీకిరామాయణమ్‌. (అయోధ్యా.XL-9.)

దీనికి విశేషవాక్యభూషణులగు "పెరియవాచ్చాంబిళ్ల" గా రిట్లు వ్యాఖ్యానము వ్రాసియున్నారు:

తన్నిశ్లోకి—

(యద్వా) రామం; దశతి మత్స్యాంశ్చపోరగాదీన్ దంష్ట్రావ్యాపారవిషయాన్ కరోతీతి దశః పక్షీ (దంశ దశన ఇతి ధాతుః) దశనం దంష్ట్రావ్యాపారః-పచాద్యచ్-పృషోదరాదిత్వా దనునాసికలోపః. స గరుడః రథో యస్య తం విష్ణుం విద్ధీ త్యర్థః. "ని. దశః పక్షీ విహంగమ" ఇతి హలాయుధః.

8. కుచేలము:—సముద్రము (అనైఘంటుకము): వేదాంతదేశికులు-

"శ్లో. కాచాయనీతం కమనీయవాచా
మోచాఫలస్వాదుముచా న యాచే,
దయాకుచేలే ధవదక్కుచేలే
స్థితే కుచేలే శ్రిత మాకుచేలే."

ఇటువంటిస్థలమున నాశబ్దము క్రింద గుర్తింపవలెను. లేనియెడల సందిగ్ధముగా నుండును.

పైశ్లోకమునకు స్వర్గీయ శ్రీ అల్లమరాజు సుబ్రహ్మణ్యకవిగారు తమ "చాటుధారాచమత్కారసారము"లో (పుట 13; 1895 సం.న ముద్రితము) ఇట్లు వ్రాసియున్నారు: ప్రకృత కుచేలశబ్దవ్యాఖ్యను మాత్రము జూపెదను.

"దయాయాః కోశః భువః; చేలం వసనం, సముద్రః; దయాపూర్ణ ఇతి యావత్." ఈశ్లోకమును వీరు వేదాన్త దేశికకృత మనియే వ్రాసిరి.

ఈశ్లోకము శ్రీముక్కవితార్కికసింహ సర్వతంత్రస్వతంత్ర శ్రీవేదాంతదేశికకృత "వైరాగ్యపంచకము" లోనిది. బృహత్ స్తోత్రరత్నాకరము II భాగములో నీవైరాగ్యపంచకము చూడనగు. సముద్రమును భూమికి వస్త్రముగా వర్ణించుట కవిసమయముగా నున్నది.

i "సముద్రవసనే దేవి పర్వతస్తనమండితే."

ii "శ్లో....సర్వస్సముద్రవసనే సరసైరకార్షి
రానందసాగర మపార మపాంగపాతైః."
—వేదాంతదేశికకృత "భూస్తుతి" 16 శ్లో.

iii "శ్లో....శ్యామాం స్వత స్త్రియుగమాకరగేహిని
త్వం వ్యక్తిం సముద్రవసనా ముభయీం బిభర్షి."
—భూస్తుతి." 23 శ్లో.

iv "సీ. అంభోధివసనవిశ్వంభరావలయంబుఁ
దనబాహుపురిమరకతముఁ జేసె."
—మనుచరిత్ర; ఆముక్తమాల్యద.

v "సీ. సిరిపుట్టినిల్లు రాజీవలోచను సెజ్జ
పట్టు మహీకాంతకట్టుఁజీర."
—ఎఱ్ఱాప్రగడ నృసింహపురాణము I ఆ.

9. బవి (వికృతి)=గొప్పి; (ప్రకృతి) అవి.
అప్పకవీయము. I ఆ. 98 ప. "కుక్కగోరె"మను సీసము. దీనికి వివరము:—'అవి' శబ్దమునకు 'బవి'.

10. పాణింధమము = (1) గాలిమితిత్తి (2) చీకటి (3) వాద్యవిశేషము.

నాకు దొఱకిన ప్రయోగములలోఁ గొన్నిటికీ మూఁడర్థములు నుచితములు గాకున్నవి. ఆప్రయోగము లన్నిటిని జూపెదను.

(i) మురారిమహాకవికృతానర్ఘరాఘవనాటకమ్.
I—20. శ్లో.

"శ్లో. శస్త్రాగ్నిత్రికకైవకానవభవ
ద్గీర్వాణపాణింధమాః,
పంథానో దివి సంకుచంతి
వసుధా వంధ్యాన మా తే భటాన్;
లక్ష్మీర ప్యరవిన్దపాదపలభీ
నిర్వ్యాప్యహాపర్యఙ్కికా,
విశ్రాన్తై రలిభి ర్న కుంజరఘటా
గండోద్గతై ర్మోక్ష్యతే."

ఇష్టార్థకల్పవల్లీవ్యాఖ్యా:—
"పాణయో ధ్మాయంతే శబ్దాయ్యంతే యేషు తే
తథోక్తాః; అతిభయంకరా ఇత్యర్థః"
—మైసూరుప్రతి. పుట 444 (1905 సం.)

(ii) శ్రీనాథమహాకవి: కాశీఖండము. IV ఆ. 119 ప.
"సీ. వరిబిధూళీపాళి పరిచితంబులు మాణి
బంధాశ్మలవణా పాణింధమములు.

(iii) శృంగారనైషధము. II ఆ. 32 ప.
"శా. కాలాంతఃపురకామినీకుచతటీ
కస్తూరికాసారథ
శ్రీలుంటాకము చందనాచలతట
శ్రీఖండసంవేష్టిత
వ్యాలస్ఫారఫణాకఠోరవిషని
శ్శ్వాసాగ్నిపాణింధమం
బేలా నాపయి దక్షిణానిలము ప
క్షీ సేయు దాక్షిణ్యమున్."

(iv) శృం. నై. VIII ఆ. 51 ప.
"శా. కోపంబింతయు నుజ్జగించి కుముదః
కోదండనారాచధా
రాపాణింధమ మైనసీసవళ సే
ద్రత్యోత్స్న హైఁబల్లవే

తాపంబారఁగఁ గోఁగిలింపుమికోనవే
లక్ష్యంబు నీబంట నే
నో పుంస్కోకిలవాణి యోశశిముఖీ
యోపక్వబింబాధరీ

(v) భీమఖండము. II ఆ.

"క. ఒక్కయింటి మచ్చెకంటి కలమధురవీణా
క్వాణపాణింధమం బై వయొలుంగు నెత్తి 'యోబ్రాహ్మ
ణో త్తమా! శాపము సంహరించి యిటు రమ్మని నన్నుం
జేరఁ బిలిచెను." (వ్యాసులు కాశిఁ శాపిన కథ.)

(vi) చరిగొండధర్మన్న: చిత్రభారతము.

"శా. ఆరాజేంద్రశిఖావతంసనిజబా
హాయుక్తవిశ్వంభరా
ధారేయుండు విరోధిమంత్రిముఖము
ద్రావత్కుఁ డుద్యద్దయా
పారీణుండు పటీరతారకసుధా
పాణింధమశ్రీయశో
హారుం డిమ్మలపల్లి మాదవిభు పె
ద్దామాత్యుఁ డుల్లాసియై."

(vii) అడిదము సూరకవి: కవిజనరంజనము.

"క. వలపుల పాణింధమములు
మలయానిలవిహార మందిరములు ప్రా
విలుతుని యాయుధశాలలు
చెలువలజన్మస్థలము లనటిప్రాఁదోఁటల్."

(viii) శంకరకవి: హరిశ్చంద్రచరిత్ర పీఠిక. 1౩ ప.

"క. ధీరుల బాణమయూరుల
భారవులై వెలయు మాఘుభారవుల సుధా
ధారాపాణింధమకవి
తారచనావాసుఁ గాళిదాసుఁదలంతున్."

(ix) సంకుసాలనృసింహకవి: కవికర్ణరసాయనము.
II ఆ. 233 ప.

"సీ. కస్తూరికామృగీ కర్ణేజపంబులు
నిర్ఝరీనివహపాణింధమములు."

(x) బహులాశ్వచరిత్ర. I ఆ. III ప.

"సీ. పదిలమ్ముగుమ్మ నీపాణిపాణింధమ
నారికేళము దర్పణంబు తలిని."

(xi) మాదయగారి మల్లన: రాజశేఖరచరిత్ర IIఆ.
170 ప.

"శా. ఆపుంస్కోకిలవాణి యాజలధిక
న్యారత్నసౌందర్యరే
ఖాపాణింధమమూర్తి యాత్రిజగతీ
కాంతావతంసంబు కే
లీపద్మాకరవాంఛ దీఱ దనఁగా
లీలావతిన్ నిద్దపున్
జూపున్ గెల్వ వసంతమాడె మహిభృ
చ్చూడావతంసంబు పైన్."

(xii) పాండురంగమాహాత్మ్యము. III ఆ. 10 ప.

"సీ. బహుసంకుమదపంకపాణింధమం బైన
తాళిగోఁణపుఁజుంగు నేలకీగ."

(xiii) పాండు. మా. III ఆ. 88 ప.

"శా. కాఁపుం గెంజిగురాకుఁబోఁడి పరలో
కం బంత ప్రాపింపుమున్
వ్యాపాదంబున నాతఁ డొందుగడ రూ
పాజీవరాజాననం
దాపింధన్నృదుస్నిస్నిమదాం
ధన్ బంధురశ్రోణి పీ
ణాపాణింధమపాణి నొక్కప్లవక
న్యం గూడి క్రీడింపఁగన్."

(xiv) పాండు. మా. III ఆ. 179. వ.

"వ. దర్పణంబుల దర్పంబును, సరోజంబుల యోజయు, సుధాకలశంబుల విలసనంబును, నంబురుహబింబంబుల మదంబుఁ ఖండించి, యశేషకలాకలాపపాణింధమస్వరభాస్వరం బగువదనవలయంబు."

(xv) కంకంటి పాపరాజ మహాకవి: ఉత్తరరామాయణము II ఆ. 30 ప.

"సీ. మధ్యందినాదిత్యమండలోగ్రాంశుపా
ణింధమాయుధదీప్తి నింగి ప్రమింగ

(xvi) గణపవరపు వేంకటకవి: ప్రబంధరాజవేంకటేశ్వర విజయవిలాసము 47 ప.

"క. వాణీవీణానిక్వణ
పాణింధమపదనిబంధ బంధురభణితుల్
రాణింప వసంతతిలక
భ్రాణము దెనుఁగించి కీర్తిఁ బడసిన సుకవిన్."

11. గోకర్ణము:— (అన్యైఘంటుకము) ఆవుచెవివంటి యాకారముగల కొబ్బరిచిప్ప.

12. నాగరము:— (అన్యై.) (1) భూషణవిశేషము. (2) నాగరలిపి.

13. గీర్వాణము:—(అన్యై.) (1) భూషణవిశేషము.(2) గర్వము.

"నీ వెంత గొప్పవాఁడవైనను నంత గీర్వాణము కూడదు." (అన్యై.)

14. అర్ధచంద్రిక:— అన్యై).భూషణవిశేషము (స్త్రీలు ముక్కునఁ ధరించునది.)

15. వృత్తాదుల వివరించి యుదాహరించునది.

(i) మత్తేభము:— (1) మదపుటేనుఁగు. (2) మత్తేభవృత్తము.—లక్షణము:

"స, భ, ర, న, మ, య, లగ;" 14 వ యక్షరము యతి

ఉదా:—

"అల వైకుంఠపురంబులో నగరిలో
— వామాలసౌధంబుదా పల..."

(ii) శార్దూలము:— (1) పెద్దపులి. (2) శార్దూలవృత్తము —లక్షణము:

"మ,స,జ,స,త,త, గురువు." 13 వ అక్షరము యతి.

ఉదా:—

"నొక్కింతయును లేదు ధైర్యము విలో
— లంబయ్యెఁ బ్రాణంబులున్,తావుల్దప్పెను..."

ఇట్లు ఉత్పలము, చంపకము, స్రగ్ధర మొదలగు వానినన్నిటిని వివరించి లక్ష్యముం జూపునది. లేక, వైద్యపండితులు (L. R. Vaidya) చేసినట్లు నిఘంటువు చివర శ్లోకఛందోనుక్రమణికం జేర్పవలెను.

16. కవి:—

సప్తవిధకవులను వివరించి యుదాహరించునది.

(i) వివేకి(గుణదోషజ్ఞుఁడు.)

(ii) వాచకుఁడు(అనుప్రాసయుక్తపదసంధానఁ జేయువాఁడు.)

(iii) ఆర్థికుఁడు (అర్థములఁ బొందుపరుచువాఁడు.)

(iv) శిల్పకుఁడు(యమకకవితాదక్షుఁడు.)

(v) భూషణార్థి (అలంకారయుక్తకవితాధురంధరుఁడు.)

(vi) మార్దవి (రచనతత్పరుఁడు.)

(vii) రోచకుఁడు (హృదుమధురకవితాలలితుఁడు.)

17. కవిత:—

చతుర్విధకవిత్వము నుదాహరించునది.

(1) ఆశు (2, గర్భ (3) చిత్ర (4) బంధములు. బంధశబ్దమునొద్ద సర్వవిధబంధముల వివరింమవది.

18. అలంకారము:— (i) చతుర్విధాలంకారములు: వస్త్రభూషణమాల్యానులేపనములు.

(ii) శబ్దార్థాలంకారములు: ఇవెన్ని విధములో వివరించి, ఆయా స్థానముల నుదాహరణముం జూపునది.

19. గద్యము, పద్యము, చంపువు, కథ, ఆఖ్యాయిక మొదలగువానిని వివరించి లక్ష్యముం జూపవలెను.

20. న్యాయ వైశేషిక సాంఖ్య యోగ మీమాంసా వేదాంతము లను షడ్దర్శనముల సంగ్రహముగా వివరించునది.

VII కవితార్కికసింహులును, బరకేసరిగ్రంథకర్తలు నగు శ్రీమద్వేదాంతదేశికులచే "దశదీపకనిఘంటువు" రచింపఁబడినది. ఇందు 40 శ్లోకము లున్నవి. 1898-వ సంవత్సరమున విశాఖపట్టణములోని యార్ష ముద్రణాలయమువారు దీనిని ముద్రించిరి. మచ్చున కొకశ్లోకముం జూపెద:—

"శ్లో. సుధ స్స్వధాకరే వృక్షభేదే ధర్మప్రభేదే౽పి చ
సుధాక్షీరే లతాభేదే విద్యాయా మిక్షువాచకే,
అమృతేనార్ణకల్కే స్యాత్సుధామాధ్వీకకిట్టకే."

ఈయర్థములన్నియు నప్రసిద్ధములని శ్రోసిరాజనక స్వీకరించుట యుపయుక్తమని తోఁచెడిని.

VIII అవధానము:—

ఇదెన్నివిధములో వివరించునది.

శతావధానము, అష్టావధానము, వ్యస్తాక్షరి, నిషేధాక్షరి, ఏకసంధాగ్రాహిత్వము మొదలగు విద్యావినోదముల విశదీకరించునది.

IX. అంకుశశబ్దముదగ్గఱ, "నిరంకుశాః కవయః" యను ననుకృతి (quotation) ని జూపినట్లే యాయాపదములయొద్ద నిట్టిసుప్రసిద్ధానుకృతుల వ్రాయునది.

ఉదా:—

(i) తద్ధితము:—ఇదెన్నివిధములో వివరించియుదాహరించిన పిమ్మట నీ యనుకృతిం జూపనగు:

"తద్ధితమూఢో వైయాకరణ,
స్తద్ధితమూఢో ఽవైయాకరణః."

(ii) కౌముది:— దీనిని వివరించినపిమ్మట నీశ్లోకముం జూపునది:

శ్లో. యస్యాః ప్రకాశం విరహే జనానాం
కరోతి కౌముద్యపి తాపభారం,
సురూపశ్లేషై రుపలాలితాయాం
మనోరమాయాం రమతే మనో మే."

X. "వికృతిపదములకు శక్యమగునంతమట్టునకుఁ బ్రకృతులు చూపి వానిని గుండలీకరించునది. ఉదా: అగ్ని వి. (స. అగ్నిః)" అని సంపాదకులు నియమించిరి.

కాని ప్రకృతిపదముల కేల వికృతులఁ జూపరాదో తెలియకున్నది. శబ్దరత్నాకరములో శ్రీసీతారామాచార్యులవారు (పుట. 792) "బాసవాలు:— దీనికి సరియైన సంస్కృతపదము గీర్వాణుఁ"డని వ్రాసియున్నారు.

సవ్యసాచికి సరియైన తెనుఁగుపదము కవ్వడి.
కిరీటికి సరియైన తెనుఁగుపదము క్రీడి.

ఇట్లు ప్రకృతులకు వికృతులను జూపినచో, లక్ష్మీనారాయణీయము, వైకృతదీపిక, పురుషోత్తమకవీయము మొదలగు నిఘంటువులు చేయు నుపకారమును గూడ మన సూర్యరాయాంధ్రనిఘంటువు చేయఁగలదు. ఇంత మాత్రమునకుఁ గ్రంథవిస్తరభీతి యవసరము లేదు.

XI. సారస్వతతారాపథమున దివ్యజ్యోతులవలెఁ బ్రకాశించు సుగృహీతనామముల పవిత్రచరిత్రల [illegible]గ్రహముగాఁ జేర్చి, వారిగ్రంథముల నుదాహరించి, [illegible]తముగ వారికాలమును వ్రాయునది. ఆనండేలు పండితుఁడు (Dr. Annandale) తన యాంగ్లనిఘంటువు చివర నొక యనుక్రమణికలో నాంగ్లగ్రంథకారుల యవతారనిర్యాణకాలములఁ దెలిపెను. ఇది భాషాసేవకులకు నత్యుపకారకము.

మఱియు నాంధ్రగీర్వాణసారస్వతసాగరమునందలి సుప్రసిద్ధ కావ్యరత్నముల నామములు చేర్పవలెను. ఇట్లు చేసినయెడల "పురాణనామచంద్రిక"వలనఁ గలుగు నుపకారము కొంతవఱకు నీనిఘంటువువలనను గలుగును.

ఉదా:—

(i) వేదాంతదేశికులు:—దాక్షిణాత్యులు; రామానుజీయులు; కవితార్కికసింహ సర్వతంత్రస్వతంత్రాది బిరుదాంచితులు;

గ్రంథములు: యాదవాభ్యుదయము; హంససందేశము; పాదుకాసహస్రము; సంకల్పసూర్యోదయనాటకము; సుభాషితనీతి; అధికరణసారావళి; తత్త్వముక్తాకలాపము. ఇవన్నియు సంస్కృతమయములు. (1367—1468 క్రీ. శ.)

(ii) వేంకటాధ్వరి:—(17 వ శతాబ్ది). దాక్షిణాత్యుఁడు; రామానుజీయుఁడు; శ్లేషయమకచక్రవర్తి.

గ్రంథములు: విశ్వగుణాదర్శ చంపువు; కరిగిరి చంపువు; ఉత్తరచంపువు; లక్ష్మీసహస్రము; ప్రద్యుమ్నానందభాణము; ఆచార్యపంచాశత్తు; శృంగారదీపకభాణము. ఇవన్నియు సంస్కృతమయములు.

(iii) జయదేవమహాకవి:—(16 వ శతాబ్ది). అప్పయదీక్షితసమకాలీనుఁడు.

గ్రంథములు:— ప్రసన్నరాఘవ నాటకము; రతిమంజరి; చంద్రాలోక మను నలంకారగ్రంథము. ఇతఁడు "గీతగోవింద"కారుఁ డగు జయదేవునికంటె భిన్నుఁడు.

(iv) చిత్రమీమాంసము :— కువలయానందము, వృత్తివార్తికము, భక్తిశతకము, వైరాగ్యశతకము, వరదరాజస్తవము, హరివంశసారచరితము మొదలగు సద్గ్రంథరచయితయగు నప్పయదీక్షితవిద్వత్కవికృతాలంకారగ్రంథము.

(v) కుసుమాంజలి:— తర్కశాస్త్రము; కర్త: ఉదయనుఁడు.

(vi) గణరత్నమహోదధి:— తర్కశాస్త్రము; వర్ధమానకృతము.

(vii) అనుమానచింతామణి:— తర్కము; గంగేశకృతము.

(viii) గౌతమసూత్రము:— న్యాయసూత్రములు; కర్త గౌతముఁడు (అక్షపాదుఁడు); వ్యాఖ్యాత వాత్స్యాయనుఁడు (పక్షిలుఁడు).

(ix) వైశేషికదర్శనము:— న్యాయశాస్త్రము: కణాదకృతము.

(x) వ్యాడి:— "సంగ్రహ" మను సంస్కృతవ్యాకరణప్రణేత.

(xi) పార్థసారథి:— శాస్త్రదీపికామీమాంసాకారుఁడు.

(xii) మండనుఁడు:— నైష్కర్మ్యసిద్ధి; వార్తికమీమాంసాకారుఁడు.

(xiii) ప్రభాకరుఁడు:— జైమిని మీమాంసాసూత్రవ్యాఖ్యాత.

(xiv) కుమారిలభట్టు:— తంత్రవార్తిక మీమాంసాకర్త.

(xv) శబరుఁడు:— మీమాంసాసూత్రభాష్యకారుఁడు.

(xvi) పాణిని:— వ్యాకరణసూత్రకారుఁడు; గీర్వాణవైయాకరణపితామహుఁడు.

(xvii) కాత్యాయనుఁడు:— వరరుచి; పాణినీయవ్యాకరణసూత్రములకు వార్తికకారుఁడు.

(xviii) పతంజలి:— వ్యాకరణ మహాభాష్యకారుఁడు; యోగశాస్త్రప్రవర్తకుఁడు; ఆదిశేషావతారము.

ఏ యాంధ్రభోజుని మహౌదార్యముచే, నేయభినవకృష్ణరాయని భాషాభిమానముచేఁ దేశభాషయగు తెనుఁగుబాసకు నేఁటికిట్టి బృహన్నిఘంటులాభము కలిగెనదో, యట్టిమహాప్రభునిఛాయాపటమీనిఘంటుప్రారంభమునఁ జేర్పఁబడెను. "శ్రీసూర్యరాయాంధ్రనిఘంటు" వను పవిత్రనామమును బ్రతిపుటమీఁదను ముద్రింపించుటది. ఇట్లు చేసినచో నాంధ్రలోక మామహారాజుయొక్క పవిత్రనామము నెప్పుడును స్మరించుటచేతను, నాభాషాపోషకతేజఃపుంజముయొక్క ఛాయాపటమును నిరంతరము నేత్రోత్సవముగా సందర్శించుటచేతను, నామహోపకారఋణమును గొంతవఱకైనఁ దీర్చుకొనఁ గలుగునేమో.

ఈయాంధ్రనిఘంటురూపమున నాంధ్రసారస్వతసేవ చేసిన సంపాదకులగు బ్రహ్మశ్రీ జయంతి రామయ్య పంతులుగారియొక్కయు, పండితులయొక్కయుఁ బవిత్రజీవితముల సంగ్రహముగ వ్రాసి, వారిఛాయాపటముల గూడ నిఘంటువునఁ జేర్చునది.



# చిలుకలకవపై

నాదెళ్ల వెంకట్రావుగారు బి. ఏ.,

బహువిధక్లేశ భరితప్రపంచ మిందు
జనన మొందిన మానవజాతి కెల్ల
సహజమైనట్టి కష్టసంచయము లేవొ
మనసుఁ జీకాకుపఱచె నీదినము మిగుల.

అంత, గ్రామంబు వదలి యిట్లరుగుదెంచి
చెట్టుపుట్టలతో సోదె చెప్పుకొనుచుఁ
జేరి యిచటకు మిముఁగాంచి చిలుకలార!
అరగడియయైనఁ జింతల న్మఱచినాఁడ.

దినము నాహార మెట్టులో తిన్న పిదప
గూటిలో మీకు హాయిగాఁ గునుకుపట్టు
నిలువ లేదని కలలచేఁ గలఁత నిదురఁ
జెందు మాకంటె మీదె యానంద మహహ!

అందములుచిందు మాకందమందు నిలిచి
యిరువురును నొక్కకాయనే కొఱికి పిదప
వ్రేలునొకచిన్నకొమ్మ నుయ్యాలలూగు
చున్న మీకును గ్లేశంబు లున్నవొక్కొ?

మాటిమాటిని గలుపుచు మోహనముగఁ
గూయుచున్నారు మీరు మీకూజితముల
కర్థ మగ్రాహ్యమయ్యు శ్రావ్యంబులగుచుఁ
గ్రాలు నీనాఁటి భావగీ   వోలె.

కవులకును మీకుఁ జాలబాంధవము గలదు
మీవిహంగజాతి యట్టులే మేముగూడ
ముందుపూటకు గతిలేక కుందుచున్నఁ
బాడుచుందుము కొనవెఱ్ఱిపాటలేవొ.

విమలసంతోషమిచ్చు మా వెఱ్ఱిపాట
లితరజనులకు; మీగీతవితతి మాకు
సతత మానందదాయియై యతిశయిల్లఁ
గాన మాకంటె మీరలే ఘనులుగారె!

పరుల యాచింపఁబోరు మావలెను మీరు
దినము ఱెక్కలకష్టంబుఁ దినుచు, నాత్మ
తృప్తికై గానమొనరింతురెపుడు మిమ్ముఁ
గని తల ల్వంపవలదె మాకవులజాతి!

చెలువ ముంచిన, గొనముల కలిమిగూడఁ
గలుగు నచ్చోటనే యని తలఁపువాడము
నదియసూనృతమయ్యె మీయందు నహహా!
ధన్యతం గాంచినాఁడ మీదర్శనమున.

మానవుని దుర్గుణంబుల మాటచొరని
కాననాంతరసీమల మౌనులట్లు
పండుఫలములఁ దినిగాదె బ్రతుకుచుందు
రెలమి సన్మార్గగాములై యెల్లయపుడు.

ఈరసాలంబుఁ జెంత నింపెసఁగునట్టి
కాలువనుఁ, జుట్టు పచ్చనిచేల, నన్ని
మించి మిమ్ముల జ్ఞప్తియం దుంచుకొందు
జీవితాంతము వఱకింక సెలవు! సెలవు!!




శ్రీమాన్ కో. వేం. కృష్ణమాచార్యులు అయ్యవార్లుగారు

వ్యాసునికలహాభిలీతమును సార్వజనీనము నాచరింపవలయును. పరాజయ మెట్టివారల పాలఁబడును? విజయ మెవ్వనిధనము? కారణము లెవ్వి? ఎట్టివారలు శత్రువులవేఁగూడఁ గొని గూడఁబడెదరు? ధర్మపాశమున కెట్టియధికారము గలదు? ఉత్తమప్రశ్నములలో నేమేని తారతమ్య ముండునా? విచారింపవలయును. కావుననే ముద్రారాక్షసరచన కావశ్యకత గలిగినది. ఉత్తమస్వార్థకోవిదుడు, స్వార్థరాహిత్యమున (పరోపకారితే) కుఁ బ్రసండదండనమును గావించి విశాఖదేవుఁడు స్వార్థరాహిత్యమును గెలిపించెను. కామక్రోధాదులు గుణములు పురుషాదిరూపమున విపరిణమించి, గాత్మకృత్యముల సూచించుచు, మతాంతరకృత్యముల నిందించుచు, వివేకమునకు విజయము నొసంగి, వేదాంతశాస్త్రము వార్యులు వేదభావములతో వశీనయింపఁజేసిరి. ప్రబోధచంద్రోదయాదికి మిట్టినాటకసమాజము, రోగములను రోగములనుండి చేతనుఁడు రక్షింపఁబడు క్రమము వశీనయించుచు 'జీవానన్దా' దికి మప్పతిల్లెను. ఆరంవిజ్ఞానమునకు, నవ్యవిజ్ఞానమునకుఁ గలభేదము పాఠకులకు స్ఫురించినదా?

విశాఖదేవుని జీవితకాలమును ముద్రారాక్షసరచనాకాలమును మన మింక గమనింతము. మనవారలకు దేహాత్మాభిమానము లేకుండుటయుఁ, బునర్జన్మపరంపరయు వారి యాత్మపరివర్ణనమున విరతాదరుల నొనర్చినది. కొందఱు స్వనామము నుచ్చరించుటయే పాతకమని యెంచిరి; కొందఱకుఁ గలగోత్రవర్ణనమునఁ జాతకము. ఔను! తా నెన్ని జన్మముల నెత్తెను? ఎన్నికులముల? నెందఱు దుఃఖులు? మనకు స్వర్గముకూడ నశ్వరమే! నశ్వరసుఖాపాదకమగు నీశరీరమును, దన్నామాదికము నేలవచింపవలయు? అంత్యమున నఖండానందము ననుభవించు మనకు దుఃఖాన్తప్రబంధకల్పన మేల?

కాళిదాసాదులవలెఁ గాక యీ విశాఖదేవుఁడు తనకాలమునందలి వారివలె

'సామన్త వటేశ్వరదత్తపౌత్రస్య మహారాజ
పదభాక్పృథుసూనోః కవే ర్విశాఖదత్తస్య
కృతి ర్ముద్రారాక్షసం నామ నాటకమ్'

అని వచించెను. ఇకఁ డొనర్చిన ప్రబంధ మొండు గాన్పింపదు. మన కీవాక్యమే శరణ్యము.

విశాఖదత్తుఁడు క్షత్త్రియుఁడు. ఈతనితండ్రి పృథువు. తాత వటేశ్వరదత్తుఁడు. వటేశ్వరదత్తునికాలమున నాతఁడు సార్వభౌముఁడుగాక యొకచక్రవర్తి కంకితుడైయుండెను. ఎవని కంకితుఁడు? ఏ దేశము నేలెను? ఎప్పుడు? మన కగోచరము. ఈతనితండ్రి పృథువుమాత్రము చక్రవర్తిని నిరాకరించెనో, యనుగ్రహమునుబడసెనో మహారాజయ్యెను. ఈతనివిషయమునగూడ మనకుఁ దెలియునది యింతయే. కవి తాను రాజనని కాని, చక్రవర్తినని కాని వచింపక 'కవి' యనుటచే నీతఁడు పట్టాభిషిక్తుడుగాకమునుపే యీ గ్రంథమును రచించియుండును. పృథురాజ్యకాలమే గ్రంథనిర్మాణకాలము.

పృథుకాల మిదియనుట కాధారము గాన్పింపదు. విల్సన్ ఈతని శైలి ననుసరించి, క్రీ. శ. పదునొకండవ శతాబ్దియో, పన్నెండవశతాబ్దియో యీకవికాలమని నిర్ణయించెనట! కాని యీనిర్ణయము సమంజసముగా గాన్పింపదు. కారణ మీక్రింద నిరూపింపఁబడును.

మనయార్యభాషలో విమర్శనములు లేవను నాశయము కొంతవఱ కుండవచ్చును, గాని యలంకారశాస్త్ర మీలోపమును వారించుచున్నది. సర్వకావ్యానగతము సమంజసాభిప్రాయమును లక్షణముగను, కావ

ముల లక్ష్యములుగను స్వీకరించి, యనముగతముల నిరాకరించుట విమర్శము గాదా? దశరూపకమునందలి ప్రథమ ప్రకాశమున నంతిమశ్లోకమును వివరించుచు, నాలోకమున

'తత్రబృహత్కథామూలం
ముద్రారాక్షసం......ఇతి
బృహత్కథాయాం సూచితమ్'

అని వ్రాయఁ బడినది. ఈదశరూపాలోకముల రచించిన విష్ణుసూనుఁడగు ధనికుఁడు ముంజభూపు నాస్థానకవి. ఇతని కాలమును నిర్ణయించుచు, పం. దుర్గాప్రసాదశర్మ ద్వివేదిగారు తమ సాహిత్యదర్పణపీఠికలో, 'విష్ణుపుత్రుఁడగు నీధనికుఁడు శా. శ. తొమ్మిదవ శతాబ్ద చరమభాగమున నుండెను. ఈతఁడు దశరూపకమును, దశాలోకము నురచించె"నని లిఖించెను. ధనికునకు ధనిమ్మఁ జత యెట్లు సంభవించెను? ఆంగ్లేయులు దానిని విశ్వసింతు రెట్లు? కావున విశాఖదేవుఁ డంతకన్నఁ బూర్వమున, నవఁగా క్రీ. శ. 9-వ శతాబ్ది నుండెను. సుభాషితావళీపీఠికలో పి. పిటర్సన్ క్రీ. శ. 8-వ శతాబ్ది నీతఁ డుండెనని నిర్ణయించె. కారణ మేమియో?

ముద్రారాక్షసభరతవాక్యమున

'స శ్రీమద్బంధుభృత్య శ్చిర మవతుమహీం
పార్థివ శ్చన్ద్రగుప్తః'

అనియుండుటచే నీతఁడు చంద్రగుప్తసమకాలికుఁ డనుశంక పొడమవచ్చును. కాని[1] పౌరాణికోక్తి ననుసరించి కలి 16 శతాబ్దిలో, నవఁగా నేఁటికి 3400 వత్సరములకన్న బూర్వముగాని, మాశీననిర్ణయములఁబట్టి క్రీ. పూ. 4 శతాబ్ది, నవఁగా నిప్పటికి 2400 వత్సరములక్రిందఁగాని యున్న చంద్రగుప్తుఁడు, మించుమించుగా నిప్పటికి 1200 సంవత్సరములక్రింద నున్న విశాఖదత్తుఁడును సమకాలికు లెట్లయ్యెదరు? మాళవికాగ్నిమిత్రమునందలి భరతవాక్యమున కిది యనుకృతి కావచ్చును.

గ్రంథకర్త యీరూపకమునకు 'ముద్రారాక్షస' మని పేరిడెను; ముద్రచే రాక్షసుని గ్రహించుట యిందుఁ బ్రధానప్రతిపాద్య మగుట. రాజకీయాధికారులలోఁ బ్రధానులకరమున ముద్ర యుండును. దాని ముద్రించి రాజకీయకార్యముల నాలోకింతురు. ఇందు రాక్షసుని ముద్ర శత్రువులచేఁ జిక్కి యెన్నివిధముల నతని బాధించినదో యాపిల సూచింపఁబడును. ప్రథమమున దీని కీయాఖ్య యర్థ మగునో, కాదో విమర్శింతము.

గ్రంథములవలన ధర్మ అర్థ కామముల తత్త్వము తేటపడవలయును. రచనాప్రణాళికయు దానివనుసరించియే యుండును. ఈగ్రంథమునకుమాత్ర మేలయో కాని పరాజితునిఁ బరాజయసాధనమును సూచించు నాఖ్య నుంచెను. రాక్షసుఁడు పరాజితుఁడు; ముద్ర పరాజయ సాధనము. ఇట్టిదానివలన మనకు బోధ్యమగు నంశ మెద్ది?[2] దండికవి మృచ్ఛకటిక మని తనరూపకమున కాఖ్య యుంచెను. చారుదత్తుని కొమరున కాడుకొనుటకై మట్టిచేఁ జేయబడిన బండి వసన్తసేన బంగారునగల నలంకరించుకొనినది. కడకు విదూషకుని చంకనుండి జారి నగలు చారుదత్తుని మృత్యుముఖమున వైచినవి. దాని వలనమాత్ర మేపురుషార్థము సిద్ధించినది?

---

1 బార్హద్రథుల రాజ్యకాలము వేయివత్సరములు, శునకాదులు 138 ఏండ్లు, శైశునాగులు 360 ఏండ్లు, మహాపద్మ తత్పుత్రులు 100, ఇట్లు చంద్రగుప్తరాజ్యకాలము కలి 1598 తరువాత కానచే—

'తే తు పారీక్షితే కాలే మఘాస్వాస న్ద్విజోత్తమ!
ప్రయాస్యంతి యదా చైతే పూర్వాషాఢాం మహర్షయః,
తదానందాత్ప్రభృత్యేష గతివృద్ధిం గమిష్యతి'

అనునది సరికాదు. 'పూర్వాభాద్రా' మనవలెను. ఇటులే

'యావత్పరీక్షితో జన్మ యావన్నందాభిషేచనం,
ఏతద్వర్షసహస్రం తు జ్ఞేయం పంచాశదుత్తర' మనుట సరికాదు. 'పంచశతోత్తర' మనఁదగు

2 పిశ్చెల్ అను వాంగ్లపండితుఁడు మృచ్ఛకటికను రచించినది దండికవి యని చెప్పినట్లు సుభాషితావళి పీఠికలో పి. పిటర్సన్ మహాశయుఁడు వచించెను.

సత్పురుషుఁడుకూడఁ గర్మబద్ధుఁడే. సత్కార్యముల నొనర్చినపుడు దైవికముగఁ బ్రత్యవాయములు - ఆపదలు - పాల్పడవచ్చును. అంతమాత్రమున సత్కార్యములఁ బరిత్యజింపవలయునా? చారుదత్తునివలె బ్రణయిని బ్రాణములఁ బాయఁ దానుగూడ నాపెకై ప్రాణముల విడుచుటయే తటస్థించినను, అమాత్యరాక్షసునివలె స్వామికార్యమునకై కడఁగి యఫలమనోరథుఁడై పరాజితుఁడైనను - ఆర్యులు అసత్కార్యములఁగాని, అస్వామిభక్తిని గాని విడుతురా? 'యజ్ఞే వధోఽవధః' యనువారల కిది యేపాటి? విజయమును బడసిన యార్యచాణక్యుని మార్గము సమంజసమే కావచ్చును: విజయమే యావిషయమును బ్రతిపాదింపవచ్చును; సర్వజనాదృతము కావచ్చును. కవిమాత్రము రాక్షసునిపరాజయమువంటి పరాజయము నుపాదేయ మనుచున్నాఁడు.

ఇతరగ్రంథములవలెఁ గాక యీగ్రంథము చారిత్రకవిషయకము. మనము భాగవతాదిపురాణములఁ గాని, బృహత్కథను గాని పరిశీలించిన మనకనుల కంటఁ జాణక్యచంద్రగుప్తులు గాన్పింతురు. పాణినిప్రణీతమగు నష్టాధ్యాయీగ్రంథమున నీశబ్దము లుత్పాదితము లైనవి. గర్గాదిగణమునఁ 'జణక' శబ్దమును, 'సర్వాదిగణమున' 'ముర' శబ్దమును బఠింపఁబడినవి. 'చాణక్య' 'మౌర్య' అనుశబ్దములు నిష్పన్నము లైనవి. పౌరాణికులు 'ముర' యని స్త్రీవాచకముగ వచించుచుండ నిందు పుంలింగముగ నేల యుండెనో? కారణము దురూహ్యముగ నున్నది. ఏదియెట్లున్నను చంద్రగుప్తుని కాలనిర్ణయము సరిగా లేదనియుఁ, బాణినికాలనిర్ణయముగూడఁ గావలయుననియుఁ, బురాణముల భవిష్యద్రాజనిరూపణమునందలి రాజులందఱును తాత్త్వికులా, కల్పితులా, నిరూపింపఁబడవలసిన యంశమనియు వచింపవలసివచ్చినది. ఈప్రకృతము నాయంతమునువదలితిని. శే॰ 10,12 సంవత్సరముల క్రిందనున్న విశాఖదత్తుఁడు శ్రీకురాయబారి వ్రాఁతల ననుసరించకే బృహత్కథనో, మఱియేయార్యవాక్యములనో అవలంబించి యీముద్రారాక్షసమును రచించియుండును. కాన నిందలి రాక్షసాదులు కల్పితులై యుందురు.

ఈకల్పనాప్రణాళి కొంతవఱకు మృచ్ఛకటికము ననుగమించును. కాని మృచ్ఛకటికము నిద యనుగమించెనో, దీనిని మృచ్ఛకటిక మనుసరించెనో నిర్ణయింపఁజాలము. పంచతంత్రము క్రీ. శ. ౬-వ శతాబ్దికన్న ముందుగనే రచింపఁబడెనని సర్వజననిర్ణీతమగు నంశము. కాన నందలి మిత్రభేదము ననుసరించి యిందలి పాత్రములు కల్పింపఁబడియుండును. మలయకేతువునకును బింగళకునకును, అమాత్యరాక్షసునకును సంజీవకునకును, భాగురాయణునకును దమనకునకును సాదృశ్యము చాలవఱకుఁ గలదు. దమనకునివలెనే భాగురాయణుఁ డిందు మలయకేతునికడఁ జేరి యమాత్యరాక్షసునకు, నతనికి ద్వేషముత్పాదించి రాజానుగ్రహమును బడయును.

ఈగ్రంథము బృహత్కథ ననుసరించి రచింపఁబడెనని పైన వాకొంటిమి. ప్రకృతమునఁ బ్రచారమున నున్న కథాసరిత్సాగరమునఁ గథాపీఠలంబకమున నైదవ తరంగమున నీకథ వర్ణింపఁబడియున్నది. ధార్మికుఁడును, ధనవంతుఁడు నగు నందుఁడు పంచత్వమంద గురుదక్షిణకై యింద్రదత్తుఁడను బాపఁ డాతనిదేహమునఁ బ్రవేశించెను. రాజు మరణించి జీవించుటకై యాశ్చర్యపడి యథార్థము గ్రహించి శకటాలుఁడనెడు నాతనిమంత్రి నందపుత్త్రుఁడు చంద్రగుప్తుఁడు బాలుఁడగుటయు, రాజ్యమునకు ననేకశత్రువు లుండుటయుఁ దలంచి యింద్రదత్తుని కాయమును గాల్పించెను. యోగనందుఁడు (నందదేహమునున్న యింద్రదత్తుఁడు) వరరుచిమాటచే నాతనిపుత్త్రసహితముగ భూగృహమున నుంచి హింసించి కడ కాతని మాత్ర మీవలకుఁ దీసెను. కొంతకాలమునకు వరరుచి భార్యాదులు మరణించుటచే విరక్తుఁడై వనిఁ జేర, శకటాలుఁడు సమయమును గనిపెట్టి కోపనుఁడగు చాణక్యుని త్రయోదశీశ్రాద్ధమునకు నిమంత్రించి, రాజుచే నవమానితుఁడగు నతనికిఁ గృత్యాసాధనమునకు నేయుపరికరముల నొసఁగె. యోగనందుఁడు, నాతని సుతులు నేడుదినములలో దాహజ్వరముచే మరణింప, రాజ్యమును జంద్రగుప్తునకిచ్చి, సాచివ్యమునఁ జాణక్యు నునిచి తాను పుత్త్రశోకమున విరక్తుఁడై వని కేఁగెను.[1]

1 దశరూపకమునం దుదాహరింపఁబడిన శ్లోకములఁ జాణక్యుఁడే పట్టాభిషేక మొనర్చినట్లు కలదు.

ఈకథానకమే ముద్రారాక్షసమునకుఁ బూర్వపీఠిక యనవచ్చును. వరరుచియను నామ మిందుఁగానము, నందుని మంత్రులు వక్రనాసుఁడు మొదలగువారు. పరకాయప్రవేశము సత్యమైనను గాకున్నను, అమాత్యరాక్షస వాక్యముల నాతని ధార్మికత్వమును, ఆర్యచాణక్యవాక్యముల నాతని క్రౌర్యమును, ధనాభిలాషను-బ్రకటించుటచే నాతని ప్రకృతి పూర్వమునకన్న విభిన్నమైనదని తలంపవచ్చును. అమాత్యరాక్షసుఁడు కొంతకాలము పర్వతేశ్వరుని కడనుండి యాతని రాజ్యకార్యములఁ జూచుటచేతను, అవసానమునందు నాతని నట్టులే చూచుటచేతను, ఈవిషయము నుపలక్షింపక పోవచ్చును. పైకథానకమునఁ బూర్వనందసుతుఁ డనఁబడిన చంద్రగుప్తుఁ డిందుఁ గులహీనుఁడని వచింపఁబడియెను. ఆర్యచాణక్యుఁడుగూడ నీతని 'వృషలుఁ' డనుచున్నాఁడు. వృషలుఁ డనుటకుఁ గారణముగాఁ గవి కంచుకిముఖమున వితృష్ణుఁడగుటను సూచించుచున్నాఁడు. విష్ణుపురాణమునఁ జతుర్థాంశమునఁ జతుర్వింశాధ్యాయమును బరికించువారల మహాపద్మనందుఁడే శూద్రాగర్భసముద్భవుఁడైనట్లును, నాఁడు మొదలుగ రాజులెల్లరును శూద్రులైనట్లును, స్పష్టముగఁ గలదు. పూర్వప్రసిద్ధుఁడగు చంద్రగుప్తుఁడు పారశైణీయుఁడగు మహాపద్మసుతుఁడేమో! మురపత్ని యాతని జననియేమో!

'ముద్రారాక్షసము'నఁ జంద్రగుప్తుని విషయ మంతప్రధానముగాఁ గాన్పింపదు. సైన్యములరణ మిందుఁ బ్రధానముగాదు: బుద్ధిరణ మిందుఁ బ్రధానము. కుటిలమతియై దుఃఖనృత్య మొనర్చు నాతనికిని, క్రూరగ్రహమునకు నిందు యుద్ధము వర్ణింపఁబడినది. కుటిలమతి కృత్యములను వివరించి, జయపరాజయహేతువులఁ బ్రతిపాదించి యీ వ్యాసము నుపసంహరింతును.

కుటిలమతి యప్రతిగ్రహీతలగు ఋషులయన్వయమున నవతరించెను[1]. వాత్స్యాయను డగు నీతఁడు తన వంశపువారివలెనే సర్వశాస్త్రముల కాకర మనిపించుకొనెను. మానసమునఁ దృష్ణకుఁ దావిడక, రాజకీయరంగమున బ్రవేశించినప్పుడుగూడ నంతేవాసులకు విద్యాధనమును దారవోయుచు, శిష్యులపై దుశ్శీలుఁడును, జండకోపనుఁడును గాక భగవత్పతంజలిపృషోదరాదిసూత్రభాష్యమున వచించిన

'ఏతస్మిన్నార్యావర్తేనివాసేయే బ్రాహ్మణాః
కుంభీధాన్యా అలోలుపా అగృహ్యమాణ
కారణాః కించిదంతరేణ కస్యాశ్చిద్విద్యా
యాః పారంగతా స్తత్రభవంతః శిష్టాః'

అనుదాని కుదాహరణీయుఁడుగ నుండెను. కాని దైవమెట్టివానికైన, నెట్టికీర్తికైనఁ దీసికొనిరానోపునుగదా! దుర్మార్గులగు మంత్రులపై రాజ్యభారమును వైచి, పరద్రవ్యాపహరణమునకు వెనుదీయక, గరువమునఁ గన్నుగానని నందుఁడు! ప్రజలయెదుట నగ్రాసనమునుండి క్రిందికీడ్పించుట యాతనిఁగూడ నన్వయముతోడ సింహాసనమునుండి క్రింద కీడ్పింపఁబడవలసినదిగాఁ బ్రేరేపించెను. తన మిత్రుఁడగు[2] విష్ణుశర్మసాయమునను, బర్వతేశునిసాయమునను నందులను నాశనమొనర్చెను[3]. విశ్వస్తవంచకుఁడును (కృతఘ్నుఁడును), బరాంగనాపరాయణుఁడు నగుపర్వతే

1 విష్ణుపురాణము చతుర్థాంశమునఁ జతుర్వింశాధ్యాయమున వ్యాఖ్యసేయుచు శ్రీధరుఁడు
'కౌటిల్య వాత్స్యాయన విష్ణుగుప్తాద్యపరపర్యాయ శ్చాణక్యః'
అనుచున్నాఁడు. ఈతఁడు వత్సులలోనివాఁడు కావచ్చును.

2. చంద్రగుప్తచక్రవర్తిలో 'ఇందుశర్మ' యనికలదు.

3. కవి యీవిషయమును విచిత్రముగ సూచించియున్నాఁడు. మలయకేతువు రాక్షసునికృతఘ్నతను బలుకుచు,
'మిత్రం మమాయమితి నిర్వృతచిత్తవృత్తిం విస్రంభతస్త్వయి నివేశితసర్వకార్యం
తాతం నిపాత్య...' 5-7
యను టతని వివేకహైన్యతను దెల్పునది. రాక్షసుని మిత్రుఁడఁట! ఆతనితో దీక్షాసెనఁట! రాక్షసుఁడు కృతఘ్నుఁ డెట్లు? పర్వతేశుఁడే కృతఘ్నుఁడు, హంతవ్యుఁడు.

కుని వధించెను. చంద్రగుప్తసంహారమునకై శత్రువు లొనర్చు ప్రయత్నముల విఫలీకరించెను.

కుటిలమతియైనను చాణక్యునకు గుణములపైఁ బక్షపాతము మెండు. తానొనర్చిన ప్రతిజ్ఞ నెట్టులో పరిపూర్తి యొనర్చుకొనెను. కాని చంద్రగుప్తునిగుణగణ మాతని మనము నాకర్షించెను. రాజ్యము నిష్కంటకముగ నొనర్చినఁగాని తనప్రతిన పూర్తికాదని తలంచెను. తాను నిస్పృహుం డయ్యు వృషలునిపై ప్రేమచే శస్త్రమును ధరించెను. నీతిశాస్త్రము నొకదానిని రచించెను. యోగ్యుఁడగు స్వామిభక్తున కీమంత్రిశస్త్రము నొసఁగి తాను నిశ్చింతగ నుండవలయునని యాతని యాశయము.

ధనముండిననే తరుణులును, దర్పముండిననే భటులు ననుట ప్రపంచసహజము. నందామాత్యుఁడును, స్వామిభక్తుఁడు నగురాక్షసుఁడే యిట్టిపదవి కర్హుఁడు. ఆతఁడా? తన్నో, తన కక్షిష్టుఁడగు చంద్రగుప్తునో సంహరించి నందులఋణము దీర్చుకొనఁదలఁచి, విషాదులఁ బ్రయోగించి వేవిధములఁ బ్రయత్నించుచుండెను. ఆర్యచాణక్యున కాతఁడే యమాత్యుఁడుగా నుండఁదగునని తలంపు.

ఆర్యుఁ డమాత్యుని కృతజ్ఞతయుఁ, బర్వతకుని- అతనికొమరుఁడగు మలయకేతుని లోభము, అకృతజ్ఞత, బుద్ధిహైన్యము నెఱుఁగును. పర్వతకునిమైత్రి నమాత్యుఁడు మఱవఁడనియు, తత్పుత్త్రునికే సాయమొనర్చుననియు నమ్మి మలయకేతువును, దనప్రియభటుఁడగు భాగురాయణునిచే నగరివెడలఁగడపించెను. అమాత్యుఁడు మలయకేతువు నాశ్రయించెను. కలూతాదిదేశాధిపతులమైత్రిని గడించి చంద్రగుప్తునితో రణమొనర్ప ప్రయత్నమొనర్చెను.

ఆర్యచాణక్యునకు దైవమునకన్నఁ బురుషకారమే గొప్పదనియు, సేనలకన్న శేముషియే గొప్పదనియు దృఢమగు విశ్వాసము కలదు. శేముషిచేతనే శత్రువుల జయింపఁదలఁచిన నీతఁ డమాత్యరాక్షసుని ప్రభావ మెఱుఁగును గానఁ జతురంగబలముల నాయిత్త మొనర్చెను; బుద్ధిబలమును వినియోగించెను.

ఇపు డీతనిబుద్ధి రెండుకార్యముల సాధింపవలయును: యుద్ధసన్నాహమును భంజించుట, యమాత్యరాక్షసుని జంద్రగుప్తవిధేయునిగా నొనర్చుట. స్వామిభక్తుఁడును, కృతజ్ఞుఁడును, రణపండితుఁడును, సాహసియు నగునమాత్యుఁడు యత్నభంగమైనఁ బ్రాణముల వదల సాహసించునేమో! చాణక్యుని కింతకన్న నాపద యెద్ది? సద్గుణగరిష్ఠుఁడైనను జాణక్యుఁ డిపుడు అడుగుల నిడిన భూమి యణఁగునేమో యని యడుగిడఁ గొంకియు, బాహుల నెత్తిన బ్రహ్మాండము బగులునేమో యని బాహుల నెత్తఁ జంకియు, కనులఁ దెఱచి చూచినఁ గాలిపోవునేమో యని కనుఁగొననోడియుఁ ద్రిపురారివలె దుఃఖనృత్యమునకుఁ గడంగెను. ఈ నృత్యమున నాల్గువిధములగు తంత్రములు అమాత్యమలయకేతు భేదనమునకును, రాక్షసు విధేయునిగా నొనర్చుటకు నుపయోగింపఁబడినవి.

అమాత్యరాక్షస మలయకేతువులకుఁ గలహము గల్పింప నీతఁ డొనర్చినయత్నములలో—

మొదటిది అమాత్యునికడను, మలయకేతువుకడను నమ్మకమైన తనచారుల నుంచుట. నందనాశకన్న ముందుగనే తనసహాధ్యాయుఁడగు విష్ణుశర్మను క్షపణకవేషమును వేయించి జీవసిద్ధి యనుపేర నమాత్యునికడను, చంద్రగుప్తసహాధ్యాయుఁడగు భాగురాయణుని మలయకేతువుకడను, సిద్ధార్థకుఁడనువాని నమాత్యుని మిత్రుఁడును, వ్రాయసకాఁడు నగు శకటదాసునికడను నుంచెను. వారివారి యనుగ్రహమునకు వారును పాత్రులైరి. జీవసిద్ధికుసుమపురినుండుటచే విషకన్యాప్రయోగముచేఁ బర్వతకునివధించె ననునెప మిడి రాక్షసవ్యాపారముల నెఱుఁగుటకై యాతని వెడల నడచెను. రాక్షసునికడ నాతఁ డుండెను. భాగురాయణుఁడు కుసుమపురి మలయకేతు వుండిన రాక్షసుఁ డతని నాశ్రయించు నవకాశము కలుగదనియు, మలయకేతువు నాశ్రయించినచో సుభేద్యుఁ డగుననియు బోధకుఁడై, 'నీతండ్రి నర్ధరాజ్య మీవలసివచ్చునని చాణక్యుఁడు వధించె; నిన్నుఁగూడ వధించు' నని భయపెట్టి కుసుమపురినుండి పాఱిపోవ బోధించి, తాను నాతనితో నేఁగి, యాతని కిష్టసఖుఁడై తనవంటి భద్రభటాదులకు సైన్యపాలకతాద్యధికారముల నిప్పించి శత్రుకటకమును మిత్రభూయిష్ఠముగ నొనర్చెను. సమయ మగునపుడెల్ల నీతఁడు 'చంద్రగుప్తుఁడు స్వామిపుత్త్రుఁడు; చాణక్యుఁడు తన కుచితపదవి నాక్రమించుటచే నతనిపై ద్వేషమేకాని యమాత్యునకు చంద్రగుప్తునిపై నేమిద్వేష' మని యిచ్చకము

లాను, నమాత్యునిపై సంశయముత్పాదించుచుఁ గ్రమముగా వారిమైత్రిని భంజించివైచెను. జీవసిద్ధి 'యమాత్యుఁడే పర్వతకునిఁ జంపించె' నని తెలుపునపుడు రాక్షసప్రాణముల రక్షించి చిత్రవర్మాదులఁ జెండించెను.

రెండవది కూటలేఖ. ఆర్యుఁడు సిద్ధార్థకుని శకటదాసుకడ నుంచెనని వివరించితివిఁకదా! సిద్ధార్థకుఁ డెవ్వరి కెవ్వరు వ్రాసినదియు లేకుండునట్లు ఒక లేఖను శకటదాసునిచే వ్రాయించి, రాక్షసముద్రచే ముద్రించి తనతోనుగ నమాత్యునికడఁ జేరుటకును, బరినుండి వెడలుటకును నై శకటదాసునకు 'రాజద్రోహి'యని శూలారోపమును విధించి, సిద్ధార్థకునిచే విడిపించి యార్యుఁడు లేఖతోడ నతని రాక్షసునికడ కనుపును. అంత నా సిద్ధార్థకుఁడు మిత్రప్రాణత్రాణసంతుష్టుడగు రాక్షసుఁ డొసంగిన (మలయకేతువు రాక్షసున కొసఁగిన) యాభరణములపై నాముద్రనే ముద్రించి రాక్షసున కొసంగి, రాజకీయవ్యవహారముల నాముద్రచే ముద్రించి, శకటదాసు లిఖించుటను గమనించి, లేఖను, ఆభరణముల దీసికొని, మలయకేతువుకడ కేఁగి, 'యమాత్యుఁడు లేఖను లిఖించి చంద్రగుప్తునకు వార్త నంపించె'నని వివరించి వాని నొసఁగును. మలయకేతువు విశ్వసించును.

మూఁడవది పర్వతకుని నగల నమాత్యునకు విక్రయింపించుట. చాణక్యుఁడు శ్రాద్ధకాలమునఁ బర్వతకు నలంకారత్రయమును (విప్రవేషమును ధరించుకొనిన చారులకు) బ్రాహ్మణులకు చంద్రగుప్తునిచే నిప్పించి యమాత్యునకు విక్రయింపించును. సిద్ధార్థక జీవసిద్ధులు తనపై దోషముల నారోపించునపుడు నాయలంకారముల నలంకరించుకొని రాక్షసుఁ డేఁగి మలయకేతువుచే నిరాకృతుఁడగును. మలయకేతు వనృతమునే విశ్వసించును.

నాలవది కృతకకలహము. చాణక్యుఁడు చంద్రగుప్తుఁ డాజ్ఞాపించిన కౌముదీమహోత్సవమును నివారించి, తనతోఁ గలహింపవలసినదిగ, రాజకీయవ్యవహారముల స్వయముగాఁ జూచుకొనవలసినదిగ నాజ్ఞాపించి యాతనితోఁ గలహించును. ఈకలహమే రాక్షసుఁ డెత్తివచ్చుటకును, భంగపడుటకును గారణము.

చాణక్యుఁ డిన్ని విధముల యత్నించినను రాక్షసుఁ డెట్టిభేదోపాయములు నవలంబింపక రాజాలసాయమును వేఁడికొని పడయుచు. సన్నద్ధుఁడై భేదనమునకై స్తనకలశుఁ డను వైతాళికునిమాత్రము ప్రయోగించెను. [illegible]క్యుఁ డీవిషయమును గుర్తించెను.

రాక్షసు నమాత్యునిగాఁ జేయుట కొనర్చినతంత్ర మొక్కటియే. ప్రజలు విశ్వసించుటకు, మధ్యమమునఁ దోడ్పడుటకును రాక్షసుఁడు తనకుటుంబమును జందనదాసుఁ డను శ్రేష్ఠియింట నుంప, నీవిషయము నెఱింగి చాణక్యుఁడు—

'త్యజ త్యప్రియవ త్ప్రాణా
న్యథా తస్యాయ మాపది,
తథైవా స్యాపది ప్రాణా
నూనం తస్యాపి న ప్రియాః' 1.25

అని నిర్ణయించుకొని, కుటుంబముతోడ నాతని బంధించి, మలయకేతునిరాకృతుఁడై సాహసించ చందనదాసమోక్షణమునకై ఖడ్గసఖుఁడై వచ్చు నతనిచేతిఖడ్గము నుపాయమునఁ దీయించి, యతనిప్రాణముల, హంతకులప్రాణముల రక్షించి, యమాత్యునితో నమాత్యపదవి కేకొనవన్నఁ జందనదాసప్రాణములు దక్కవని శస్త్ర మొసఁగెను. 'నమః సర్వకార్యప్రతిపత్తిహేతవే సుహృత్స్నేహాయ' యని యమాత్యుఁ డంగీకరించెను.

రాక్షసుఁడు శస్త్రోపజీవియగు బ్రాహ్మణుఁడు; కుటుంబి; చాణక్యునికన్న వయసునఁ బెద్ద; నందానురక్తుఁడు; అమాత్యుఁడు; ధనధాన్యవైభవమున, నస్వాతంత్ర్యమునందు నప్రతిముఁడు; దైవమే పురుషకారమునకన్నఁ బ్రబలమను దృఢవిశ్వాసము గలవాఁడు; మూర్తిమతియగు కృతజ్ఞత యని వచింపవచ్చును. ఈ 'క్రూరగ్రహ' మేల పరాజితమయ్యెనో వివేచింతము.

రాక్షసుఁడు పరాజితుఁడగుటకుఁ బ్రథమకారణము మలయకేతువు నాశ్రయించుట. చాణక్యుఁ డాశ్రయించిన చంద్రగుప్తుఁ డాతనియందుఁ బ్రేమవిశ్వాసములు కలిగి, తాను రాజు ననియుఁ జాణక్యుఁ డమాత్యుఁ డనియుఁ దలంపక, దాను శిష్యుఁడననియుఁ, జాణక్యుఁడు

లీవయాచార్యుఁ డనియు నెంచి, యాతని యాజ్ఞకు మాఱాడక యంగీకరించుచు, నాతని యాజ్ఞచే నారిసితోఁ గలహించి,

'ఆర్యాజ్ఞయైవ మమ లంఘిత గౌరవస్య
బుద్ధిః ప్రవేష్టు మివ నే వివరం ప్రవృత్తా'

యని సంతపించి చాణక్యునియం దపారమగు భక్తి నించెను. అమాత్యుఁ డాశ్రయించిన మలయకేతు వాతని విశ్వసించియు, భాగురాయణుఁడు మొదలగు సచివముఖ్యుల యిచ్చకములకు మెచ్చి, వారలచేతిబొమ్మయై, వారలమాటలచే నమాత్యునిపై సంశయించి యమాత్యప్రతిపత్తిఁ జూపుచు, శత్రువులవలలోఁ జిక్కి మిత్రుల హింసించి,

'శక్యః ఖల్వేష రాక్షస మతి పరిగృహీతో
ఽపి వ్యక్తిస్థ మానః ప్రజ్ఞయాం నివార
యితుమ్'

అను చాణక్యవాక్యమును యథార్థమొనర్చి యతని యాలోచనల సఫలముగఁ జేసెను. రాక్షసుఁడు పర్వతేశు నాశ్రయించి యతఁడే తనతోఁ డీకొను నెటులఁగను. చంద్రగుప్తుం టివాఁడే తనయుఁ డని యేల గ్రహింపలేకపోయెనో! కవి యాశయమును

'అద్రవ్య మేత్య తు వివిక్తసరో ఽపి మన్త్రీ
శీర్ణాశ్రయః పతతి కూలజవృక్షవృత్త్యా'

యని రాక్షసముఖముననే వివరించెను.

రెండవప్రకారము నైతికము. రాజకీయనీతికి, నితర లోకనీతి (ధర్మము) కి నెంతయో యంతరము.

'మిత్రాణి శత్రుత్వ ముపానయన్తి
మిత్రత్వ మర్థస్య వశా చ్చ శత్రూన్,
నేతి ర్నయ త్యస్మృతపూర్వవృత్తం
జన్మాన్తరం జీవత ఏవ పుంసః.' V-8

కావుననే రాజ్యాధికృతులు ప్రపంచమునంతయు విశ్వసింపఁజేయవలయును. తానుమాత్రము విశ్వసించిన ట్లభినయించుటతప్ప నిజముగా విశ్వసింపరాదు. శత్రుసంబంధుల నెన్నటికిని నమ్మరాదు. ఎట్టివారితో మాటలాడినను, ఎట్టి యాలోచనలఁ బన్నినను, అవశ్యముగ గోప్యపవలయును. భావిఫలితములను, ప్రతిబంధములను, దన్నిరాకరణపరిపాటిని నిర్ణయింపవలయును. రాజకీయమునకును, కుటుంబమునకు నొక్కేసాధనము వినియోగింపరాదు. భృత్యులకుఁ బారితోషికము మిక్కుటము వివేచించి యీవలయును. చాణక్యుని కార్యమాత్రమెల్ల నీరీతిగ నుండును. అతఁ డాలోచించు నాలోచనలతనికి, నింకనెవరివలన నా కార్యము సాధింపఁబడునో వానికిని మాత్రమే తెలియును. రాజునకుఁగూడఁ దెలియనటులు,

'కృతకకలహం కృత్వా స్వతన్త్రేణ త్వయా
కించిత్కాలం వ్యవహర్తవ్య మిత్యార్యోపదేశః'

యనునదియే ప్రబలప్రమాణము. ఫలమేమి యనువిషయమనిన, నారెండవప్రాణికిని దెలియదు. కాళిదాసుని 'ఫలానుమేయాః ప్రారంభాః' యనుట కక్షరేయ మిదియే. ఒకకార్యమునకయి యనేకసాధనముల నాలోచించుటయు, వినియోగించుటయు శత్రుకృతాంతరాయముల నరికింపక ఫలేగ్రహి యగుటకే. ఈతఁడు భృత్యులకిచ్చు పారితోషికము కృత్యమున కుచితమైనదగుచుండును. ఇతరుల కాగారప్రణాళి తెలియదు. ఎవరికివారే యధికఫలభాక్కులమని తలంపఁజేయును. ఇది చాణక్యుని నైతికచాతుర్యము. రాక్షసుని నీతిపథ మిట్టిది కాదు. అతఁ డాలోచించువిషయముల నీవలివారు వినుటయు, నపార్థములఁ గల్పించుటయుఁ దటస్థించినది. చంద్రగుప్తుని బాల్యస్నేహితులగు భాగురాయణాదులు తనపక్షమున కేల వచ్చిరా యనుకారణమునైనను విచారింపలేదు. ఈతఁ డతిచిత్రకల్పనకై కడఁగి లేఖవ్రాళ్లను నిదురను వదలెనేకాని, కరణీయాకరణీయముల నిర్ణయింపలేదు. ఇతని కార్యఘాతుకుల నరివశత్రువులును గ్రహించిరి. చంద్రగుప్తచాణక్యకలహమువలన నీతని యుపాయ మెంతఫలితమయ్యెనో గ్రహింపవచ్చును. ఈతఁడు శత్రువులసాధనము నెప్పుడును విచారింపనే లేదు. భటులను గారవించునపుడు తారతమ్యము లేదనుటను మలయకేతు వొసఁగిన యాభరణముల శకటదాసరక్షకుఁడగు సిద్ధార్థకున కిడుటయే తెలుపుచున్నది దూరాలోచనము లేమి బ్రాహ్మణికొసఁగిన యంగుళీయకమును సిద్ధార్థకునివలన గ్రహించి శకటదాసునకు రాజకీయవ్యవ

హారముల నుపయోగింపవలసినదిగా నికుటచే గ్రహింపవచ్చును. పైకారణములవలననే యాతనికి శత్రువు లెవ్వరా? మిత్రులెవ్వరా? యనువిషయము తెలియక,

‘ఏతే భద్రభటాదయః నచ తథా లేఖః స
సిద్ధార్థకః,తచ్చాలంకరణత్రయం సభవతో
మిత్రం భదన్తః కిల, జీర్ణోద్యానగతః స
చార్త పురుషః క్లేశః స చ శ్రేష్ఠినః, స
ర్వోఽసౌ వృషలస్య వీరభవతా సంయో
గమిచ్ఛోర్నయః’

అని యార్యుడు వివరించుననుకొనువారలనె సంశయించెను. మాయావియగు చాణక్యునితోపాటు ఈతడును మాయావియైన నెటులుండునో? భారవికవి

‘వ్రజన్తి తే మూఢధియః పరాభవం
భవన్తి మాయావిషు యే న మాయినః,
ప్రవిశ్యహి ఘ్నన్తి శఠా స్తథావిధా
న సంవృతాఙ్గా న్నిశితా ఇవేషవః’

అని వివరించుటచే విశాఖదేవుడును ప్రధానమగు నీయంశమును ‘శాఠ్యమవాప్య’ త్తని యాద్యశ్లోకముననే వివరించెను. ఈశాఠ్య వనమేమి? ఎత్తునకు మాఱెత్తు యభిమతసిద్ధిని గాంచుటయే. చాతురికూడ నింతకన్న వేఱె కలదా?

మూడవకారణము దుఃఖియగుట. ప్రపంచమున నెవఁడైన విచారాకులుఁడగునెడల నాతనిబుద్ధి నిబద్ధమగుటచే కరణీయాకరణీయముల గుర్తింపలేకపోవును. రాక్షసుఁడు తానెవనిచే కన్నబిడ్డకన్న నధికప్రేమమున విలోకింపఁబడెరెనో యట్టివారలే దైవదుర్విపాకమునకుఁ బాల్పడిరి. ఆతఁడు ధైర్యమును వీడి వారలమాట నెత్తికొని వాపోవుచు, మరణమే శ్రేయమని తలంచుచు, ‘ఋణము ఋణ’మని కృతజ్ఞతచేఁ బ్రేరేపింపఁబడుచు వచ్చెను. ఋణ మొకవంకను, విచార మొకవంకను శోధించుచుండ నాతని కాలోచనాశక్తి యెట్లు? భాగురాయణాదుల కాటిల్యమును గుర్తించు టెట్లు? చాణక్యుఁడా ప్రతిన నెఱవేర్చుకొనెను. చంద్రగుప్తునకు రాజ్య మొసఁగెను. ఆతనికి విచార మేడ? ఆలోచనాశక్తి లోప మేడ?

నాలవకారణము చారుల తారతమ్యము! చాణక్యనిభటులు ప్రతినయొనర్చినది మొదలు శత్రువుల కపకరించి, నమ్మించి, యమాత్యాదిపదవుల నాక్రమించి, సమయజ్ఞత చాతురిని వినియోగించుచుండిరి. రాక్షసభటు లట్టిప్రవేశమును లభింపకుండుటయే కాక, లభించిన యున్నతపదవులనుగూడ శత్రువు తెలియఁగనట్లు సంచరింపలేక యచేతనసాధనములచే నరుల కపకరించుచు వచ్చిరి. ధీమత్ప్రభావమునిన వీరలకడ నుండునకైనఁ గానమను టతిశయోక్తియా?

ఇవన్నియుఁ గారణాభాసములే: ప్రధానకారణము స్వార్థమును, పరార్థమును. రాక్షసుని వ్యాపారములన్నియుఁ గృతజ్ఞతామూలములు. తా నెవరిచేఁ గొమరు నివలెఁ బోషింపఁబడియెనో, తన కుపకరింప నెవరు ప్రాణముల వీడ దొలఁగిరో వారలఋణము దీర్చుకొనుటయు, నాకలకై తనమానముఁ ద్యజించుటయు మత్తమగుణమయ్యు నవశ్యకరణీయములలో నొకటియగుటచే స్వార్థమే. ఈస్వార్థమున నీతఁడు సంయతుఁడై కడకు ‘కాగతిః’ అని మరణమునకన్న దారుణమగు శత్రుసేవ కియ్యకొనెను

చాణక్యునికృతి పరోపకారరూపము. చంద్రగుప్తున కాతని కెట్టిసంబంధము (పోష్యపోషకాదికము)ను గానము. అతనికి రాజ్యాభిలాషముగాని, భోగేచ్ఛగాని లేదనుట కాతని- రాజాధిరాజమంత్రిగారి గృహభూమికే[1] పిడకల పలుగఁగొట్టుటకై యుపయోగించు పలుగు తాతిని, వటువులు తెచ్చి పడవైచిన దర్భకట్టలను, ప్రా[illegible] గోడకొణిగపై నెండవైచిన సమిధలను విలోకింతుము. తృష్ణ కున్నః వటువు. ఇట్టివాఁడయ్యు నీతఁడు వృషలా

[1] ఉపలశకల మేత ద్భేదకం గోమయానాం, వటుభి రుపహృతానాం బర్హిషాం స్తోమ ఏషః, శరణ మపి సమిద్భి శ్శుష్యమాణాభి రాభి, ర్వినమితపటలాన్తం దృశ్యతే జీర్ణకుడ్యమ్. III-15

పేక్షచే మన్త్రిశస్త్రమును గ్రహించెను. నిజమునకు[1] భృత్య ప్రకృతి యగు రాక్షసునికన్న నా మన్త్రిశస్త్రమును అర్హునకొసఁగఁగోరు పరోపకారి చాణక్యుఁడే గెలువనర్హుఁడు.

ఈరూపకమువలన సేవకన్న క్షేమషియు, ప్రాణమునకన్న మానము, వంతకన్న మిత్రరక్షణము, కృతజ్ఞతయు గొప్పవని మనము గ్రహింపఁదగును. వ్యవహారస్వభావమును, కార్యసాధనోపాయములను నిందు ముఖ్యముగా గమనింపఁదగును.

ఆలంకారికులలోఁ గొందఱెందు అంత్యమున భరతవాక్యమును వచించు నాయకాభ్యుదయము లేకుండుటయేకాక యఫలమనోరథుఁ డగుటవలన నసత్కావ్యముగా వచించుచున్నారు. కవి యిట్లాత్మరక్షణాదేరాక్షసుని సఫలమనోరథునిఁగ నొనర్చి యీదోషమును నివారించికొనె ననవచ్చును. ఫలభాక్కగుటచేఁ జంద్రగుప్తుఁడే నాయకుఁడనియు, నాతఁడు—

'ప్రఖ్యాతవంశో రాజర్షి
ర్దివ్యో వా యత్ర నాయకః'

అనుటకు వ్యతిరేకముగఁ గులహీనుఁ డగుటచే నసత్కావ్య మనుచున్నారు. కవి—

'వారాహీ మాత్మయోనే స్తను మతనుబలా
మాశ్రిత స్యానురూపాం, యస్య ప్రాగ్దన్త
కోటిం ప్రలయపరిగతా శిశ్రియే భూతధాత్రీ, మ్లేచ్ఛై రుద్వేజ్యమానా భుజయుగ
మధునా పీవరం రాజమూర్తేః, స శ్రీమ
ద్బన్ధుభృత్య శ్చిర మవతు మహీం పార్థివ
శ్చన్ద్రగుప్తః'

అని 'నావిష్ణుః పృథివీపతి' యగుటచే దివ్యనాయకుని వృత్తముచే బ్రతిపాదించి రాజ్యసంపాదనమును సూచించెనని తోఁచఁదగును.

పాఠకులార! ఈవ్యాసము నుపసంహరించితిని. అమూల్యమగు కాలమున కీయన్తరాయమును క్షమింతురుగాక!

---

# వియోగయాత్ర

పాటిబండ అప్పారావు గారు

గోదావరమ్మ తల్లీ! నాదుఁరదృష్టములు కారణంబుగ నను నీ
పాదంబుల దరి కీడ్చితి, వేదిక్కుం జూపి కష్ట మీడించెదవో.

క. ఎండ బడి దప్పిగొని రేయెండన్ వడదాకు బిడ్డ డేడువగా నీ
యండన్ జేరితి మీఁక నెం దుండునో యాజైలు? ఎట్టు లుండునో ప్రియుఁడున్.

సీ. అవిరతైశ్వర్య వైభవ మహాప్రాభవోపేత భేరీధ్వాన విలసితంబు
సంగీతమాధురీ సారస్వత రసానుభవ నవ్యరాగ సంవాసితంబు

---

1. ఈ విషయమును గవి చంద్రగుప్తకంచుకి 'క్షేతవ్యం నృపతే' యని సేవాకష్టముల (III–14) వివరించినట్లు రాక్షసునిచే 'అధికారపదం నామ నిర్దోషస్యాపి పురుషస్య మహదాశంకాస్థానం. కుతః?'
'భయం తావత్సేవ్యా దభినివిశతే సేవకజనం, తతః ప్రత్యాసన్నా ద్భవతి హృదయేష్వేవ నిహితం,
అతోఽధ్యారూఢానాం పద మసుజన ద్వేషజననం, మతిః సోచ్ఛ్రాయాణాం పతన మనుకూలం కలయతి.'(V–13.)
అని వచింపించుటచే నూహింపఁదగును.

నిత్యయౌవనలతో స్నేహప్రణయపుష్పసందోహ పరిమళోచ్ఛ్వాసితంబు
పరదేశగమన సంప్రాప్తనూత్నజ్ఞాన సూచితానేకార్థ శోభితంబు
నగుచు దాంపత్యజీవితం బలరు ననుచు, నాదుపెండ్లినాడు తలంచినాము కాని
జెయిలులో నున్న ప్రియునకై పయనమాడు, ననుచు నెన్నడుం గలగాంచ మైతి మపుర.

వలపువెన్నెలసెలయేళ్ల జలకమాడి, చెలిమి లూరు నాశాక్షీరములను బోసి
మొలవజేసితి మది నొక్క తులసిమొక్క, క్రూరులై దాని బడద్రోసినారె తల్లి.

జీవనామూల్యరత్నంబె చిక్కెననుచు, తలపుదొంతరలందు భద్రముగ నునిచి
చిత్తమంజూష డాచియుంచితిని ప్రియుని, భీరులై వాని కాజేసినారె తల్లి.

బిగికవుంగిలి కోటగోడగ నమర్చి, మధురలావణ్యసీమ సామ్రాజ్య మిచ్చి
రక్షణ మొనర్పఁ జూచి యోర్వంగలేక, నాథు నెడబాపి బంధించినారె తల్లి.

మోసము చేసెనా సిరుల ముచ్చిలెనా పరకాంత జూచెనా
బాస దొలంగెనా యితరపాపలవం బెపుడైన జేసెనా
దోసము నేమి పట్టుకొని త్రోసెను జైలున? ఇంత భగ్గనఁ
జేసి ప్రభుత్వ మేమి తిన నేర్చునొ యాప్రభువైన జూచెదఁ.

సత్యనీతియందు చండశాసనుడంచు, ప్రియునిబట్టి చెరను బెట్టిరంట
దీనరక్షణమున ధీరసాహసుడంచు చీకటింట బందిచేసిరంట.

కోమలరాగిణీహృదయకోటరమందున చిచ్చువెట్టి యీ
భూమి నెవండు బాగుపడె మున్న బలాహృదయప్రకోపితో
ద్దామపరాక్రమప్రళయతాండవమందున నెవ్వడాగు; దీ
క్షామహనీయసిద్ధికయి కాళికనై నవశక్తి జూపెదఁ.

మాతృదేశరక్షాయాగమండపమున, బలియగుదు నేను నాముద్దుపాపతోడ
ఈవియోగిని కిక లేవు లేవు లేవు, నిరతధనధాన్యసంపదన్వేషణములు.

ఓ! యని తండ్రికై యిటుల నూరక యేడ్చెద వేలనోయి, బి
డ్డ! యిట నీవు నేను వనటంబడి గోలున మొత్తుకొన్న మీ
నాయన వచ్చి ముద్దు లిడునా?—యిటు లేడ్చెదు నీదుకన్నులన్
బాయక చందమామ చిఱుబంగరుపూవు లొసంగు జూడుమా

---




[భాసకృతికిఁ దెనుఁగు]

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

(వెనుకటి సంచిక తరువాయి)

రాముఁడు

గీ. ఇపుడు నీకవదాతిక యిచ్చినట్టి
నారచీరలు గొని తెమ్ము నాకుఁగూడ
నే నిదే యన్యభూపతుల్ పూననిదియు
నాచరింపనిదియు ధర్మ మాచరింతు.

సీత

ఆర్యపుత్త్రులు పుచ్చుకొండి!

రాముఁడు

మైథిలీ! నీవిషయమేమి?

సీత

నేను మీకు సహధర్మచారిణినిగదా!

రాముఁడు

నే నొక్కఁడనేకదా వెడలవలసినది.

సీత

అందుకనేగదా నేనూ వస్తాననడము?

రాముఁడు

అడవులలో వసింపవలెనుసుమా!

సీత

అడవులు నాకు మాడువులే అవుతవి సుమండి!

రాముఁడు

అత్తమామలకు శుశ్రూషకూడ నీవు చేయవలసియున్నదిగదా!

సీత

దానికోసమై వేలుపులకు మ్రొక్కుకొంటున్నాను.

రాముఁడు

లక్ష్మణా! నీవదినెను నివారింపుము.

లక్ష్మణుఁడు

అన్నా! మెచ్చఁదగినపట్టున నీవెను నివారింపుమనుచుంటివి. నివారింప నే నుత్సహింపను. ఏలన—

ఉ. తారక వెన్నడించును సు
ధాకరు రాహువు మ్రింగునప్పుడున్
భూరుహ మూర్విఁ గ్రుంగ వెసఁ
గ్రుంగును దీవయు, నేన్గు లోంపిలోఁ
గూరుకొనన్ గరేణువును
గూర్కొను, నీమె చరించు ధర్మ మా
తీరున నిన్ను వెన్కొని, స
తీమణి భర్తృసనాథయే కదా!

చేటి

(ప్రవేశించి)

అమ్మగారికి జయము! అలంకార సామగ్రిని కాపాడే రేవమ్మగారు మీకు మ్రొక్కి విన్నవించుకొన్నది: "అవదాతిక సంగీతశాలలో నుంచి ఆనారచీరల్ని చించుకు తీసుకువచ్చింది. ఇవిగో, ఇవి ఉపయోగపరచనివి కొత్తవి. వేరేఉన్నవి. మీరు వీటిని ఉపయోగించుకో వచ్చును." అని;

రాముఁడు

అవీ్నా! ఇటు తెమ్ము. మీయమ్మగా రింతకు ముందు కైకొన్న వానితో సంతోషించెను. ఇవి మాకుఁ గావలెను.

చేటి

చిత్తం! దొరగారు! తీసుకోండి!

(ఇచ్చి వెళ్లును.)

లక్ష్మణుఁడు

అన్నా! మన్నింపుము.

గీ. వస్త్రభూషణమాల్యాది వస్తువులను
ముందుగాఁ జక్కనగ మిచ్చుచుండు వెపుడు
ఇప్పు డటు నాకు వల్కల మీయకుండ
నొక్కఁడవె తాల్చి తివి యేమియుక్త మన్న?

రాముఁడు

మైథిలీ! ఈతని నివారింపుము.

సీత

సౌమిత్రి! ఊరుకోవయ్యా.

లక్ష్మణుఁడు

గీ. అమ్మ! నీకొక్కరితకె మాయన్నగారి
యడుగు దమ్ములఁ సేవింప నాస్థ యగునె?
కుడియడుగు నీకె యగుఁగాక, యెడమయ [డుగు
పడయఁగానిమ్ము న; న్నెడమడుగు వలదు.

సీత

ఆర్యపుత్త్రులు కరుణించవలెను. సౌమిత్రి సంకట పడుతున్నాడు.

రాముఁడు

సౌమిత్రి! వినుము, వల్కలము లనఁగా,

గీ. కర్లె మింద్రియచయ మను కంకటమున,
కంగరతి తపం బను సంగరమున,
కంకుశము నియమం బను హస్తి కింక
ధర్మరథము సారథి దీనిఁ దాల్పుమోయి!

లక్ష్మణుఁడు

అనుగృహీతుఁడను.

రాముఁడు

ఈవృత్తాంతమును విని పౌరులు రాజ మార్గమున క్రిక్కిఱిసియున్నారు! త్రోవ తొలఁగుఁడు! త్రోవ తొలఁగుఁడు!

లక్ష్మణుఁడు

అన్నా! నేను ముందు నడచెదను. త్రోవ తొలఁగుఁడు! త్రోవ తొలఁగుఁడు!

రాముఁడు

మైథిలీ! ముసుఁగును దీసివేయుము.

సీత

చిత్తము. ఆర్యపుత్త్రు లానతిచ్చినట్లు! (తీసివేయును.)

రాముఁడు

ఓ! హో! పౌరులారా! వినుండు! వినుండు!

ఉ. ఆజ్ఞ యొకింత లేదు కనుఁ
  డయ్య! కనం! డిదె నాదుభార్య, బా
ష్పజ్ఞపితవ్యథంబు లగు
  వక్త్రములం బ్రజలార! నిర్గతా
వజ్ఞ మగున్ గనుంగొనఁగ
  వచ్చును గాంతల నెల్లవారికిన్
యజ్ఞమునన్, వివాహమున,
  నాపదయం, దటవీస్థలంబునన్.

కాంచుకీయుఁడు

(ప్రవేశించి)

బాబూ! వెడలవలదు. వెడలవలదు. వీరుగో మహారాజులుం గారు!

చ. అడవులకున్ సతీమణి స
  హాయముగాఁ జనుచుంటి వీ వటం
చనుగక లక్ష్మణుండును స
  హోదరభక్తిని వెంబడించె నం
చడలుచు నాలకించి నృపుఁ
  డంగము భూమిని బ్రుంగి క్రుంగ వ
చ్చెడు నిదె! కాననంబు విడి
  చెచ్చెర వచ్చెదు నేనుఁగో యనన్.

లక్ష్మణుఁడు

అన్నా!

గీ. నారచీరలు దాల్చి వనప్రవాస
  మరుగు మన కిప్పు డేమి దృశ్యంబు గలదు?

రాముఁడు

అడవులకు నేము పోవంగ, నవల వచ్చి
జేఁసు మన యున్కిపట్లు దర్శించుఁ గాక!

[అందఱును వెడలిరి.]

ప్రథమాంకము ముగిసెను.

---

## ద్వితీయాంకము

[కాంచుకీయుఁడు ప్రవేశించును.]

కాంచుకీయుఁడు

ఓహో! ఎవరు! ద్వారము గాచుచున్న వాండ్రు! మీరుమీరు మీమీస్థానములందు జాగ్రత్తతో నుండుఁడు!

ప్రతీహారి

(ప్రవేశించి)

అయ్యో! ఇ దేమిటి?

కాంచుకీయుఁడు

ఇదియా? మహారాజులుంగారు సత్యవాక్యరక్షణపరులై యరణ్యమునకు వెడలుచున్న రామచంద్రమూర్తిని మరలింపఁజాలక పుత్త్రవిరహశోకాగ్నిచే దగ్ధహృదయులై పిచ్చివానివలె పెచ్చుప్రలాపించుచు సముద్రగృహమునఁ బండుకొన్నారు. అక్కడ—

చ. కడఁగి యుగాంతకాలమునఁ
  గంపిలు మేరుమహీధరంబుకై
వడిఁ, గలగుండుగా నివురఁ
  బాఱు మహోదధిపోల్కి, బింబమా
త్రుఁడయి మహార్చులం దొరఁగి
  తూలెడు సూర్యునిరీతి, నెమ్మనం
బెదరునఁ బ్రుంగ, నంగ మిటె
  యింపులఁ గంపిల లేఁడు వాఁడెదున్.

ప్రతీహారి

అయ్యో! అయ్యో! మహారాజులుంగా రిటువంటి అవస్థలో ఉన్నారా?

కాంచుకీయుఁడు

(అంతటఁ గలయఁజూచి) ఎంతకష్టము! శ్రీరామనిర్గమన దినము మొదలుకొని యీయయోధ్య పట్టిపోయినట్టుగానే కానవచ్చుచున్నది. ఏ లనఁగా!

సీ. కవణంబు గైకొక గంధేభయూథంబు
బృంహితంబులు మాని బీదపడియె
మోరఁ గన్నీరు జాల్వాఱ దుక్కారముల్
వసివాడె హేషారవంబు దక్కి
పౌరు లెల్లరును స్త్రీబాలవృద్ధులతోడ
దీనదీనాస్యులై దిగులు గుడిచి
రాహారమును మాని హాహా యటంచు గ
ద్గదులుగా నెలుఁగెత్తి కూయు లిడుచు
గీ. తొడరి రాముండు కులకాంతతోడ భూమి
జాతతో, భ్రాతతోడ లక్ష్మణునితో, వ
నమ్మునకు నేగుచున్న మార్గమ్ము బడిన
గాంచుచుండిరి గన్నీరు నించుచుండి.

నేను నిదిగో మహారాజులుంగారిని జేరఁబోయెదను. (పరిక్రమించి చూచి) ఓహో! వీరె మహారాజులుంగారు! మహాదేవిగారును, సుమిత్రాదేవిగారును మిక్కిలి దుస్సహమయిన దయినను పుత్త్రవిరహశోకమును నిగ్రహించుకొని తమ్ము నోదార్చుచుండఁగా వారితో నిక్కడ నున్నారు. ఈ యవస్థ కష్టముగా నున్నదిగదా! వీరు! ఈ మహారాజులుంగారు!

గీ. అయ్యయో! యయో! యటంచుఁ బేరెలుఁ
గాచఱచుచు లేచిలేచి పడును [గుహ
ఏఁగె రాముఁ డడవి కేదెసఁ బట్టి యా
దెసకె రిత్త తేరి తేరి చూచు.

(నిష్క్రమించెను.)

ఇది మిశ్ర విష్కంభకము.

[అంత యథానిర్దిష్టుఁడుగా రాజును, రాణులును ప్రవేశింతురు.]

రాజు

స్ర. హాహాహా! తండ్రి! రామా! యఖిలభువననే
త్రాభిరామాంగధామా!
హాహాహా! లక్ష్మణా! నాయన! సముచితల
క్ష్మాంగకవ్యూహా దేహా!
హాహాహా! సాధ్వీ! సీతా! అధిపతి హితతా
ర్యాన్వాహాయత్త చిత్తా!
హాహాహా! యేఁగినారే యడవికి నయయో!
యయ్యయో నాతనూజుల్!

చిత్ర మిదిగదన్నా! భ్రాతృస్నేహము వలన, పితృప్రీతిని విడనాడినవాఁడవునను లక్ష్మణునిఁ జూడఁగోరుచున్నాఁడను. బిడ్డా! వైదేహీ!

క. విడనాడె రామచంద్రుఁడుఁ
జెడనాడెను లక్ష్మణుండు క్షితితలమందుఁగా
గడు దుర్యశమునకుం బా
ల్పడిన ననుక్ నీవుగూడ వర్జించితివే.

పుత్త్రా! రామ! నాయనా! లక్ష్మణ! బిడ్డా! వైదేహీ! నాకు బదులుపలుకుం డబ్బలారా! శూన్య మిది. అయ్యో! నాకొక్కఁడును బదులుపలుకకున్నాఁడు. కౌసల్యాతనయా! ఎక్కడ నున్నాఁడవు?



ఆకిరిపల్లి: గరుడోత్సవము



ఆకిరిపల్లి: వరాహపుష్కరిణి (కోనేరు).

గీ. సత్యసంధ! విమత్సర! శాంతహృదయ!
సర్వలోకాభిమత! గురుజనవిధేయ!
సద్గుణగణాభిరామ! శ్రీరామ! రామ!
పలుకఁగదవన్న నాకొక్క బదులుపలుకు!

అయ్యో! సర్వజనహృదయ నయనాభిరాముఁడగు నారాముఁ డెక్కడ! ఆపిత్రువాక్యానువర్తనుం డెందుండె? శోకార్తులమైన నాయనుకంప యేమయ్యె! రాజైశ్వర్యమును తృణమువలె లెక్క సేయని నాతండ్రి యేఁడీ! నాయనా! రామా! వృద్ధుఁడగుతండ్రిని నన్ను విడిచి, యసంబద్ధమగు ధర్మమును నీ వేల యనుచరింపవలెనో! అయ్యో! ఇసిరో! కష్టమయ్యో!!

గీ. సూర్యన స్తేఁగె రాముఁడు సూర్యునంటి
యరుగుదినమట్లు లక్ష్మణుఁ డనుగమించె
రవియును దినంబు వెడలినయవల ఛాయ
గానరానట్లు సీతయుఁ గానరాదు.

(పయికిఁ జూచి) ఓ! కృతాంతహతకా!

గీ. పుత్త్రులే లేనివాఁడ నైపోతి నేను
రాముఁ డేభూమిఁజతికొ కుమారుఁ డెయ్యె,
అడవిఁబలియయ్యెఁగై కేయి యక్కటకట!
మూఁడుజెడిదముల్ నీచేతమూఁడెగదర!

కౌసల్య

(ఏడ్చుచు)ఊరుకొండి, నిబ్బరించుకొండియింక; మీ రింతగా సంతాపపడుతూ పారవశ్యం తెచ్చుకోవడంతగదు. కోడలు, కుమాళ్లు మీరు మాటయిచ్చినకాలము దాటగానే వస్తారు. చూడవచ్చును.

రాజు

ఓసీ! ఎవతెవే నీవు?

కౌసల్య

మీదయకు తప్పినకొడుకును గన్నతల్లిని నేను.

రాజు

ఏమీ!ఏమీ! సర్వజన నయనహృదయాభిరాముఁడయిన రామునకుఁ దల్లివి కౌసల్యవా?

కౌసల్య

దేవా! అదురదృష్టవంతురాలనే నేను.

రాజు

కౌసల్యా! సారవతివి గదవే! రాముని గర్భమున ధరించితివి.

గీ. అగ్నితుల్య మమిత మతిదుస్సహంబు దుః
ఖంబు నన్ను మిగులఁ గాల్చుచుండె
సంహరింపఁజాల సహియింపనుంజాల
నెట్టులొక్కొ! ప్రముషితేంద్రియుండ!

(సుమిత్రనుజూచి) వేఱొకతె ఇది యెవ ర్తె?

కౌసల్య

నాయన లక్ష్మణుని—(అర్ధోక్తిలో)

రాజు

(తొందరతో లేచి) ఏఁడీ! ఎక్కడ లక్ష్మణుఁ డెక్కడ! లేఁడే? అయ్యోకష్టము!

(రాణులు తొట్రుపాటుతో లేచి రాజును బట్టుకొందురు.)

కౌసల్య

కాదండీ! నాయనలక్ష్మణుని తల్లి సుమిత్ర అని చెప్పబోతిని.

రాజు

ఓసి సుమిత్రా!

గీ. ఓసి! నీకుమారుఁడే సత్కుమారకుం
డగు; నదేమనంగఁ బగలు రేయు

రామచంద్రమూర్తి రఘువంశ దీపకు
నీడవోలె నతఁడు వీడకుండె.

కాంచుకీయుఁడు

(ప్రవేశించి)

మహారాజులుంగారికి జయము. వీరుగో! పూజ్యులగు సుమంత్రులవారు విచ్చేసిరి.

రాజు

(తొందరతో లేచి) రామునితో వచ్చెనా?

కాంచుకీయుఁడు

లేదు. రథముతో వచ్చెను.

రాజు

ఏమీ! ఏమీ! రథముతోనా? వట్టి రథముతోనా? (అని మూర్ఛితుఁడై పడును)

రాణులు

దేవా! ఊరడిల్లండి. ఊరడిల్లండి. (అవయవములఁ దడవుదురు.)

కాంచుకీయుఁడు

అయ్యో! కష్టము! ఇటువంటి మహాపురుషులు గూడ నిటువంటి యాపదను బొందుదురనఁగా విధి యెంతయనతిక్రమణీయ మన్న మాట! మహాప్రభూ! ఊఱడిల్లుఁడు. ఊఱడిల్లుఁడు.

రాజు

(ఇంచుక తెప్పఱిల్లి) బాలాకీ! సుమంత్రుఁ డొక్కఁడే కదా వచ్చినది?

కాంచుకీయుఁడు

అవును.

రాజు

అయ్యో! కష్టము.

గీ. రథము శూన్యమై పరావృత్తమయ్యెనా?
నామనోరథంబు నష్టమయ్యె
అనిపె నేమొ దశరథునిఁ దోడుకొనిపో
పొంటె రథముఁ గాలపురుషుఁ డిపుడ
అల్లని శీఘ్రముగాఁ దోడ్కొని రమ్ము.

కాంచుకీయుఁడు

చిత్తము. మహారాజులుంగారి సెలవు ప్రకారము. (వెళ్లును)

రాజు

గీ. అడవి నెత్తమ్మికొలఁకుల నుడిసివచ్చు
కమ్మఁ దెమ్మెరల్ భాగ్యవంతమ్ములుగద!
తనివు జనియింప నయ్యవి తాఁకుచుండు
నడవిఁ దిరుగాడు శ్రీరాము నంగకముల.

(అంత సుమంత్రుఁడు ప్రవేశించును.)

సుమంత్రుఁడు

(అంతటను గలయఁజూచి శోకముతో)

మ. తమ కృత్యమ్ములువీడి భృత్యజను ల
త్యంతంబు నెయ్యంబు తి
య్యము పెంపొందిన రామచంద్రు నెడఁబా
యఁగ లేక శోకాగ్నియం
గములం గాల్పఁగఁ గన్ను లశ్రులఁదోలం
గఁగ దీనదీనాస్యులై
గములై బెగ్గిలి యేడ్చుచున్న నృపతిన్
గర్హించుచున్నా రహో!

(చేరఁబోయి) మహాప్రభూ! జయము.

రాజు

సీ. అన్నా! సుమంత్ర! నాయుగ్రపుత్త్రుఁడు:—
కాదుకాదు తప్పఁగాఁ బలికితిని

సీ. అన్నా! సుమంత్ర! నీయగ్రపుత్త్రిఁడు రాముఁ
డెచ్చట నున్నాఁడొ యెఱుఁగఁ జెప్పు!
అల విదేహాధీశునను(ఁ?)గుఁగూఁతురు గురు
శుశ్రూషు విప్పు డెచ్చోటఁ గలదు?
భ్రాతృసేవైక తత్పర చిత్తవృత్తి యా
సౌమిత్రి తాను నెచ్చటఁ గలండు?
మరణ మాసన్నమై దురపిల్లుచున్నట్టి
చెన్నటితండ్రిని నన్నుఁగూర్చి
సకలలోక శోకసాగర సంక్షోభ
కరముగాఁగ నేమిగాని నీకుఁ
జెప్పి పంపినారె యిప్పు డద్దానిని
దప్పకుండఁ నాకు జెప్పుమన్న.

సుమంత్రుఁడు

మహాప్రభూ! వలదువలదు. అమంగళ వచనముల నిట్లు పలుకవలదు. అచిరముననే వారిని మీరు చూడఁగలరు.

రాజు

అగును. నే నయుక్తముగానే యడిగితిని. అది తపస్వుల విషయమున నడుగఁదగిన ప్రశ్నము గాదు. ఇకఁ జెప్పుము. తపస్వుల తపస్సు వర్ధిల్లుచున్నదా? అరణ్యములు స్వాధీనములయ్యెనా? అక్కడఁ దిరుగుచో వైదేహి క్లేశపడుట లేదుగద!

సుమిత్ర

సుమంత్ర! నారచీరలలుంగలు ఒంటినిండా (క?)ప్పుకొని పసిబాల అయియుండికూడా ఆరి తేరినవారి నడవడిక నేర్చుకొన్న మా సీతమ్మ అడవులలో పెనిమిటికి సహధర్మచారిణి అయి మమ్ములనుగూర్చి మహారాజులుంగారినిగూర్చి ఏమయినా చెప్పంపిందా?

సుమంత్రుఁడు

అందఱును మహారాజులుం గారిని గూర్చియే-

రాజు

ఆగు. ఆగు. శ్రోత్రరసాయనములు నాకుహృదయాతురౌషధములు అయిన వారి నామధేయములను వేర్వేఱుగనియే చెప్పుము.

సుమంత్రుఁడు

మహాప్రభువుల సెలవుప్రకారము. చిరంజీవి రామమూర్తి

రాజు

రామమూర్తి అనియా, వీఁడుగో రాముఁడు. వాని నామమును విన్నంతనే నాకు వానిఁ దాఁకినట్లున్నది. ఇఁక, ఇఁక-

సుమంత్రుఁడు

చిరంజీవి లక్ష్మణుఁడు

రాజు

వీఁడుగో లక్ష్మణుఁడు. ఇఁక ఇఁక,

సుమంత్రుఁడు

ఆయుష్మతి సీత, జనకరాజపుత్త్రి.

రాజు

ఇదిగో వైదేహి, రాముఁడు, లక్ష్మణుఁడు, వైదేహి, అని యీవరున సరి గాదు.

సుమంత్రుఁడు

ఇఁక వరుస యెట్లు?

రాజు

రాముఁడు, వైదేహి, లక్ష్మణుఁడు అని చెప్పుము.

గీ. ఇడుము లడవులందుఁ గడుఁగల్గు సీతమ్మ
కాపుఁ గల్గియుండఁగా వలయును

నామసంగ్రహణముననుగూడ రామల
క్ష్మణుల నడుమ నామె మనలుఁ గాక!

సుమంత్రుఁడు

చిత్తము మహాప్రభువుల సెలవుప్రకారమే.
చిరంజీవి రామమూర్తి

రాజు

వీఁడుగో రామమూర్తి.

సుమంత్రుఁడు

ఆయుష్మతి జనకరాజపుత్త్రి

రాజు

ఇదిగో వైదేహి.

సుమంత్రుఁడు

చిరంజీవి లక్ష్మణుఁడు.

రాజు

వీఁడుగో లక్ష్మణుఁడు. రామ! వైదేహి! లక్ష్మణ! కౌఁగిలించుకొనుండు నన్ను బిడ్డలారా!

మధ్యాక్కర

ఒకమాఱు తనుపారఁగౌఁగిలింతునో
యొద్దఁజేర్చుకొని
యొకమాఱు కనులారఁ గాంతునో రాము
నొప్పులకుప్ప
వికలజీవితుఁ డమృతమున జీవించు
విధమున నేను
సుకపడి మరల జీవింతునని తలం
చుచున్నవాఁడ!

సుమంత్రుఁడు

శృంగిబేరపురమున రథమునుండిదిగి యయోధ్యాభిముఖులై నిలుచుండి యందఱును మహారాజులుంగారికిఁ దలతో నమస్కరించి విన్నవించుకొన నుపక్రమించిరి.

ద్వి. తడవేదియో చెప్పఁదలపోసి; రఘుడు
వడకెఁను నొకువంగ వాతెఱగూడ
అప్పళించెను గంత మంతఁ గన్నీరు
చెప్పకే యడవికిఁ జేరిరి వారు.

రాజు

ఏమీ! ఏమియుఁ జెప్పకుండ నేయడవి కేఁగిరా?
(అని రెట్టింపుమోహమును జెందెను)

సుమంత్రుఁడు

(తొట్రుపాటుతో) బాలాకీ! మహారాజులుంగారు అప్రతీకారమయిన యవస్థలో నున్నారని యమాత్యులకుఁ దెలుపుము.

కాంచుకీయుఁడు

అట్లే (వెళ్లును)

రాణులు

దేవా! ఊరడిల్లండి! ఊరడిల్లండి.

రాజు

(ఇంచుక యూఱడిల్లి)

గీ. సంస్పృశింపుము నన్నుఁ గౌసల్య నిన్నుఁ
గాంచుటకు నాదుకనుదోయి కానరాగ
అరిగె శ్రీరామచంద్రుని దరికి మనము
తిరిగి రా దిప్పటికి నందె మరగియుండె.

నాయనా! రామా! ఎడతెగక నే నిదే తలపోసితిని గదోయీ!

సీ. కానక కన్నసంతానమ్ము నిన్ను సు
శ్రీ రాజ్యమున నభిషిక్తుఁ జేసి
రక్షింపఁగలదొడ్డ రాచగున్న లభించు
కతమునఁ బ్రజఁగృతార్థతకుఁ దార్చి

తమ్ముఁ గుఱ్ఱల సంతతము భవత్సమ వైభ
　వులఁ జేయుమని నీకుఁ దెలియఁ జెప్పి
చింతఁబోకార్చ విశ్రాంతిఁ జేకూర్పఁ బ
　ర్యాప్తమౌ మునివనాశ్రమముఁ జేరి
జీవితావశేషంబు పోఁద్రోవవలయు
ననుచుఁ దలఁచు నావాంఛితంబక్కటకట!
క్షణము లోపల సర్వంబుఁ గణఁగి యన్య
థాకరించెను రాకాసికైక తనయ!

సుమంత్రా! కైకేయికిఁ దెలుపుము.

గీ. చనియె రాముఁడనుము సంతోష పడుమనుము
　మునురు లెల్ల నాకొనుడిఁగె ననుము
తోడుతోడఁ గొడుకుఁదోడ్తెచ్చుకొనుమనుము
　పాపఫలము తనకుఁ బండె ననుము.

సుమంత్రుఁడు

మహాప్రభువుల సెలవుప్రకారము.

రాజు

(మీఁదికిఁజూచి) అహో! రామకథా శ్రవణ సందగ్ధహృదయుఁడ నగు నన్నునోదార్చుటకు బితరు లరుదెంచిరి! ఎవ రక్కడ?

కాంచుకీయుఁడు

(ప్రవేశించి)

జయము మహారాజులుంగారికి.

రాజు

ఉదక మోయి!

కాంచుకీయుఁడు

సెలవుప్రకారము మహాప్రభూ! (నిష్క్రమించి ప్రవేశించి) చిత్తము మహాప్రభూ! ఇదిగో ఉదకము.

రాజు

(ఆచమించి చూచి)

గీ. ఇంద్రునకు నెచ్చెలి దిలీపుఁ డితఁడు! యితఁడె
　రఘువు, నాతండ్రి యజమహారా జితండె?
　ఏలవచ్చితిరయ్య మీ రిచటి కిపుడు
　నేనె మిముఁ జేరవచ్చుచున్నాను గాదె!

రామ! వైదేహి! లక్ష్మణ! నేనిఁక పితరుల సన్నిధికిఁ బోవుచున్నాను! ఓపితరులారా! నేను, ఇదిగో నేను, వచ్చుచున్నాఁడను.

(మూర్ఛలో మునిఁగెను)

(కాంచుకీయుఁడు తెరవైచును.)

అందఱును

అయ్యో! అయ్యో! మహారాజులుంగారు.

(నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము



# ఉత్తరుని ప్రగల్భములు

శ్రీ. తి. వ. నారాయణస్వామి గారు

కురుపతి సంగరంబె మది కోరి వడిన్ మన గోగణంబుకై
సరథగజాశ్వసైనిక విశాలచమూ నివహంబుఁ గూర్చి యు
త్తరమున నేఁడు గోవులను దాఁకె నటంచును వింటి; నిన్నకా
వరమున దక్షిణంబు పసిబట్టె సుశర్మ య దెంతచిత్రమో.

క. నను భూమింజయుఁ దరుణీ-జనమారుని నిఖిలశత్రుసంహారకు చే
కొనక రణభూమి కుఱుకుట-గనఁ బలిమీనముల సూఁగుగితి యయ్యెఁ గదా.

మ. మముఁ జంకించుట కాలఁ బట్టఁగ సుశర్మన్ ముందుగా నల్పసై
న్యముతోఁ బంచిన మత్స్యభూపతి యనూనాటోపధాటీచమూ
సముదాయంబు రహింపఁ బోవు నట కాసావిన్ గుబేరాశకై
యమితానీకినిఁ బంపఁ జేపడు విరాటాధీశు గోసంఘముల్.

క. అని యెంచి దక్షిణాశకు-మనగోవులకై త్రిగర్త మహీరమణున్ జ
య్యనఁ బంచి కొదువబలముల-ననుపఁగఁ దలపోసె నుత్తరాశకుఁ గడఁకన్.

చ. జనపతి దక్షిణంబున సుశర్మ పశువ్రజము న్మరల్చి యొ
య్యనఁ గొనిపోవుచుండిన జనశ్రుతి వించు ననల్పసైన్యమున్
గొనుచుఁ బచిన్ మరల్పఁగ నకుంఠిత విక్రముఁ డేఁగె తండ్రి యీ
గిను మెద నెంచఁడయ్యెనె యొకింతయుఁ దప్పెను కార్యపద్ధతుల్.

క. రథముఁ గడుపంగఁదగు సా-రథియొక్కఁడు లేమి నేఁ దలంకెదఁ ద్రుటిలో
వధియింపనె రిపులను సా-రథి పేర నొకండు దొరకి రహియించినచోన్.

క. కలహాశనుఁ డాడఁగ ని-మ్ముల భూపతులెల్ల నౌర! బుడుతఁ డితం డెం
తలు చేసె ననుచు మెచ్చఁగ-గలనన్ గురువీరులను చికాకొనరింతున్.

చ. కమలభవాండభాండమునఁ గల్గిన శూరసమూహమెల్ల ని
క్కముగ విరాటసూతి కెనఁగా దగు చాపరహస్యవేదిఁ గం
దుమె యని యక్కజంబు మదిఁ దోఁపఁగఁ నాడెడురీతి యుద్ధరం
గమునఁ బరాక్రమించి కడఁకన్ మనగోగణమున్ మరల్చెదన్.

ఉ. ఎక్కటివోరిలోఁ బశుపతిన్ విషమాక్షునిఁ దాఁకినంత అ
మ్మక్క! కిరీటి యెంతటి యమానుషవిక్రముఁ డంచుఁ బల్కఁ బే
రెక్కిన యోధులన్ గలన లీల జయించిన నన్నుఁ గాంచి యీ
యుక్కరి! యర్జునాదులనె యొడ్డు రణంబుల నంచుఁ బల్కరే.

క. రథమంథర మహితాంభో-నిధిలోఁ దిరుగాడ వాహినీపతి కలఁగన్
రథికుఁడనై సారథినై-మథియింతుఁ గురుప్రవీరమయసైన్యాబ్ధిన్.

చ. తలఁపరుగాక కౌరవు లెదన్ బరిమృష్టరిపుప్రజాంగనా
గళవిలసన్మృగీమదసుకర్దమ హా తరవారిచేతిలో
నలరెడి నన్ను! నింత పరిహాసక మయ్యెనె యుద్ధకేళి? నా
యలవుఁ జలంబు శౌర్యము బలాఢ్యులు గందురుగాక నేఁ డనిన్.

ఉ. కొండొక నాకరాజ్యరమఁ గోల్పడి మాయదురోదరంబునం
దెండ చొరంగరాని యవనీధ్రవనీతతులందు దాఁగి పం
డ్రెండు సమల్ వసింపఁగ సుధీయుతు లచ్యుతధర్ము లైన య
ప్పాండవులా? యరాతిగణభంజనుఁ డుత్తరుఁ డేవిధంబొకో.

మ. రథనేమిధ్వని గర్జగా నిరతధారావాహి బాణౌఘని
ర్మథితారాతికిరీటరత్నరుచిశంపాలీలగా రక్తధా
తుధునీవారము వృష్టియై తగ సహేతూద్భూతకల్పాంతతో
యధరంబో యన మించి కౌరవుల శౌర్యగ్రీష్మముం బాపెదన్.

మ. వికటాటోప నటత్కబంధము భయావిర్భావధావద్రథి
ప్రకరం బాహతివల్గదశ్వకము సర్పభ్రాంతికృత్తాంగదో
ర్మికబాహువ్రజ ముల్లుఠద్రథము దుర్మేదోవసావిస్రగం
ధి కరీంద్రాంగకమై చెలంగ దురమున్ దీవ్రంబుగాఁ జేసెదన్.

సీ. జాలమార్గముల మృగీలోలలోచనల్ లీలాదృగుత్పలమాల లనుప
లీలాపరిష్కృత శూలాయుధులు రణాభీలశూరులు వేనవేలు గొలువ
హేలావిజితశత్రుజాలుం డటంచు జనాలి మద్విక్రమశ్రీలఁ బొగడ
ప్రోల నాశ్రిత మహీపాలలోకంబుతో బాళిమై మత్స్యభూపాలుఁ డలర
కలనఁ గురువీరులను లీల దోలఁచి యాల-మలఁచి జయమునుగొన్నన్ దలఁపనట్టి
బలయుతుం డొక్కఁడైన నీయిలను వేడ్క-నలరునే? నన్ను సేవించి వెలయుఁ గాక.

క. గాంగేయ కుంభజన్మ కృ-పాంగాధిపముఖ్య రథికవర్యులతోడన్
సంగ్రామ మొదవె నా కిం-కం గాదగునర్థ మెద్ది గణుతించినచోన్.




## ౬. యమపాలచండాలునికథ

పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి గారు

ఏనాడేర్పడిందోగాని వారణాసీపట్నం ఇన్ని యుగాలు చెల్లినా ఇన్నిప్రళయాలు జరిగినా ఇప్పటికిన్నీ ఒక్కమోస్తరుగా ధర్మక్షేత్రస్థానంగా ప్రసిద్ధి వహిస్తూనే వుంది. ఎంతమంది రాజులు దాన్ని ఏలినారో, మరెంతమంది విజ్ఞాననిధులు అచ్చట ధర్మబీజాలను నాటి తోటకాపరు లయ్యారో చెప్పలేము, కాని దాని పూర్వోత్తరాలు పరికించేకొద్దీ పులకరింపులు కలిగించకుండా ఉండవు. ఇల్లాంటి వారాణసికే సంబంధించిన యొకగుణవృద్ధునికథే మనయమపాలచండాలుడిది. దాన్నే పాఠకులకు ఉపహారం చేస్తున్నాము.

యమపాలచండాలుడి కథజరిగినకాలంలో కాశీపట్నాన్ని పాలిస్తూన్నరాజు పేరు పాకశాసనుడు. పాకశాసనుడు అవడానికి కాస్త కఠినుడుగా వున్నా ప్రజాపరిపాలనంలోనేం, భూతదయలోనేం అద్వితీయుడే కాని మఱొకటికాదు. ఆయన రాజ్యాన్ని పాలిస్తున్న సమయంలో ఒకమారు ప్రజలలో అతిదుస్సహమైన సంక్షోభం ఏర్పడింది. అంటే ఇది అతని నిరంకుశపరిపాలనం వల్ల కలిగింది ఎంతమాత్రం కాదు. ఎందువల్ల వచ్చిందో యేమో చెప్పలేం— రాష్ట్రంలో అంతటా మహామారివంటివ్యాధికలిగి సర్వనాశనం కావడం తటస్థించింది. రోజుకు రోజూ ఈవుపద్రవం హెచ్చిపోవడమే కాకుండా 'అయ్యబాబో' ప్రజలు ఆదెబ్బకుతాళలేక ప్రవాసం చిత్తగించాలసినంతటి అవస్థపట్టింది.

పాపం రాజు చాలా మెత్తనిమనస్సు కలవాడనే ఈవిషయంలో చెప్పక తప్పదు. ఆయన వెంటనే మంత్రులను ప్రజాప్రతినిధులను పిలిపించి ఏంవుపాయమో చెప్పం డన్నాడు. అంటే మంత్రులూ వగైరాలందఱూ కలసి ఆలోచించారు. ఏం ఆలోచిస్తేనేం— ఏదైనా కంటికి అవుపించే ఆపదలకైతే ప్రతిక్రియ చేస్తారు గాని అదృశ్యంగా జననష్టం కలిగించేవాటికి ఎవరేం చేస్తారూ? కాబట్టే వారంతా అన్నారుగదా!—'మహాప్రభో! ఇది మావల్ల సాధ్యమయ్యే కార్యంగా వుండలేదు. దైవికములయిన ఆపదల్లో చేరింది. కనుక దీనికి ప్రతిక్రియ చేయ చెప్పవలసినవారు దైవజ్ఞులున్నూ చేయవలసినవారు పురోహితులున్నూ. వారిని విచారిస్తే ఏదో తరణోపాయం దొరుకుతుంది'-అన్నారు.

అంతట రాజు సరే అని గణకుల్ని ప్రోగుచేయించాడు. వారు చెప్పారుగదా—"అయ్యా ఇది మితిమీరిన జీవహింసచే ఏర్పడ్డ అవగ్రహదోష మండీ, ఎన్నో వేలకొద్దీ జీవాలు మీరాష్ట్రంలో హత మవుతున్నాయి. వాటి ఘోష ఊరికె పోతుందా? దానికి ఫలంగా ఇప్పుడీవుపద్రవం వచ్చింది. ఇదీకారణం. మఱి ఇటుపైన మీరు జీవహింసమాన్పించడమే కాకుండా, ఇదివఱకు చేసిందానికి ఏదైనా తగినశాంతి చేస్తేనే గాని ఈవుపద్రవం శాంతించదు"

సరే—అన్నాడు రాజుగారు. వెంటనే పురోహితుల పిలిపించి జరిగినకథ అంతా చెప్పాడు. మఱి దీనికి మీరు మఱి ఏదో నూటిగా శాంతి జరపక తప్ప దన్నాడు. అప్పుడు పురోహితులు చెప్పారుగదా— "దేవరవారి ఆజ్ఞకు అడ్డేముందిగనక? అట్లాగే కాని మాబుద్ధికి ఇది సాధ్యపడేటట్టు తోచడం లేదు. శాంతి హోమాలంటే మేం చెయ్యగలం గాని దుర్వ్యసనాలకు అలవాటుపడ్డ మనుష్యపశువుల్ని మళ్లించడం మాతరమా అండీ? కిష్మిష్పండ్లను పాలలో శుద్ధిచేయమంటే

# మీకు మేలైన సువాసనగల అత్తరులు కావలెనా?

## అటులైన అత్తరులకు రాజని పిలువబడు ఆటోదిల్‌బహార్‌ను వుపయోగించు




కొన్ని బిందువులను మీ చేరుమాలుపై చిలకరించి వేయింపగ, పుష్పసంబంధమగు సువాసన నీచుట్టుపట్లవ్యాపించును.

ఇంతటి రమ్యమైన, మనోహరమైన వాసనను నీవు బజారులో కొను యితర అత్తరులలో పొందజాలవు.

'ఆటోదిల్ బహార్' అను పేరును యిపుడు జ్ఞాపకమునకు తెచ్చికొనుడు. దానిని ఒకమారుపయోగించుడు. దాని మనోహరమైన, శాశ్వతమైన సువాసనకుతన్మయత్వమును చెందుదువు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ½ | ఔన్సు | బుడ్డి | వెల | రు. | ?–0–0 |
| ¼ | ,, | ,, | ,, | రు. | 1–4–0 |
| 1 | డ్రాము | ,, | ,, | రు. | 0–12–0 |
| మాదిరిసీసా | | | ,, | రు. | 0–2–0 |
| సువాసనగలకార్డులు | | | | రు. | 0–1–0 |

వి. పి. చార్జీలు ప్రత్యేకము

కొనునపుడు దయచేసి 'ఆటోదిల్ బహారు' అను పే... జాగ్రత్తగా పరిశీలించి కొనుడు. అన్నిచోట్లను అమ్మ...

సోల్ ఏజంట్లు:—

ఆంగ్లో యిండియన్ డ్రగ్ అండు కెమికల్ కంపెని,

285, జుమ్మామసీదు బజారు, బొంబాయి.

---

# నొప్పులుగాని, తీపులుగాని, ఏవైననుసరియే తొలగింపవచ్చును



మీరు ఏల నొప్పులవలన బాధపడవలెను. ఆ నొప్పులు తలయందైననుసరే, దేహమున యితరచోట్లనైననుసరియే, నడుమునొప్పి, వాయువునొప్పులు, పడిశము, గొంతురాపిడి, కాళ్లనొప్పులు, కీళ్లనొప్పులు, నాడినొప్పులు, బెణుకునొప్పులు, మొదలగు నొప్పులైనను సరియే, తప్పక త్వరలో

'ఆడమ్సన్స్ సైప్రిన్ సాల్వ్'

అనువానిచే మాన్పవచ్చును. ఇది వుపశాంతికరమగు అంజనము కాదు. ఇది చాలా మేలైన తైలము. ఇది చాలా విలువగల ఓషధులచే తయారుచేయబడినది. దీనిచే నొప్పులుమొదలంటపోయి తక్షణమే నిన్ను ఆనొప్పియొక్క బాధనుండి తొలగించును. వేలకువేలు దీనివల్ల లాభపడిరి.

వెల బుడ్డి 1 కి రు. 1–0–0. వి. పి. చార్జీలు ప్రత్యేకము.

ఈ అత్యద్భుతమగు బాధనివారిణి ఫలమును కనుగొనుటకు యీ క్రింద చేర్చబడిన అంగడినుండి 2 అణాలకు శ్యాంపిలుడబ్బీ తెప్పించుకొనవచ్చును.

మెస్సర్సు:— ఎ. వి. పారెక్, 259, చైనాబజారు, మద్రాసు.

సోల్ ఏజంట్లు:— ఆంగ్లో యిండియన్ డ్రగు అండు కెమికల్ కంపెని,

285, జుమ్మామసీదుబజారు, బొంబాయి.

శైమ్యలు చెయ్యబూనుతారే గాని అదెప్పటికైనా అమృతఫలాలు అవుతవా?—ఇల్లాగే వ్యసనాసక్తులచిత్తాలుగూడా. ఇందుకు తగినట్టుగానే ఇక పదిరోజుల్లో నందీశ్వరుడి వుత్సవాలువస్తున్నాయి. ఈవుత్సవాల్లో దైవభక్తిపూజాపురస్కారాలమాట దేవుడెఱుంగునుకాని దానికి చుట్టుపక్కల దేశదేశాల్నుంచీ ప్రజలు వస్తారు. వారికి అన్నశాలలు పాకశాలలు వేలకొద్దీ ఏర్పడుతాయి. అందులో అనేకవేల జంతువులు ప్రాణాలు పోగొట్టుకో వలసి వస్తుంది. లేకపోతే వారికి రుచైనమాంస మెల్లా లభిస్తుంది? పోనీ! నిషేధిస్తా మంటారా? కోశాధ్యక్షులకు తమ్మూల్లంగా కనకవర్షం కురుస్తుందిగదా ఎల్లావప్పుకొంటారు?" అని.

"భక్. తప్పకుండా ఆపించవలసిందే. ప్రజలు చెడ్డతర్వాత ప్రభువులకు కోశంలో ఏంవుపయోగంకనుక ఆపితీరుతాను."—అని వెంటనే పట్టణంలో అంతటా [illegible]టించారు:— "ఇకమీద మననగరంలో ఎవరైనా సరే [illegible]సాచేయకూడదు. నందీశ్వరోత్సవకాలంలోనైనా సరే ఏజీవాన్నిగాని ఎంతస్వల్పాన్నిగాని హింసించినా సరే— లేక హింస చేస్తారని తోచినాగాని వురితీయించి వేస్తాము"—అని.

దండోరా నిమిషంలో పాకిపోయింది. మున్దూర్: పట్నంలో ఎక్కడచూసినా జీవహింసలేదు సరేకదా, ఆప్రయత్నమైనా కలికానికిఅయినా కనపడలేదు. పురోహితులు శాంతికర్మలు చేశారు. ఉత్పాతము మెల్లెంగా సద్దుకొన్నది. క్రమంగా రాష్ట్రమంతటా రాజాగారి ధర్మమా—అని శాంతి నెలకొంటున్నది.

ఇట్లా వుండగా ఆవూళ్లో ధర్మకుడని ఒక శెట్టిగారికుఱ్ఱా డున్నాడు. కుఱ్ఱా డంటే పాలుతాగే కుఱ్ఱాడుగాడు. ప్రాయంలో వున్న కుఱ్ఱాడు. అసలే కోమటి [illegible]డ్డ. ఆపైని సంపన్నుల యింటివాడు. ఆతర్వాత స్వేచ్ఛాచారి. అందుపైని కాస్తపేత్వాలోను ఇంకాస్త తస్కరాణాం పతయే లోనున్నా మఱికాస్త జిహ్వాచాపల్యానికీ - ఇదికాస్త - అదికాస్తచొప్పున - వ్యసనాలకన్నిటికిన్నీ మంచి అనుభవం కలవాడే. ఉద్దండుడు. మఱి ఇల్లాంటి శూరుడిపాలికి మాత్రం రాజాజ్ఞ యమశాసనంగా పరిణమించినంటే ఆశ్చర్య మే మున్నది? కాబట్టే,

'వ్యసనినాంహి నియమ ఏవ యమః'

అన్నారు పెద్దలు. ధర్మకుడు - మఱి వుపాయం ఏమటని ఎంతో తలపోశాడు. ఎన్నివిధాల ఆలోచించినా అంతు పట్టలేదు. ఈసమస్యనే చర్చించుకొంటూ ఒకనాడు రాజాగారి బాహ్యోద్యానంలో వెళ్లి కూచున్నాడు. అక్కడమంచి చల్లనినీడగల చెట్లున్నాయి. మంచివాసనల నుబాళించే పూలచెట్లు పలురకాలు అందులో వున్నాయి. స్వాదువులయిన తేటనీరును వెదజల్లే జలయంత్రా లున్నాయి. ఇన్నెందుకూ? హాయిగా కాలం వెళ్లబుచ్చడానికి అనుకూలమైన సాధనాలన్నీ పుష్కలంగానే వున్నాయి. అయినా ఏంలాభం? ఆశాంతపరిస్థితులు అతనిమనస్సుకు నచ్చలేదు. క్షణక్షణానికిన్నీ "అయ్యో!—మాంచి రుచిగల మాంసం తిని ఎన్నికల్పాలయిందోగదా! మఱిఈజన్మలో, అల్లాంటిసుఖాలు మళ్లా లభిస్తవా? పోనీ లభించకపోయినా జీవితకాలంలో చివర ఒక్కమాటైనా కడుపునిండుగా లేకపోతే పోయింది ఏదో కొంచెము రుచికైనా నంజుడు లభిస్తుందో లభించదోగదా!"—అని తలపోస్తూ గుటకలు మింగుతూ కూచున్నాడు. ఇట్లా వుండగా ఆతోటలో ఒకవూల మాంచి బలిసిన మేకపిల్ల కట్టివేసి వున్నది. దాన్ని చూచే చూడడంతోటే 'హా హా'—అనిపించింది ధర్మకుడి మనస్సు. దానికి తగినట్టుగానే ఆచుట్టుపక్కల నిశ్శబ్దంగా వుంది. ధర్మకుడు ఇహ నిల్వలేక పోయ్యాడు. వెంటనే ఛప్పున లేచి ఆమేకను పట్టుకొని మెడనులిమి చంపి చురకత్తితో డొక్కచీఱి ఆపచ్చిమాంస మే ఇంత తిన్నాడు. ఇదిల్లా జరిగేలోపలనే తోటమాలి వచ్చాడు. ధర్మకుడి గుండెలు దడదడ మన్నాయి. కాని కాస్త బంగారం ప్రదర్శించడంతోటే అతనికి ఆభయం తీరిపోగ్గింది. తర్వాత ధర్మకుడు ఆమేకను ఆతోటలోనే తోటమాలిసాయంతో పూడ్చి పున్నడికిమల్లే వెళ్లి పోయాడు. తోటమాలి తాను ఏమీ ఎఱుగనట్లే వెళ్లి రాజుగారితో మేక అంతర్ధానాన్ని విన్నవించాడు.

"ఏంచిత్రం! రాజా ఉద్యానంలో - అందులో తోటమాలీని రేయింబవళ్లు కాపుంచినతోటలో - పట్ట

పగలే పెంపుడుమేక అదృశ్యమై పోవడమా ?'–అని ఏమేమో ఆలోచించి రాజుగారు గూఢచారులను పిలిపించి భోగట్టా చెయ్యమన్నాడు. గూఢచారులు సరే నన్నారు. వెదికారువెదికారు విశ్వమంతా వెదకారు. జాడాపోడా కనపడలేదు. అంతట వాళ్లలో ఒకడు తోటమాలిని పరీక్షిస్తే బాగుండు ననుకొన్నాడు. తర్వాత మెల్లగా సాయంకాలము కాగానే మారువేషంతో తోటలో ఒకమూల వెళ్లి దాగివుండి క్రమంగా చీకటిపడేకొద్ది తోటమాలిగుడిసె వెనక కాపలా కాచాడు. సరిగ్గా కర్మంజాలక ఆనాడే అర్ధరాత్రిప్పుడు తోటమాలిని అతనిపెండ్లము అడిగిందిగదా!–అవును గాని మేకను పట్టపగలు చంపేసినధర్మకుణ్ణి రాజు ఏం చేయగలిగాడు? ఇదిగో ఇట్లాగే వుంటాయి మనదొరల ప్రతిజ్ఞలు' అన్నది. తోటమాలి -'ఛీ అరవకు. మన కెందుకా సంగతి. మనకు ధర్మకుడిచ్చినర్మాన పదివరహాలు లభించాయి. ఈసంగతి వెళ్లబెడితే మనకూ అతనికీ వురి తప్పదు.' అన్నాడు. గూఢచారి ఈమాటలు తీసికొని చక్కాపోయి మర్నాడు తెల్లవారకముందే ధర్మకుణ్ణి పట్టుకొని రాజస్థానంలో హాజరుపెట్టి చెప్పాడు. రాజు జరిగిందంతా విచారణచేసి అన్నాడుగదా–'వ్యసనేన యుతో జీవః సర్వం పాపపరో భవేత్'–అని. తర్వాత ధర్మకుణ్ణి తీసికోపోయి కొట్టపాలుడితో చెప్పి వెంటనే ఉరితీయించమని ఆజ్ఞ యిచ్చాడు. రాజాజ్ఞ అయిన తర్వాత ఇక ఆలస్యమేం? కొట్టపాలుడికి చెప్పచెప్పారు. అతడుకూడ వురిస్తంభం దగ్గఱికి పంపి, ఉరితియ్యమని యమపాలుడికి ఆజ్ఞచేశాడు. కొట్టపాలుడి సేవకులు అతన్ని యమపాలుడిదగ్గఱికి తీసికోపొయ్యారు.

యమపాలుడిది కావడానికి వధ్యస్థానంలో వుండి వధార్హులను వురితీసే ఉద్యోగమే. కాని హృదయం చాలమెత్తనిది. దైవభక్తి పాపచింతనము అతనికి ప్రత్యేకంగా వున్న ఆస్తులు. దానికి తోడు తాను నీచజాతిలో జన్మించినా సత్సహవాసం వల్ల తప్పకుండా తరిస్తామనే విశ్వాసం అతనికి ఘట్టిగా వున్నది. కనుక నతడు ఆయుద్యోగంలో తనధర్మాన్ని నిర్వహించి జీవయాత్ర జరుపుతూ అవకాశం చిక్కినప్పుడల్లా జైనసన్యాసుల నాశ్రయించి ఆత్మవిజ్ఞానాన్ని ఆర్జిస్తూ కాలం తోస్తున్నాడు. అటువైని అతను కొలదిరోజులక్రిందనే చతుర్దశీవ్రతదీక్ష పట్టాడు.

చతుర్దశీవ్రతదీక్ష అనగా–జైనమతప్రకారం ఏవిధమైన హింసాకృత్యాన్ని ఆచరించకుండా కేవలము జలాహారియై భగవద్ధ్యానంతో కాలం గడపవలసినరోజు. కాబట్టి అతడు చతుర్దశీవ్రతాన్ని చాలా గోప్యంగా ఆచరిస్తున్నాడు. ఇదిల్లా వుండగా సరిగా చతుర్దశీదీక్షనాడే ధర్మకుణ్ణి వురితీయవలసిన అవసరం ఏర్పడ్డది. అందులోనూ–ఆరోజు వధ్యస్థానంలో వంతు యమపాలుడిదే. కాబట్టి యమపాలుడికిది సంకటంగా పరిణమించింది. ఏంచేస్తాడూ? చతుర్దశీవ్రతాన్నా వదులుకోలేడు. రాజాజ్ఞనా త్రోసిపుచ్చ వీల్లేదు. ఇట్లాంటి విషమస్థితిలో పడి ఉంటూనే దూరంనుంచి వస్తూన్న రాజభటులను చూచి ఇంటిలో దూరి దాగికొని భార్యతో అన్నాడుగదా–'యమకింకరులకు మల్లే వస్తున్నారు రాజభటులు వారు వచ్చిపిలిస్తే నేను వూరిలో లేనని చెప్పు. జాగ్ర[illegible] సుమా' అన్నాడు. ఆవిడకూడ సరే అన్నది.

ఇంతలో రాజభటులు కూడా సమీపించారు. వాకిట్లో యమపాలుడి భార్య నిలువబడ్డది. ఆవిణ్ణిచూచి 'యమపాలు డెక్కడ? రాజుగారు తీసికోరమ్మన్నారు–' అని అడిగారు. ఆవిడన్నదిగదా–'అయ్యో మా బంధువుల్లో దూరగ్రామస్థులకు చాలా జబ్బు చేసిందట. వారిని చూసివస్తానని పొయ్యాడు. నాల్గురోజు లయింది. ఇంకా రాలేదు–' అన, రాజభటులు మొగాలు మొగాలు చూసుకున్నారు. ఆసంగతికని పెట్టి "ఏదో పని వుండాలె–" అనుకొని మళ్లా అన్నదిగదా–ఏం విశేషం? రేపు ఎల్లాగా వస్తాడు. తప్పదు. ఇంతలో మించిపొయ్యే దేమన్నా వుంటే........" అని తటపటాయించింది.

రాజభటులు ఆవలిస్తే పేవులు లెక్కపెట్టే వాళ్లుగదా. వారిలో ఒకగడుసువాడన్నాడు–"ఎ[illegible]మ ఏమీ లేదు. ఇవ్వాళ్ల యమపాలుడే వున్నట్టుంటే అతనిదరిద్రం నేటితో తీరిపొయ్యేది. రాజుగారు అతని మీద చాలా దయపడ్డారు. అందుకుతోడుగా నేడు ఒకపాపాత్ముని వురితియ్యాలి. ఆపనిచేసినతలారికి రాజుగారు నూరుబండారాలు (అంటే బంగారు నాణెములు)

ఇస్తా నని శపథం చేశారు. ఏమైతేనేం దరిద్రుణ్ణి బాగుచెయ్యడం సాధ్యమా?"

తలారిభార్యకు బంగారుపేరు వినడంతోటే నోరూరింది. కాని నోటితో యమపాలు డింట్లోనే వున్నా డని చెపితే చంపేస్తాడు. కనుక కాస్త స్త్రీచాపల్యం చూపిస్తూ రాజభటులకు ఇషారా చేసింది. వెంటనే యమపాలుడి గుడిసెలోకి జబర్దస్తీగా దూరి వారతన్ని ఇవతలికి లాగికొని వచ్చారు. కనుకనే అన్నారు గదా!

* శ్లో. స్త్రీణాం స్వభావతో మాయా
కిం పున ర్లోభకారిణే,
ప్రజ్వల న్నపి దుర్వహ్నిః
కింవాతే వాతి దారుణే.
—ఆచార్యనేమిదత్తుని ధౌమప్తినుండి.

కాని యమపాలుడు మొండిధైర్యంతో 'రావ[illegible]' లే దన్నాడు. అంటే సాగుతుందీ? వాళ్లు తన్ని [illegible]గారి దగ్గఱకు పట్టుకొని పోయారు. పిమ్మట రాజుగారు క థేమి టన్నాడు. యమపాలుడు చెప్పుకొన సాగినాడు:—"మహాప్రభూ! దేవర చిత్తగించాలి. నేను నేటిదినం ఏప్రాణినీ హింస చెయ్యను. సర్వౌషధిబుద్ధి అనే వారివద్దఆ దీక్ష స్వీకరించాను. కాబట్టి నన్ను క్షమించి వదలిపెట్టండి. రేపు దేవరఆజ్ఞను శిరసావహిస్తాను. లేదా నేటికిమాత్రం మఱేఎవ్వరికైనా ఈపని పెట్టండి. తమబోటి ధర్మపాలకులు కరుణించి యీ మాత్రం నాకు అవకాశం దయచేయండి—" అని.

పాకశాసను డసలే భగ్గుమం టున్నాడు. అందులో 'తాను ఆజ్ఞ యివ్వడమన్నా అది చేయకపోవడమే కాకుండా, నేను ఏప్రాణినీ నేడు చంపనని చెప్పడమూనా!' అని అతనికి పట్టింపు ఎక్కువైంది. యమపాలుడితో చేయక తప్ప దన్నాడు. యమపాలుడు తెగించి 'నేను చెయ్య' నన్నాడు. సభలో వారంతా ఆశ్చర్యపడిపోతున్నారు. రాజుగారికి పట్టుదల హెచ్చుతున్నది. దానికి రెండింతలుగా తలారి ధర్మశ్రద్ధ పెరుగుతున్నది. కాదూమఱీ!

• శ్లో. యై ర్దుఃఖాని సమాప్నువంతి వివిధ
జ్ఞానంతి పశ్యంతి నో
వీర్యం నైవ నిజం త్యజం త్యసుభృతో
నిత్యం స్థితా స్సంసృతౌ
కర్మాణి ప్రహతాని తైని మహతా
యోగేన యై స్తే సదా
సిద్ధా నిత్యచతుష్టయామృతరసా
స్నాథా భవేయు ర్న కిమ్?
—పంచాశికనుండి.

"ఏం పట్టుదల వదుల్తావా? లేదా?" అని రాజు మఱల అడిగాడు. చండాలుడు 'మహాప్రభో! వదలుటకు వీలులేద'న్నాడు. రాజు—అల్లాగా! అయితే మంచిది! అని రాజభటులను చూచి "ఈస్సాగరుబోతునే తీసికొపోయి ధర్మకుడికి బదులుగా వురితీయం" డన్నాడు. యమపాలుడు మాఱుమాట చెప్పకుండ రాజభటుల వెంట వధ్యస్థానానికి వెళ్లినాడు. సరి ఇక తరవాయి యేమున్నదీ? ఆజ్ఞప్రకారం అంతా సిద్ధమైంది. యమపాలుణ్ని ఉరికంబానికి కట్టారు. అప్పటికీ అతనుమాటాడ లేదు. అప్పుడు కొట్టపాలుడు దగ్గఱకువచ్చి ఏమైనచెప్పు

* సహజంగానే స్త్రీలు మాయాస్వభావలుగదా! అందులో కాస్త ఏదైనా ధనద్రవ్యాదులఆశగాని, లేక వస్తువాహనాదుల యభిలాషగాని కలిగితే ఇక వారుచూపు మాయను గుఱించి వేఱె చెప్పవలయునా? ఏమందురా? అసలే దుర్వహ్ని (అనగా దగ్గఱికి చేరరాకుండా నాల్గువైపులా మండుతూవుండే కాల్చుకొని తినే నిప్పుగదా) అందులోనూ దానికితోడుగా అతిదారుణంగా గాలికూడా వీస్తూ తోడైతే మఱి చెప్పేదేముంది?

• తమకు ప్రాప్తించెడి దుఃఖాల నన్నిటినీ బాగా ఎఱిగే వుంటారు. పైని వాటివలన కలుగబోవు చెడుపులను కూడా తెలిసికొనే వుంటారు. ఇట్లా వుండికూడా, తత్రాపి అందఱితోబాటు తామున్నూ నిత్యకృత్యాలలో సంసారంలో బడి ఎడా తెరిపి లేకుండావుండికూడా, తమ ఓర్పు (ఇదే వీర్యము) నేమాత్రం కోల్పోకుండా వుండే, కర్మల నన్నిటిని అనుభవిస్తూంటేనే వుంటారు కాని లొంగరు. అట్టి నిత్యచతుష్టయామృతరసికులకు సిద్ధులు నిజానికి సమస్తలోకాలకీ నాథులుగా నేల పేర్కొనరాక యుందురు?

కావలసింది వుందా? అని అడిగాడు. యమపాలుడు— ఆ వుంది. అయినక్షణాలు భగవంతుని స్తుతించుకోవడానికి వీలుకలుగజెయ్యవలె!' అనికోరాడు. కొట్టపాలుడు సరే నన్నాడు. యమపాలు డంతట ఇల్లా ఆరంభించాడు.

* శ్లో. జయ వృసహ! ణాహిణందణ!
  తిహువణణిలయేకదీవ తిత్థయర!
 జయ సయలజీవవచ్ఛల
  ణిమ్మల గుణరయణిహి ణాహ!

† శ్లో. దిత్తేతుమ ఏ్మ జిణవర
  సుహాగడి సంపాహణేక్కవీయమ్మి
 కంఠగద జీవి యస్స వి
  ధీరం సంపజ్జయే పరమమ్.

స్తోత్రం ముగిసిపోయింది. కొట్టపాలుడు కానిమ్మని పనికులకు ఆజ్ఞయిచ్చాడు. వెంటనే తలారులు యమపాలుణ్ణి వురితీసారు. అతనివెంటనే ధర్మకుణ్ణికూడా వురితీసారు. పిమ్మట రాజుగారు స్వయంగా యమపాలుణ్ణిమాచుటకు వచ్చి తన ఆజ్ఞాభంగం చేశాడనేఅక్కసున్ని పట్టలేక ఆశవాన్ని అక్కడకు దగ్గరగా వుండే మొసళ్ల సరస్సులో కొట్టించాడు. ఆహా! వెంటనే ఏం జరిగిందను కొన్నారూ? జలాధిదేవత రత్నఖచితమైన దివ్యసింహాసనములో యమపాలుడికి దివ్యశరీరాన్ని యిచ్చి కూర్చుండబెట్టుకొని సరోమధ్యను ప్రత్యక్షమైంది. రాజుకు అంతట తెలివి గలిగింది. అప్పుడు రాజు అనేకంగా ఆ దేవతను స్తుతించి యమపాలుడిని చేరదీసికొనిఅతనిననేక విధాల స్తుతించి అనేకరీతుల బహుమానా లతనికి చేసి సత్కరించాడు. యమపాలుడు మాతంగుడే అయిన నేం; గుణోజ్జ్వలుండు కాబట్టే దేవపూజ్యుడు కాగల్గినాడు. కాబట్టెయే పెద్దలన్నారు

‡ శ్లో. సదాజ్ఞాత్వా మహాభవ్యైః
  స్వర్గమోక్షసుఖప్రదే
  ధర్మే శ్రీమజ్జినేంద్రోక్తే
  మతిః కార్యా సదా ముదా.

శ్లో. మాతంగో యమపాలకో గుణరతై
  ర్దేవాదిభిః పూజితో
 నానా వస్త్రసువర్ణరత్ననికర
  త్పుష్పోత్కరైః సాదరమ్
 యద్ధర్మస్య హి శేషతోఽపి భువనే
  స శ్రీశివః సంస్కృతః
 కృత్వా దేవనికాయపూజితపద
  ద్వంద్వోఽస్తు నః శ్రేయసే.

ఇది జైనుల మతకథలయందు— ౬ వది యమపాలచండాలుని కథ ముగిసినది.



* ఛాయః—జయ ఋషభ నాభినందన! త్రిభువన నిలయైకదీప! తీర్థకర!,
  జయ సకలజీవవత్సల! నిర్మలగుణరత్ననిధే! నాథ.

[తాత్పర్యము:—భగవానుడా! ఋషభుడా! నాభికొమరుడా! మూడులోకాలకూ అలంకార ప్రియమైన తీర్థంకరా! సమస్తప్రాణుల యందు వాత్సల్యము గలవాడా! నిర్మలములగు గుణములకు రత్నాకరము వంటివాడా! నాథా సర్వోత్కర్ష తో విజయమునొందుము.]

† ఛాయః—దృష్టే త్వయి జినవర! శుభగతి సంపాదనైక బీజే,
  కంఠగతజీవితస్యాఽపి ధైర్యం సంపద్యతే పరమమ్.

[తాత్పర్యము:—ప్రభూ! నీవు సమస్తప్రాణులకున్ను శుభగతి నార్జించుకొనుటకు ప్రధాన కారణమవు గదుసుమ్మా! అట్టి నిన్ను కనుగొనగల్గినచో కంఠగతప్రాణునికైనను ధైర్యము రాగలదే. ఇక నాకు మాత్రమేల అట్టిధైర్యము రాకుండును, కాన నాకు ఈశిక్షానుభవము చేయగల ధైర్యము నొసంగుము.]

‡ సంసారమునంబడి దారీ తెన్నూ లేకుండావుండే సంసారులు ఈవిధముగాను నటించి స్వర్గమోక్షసుఖప్రద మైనదైన ధర్మమునందు ఎల్లప్పుడు సంతోషముతో చిత్తమును వుత్తింతునుగాక అని తాత్పర్యము.

# మనుష్యనిర్వేదము

పండిత పురాణం సూర్యనారాయణతీర్థులు గారు

ముఖారి రాగము - మిశ్రచాపు తాళము.

ప్రాణరక్షణ కిన్ని-పాట్లుపన్న వని మున్నె,
యే నెఱింగి యున్న-నీజన్మమే కోర.
జ్ఞాను లిది రోసికొనియే కా-కానలకుఁ బోవుదురు సర్వము,
మానుకొని యెప్పటికి నీజ-న్మము లభింపనిపదము వెదకఁగ- ప్రా.

ఉదయము కాఁగానే-నిదుర తొలఁగిపోవు,
పది మొదలెన్నో ఆ-పదలే చుట్టు ప్రోవు,
బ్రదుకఁదెరె వెటు చూచినను కను-పడ దిఁకేమి యొనర్తు నయయో!
చదునుగా మది నెంచ నిది శవ-జాగరమ్మై తగులుకొన్నది- ప్రాణ.

స్నానము కాఁగానే-బోనము కావలెను,
దానికై యెన్నెన్నో-తంటాలు పడవలెను.
మానుకొందా మన్నఁ గడుపున-మండుచుండును దేహ మెంతను,
పోనీ యెట్లో తెచ్చిపెట్టినఁ-బొట్ట నిండేటట్టు తోఁచదు- ప్రాణ.

పప్పంటే నే యుండ-దుప్పంటే నూనె లే,
దెప్పటి కప్పుడే-యేదో లోపమె యుండు,
తప్ప దిది యని యిరుగుపొరుగుల-నప్పడుగఁబోయినను వెనుకటి,
యప్పు లిమ్మని బాధపెట్టెద, రప్ప! బ్రదు కెటు తెల్లవాఱును- ప్రాణ.

రాత్రి చింతలచేత-రానేరాదు నిద్ర,
గాత్రము నల్లులు-కఱచి వేయును ముద్ర,
స్తోత్రపాఠకులట్లు పైపై-దోమ లన్నా! ముసరుచుండుఁగ,
శత్రు మస్వాడె నగలు నాకౌము-లాత్రపఱచుచు నడుగుచుండును- ప్రాణ.

బాజారునకుఁ బోయి-వస్తువు లడిగిన,
చేఁజాఁచి డబ్బుకై-బేజారు సేతురు,
రోజు ఋణములు తీర్పు మనుచు మ-హాజనులు బెదరించుచుందురు,
వాజముండాకొడుకు లిదిగో-వ్యాజ్య మేసెద నందు రబ్బా! ప్రాణ.

దేహపోషణ కని-గేహినిఁ బెండ్లాడ,
ఓహో! పిల్లలు పుట్టి-యూపిరి తీతురు,
మోహ మెక్కువ యవుట బిడ్డలు-మూర్ఖులై పోవుటయు వాఁరి వి
వాహములకై చదువుకై పలు-పాట్లు పడవలయుటయుఁ జాలును- ప్రాణ.




మనుష్యుని ఆశకు అంతం లేదు. దేనికైనా మొదలుఅని తుదిఅని వున్నది. కాని ఆశకు తుది లేదు. పెద్దపెద్దఋషీశ్వరులనుకూడా యిది వదల లేదు. ఆఆశ నెరవేరేదే కాని నెరవేరంది కాని, సకలమూ పరిత్యజించి ఆశాపాశాలు వదలి అడవులలో ముక్కుమూసుకొని తపస్సు చేసుకుంటూ 'నిష్కాములము' అనిపించుకునేవారికికూడా ఆశ వుండనే వుంది. లేదంటారా? అంటారు; కాని, వారు తపస్సు చేసేది దేనికి? ముక్తికోసము! ముక్తే వారికి ప్రతిఫలం. ముక్తి అందరికీ దొరుకుతుందా? ఏమో. దొరకేవారికి దొరుకుతుంది. లేనివారికి లేదు. కాని ఈఅందరికీ ఆశమాత్రం పీడిస్తూ వుంటుంది. దేవాదిదేవతలకైన తప్పేంది కాదు. కాబట్టి ఆశ అందరికీ సామాన్యమే. ఆశలన్నీ తీరుతాయా? మన ఆశలన్నీ - కోర్కెలన్నీ - తీరేటైతే మనము మానవుల మెందుకవుతాము? అమరులమే అవుదుము. దేవతలకూ మనకూ భేదమే వుండదు.

చూడండి - ఇప్పటి కారుమాసములనుంచీ మా యింట్లో పెద్దపోరు. 'మాటీలు' చేయించిపెట్టమని ఒక్కటే పోరు. ఈవూళ్లో అదొక్క కొత్త 'ఫ్యాషన్' బయలుదేరింది. కాని, యీ 'మాటీ' లంటే యేమిటా అని అనుకున్నాను. 'అదేమిటి?'అని అడిగాను. 'అది ఒక బంగారునగ. చెవులదగ్గర పైవెండ్రుకలకు తగిలించేది. పుష్యరాగాలు, కెంపులు, రవ్వలు, చెక్కివుంటారు'అని మాఆవిడ చెప్పింది. కాని, ఫలానిది అని నాకు తెలిసింది కాదు. కాని, మళ్లీ "అదెట్లా వుంటుంది?"అని అడుగడానికి నామూషీ. నే నడగలేదు. తెనాలినగలదుకాణాలన్నీ తిరిగేశాను. 'మాటీలు' అని పేరున్న నగ ఒక్కటైనా నా కెక్కడా కనిపించలేదు. అప్పటికి 'సరే' అన్నాను. ఊరుకున్నాను.

కొన్నాళ్లు గడచినవి. లాహోరులోని ఒక పెద్ద ఔషధాలయం 'క్యాటలాగ్' ఒకటి నేను చూడడం తటస్థించింది. అందులో ఔషధాలపేర్లూ, ధరలూ, అవి యేయేరోగాలకు వాడేది అన్నీ వ్రాశాడు. ఆ వరుసలో "బాలవినాశక తైల" అని ఒకప్రకటన చూచి గుండెలు గుభిల్లు మన్నవి నాకు. ఇదేమా అని చదివాను. నాకే నవ్వువచ్చింది. అది హిందీభాష. "బాల్" అంటే వెండ్రుకలు; ఉచ్చారణ "బాల్ వినాశక్ తైల్" అని; వ్రాయడం మాత్రం "బాలవినాశక తైల"అని. అప్పుడు నా కా అపోహ్యం దేనికో తెలిసిపోయింది. నాకా భాష వచ్చును కాబట్టి సరిపోయింది. హిందీభాష రానివాళ్లే మనుకుంటారు?

అప్పుడు ఈమాటీలుకూడా అటువంటిదే అయి వుండవచ్చు ననుకున్నాను. ఆనిమిషంలో స్ఫురించింది: ఇది అరవభాష. "మాట్టు" అంటే "తగిలించు" అని అర్థం. ఇప్పుడు మనదేశంలో అరవ కమసాలీలు నిండివున్నారు. వాళ్లువస్తువును వళ్లి స్థాపించి క్రొత్త పేరు పెట్టి మనదేశంలో వ్యాపింపజేస్తున్నారు. దీనికి తెలుగుపే రేమైనా వుందా, లేదా?

ఒకనాడు నే నాఫీసుకు పోతుంటే చెన్నపట్టం రత్నాచారి నాకు తోవలో కనబడ్డాడు. వాణ్ణి అడిగినాను 'మాటీలు' అంటే ఏవని. వా డొకజత తెచ్చి చూపాడు. అది చంపసరం! దీనికి అరవంపే రేమన్నాను. వాడు 'మయిర్ మాట్టీ' అన్నాడు. అంటే "వెండ్రు

కలను తగిలించేవి" అని అర్థం. ఆఅరవం పేరే 'మయిన్' తీసేసి 'మాటీలు' చేశారు మనవారు. ఇదే కావలసింది మా ఆవిడకు. ఇంతకూ 'చంపసరం' అనే చక్కని తెనుగు పేరుండగా 'మాటీ'లని యెందుకు అనవలెనో నాకు తోచడం లేదు. మన తెలుగుభాష యింకా యేయేవికారాలకు లోనవుతుందో కదా! సంపసరం పాతకాలపు నగ-ప్రాతపేరు! పాతవన్నీ మోటు! ఇప్పుడది కొత్త పేరుతో కొంచెం నాజూకురూపంతో వెలిసింది. వెలుస్తూవుంది!

ఈ మాటీలకోసమే మాయింట్లో రోజూ పోరు. మాఆవిడకు మాటీలమీద ఆశ! నాకుమాత్రం ఆశ లేదను కున్నారా? నేనూ పుల్లాప్కారంతినే మనుష్యుణ్ణే. నాకూ గొప్పగొప్ప ఆశలు పీకిస్తూనే వున్నవి. ఈ ఉమాస్తా గిరిలోనుంచి ఒక్కసారిగా యేడిప్టీకలెక్టరో - యేహుజూర్ శిరస్తాదారో-కావాలె. ఎనిమిది పది వందలు నెల జీతం కావాలె. పెద్దబంగళాలో కాపర ముండాలె. గుమాస్తాలు, చాకర్లూ, నౌకర్లూ, దాసీలు చేతిక్రింద దండిగా వుండాలె. ఇంటిముందర పూలతోట వుండాలె. సాయంత్రం నందనవనవిహారం - రాత్రిళ్లు మేడమీద వెన్నెలలో పచారు. ఈలాంటి వింకా యెన్నో ఆశలు నాకు! కాని, యివి తీరే దెట్లా? 'దరిద్రాణాం మనోరథః'- మరి ఇవే గొంతెమ్మకోరికలు!

నాకోర్కెలు - నాఆశలూ- అట్లుండనీండి. కాని మాఆవిడకోర్కె తీర్చవలసిన బాధ్యత నాలో వుండి పోయింది. అయితే వకటి. తీర్చడానికి నాకు శక్తి వున్నదా లేదా అని ఆలోచన. ఇంకొకటి: మాఆవిడ యేదైనా కావాలెనని అడిగితే అప్పటికప్పుడే తీర్చడం నా కిష్టం కాదు. ఆవస్తువుమీద ఆవిడ కెంతఅపేక్ష వుందో పరీక్షించాలె. అడగటంతోటే తీర్చేస్తే త్వరలోనే దానిమీద ఆశ తీరిపోతుంది. త్వరలోనే వెగటు అవుతుంది. ఆత్వరలోనే దీనిమీదిమక్కువ పోయి మఱొక్కదానిమీద మనసు తగులుతుంది. కావాలె-కావాలె-కావాలె-నని యెంతో మక్కువపడ్డమీదట కొనిపెడితే మక్కువ కొంతకాల ముంటుంది. ఆనందం కొంతకాల ముంటుంది. అందుకనే కోర్కెలు వెంటనే తీర్చేవాణ్ని కాను. అట్లని బొత్తిగామానేస్తానని కాదుసుమండీ! నా అలవాటుచొప్పున అడిగినప్పుడెల్లా సరే ననేవాణ్ణి.

ఆనెలజీతాలు వచ్చేరోజు సమీపిస్తున్నది. సాయంత్రం "ఈనెలైనా నాకు మాటీలు కొనిపెట్టరూ?" అని అడిగింది. ప్రతిమాసమూ మా కిదే సమయం. ఆవిడ అడగనూ-నేను సరే అనడమూ. జీతాలు రావడంతోటే "ఇదుగో ఈ ముప్పైరూపాయలు ఇన్సూరెన్సుకంపెనీకి కట్టాలె, ఈమిగిలినదానితో కాపరం జరగాలె. నీయిష్టం" అనేవాణ్ని. జీతం ఆవిడచేతి కిచ్చేవాణ్ని. ఆవిడమాత్ర మేమి చేస్తుంది? చిన్నపిల్లా? తెలివితక్కువదా? మాకు పెండ్లి అయి పదేండ్లు కడచినవి. ఈపదేండ్లనుంచీ కాపరం చేస్తున్న ఆవిడకు నాసంగతి తెలీదు?

మొదట నేను ముప్పైరూపాయలజీతంలో చేరాను. క్రమక్రమంగా యిప్పుడు అరవైరూపాయలయ్యేటప్పటికి ప్రళయం అయింది. నావిద్యకు నా కింక యింతకంటె యెక్కువ కాబోదు. ఒక్కవేళ అదృష్టం దేవా అనుకుంటే ఈ కలియుగం మునగాలె. ఈ అరవైలో మూడు మాసములకొకసారి ఇన్సూరెన్సు కట్టాలె. పెద్దపిల్లవాడి కొకడికి చదువుకి నెలలో రెండురూపాయలు. వచ్చేబ్రాహ్మలకి యేదో చేతిలోవున్నది దానధర్మం చేయాలె. ఇంటి అద్దె; అప్పుడప్పుడు ఆఫీసుకు బండి. రోజూ రెండుపూటలూ కాఫీ ఫలాహారం; కాపరం భార్యకునగలు. నేనాఫీసుకుపోయేవాణ్ని; అనువైన బట్టలుండాలెనా? ఆవిడకు చీరలు. ఇన్నీ కావాలె. ఎట్లా జరిపేవాడనో పరమాత్మునికే యెరుక! కాలం చూడబోతే మహాకష్టకాలం. అన్నివస్తువులూ ధరలు పెరిగిపోయినవి. ఏది లేకపోయి నా సంసారం గడవదు. అందువల్ల ఆనెలజీతం చేతపడడంతోటే ఈఖర్చులన్నీ లెక్కవేసుకుని చూచింది. మొహం చిట్లించుకుంది. ఏమో గొణుక్కుంది. సణుక్కుంది ఊరిపోయింది.

ఆనెల గడచిపోయింది. తిరిగీ నెలజీతాలు వచ్చే రోజులు వచ్చినవి. మా ఆవిడ పల్లవి సాగించింది. "ఈ నెలైనా కొనిపెడ్తారా మాటీలు. తమాషా చూడండీ తమాషా అందమా—దురదృష్ట మందామా? ఏమైనా

మాత్రమేమి? మాజనకసోదరపుత్రులలో వకనికి ఆనెల ఉపనయనం. వాళ్లు చాల పేదరికంలో వున్నారు. ఏదో కాస్త సహాయం చేయాలిసిందని నన్ను బతిమాలారు. నావద్ద నేముంది? 'కాస్త'! ఎంతఅయితే కాస్త? నాక్షితిగతులు నేను వాళ్లకు తెలియజేశాను. యీ ఖైలో పడ్డది. మాఆవిడకు తెలిస్తే నన్ను పీక్కుతింటుందేమో అని దడిశాను. కాని అంతమాత్రానికే భార్యకు వెరిచే వాణ్ణికాను నేను. చెప్పకుండడానికి దొంగతనమా? చెప్పాను. నాయెదుట నేమీ అనలేదు. తానే ఆకట్నం తీసుకపోయి చెల్లించివస్తానన్నది. మరీ సంతోషించాను. ఆనెల అట్లే అయిపోయింది. యీ ఖై వాళ్లకుపోతే యింక మిగిలిందేముంది? ఇల్లు గడవడానికి ఆనెల కొంచె మప్పు చేయవలసివచ్చింది. ఆఅప్పు ఆమరుచటినెలతీరిపోయింది. ఆనెల-ఆపైనెల-కూడా మాటీలు కొనలేదు. తిరిగీ ఇన్నాళ్ళకింపెని! ఇట్లాగా అనుకుంటూ వుండగానే ఆరుమాసాలుగడచిపోయినవి.

ఈసమయానికేమామరదలు-ఆవిడచెల్లెలు-రుక్మిణి మాయిల్లు వచ్చి చేరింది. ఆవిడకు కొంచె మాస్తి వుంది. పిల్లలు లేరు, విభక్తకుటుంబం. భర్త చనిపోయి కొన్నాళ్లే అయినది.

మరదలు మాయిల్లు చేరింది మొదలుకొని మా కాపరం గడవడం మా కంత కష్టంగా తోచలేదు. అట్లని ఆమెద్రవ్యమంతా మేము కర్చుపెట్టేవాళ్లము కాము. కర్చుపెట్టడాని కావిడకూ సంతోషమే కాని మా కక్కరలే దనేవాళ్లము. ఆమె ధనము వచ్చింది వచ్చినట్లే బ్యాంకిలో వేసేవాళ్లము. అట్లాగూ నాకు తెలియకుండా కొంత కర్చుపెట్టేవారే అక్కచెల్లెండ్రు.

కొంతకాలం గడచిపోయింది. మా మరదలికీ నాకూ చను వెక్కువయింది. ఆవిడ కొంచెం చదువుకుంది. మాఆవిడకూడా కొద్దిగా చదువుకున్నదే కాని చెల్లెలంత యెక్కువ కాదు. రుక్మిణికున్న వాదనాశక్తి మా ఆవిడకు లేదు. ఏవిషయంపైనైనా సరే వాదవివాదంలోకి దిగాలని చూసేది. బహు కులాసామనిషి. పరిహాసప్రియ. పడుచుతనం మరి! మాఆవిడకూ రుక్మిణికీ ఆర్నెల్లు తేడా. అనేకవిషయాలనుగురించి నాకు తీరిక వున్నవేళలలో రుక్మిణితో వాదిస్తూవుంటే - రుక్మిణి నావాదాన్ని ఖండిస్తూవుంటే-నన్ను చిన్నబుచ్చుతూవుంటే మాఆవిడ ముసిముసినవ్వులు నవ్వుతూవుండేది. ఒక్కొక్కప్పుడు చెల్లెలికి విషయం అందిస్తూవుండేది. ఈవిధంగా మేము మహానందంతో కాలం వెళ్లబుచ్చుతూన్నాము.

* * * *

ఎంతో సంతోషంలోటి కాలం వెళ్లబుచ్చుతున్నా నెలకీతం వచ్చేసరికి 'ఈనెలైనా నాకు మాటీలు కొనిపెట్టరూ!' మానిందికాదు మాఆవిడ. ఒక్కసారి నాకే జాలి వేసింది. ఎట్లాగైనా యీనెల కొందా మనుకున్నాను. గాని యెట్లా? ఆరాత్రి ఆవిడ ఆమాట అనేసరికి "అ దెట్లా వుంటుందో యేమిటో నాకు చూపందే నా కేమి తెలుస్తుంది!" అని అన్నాను. ఆవిడ కమితానంద మయింది. ఆమాటకే! "ఎల్లప్పుడూ వచ్చే పరిహాసం' మాటీలంటే తెలీనివాళ్లూ వుంటారా? ఊరకే అడగాలెనని అనుకున్నారు!" అని అన్నది.

"నిజంగానేసుమా! నాకు తెలీదు. ఆపేరున్ననగనే నెక్కడా చూడలేదు. చూస్తే చెబుతా" నన్నాను.

"అట్లాగైతే రేపు తెచ్చి చూపుతా" నన్నది.

ఆరాత్రి అంతా సుఖస్వప్నాల్లో వుండిపోయిందో, కాక, మాటీలు తనకు లభించినట్లే తలచుకుని నిద్రపోలేదో, యేమో గాని, తెల్లవారీ తెల్లవారక ముందే, త్వరగా కాఫీపని చేసింది. ఆనా డాదివారం. నేనూ తీరికగా వున్నాను. కాఫీ లయినతర్వాత యెక్కడికో వెళ్లిపోయింది మాఆవిడ. అర్ధగంటసేపటి కింటికి వచ్చింది. "ఇదుగో మాటీలు తెచ్చా" నని చెబుతూ నాచేతి కిచ్చింది! చూచాను.

"ఇదేనా మాటీలు? ఏదో బ్రహ్మాండమనుకున్నాను. దీనిపేరు చంపసరం కాదా? మనవాళ్లు పూర్వం పెట్టుకునేవాళ్లే."

"అవును. ఆరకం పోయింది__"

"రకం పోవడ మేమిటి! రక మంతా వకటే. అది కొంచెం మోటుగా వుండేది. ఇది కొంచెం నాజూకుగా వుంది. దాన్ని వారు చంపసరం అనేవారు. ఇప్పుడు

అగపడం మాటీ లంటారు. అంతే, లేదా. పాతకాలపవి అన్నీ యెట్లా మోటుఅయినవో చూడు. మళ్లీ ఆ మోజైననగలే క్రొత్తపేర్లతో తిరిగీ వెలుస్తాయి చూడు. ఇప్పుడు నాగరంకూడా మోటు! అదేనాగరం యింకో



"ఇదిగో మాటీలు తెచ్చా" నని చెబుతూ నాచేతి కిచ్చింది! చూచాను.

కపేరుతో వెలిస్తే 'ఈనాటిరకం'- Fashion of the day). ఇంక నాలుగురోజులు పోతే చీరలు మోటు అయి లంగాలు బయలుదేరుతవి చూడు—' అని యీ విధంగా ఉపన్యాసం సాగించాను.

"చాల్లేండి యీఉపన్యాసం" అని ముఖం చిట్లించుకుంది.

"పోనీ, నా కెందుకుగాని, యిదెవ్వరిది?" అని అడిగాను.

"ప్రక్కవీధిలోని అప్పయ్యగారి కోడలిది." అన్నది.

"ఎంత అవుతుంది?"

"ఏది? ఇదా? ఇదైతే రెండువందలయాభై—"

"అమ్మయ్యో! కొంప ముంచావే—"

"నా కింటిధరది కావాలె నన్నావా?"

"ఆం- మరి యెంత అవుతుందో సుమారుగా!"

"దాని కేమి ఎంతట్లో అంటే అంతట్లోనే అవుతుంది. పిండికొద్దీ రొట్టె. అయినా మనం మాటిమాటికీ చేయించబోతామా - ఇంకా కావలసిం దంతా కొనబోతామా—"

ఇది మామూలుమాట! ఏది కావాలె నన్నా, "మనం మాటిమాటికీ కొనబోతామా- చేయించబోతామా ఏదో ఒకసారి చేయించేది. కొంచెం హెచ్చైతే కొంటే యేమి? ఇంక నాలుగో అయిదో యెక్కువ అవుతుంది" అనేవాదన.

"అయితే మనం కొనాలె నంటే యెంత అవుతుందో?" అని అడిగాను.

ఆ- ఎంత అవుతుంది? వాళ్లు రెండువందల యాభైకి చేయించారుకదా—"

"వాళ్లసంగతి మన కెందుకు? వాళ్ల కేమి-ఆ తాతకు ఒక్కగాని ఒక్కకొడుకు- ఆఒక్కకొడుక్కి ఒక్కడే కొడుకు పైగా లక్షాధిపతులు!—"

"మనకు తగినట్లే మనం కొందాం" మన్నది.

"ఎంతకయితే అవుతుంది?"

"నూట—"

"నూటతొంభైతొమ్మిదే?"

"కాదు అన్నిటికీ అడ్డమాటలే—నేను చెప్పను. నా కక్కరలేదు."

"లేదు లేదు. అలిగితే ఎట్లా? అలిగితే సొమ్ము వస్తుందా? నవ్వుతూ అడగాలె: నవ్వుతూ చేయించుకోవాలె: నవ్వుతూ ధరించుకోవాలె."

"అన్నిటికీ మీరు నన్ను ఎగతాళి చేయాలె—"

"లేదు చేయను చెప్పు."

"నూటయాభై-అరవై అయితే చాలు"

"చాలునా!" అన్నాను ఆశ్చర్యంతో.

"నవ్వులాటా?" అన్నది కించిత్కోపంతో.

"నూటయాభై ఎక్కడినుంచి తెద్దాం? సేవింగ్సు బ్యాంక్ లోనుంచి తీయాలిసిందే!"

"నా ప్రాణముపోయినా సేవింగ్సుబ్యాంకునుంచి దమ్మిడీతీయను."

ఇక్కడ ఒక్కమాట చెప్పాలిసివుంది. మా ఆయన సంసారం బహుపొదుపుగా జరిపేది. మితవ్యయంలో ఆయనకుసగ్గవారు లేరనవచ్చు. మాయింటికివచ్చేవారు మా కాఫీలు, ఫలాహారాలూ, ఆడంబరాలన్నీ చూచి మాతో కూడా తినీ, తాగీ, మళ్లీ మమ్మల్ని 'దుబారా' మనుష్యులనేవాళ్లు. నేనైతే అవుతానేమోగాని మా ఆయన దుబారా కాదు. అల్లని పీనాసీ కాదు. అవసరమైన వాటికే ఖర్చుపెట్టేది. నెలాఖరున అయినరూపాయలు సేవింగ్సుబ్యాంకికి పంపేది. ఈసంగతి నాకు మొన్న మొన్ననే తెలిసింది. అందువల్ల "బ్యాంకిలోనుంచి తీయాలిసిందే" అన్నాను నేను.

"అది వల్లకా"దన్నది.

"తీయకపోతే మాటేలా?" అన్నాను.

"దాని కొక్కమార్గం చెప్పనా?" అన్నది.

"చెప్పు" అన్నాను.

"ఈనెల జీతంలో ముప్పైరూపాయ లిద్దాం—"

"తక్కినవి?"

"చెబుతాగా! తక్కిన నూటయిరవై పన్నెండు నెలలు పడతవి"

"ఆపది మిగిలే దెట్లా? ఖర్చు తగ్గించాలె-"

"ఏది తగ్గిద్దాం? ముందుగా కాఫీ సిగరెట్లు-"

"నాకేం వచ్చింది? ముందుగా కాఫీ సిగరెట్లు, తర్వాత భోజనం-"

"ఇప్పటికీ పరిహాసమేనా? ఏదీ తగ్గించ నక్కర లేదు. కాని, రూపాయికి పద్నాలుగణాలేగా—"

"ఏగవర్న మెంట్లో? బ్రిటిష్ గవర్న మెంటువారు పదారణా లేర్పరిచారు-పద్నాలుగణాల గవర్న మెంటు-"





"ఇది 'హోంగవర్న మెంట్' " అని-అంటూ రుక్మిణి మేమున్న చోటికి వచ్చింది.

"రా సమయానికే వచ్చావు ఔను, రుక్కు- అన్నట్లు ఇది హోంగవర్నమెంటు. పద్నాలుగణాలే కాకపోతే సేవింగ్సుబ్యాంకిలో ఆరుసంవలు చేరినమార్గ మేది?" అని మాఆవిడ అన్నది.

"ఇప్పుడు తెలిసింది. రూపాయి మార్చినప్పుడెల్లా రెండణాలు.

"ఔను. పదహారణాల్లూ బ్యాంకికి పోర్యేటి? ఇప్పుడు బ్యాంకికి బదులుగా రెండణా లకనై- ఇంక కొంచెం మనం కలిపి మాటీలవాళ్ల కిస్తాం—"

"సరే. బాగున్నది. ఈ రాబోయేనెల యేదో తెలుసునా? అక్టోబర్-ఇన్కురెన్సు—"

మాఆవిడకు మహాగ్రహంకలిగింది. చటాలని వెళ్లిపోయింది. ఆ ఆలోచన అంతటితో ముగిసింది.

ఆనాడాదివారంకావడం సెలవులోనే వుండడం. మాఆవిడ అలిగి నాతో మాట్లాడకుండా వుండడం! ఎన్నోసార్లు పలకరించినాను. చిట్లింపుమొహమే. నిష్ఠూరపుమాటలే. కాబట్టి ఆవిడ రోజూ నాకు చేసేఉప చారా లన్నీ పాపం! రుక్మిణి చేయాలసివచ్చింది. స్నానానికి నీళ్లివ్వడం భోజనానికి పీట విస్తళ్లు వేయడం అది కావాలెనా బావా ఇది కావాలెనా బావా అని అడగడం. కాఫీ ఫలాహారాలు ఇవ్వడం అన్నీ రుక్మిణి చేసింది.

మా రుక్మిణికి పాపం! మంచి యౌవనంలోనె వైధవ్యం సంభవించింది. ఆమెకు పద్దెనిమిదేండ్లుంటవో లేవో అంతే. మంచిచక్కనిది. నిమ్మపండుఛాయగా వుండేది. అవయవాలన్నీ పుష్టిగా వుండేవి. ఆభరణాలన్నీ తీసివేసింది. మంచిబట్టలు కట్ట మానేసింది. అన్నివిధాలా ఆపేరుకు తగ్గట్లే వుంది కాని వక్కటి మాత్రం కాలేదు. అది కావాలెనని కొందరు పట్టుపట్టారు. మమ్మల్ని బహిష్కరిస్తామని ఊళ్లో పెద్దలు బెదిరించారు. ఏమైనా సరే అది నాకిష్టం లేదు. ఏదో శాస్త్రంలో వున్నదట. వెంట్రుకలుండే విధవల తలమీదనుంచి నీళ్లు దేహంమీదికి పారితే మహాఘోరమైన పాతకమని. మమ్మల్ని బహిష్కరిస్తామని కొందరు బెదిరించేసరికి రుక్మిణిమెల్లగాసమ్మతించిసిద్ధపడ్డది. అప్పుడు నేను 'రుక్మిణీ! బారెడుసాగుకున్నా అదే పేరు-చిన్నముక్కలున్నా అదే పేరు. కాబట్టి తిరిగి ఆముక్కలు మొలవకుండానే వుంటే ఆపనికి నేనూ ఒప్పుకుంటాను. ఆ తెల్లప్పటికే జరగను కాబట్టి నీ వాలాంటి పిచ్చిచేష్టలు చేయకు. మతగురువులు అడిగినా యిదే అనుకుంటాను తరిగొండ వెంగమాంబను ఏమి చేయగలిగారు!" అని నిర్భయంగాచెప్పేశాను. ఎవ రడిగినా అదే మాట చెప్పేవాణ్ని కాబట్టి రుక్మిణి ఆ పక్కపనిమాత్రం చేయలేదు. రోజూ తల దువ్వుకొని బర్మారుడి గాని, జారుముడి గాని, వేసుకునేది. ఇప్పుడిప్పుడు మాబలవంతాన మంచిబట్టలు కట్టుతుంది. సొమ్ములు లేకపోయినా, వైధవ్యం మొహాన తాండవమాడుతున్నా, ఆమె మహా కులాసాగా వుండేది. మా యింట్లో యేదో దేవతాకాంత వాసంచేస్తూవున్నదనుకునేవాళ్లం నేనూ, నా మె అక్కయ్య. కాని, దేవతాకన్యలకైనా అలభ్యమైన సౌందర్యంగల యీమెకు యీ ప్రాయంలోనే వైధవ్యదుఃఖం కలిగించినాడుకదా దైవం అని ఆమెను చూచినప్పుడెలా చింతిస్తూవుండేవాళ్లం.

రుక్మిణికీ నాకూ చనవు నానాటికీ వృద్ధిఅయింది. మాచెర్ప నానావిధ. కాలనుగరించి వుండేది. అందులో ముఖ్యంగా పురాణాల సంబంధం. ఆమెకు శ్రీకృష్ణకర్ణామృతం, శ్రీరామకర్ణామృతం, శ్రీశివానందలహరి, భజగోవిందశ్లోకాలు అంటే మహాప్రీతి. ఇవన్నీ ఆమెకు కంఠోపాఠం. ఆమె కంఠస్వరం కిన్నరలకంఠస్వరాన్ని మించివుండేది. నాకు తీరికకలిగినప్పుడూ, అలవున్నప్పుడూ, ఆమె చేత శ్లోకాలు పాడించి వినేవాణ్ణి. ఆమధురస్వరంతో, ఆశ్లోకభావాలతో లీనమయ్యేవాణ్ణి. వాదనలో వొకొక్కప్పుడు ఆవిడ నాకు క్రిందపోయి రోషపప్పుడు ఆమెఅక్కయ్య ఆవిడపక్షు వహించేది వాళ్ల అక్కయ్యకూ నాకూ యేదైన చిక్కుకలిగితే రుక్మిణి నాపక్షమే పలికేది. మాలో యేదైనా కలహం-అలుకూ-కలిగిందా, రుక్మిణి నాపక్షంలో వుండేది. అక్కయ్యను తగు మాదిరిగా ఉపదేశంచేసేది. ఈవిధంగా ఇంకా నానావిధాలా మాయిల్లంటే నాకు స్వర్గంగా వుండేది. పగలు ఆఫీసులో పడ్డశ్రమ అంతా యింటికి వచ్చిన అరగంటలోనే తీరిపోయేది.

ఒక్కనాడు నే నాఫీసునుంచి యింటికి వస్తూ, పదిగజాలదూరంలో వున్నాను. గంగాభాగీరథీసమానురాలైన రాజ్యలక్ష్మమ్మగారు మాయింట్లోనుంచి బయటికి రావడం చూచాను. ఆక్షణమే నా కొకవిధమైన మనోవికారం కలిగింది.

ఈరాజ్యలక్ష్మమ్మ అరవై అరవైనాలు గేండ్ల వృద్ధ. ఏను గన్నంత మనిషి. చండికాస్వరూపం. ఈమెవూరికంతా "పెద్దమ్మ". ఆబాలగోపాలమూ పెద్దమ్మా అనే పిలిచేవాళ్లం. ఊళ్లో యేయింట్లో నే విశేషమైనా వంటకీమె తీరుగార్. ఆమె చెప్పిందే వేదం. నోటిదురుసు, నోరుతెరిచిందా ఆమెముందెవ్వరూ సాగరు. ఆమె అడుగుపెట్టినచోట కలహం పుట్టకుండా వుండదు. కాబట్టి వూళ్లో చుట్టుపట్లా నాలుగామడలో నీమె నెవ్వరికీ తెలీదు. గయ్యాళిగౌరమ్మ అంటే తెలుస్తుంది. ఈమె చరిత్ర చాలావున్నది. కాని అవన్నీ మన కెందుకు?

ఈమె మాయింట్లోనుంచి బయటికి రావడంచూచి నే నడలిపోయినాను. కలహబీజ మేదో నాటిం దనుకున్నాను. ఈమె మాయింటికి వచ్చేది కాదు. కాని యీపూట యెందుకొచ్చిందా?

ఇంట్లోకి వెళ్లాను. మాఆవిడ కాళ్లూచేతులు కడుక్కోవడానికి నాకు నీళ్లిచ్చింది. వేడివేడి 'టీ' తెచ్చింది. ఉల్లిగడ్డ బజ్జీలు (పకోడీలు) ప్లేట్‌లో పెట్టింది. అంతే గాని మొహాన మామూలు చిఱునవ్వు లేదు. మామూలు కుశలప్రశ్నలు లేవు. రోజూవుండే కులాసా లేదు. ఏదో మెషీన్‌వలె సినీమాలో బొమ్మలాగ పనులు చేస్తుంది. రుక్మిణి యెక్కడా కనబడలేదు. మాఆవిడప్రవర్తనాలు చిత్రంగా వున్నవి. ఏమికారణం? "పెద్దమ్మ వచ్చిపోయినందుకు ఫలితమా యిది? ఉండదు. మాటీలు కొనలేదని కోపం-. శీతం వచ్చేరోజు సమీపిస్తున్నదిగా!" అని అనుకున్నాను.

కొంతసేపటికి రుక్మిణి యింటికి వచ్చింది. నేనింటి ముందరి వసారాలో కుర్చీలో పడుకుని సిగరెట్ కాలుస్తూ అంతకు పదిపదేను రోజుల క్రిందట వచ్చిన 'భారతి' పుటలు తిప్పుతూ వున్నాను. రుక్మిణి యింటికి వస్తూవుండగనే నన్ను చూచి చిఱునవ్వు నవ్వింది. నేనూ నవ్వాను. ఆసమయంలోనె మా ఆవిడ కాఫీకప్ తీసుకపోవడానికి వసారాకు వచ్చింది. ఏమయిందో యేమో లోపలనె సణుక్కుంది. మహాకోపంతో వెళ్లిపోయింది. అది మొదలు ఆవిడ ప్రవర్తనలో యేదో మార్పు కనబడసాగింది. ఈనడుమ మాటీలమాటే ఆవిడ యెత్తడం మానేసింది. పదిపిలుపులు నేను పిలిస్తే యెదటికి వచ్చి నిలిచేది కాని పలికేది కాదు. ఏదైనా అడిగితే సరిఅయినజవాబు చెప్పేది కాదు. ఈకోపం ఈ తాపం- ఈసంతాపం-ఈచిరచిర మాపులు-ఇవన్నీ దేనికి? మాటీలు కొనలేదనే!

నాలుగైదురోజులు మామూలుగానే గడచిపోయినవి. మానరసలు ఇప్పుడు తెల్లని వైనుచీరలు మానేసి మాబలాంతోను రంగురంగులచీరలు కట్టేది. అన్నివిధాలా ఒక్కనుదుటికుంకుమతప్ప సభర్తృకవలె వుండేది. ఒక్కొక్కప్రాటా వొక్కొక్కవింతమాదిరిగ కనబడేది. ఒకరోజుసాయంత్రం నే నింటికి వచ్చేసరికి మా ఆవిడ యింట్లో లేదు. ఆరోజు నే నొక్కగంట ముందుగా వచ్చాను. రుక్మిణి నాకు ఫలాహారం టీ తెచ్చి యిచ్చింది. "మీ అక్కయ్య యేదమ్మా?" అని అడిగాను.

"పార్వతమ్మగారిహారుద్ర సమర్తాడింది. పసుపుకుంకుమ పుచ్చుకోవడానికి పిలిచారు. అక్కడికి వెళ్లింది"

"ఎంతసేపైంది?"

"ఇంతకు ముందే పోయింది. ఇంకో గంటసేపటికి గాని రాదు."

"నిలిచే మాట్లాడతా వేమి? మూర్ఛనమ్మా రోజూ నిన్నడుగుదా మనుకుంటాను గాని యెందుకా అని వూరుకుంటాను. ఇప్పుడు సమయం దొరికింది కాబట్టి అడుగుతాను—"

"ఏమిటిది బావా?"

"మరేమీ లేదు. మీఅక్కయ్యలో యీమ[illegible] మార్పేమైనా నీకు కనబడుతుందా?"

"అంటే?"

"నడవడికలో ఆవిడ పూర్వంవలె లేదు. సరిగా మాట్లాడదు. మాట్లాడితే యేదో మూతివిరుపేగా అంటుంది. పదిసార్లు పిలిచినా పలకదు. ముసుపటి ఆనందంతో వుం

ఆనందం లేదు. మనపర్వాలలో ప్రవేశించడం లేదు. ఒక్కతే యెప్పుడూ ఏదో పనిలో మునిగివుంటుంది. ఎటుచూచినా చాలా ఖేదం కనబడుతూవుంది. దీనికి కారణం నీకు తెలుసునేమో అని"

"ఏ కారణం వుంటుంది బావా? మాటీలు కొనలేదనే కాబోలు. పోనీండి కొనిపెడ్దురూ—"

"అమ్మాయీ, కొనిపెట్టనన్నానా? నీవూ చూస్తూనేవున్నావు కాదా. నే నేమైనా ద్రవ్యం చేతిలో వుంచుకుని వంచన చేస్తున్నానా? అన్నీ మీరే జరుపుతున్నారుకదా. కాకపోతే నాసొంతఖర్చు కాఫీ, సిగరెట్లు—"

"ఆఁ, దాని కేమి లెండి. ఇందు కొక్క ఉపాయం చెబుతాను. మీరు కోప్పడరుగదా—"

"లేదు-చెప్పు—"

"రేపటిరోజున కంసాలి రత్నాచారికి ఆర్డరిచ్చి వేయండి. వారంరోజుల్లో తయారుచేస్తాడు. ఈలోపుగా నావడ్డీతాలూకు రెండువందలు—"

"ఛట్-ఆమాటనకు—"

"కోప్పడకండి, బావగారూ, నిదానంగా విం గురూ.—"

"ఆపని చేయాలనంటే యిదివరలోనే యెప్పుడో చేసివుందును. కాని అది నా కిష్టం లేదు."

"నిజమే. మీ కిష్టం లేదు. అది నాకు తెలుసును. కాని, వినండి, రెండువందలు వడ్డీతాలూకు పైకం వస్తుంది కదా అందులో వాడి కిచ్చివేదాం. నెలకు పది యివ్వడానికి అక్కయ్య వప్పుకొందికదా - వాడి కిచ్చేది నాకే యిస్తురుగాని - బావా, కన్నతలిదండ్రుల వలె అక్కయ్య మీరూ నన్ను ప్రేమిస్తున్నారే - ఆదరిస్తున్నారే! సంతోషంగా నా అంటట నేను ఒక్కనంద [illegible] మా అక్కయ్య కిస్తే-వచ్చేస్తే తప్పే! - ఒక్క చిన్నపగ చేయించి యిస్తే తప్పా బావా? నాకు మాత్ర మెవరున్నారు? నే నెవరికి పెట్టాలె? అక్కయ్య పరాయిమనిషి కాదుకదా. మనవసంతమే మీకైనా నాకైనా బిడ్డను. వాడిదే యీసొమ్మంతా - కొడుకు సొమ్ముకు తల్లి స్వతంత్రురాలు కాదా? బావా, నా యీకోర్కె మీరు చెల్లించకపోతే-నాయీచిన్నిచనువు మీరు మన్నించకపోతే—నా కెంతదుఃఖం కలుగుతుందో—" అని అంటూ రుక్మిణి కండ్లవెంట నీరు కార్చింది.

నాకు మనసులో నేమాత్రమూ నామెసొమ్ము వాడుకోవడ మిష్టం లేదు. రుక్మిణి చాలా చిన్నబుచ్చుకున్నది. నే నొప్పుకొనకపోతే రుక్మిణిని తిరస్కరించిన వాణ్ణి అవుతాను. ఒప్పుకుంటే లోకాపవాదం! ఏమి చేయాలె; ఆలోచనలో పడిపోయినాను. ఏపనైనా సరే నేను పూర్ణంగా విచారించి సాధకబాధకాలరసి, నాకు మనస్సమ్మత మైతేనే పూనుకుంటాను. కొంచె మాలోచించి నేను

"అమ్మాయీ, తల్లిదండ్రులవలె నిన్ను మేము ప్రేమిస్తూ ఆదరిస్తున్నా మన్నావు. అందుకు ప్రతిఫలంగా—" అని అంటూవుండగా,

"ప్రతిఫలం కాదు బావా, కృతజ్ఞత—" అని అన్నది రుక్మిణి.

"చాలుచాలు! కృతజ్ఞతా! ఋణమూ!—"

"బావా ఆగ్రహించవద్దు. నామాట పూర్తిగా వినండి. బిడ్డలకల్ల తల్లిదండ్రులు—"

"ఆమాట వేరు. కొడుకులవల్ల తలిదండ్రులు సహాయం కోరవచ్చు. కాని నీవు ఆడుపడుచువు లోకాప-"

"బావా, బావా, లోకాపవాదానికి ఇప్పుడు లోకానికెవరు చెప్పబోయినారు? పోనీండి—లోకాపవాద మనడానికి మీరేమీ నాసొమ్ము అపహరించడం లేదుకదా. మీమాటకే వస్తాను. లోకాపవాదానికి మన మెంత వెరుస్తున్నాము! లోకమంటే నేమి? అటూయిటూ కూడా అంటుంది. అందర్ని సంతోషపెట్టడం మన తరమేనా? 'లోకము లను మూడు మూకలు కలవా?' అన్నారు. అంత యెందుకు, నాస్వంతవిషయంలో మీ రెంత స్వార్థత్యాగం చేసివున్నారో నాకు తెలీదా? ఎటూ 'నా' అన్నవారు లేని యీస్థితిలో మీరూ అక్కయ్య నన్ను కడుపులో దాచుకోలేదా? మొన్న నాకు స్ఫోటకం పోసినప్పుడు రేయుంబవల్లు మీరూ అక్కయ్య నాపక్క విడిచి కదలారా? లోకమంతా నామూలాన

మిమ్మల్ని బహిష్కరిస్తామని బెదరించినప్పు డెంత గుండెధైర్యం చూపారు మీరు! బావా, మీరు వేయ నండి లక్ష అనండి మా అక్కయ్యకు నేనొక్క చిన్న నగ—"

"అమ్మాయీ, నీసొమ్ము కర్చుపెట్టడం—"

"మీ కిష్టం లేదు. నాకు తెలుసును. నేనే కర్చు పెడతాను. మిమ్మల్నెవ్వ రడగ వచ్చారు? మీ రూరికే 'ఊఁ' అంటే చాలు."

"ఇంక నిన్నేమనాలెనో—"

"ఏమీ అనవద్దు. ఎప్పటివలెనే 'పిచ్చిపిల్లా' అనండి."

రుక్మిణిపట్టుదల నాకన నన్నాలోచనలో ముంచి వేసింది. ఆలోచించుకున్నాను. రుక్మిణిని సంతోష పెట్టడం నాకు తప్పింది కాదు. 'ఏక్ మార్ దో తుకడే'! మాఆవిడకు మాటలు కొనడమూ నాకు తప్పింది కాదు.

"అయితే, రుక్మిణీ, అది మా వద్ద నీ రహస్యం పుచ్చుకునేదైతే—"

"అల్లాగే కానియ్యండి. వీలైనప్పుడు కొంచెం కొంచెంగా యిస్తురుగాని—"

రుక్మిణి కప్పుడు మహానంద మయింది. ఆమె ఆనందం చూచి నాకూ మహదానంద మయింది. కొంచె మూరకుండి రుక్మిణి "బావగార్కు, ఇప్పుడే అక్కయ్యతో నేమీ చెప్పకుండా అన్నీ సిద్ధంచేసి ఒక్కసారిగా ఆమెను ఆశ్చర్యంలో ముంచెద్దామా?" అన్నది. సరే నన్నాను. నాకూ చేదే అలవాటు. ఏదైనా కావాలె నంటే తెచ్చిపెట్టుకుని లే దనేవాణ్ణి. ఆవిడ విసికేది. కోపించేది. రుసరుసలాడేది. ఆఖరుకు కన్నీళ్లు కారుస్తూ కూర్చునేది. నిజంగా చీటికీమాటికీ కన్నీళ్లు కార్చే వాళ్లని చూస్తే నాకు మహాకోపం. భగ్గున మండేవాణ్ని! మాఆవిడ కన్నీళ్లు కార్చిందా బ్రహ్మాండమంతా తల్లక్రిందులు చేసేవాణ్ని. ఆఖరుకు మంగళవంమీద తెచ్చిన వస్తు విచ్చేవాణ్ని. కాబట్టి యిప్పుడు రుక్మిణి ఆలోచన నాకు నచ్చింది. ఈవిధంగా మేము మాట్లాడుకుని రేపు రత్నాచారికి ఆర్డరివ్వ నిశ్చయించుకున్నాము. రుక్మిణి తనలో నేమో అనుకుని గట్టిగా నవ్వుతూ లోపలికి వెళ్లుతూ ఉంది; మా ఆవిడ యింటికి వచ్చింది.

నేనేమీ యెరగనట్టు తలవంచుకున్నాను. మా ఆవిడ లోనికివస్తూ చురచురచూపులు నావైపున ప్రసరింపజేసింది. కాళ్లు నేలకు దబాదబా కొట్టుకుంటూ వక్కవిసరుతో లోపలికి వెళ్లింది. నాకు నవ్వువచ్చింది. "ఇంకెన్నాళ్లులే యీకోపం" అని అనుకున్నాను.

నానాటికీ మాఆవిడకోపం మహోగ్ర రూపం దాల్చసాగింది. నన్ను చూచినప్పుడెల్లా యేమేమో అస్ఫుటంగా అస్పష్టంగా సగ మార్మికంగా సణిగేది. అనంతరం నాలుగైదురోజులకు నాతో బొత్తిగా మాట్లాడ్డమే మానేసింది. నాకు మనసులో వోవిధమైన ఆనందమే! ఆనాటినుంచీ రుక్మిణికీ నాకూ గుసగుస లెక్కువఅయినవి. ఏనాటిసంగతు లానాడు రుక్మిణి కేకాంతంలో చెప్పేవాణ్ణి! మాఆవిడ వినకూడదుగా! తరుచు రుక్మిణీ నేనూ రహస్యంగా మాట్లాడుకునేవాళ్లము. రుక్మిణిమొహం నన్ను చూడడంతోటే కళకళలాడేది. రహస్యం మాట్లాడ్డానికి వీలు చిక్కనప్పుడు మాకళ్లే రహస్యం చెప్పుకునేవి. ఈ విధంగా వారంరోజులు మాకు-రుక్మిణికీ నాకూ దిన మొక్కగడియగా జరిగిపోయింది. మా ఆవిడ సంతాపాగ్నిలో భగ్గున మండిపోతూవుంది. దినదినమూ క్షీణిస్తున్నది. "ఇంకెన్నాళ్లులే యీకోపం!"

ఈలోపుగా ఒకనాటిసాయంత్రం నే నాఫీసునుంచి యింటికి వస్తూవున్నాను అవాళ చాలా ఆలస్యమైంది. రత్నాచారితో మాట్లాడి వస్తున్నాను. వేణుగోపాలస్వామిదేవాలయందగ్గరికి వచ్చేసరికి మారుక్మిణి దేవాలయంలోనుంచి యింటికి వస్తూవుంది ఇద్దరమూ కలుసుకున్నాము. అవాళ రత్నాచారి యెంతవరకు తయారుచేశాడో చెప్పుతూ వస్తున్నాను. పెద్దమ్మ యెక్కడికో పోతూ మమ్మల్ని చూచి తనతో నున్న యింకొకావిడతో నేమో చెప్పింది. మాకు వినబడలేదు. కాని, మమ్మల్నిగురించే అని మాత్రం వాళ్ల చూపులవల్ల మాకు తెలిసింది. ఆమరుసటినాడు మా ఆవిడా పెద్దమ్మా మంచినీళ్ల బావివద్ద నేమో గంటసేపు మాట్లాడారట- తర్వాత నాకు తెలిసింది!

వారంరోజులు గడచినవి. ఇప్పటికి వారంపదిరోజులనుంచే మాఆవిడకూ నాకూ మాటలు లేవు కదా! ఇప్పుడు తరుచుగా నాయెదుటికైనా రావడం మానే

సింది. నాకు అన్నం పెట్టడం మొదలైనపను లన్నీ రుక్మిణే. మాఆవిడ రెండు మెతుకులు తింటుందో తినదో గదిలో చేరి మంచమెక్కి పడేది.

ఆతర్వాత రెండుమూడురోజులకు నే నాఫీసు నుంచి మామూలువేళ కింటికివచ్చాను. మాఆవిడ యింట్లో వుండలేదు. రుక్మిణిని పిలిచాను. రుక్మిణి తనగదిలో వుంది. నే నక్కడికి పోయినాను. "మీఅక్కయ్య యెక్కడమ్మా?" అని అడిగాను. "వేణుగోపాలస్వామి గుడికి వెళ్లింది" అని రుక్మిణి అన్నది. అక్కడే కూర్చు న్నాను. రుక్మిణి ఫలాహారం టీ తెచ్చి యిచ్చింది. మేము మాట్లాడుతూవున్నాము రుక్మిణిమహోత్సాహంతో గట్టిగా నవ్వింది. మాఆవిడ గదిగుమ్మందగ్గ నిలబడ్డది. నేను



చూచేసరికి మహాకోపంతో "మనుష్యులకు జ్ఞానమైనా వుండాలె-సిగ్గైనా వుండాలె! ఛీ! ఎందుకీపాడుజన్మ-" అని గట్టిగా అంటూ తనగదిలోకి పోయి తలుపు మూసుకున్నది. మే మిద్దరమూ దిగాలుపోయినాము! "ఇం కెంతసేపులే యీకోపం!" అని అనుకుంటూ రత్నాచారికోస మెదురుచూస్తున్నాను. అంతలో మా వసంతం వచ్చి "నాన్నా అమ్మ-ఆం-నాన్నా-అమ్మ-ఏడుస్తూవుంది-ఎందుకమ్మా అంటే చెప్పదు - నాన్నా, నువ్వు రావూ?" అని దేబెమొహం పెట్టి నన్ను లాగాడు. నేనూ వాడివెంట పోయినాను. మాఆవిడ పడుకున్న మంచంమీద ఆవిడపక్కలో కూర్చున్నాను. నన్ను చూచి ఆవిడ ఆవలమొహ మయింది. ఇటు తిప్పినా తిరిగి బిగుసుకుంది! ఎన్నివిధాలో పలకరించాను.

"మనుష్యజన్మ మెత్తితే సరిపోతుందా? కొంచె మైనా సిగ్గూ మర్యాదా వుండాలెనా? పుట్టెడు పుస్తకాలు చదవడంతోటే సరిపోయిం దనుకుంటారు. లోకం మొహాన ఉమ్మేస్తున్నా లెక్కాజమా?" అని సాగించింది.

నా కేమీ తోచలేదు. "ఏమిటిదీ 'లెక్కేది?' లోకం ఎవరిమొహాన ఉమ్మేస్తుంది? వాళ్ల యబ్బసొ మ్మేమైనా మింగామా? ఎందుకు వచ్చింది యిన్నీ?—"

"ఎందుకు అని అడగడ మెందుకు? పిల్లి కండ్లుమూసుకుని పాలు తాగుతూ తన్నెవరూ చూడలే దనుకుంటుంది. అంత తెలివితక్కువవా ళ్లిక్కడ యెవ్వరూ లేరు. ఇంతకూ మిమ్మన్న అవసర మేముంది? నేనే చేసుకున్నాను. నేనే అనుభవిస్తు న్నాను కొంపకు నేనే తిప్పలు తెచ్చు కున్నాను. నేనేమో అనుకున్నాను. అదేమో అయింది. పెద్దక్క నాకండ్లు తెరచేవరకూ కండ్లు మూసుకునే వుంటిని. అనక మీవ్యవహారాలు కనిపెడుతూ వు న్నాను. సాగించండి, ఇంకా కానివ్వండి, ఇప్పుడేనా యిక్కడికి వచ్చిం దెందుకు? నన్నోదార్చడానికా ఉడికించడానికా, లెండిలెండి, ఇక్కడ మీ కేమాత్రమూ పసందు కూడా దొరకదు.— నా మొహాన ముడతలుపడ్డవి. నాచేతులు వాడిపోయి నవి, నా కాళ్లు సన్నగిలిపోయినవి, నాకండ్లలోని తేజం నశించింది. నాబుగ్గలమీద గులాబీ చాయ కందిపోయింది- ముసలిదానై నాను- ఎందు కిక్కడ రావడం? నన్ను చూస్తే గిట్టకొచ్చింది!—"

"ఏమిటిదీ—"

"ఏమీ లేదు, ఏముంది? ఏమీ లేదు. ఆడుగో మీ మిత్రురాలు చక్కనిచుక్క. గుండుమొగముది. గుండ్రని లేతచేతులది"

"ఎవరు?"

"ఎవరా? కనుక్కోలేరూ? తెలీదూ? ఇంకా నే చెప్పాలెనా? పోనివ్వండి చెబుతా. నాకేమి భయం? ఇంతకొచ్చింది ఇంకెంతకురాదు? ఆకాస్తపనీ నెరవేర్చేసి



నన్నుచూచి ఆవిడ ఆవలమొహం యింది. ఇంకా త్రిప్పినా బిర్రబిగుసుకుంది! ఎన్నివిధాలో పలకరించాను.

వుంటే యింత కెందుకువస్తుంది. పెద్దమ్మ పదేపదే "జాగ్రత్తసుమీ నీకొంపమునుగుతుంది కూలిస్తుంది అని చెప్పనే చెప్పింది. నేనే"

"పెద్దమ్మ? ఏమి చెప్పింది? ఎప్పుడూ?" అని నేను గాభరాపడి అడిగాను ఇదేమాడంబరం! అట్టహాసం! నాఊహ మెరుపు మెరిసినట్లు మెరిసిం-! ఇదేమా! ఇంత అన్యాయమా; అని అనుకున్నాను.

"ఏమి చెప్పిందా? నీకొంపకు తిప్పలు నీవే తెచ్చుకున్నావు. పడుచుపిల్ల. మంచి యౌవనంలో వుంది. కొద్దికాలం కాపరంచేసినపిల్ల పుట్టింది పుట్టినట్లే వున్న పిల్లైతే పట్టగలంగాని ఈలాటివాళ్లను పట్టలేము. ఆకాస్తపనీ చేసేసి పోయినట్లైతే బాగుంటుంది. అందుకు మీ రొప్పుకోవడంలేదు. చెల్లెలని నమ్ముతున్నావు. నమ్మవద్దు నమ్మవద్దు' అని యింకా రేమేమో చెప్పింది"

"చాలించు"

"చాలించే దేమిటి? అన్నీ నిజంగానే జరిగినవి జరుగుతూ వున్నవి. ఆహాహా! ఏమిసయ్యారం! ఏమా ఓర చూపులు! ఏమా గుసగుసలు- పకపకలూ- ఛీ! అసహ్యం! నిజమే. ఆకాస్తపనీచేసి వికారాకారంచేసిపోయి చెంత పడేసి వున్నట్టయితే—"

"వ్యవహారం మించిపోతూవున్నదే. నీ చెలినిగురించి యీలాటిమాట లంటున్నానో—"

"ఏరినిగురించి అయితే నేమి? చెల్లెలయితేమాత్ర మేమి? నాపదలో చేరి, నాచేతిమీదుగా తినివాళ్లింకే—"

నే నావిడనోరు నొక్కాను. నా చేయి విదలించుకుంది. ఏమో అనవచ్చింది. అంతలో నే నన్నాను:—

"ఇదుగో విను. నీమీది ప్రేమ నాప తగ్గిం దనుకున్నావు. పట్టిభ్రమ పిచ్చిలో పడ్డావు. నీచెల్లెలు నిర్దోషురాలు—"

"అయితే దోషమంతా [illegible]—"

"నాలోనూ దోషం లేదు—"

"ఔను. మీరిద్దరూ నిర్దోషులే. మిమ్మల్నిద్దర్నీ వొక్కయింట్లో వుంచి, మీ కిద్దరికీ అంత చనువు కల్గేవరకూ నే నూరకున్నది నాదే దోషం—"

"అనవసరంగా వకళ్లను దూషించవద్దు. మన ముగ్గిరిలోనూ దోష మేమాత్రమూ లేదు. లేనిపోనివి కల్పించి ఊహించి నీచెవుల నింపిన ఆపెద్దమ్మకే దోషం. విన్నావు. విన్నదానవు పరీక్షించాలె."

"ఆఁ. అదీ అయింది. పరీక్షించందే నే నొకళ్ల నేమీ అనను. ఆనాడు పార్వతమ్మగారి యింటికి నేను పోయినప్పుడు మీ రెట్లావున్నారో- మొన్న మీరిద్దరూ కలిసి బయటినుంచి యింటికి రాగానే మెరగనా— మీ గుసగుసలూ - పాడుగహాస్యాలూ దొంగచూపులూ ఆవిడ రకరకాలచీరెలూ, జాకెట్లు, నయ్యారం పలుకూ నేను వినలేదా చూడలేదా? ఈనాడు మీ రిద్దరూ గదిలో—"

"చాలుచాలు - విన్న దంతా చాలును. ముదిరి పోయింది. పోతూవున్నది—"



ఆకిరిపల్లి: పొన్న వాహనము: చంద్ర వాహనము.



చంద్రమండలముమీదుగ సూర్యోదయము:—గ్రహణకాలము ముగియగనే సూర్యుడు కనుపడుట. క్షణమునకు మూడువందలమైళ్ల వేగమున సూర్యకిరణములు ప్రసరించును.



చంద్రునినీడ సూర్యునికి అడ్డమువచ్చినపుడు కనపడు దృశ్యము



చంద్రగోళము ఆవల సూర్యోదయము

"అవును - ముడిరేపోయింది - ఇంక నక్కటే తక్కువ: మెడను పుస్తె నక్కటే తక్కువ - నుదుట కుంకుమ బొక్కటే తక్కువ: అదికూడా కానిచ్చేసేయండి- వీరేశలింగంపంతులుగారి—"

"అందులో తప్పేముంది గాని-అదికాదు నే నన వచ్చింది. నామాటలు పూర్తిగా వినకముందేగా నీవు అనుమానిస్తున్నావు. నీమీద ప్రేమ నా కేమాత్రమూ తగ్గలేదు. నీవేనా—"

"చాలించండి మోహమిచ్చకాలు—"

"ఇచ్చకం కాదు. యధార్థం పలుకుతాను. ముఖస్తోత్రం చేయడం నావల్ల కాదు. నేను భర్తృరాజును గాను-నిన్నేమీ యాచించేటందుకు నేను రాలేదు—"

"ఔను నావల్ల మీ కిప్పు డేమి కావాలసి వుంటుంది? నేను ముసలి—"

"ఔను-నీవల్ల నా కిప్పు డేమీ కొత్తగా కావలసింది లేదు. నేను యాచించ నవసరము లేదు—"

"చాలు మీ యోగతాళి—"

"ఆఁ-ఉండు-చూస్తాను. నీముఖం ముడతలుపడ్డదెందుకో నాకు తెలుసును. నీచేతు లెందుకు కుప్పించి నవో నాకు తెలుసును. కాళ్లెందుకు సన్నగిల్లినవో నాకు తెలియకపోలేదు. అవన్నీ పూర్వ మెట్లా వుండేవో నాకు తెలుసును. కాని నీమొహం ముడతలు పడ్డవని నీమీద నా ప్రేమ ముడతలు పడలేదు. చేతులు కుప్పించినవని నా ప్రేమ కుప్పించలేదు. నీకాళ్లు సన్నగిల్లినవని నా ప్రేమ సన్నగిల్లలేదు. యధార్థం పలుకుతాను. నిష్ఠూర మైతే భయపడను. నీమనసులో చింతించకూహ, ఇంత అనుమానం, ఇంత మచ్చరం ఉండేది నే నెరగను. ఇంతకోపమూ నీకు మాటీలు కొనిపెట్టలేదనే అని అనుకున్నాను. అనవసరంగా, అన్యాయంగా పెద్దమ్మ మాటలు విని—"

"సరే, నేనుచూచినవో? నాకుకండ్లు పోయినవా?"

"మతి పోయినప్పుడు కండ్లూ కనబడవు. కనబడినా మనల్ని మనకండ్లుకూడా మోసం చేస్తవి. అయినా నీవు చూచిన దేమిటో చెప్పగలవా?"

"అన్నీ మీ రేకాంతం రహస్యాలూ, ముసిముసి నవ్వులు, ఆకిలుకులు, ఆపలుకులూ—"

"పిచ్చిదానా, పిచ్చిదానా, అవే నీకండ్లు నిన్ను మోసంచేసినవి. మా ఉద్దేశాలు, మా ఊహాలు, మా ఆనందం అన్నిటికీ అపార్థం కల్పించుకున్నావు. నిన్ను నీవే బాధించుకుంటూవున్నావు."

"మరి నన్ను పలకరించకుండా, నాతో చెప్పటి వలె నుండకుండా, నాయెదుటనే మీరిద్దరూ నవ్వుతూ ఆడుతూ-ఎక్కసక్కాలతో—"

"అన్నిటికీ కారణం వేరే—"

"ఆ కారణ మేమిటో తెలియ్యరాదూ?—"

"స్వామీ! బందులుగారూ!" అని బయట కేక వినబడ్డది. నే నెవరికోసమని యింతసేపూ ఎదురు చూస్తూవుంటినో ఆరత్నాచారి పిలుపే అది.

"స్వామీ-బందులుగారూ."

"ఎవరు?" అన్నాను నేను.

"తలుపండీ—" అన్నాడు.

నేను మాఆవిడతో "పోయి తలుపు తీయి-ఎవరో పిలుస్తున్నా" రన్నాను

మా ఆవిడ కటాలని లేచిపోయి తలుపు తీసింది. నేను కొంచెం మీనకి వచ్చి నిలిచాను. రత్నాచారి లోనికి వచ్చాడు.

"అమ్మగారు! బందులుగారు ఇక్కడ వుండారండా?"

"లోపల ఉన్నారు-ఎవరు నీవు?" అని మాఆవిడ అడిగింది.

"చెప్పండా రత్నాచారి మాటీల్ కొండొచ్చినా డని" అని అన్నాడు.

"మాటీలా? ఏమాటీలు? ఎవరికి?" అని మా ఆగ్రంతో మాఆవిడ వాణ్ణి అడుగుతూ వుంది. అంతలో నేను బయటికి వచ్చాను. నన్నుచూచి వాడు

"స్వామీ! బందులుగారూ పనివాండు ఇంటికి పూడిశినాడు. నేనుదా సొంతంగ మెరుగుపెట్టిని. ఇప్పుడుదా తయారయింది. కొండొచ్చిని." అని వచ్చీరాని తెనుగుతో నన్నాడు.

నేను వాన్ని తీసుకుని "రాత్రిపూట యిప్పుడు మూలిక దేమి తెలుస్తుంది? ఏదీరుక్మిణి! రుక్మిణినిరమ్మను" అని మాఆవిడతో నన్నాను.



"మాటలా? ఏమాటలు? ఎవరికి?......నన్నుచూడివాడు"

"అయితే నా తెచ్చి వస్తాను" అని ఆచారి లేచి యింటికి పోయినాడు. మాఆవిడ వచ్చి "రుక్కు తలుపు తీయలేదు. మారు పలకదు" అని అన్నది. అంత నేను మిద్దరమూ కలిసి రుక్మిణివున్న గదికి వెళ్లి పదిపిలుపులు పిలిస్తే రెండుగుళ్లలో అర్థగంటసేపటికి తలుపుతీసింది. ఆమె మొగము వాడివుంది. కండ్లెర్రగా చింతనిప్పులవలెవున్నవి. తలవెంట్రుకలు చెదరివున్నవి. తలవంచుకున్నది. ఆ కోపం లో భావం నాకప్పుడే తెలిసిపోయింది. నే ననుకున్న ట్లే అయింది. "సరిమాట లావిడ విన్నది. ఇంక నీవే సమాధానం పరచుకోవాలె. దీనికోసమే— ఈమాటల కోసమే మాగ సగంపలూ ఆలోచనము. ఇవి నీకు తెలీనీకుండా నేచేయించి, వక్కసారిగా తెచ్చి నిన్ను సంతోష సంభ్రమంలో ముంచాలె నని మావుద్దేశం. ఇంకతర్వాత తక్కినవన్నీ నీవే ఆలోచించుకో. రుక్మిణి చెబుతుంది. ప్రస్తుతం సమాధానం చేసి—" అని నేను బయటికి వెళ్లిపోయినాను.

అర్థగంటసేపటికి మాఆవిడ మాటలు చెవులకు తగిలించుకుని రుక్మిణి చేతులుపట్టుకుని వసంతమును చంక బెట్టుకుని కళ కళలాడుతూ వున్న మొగంతో నా యెదుటికి వచ్చి నిలిచింది.

"ఈపూట మా కేమైనా అన్నాహారా లున్నయా, ఈమాటలు మాటించుకుని కులుకుతూ అక్కచెల్లెండ్రు ఊరంతా బజంత్రీలో చుట్టితిరిగి వస్తారా" అని నవ్వుతూ అన్నాను. మాఆవిడ వొక్కనవ్వు నవ్వింది. ఆనవ్వులో జగమంతా నిండివుంది.

"బాగా, మీమాటలు బంగారంగానూ, రొంతెంత చేసిందండీ!" అని అంటూ రుక్మిణి నవ్వింది.

నేను కృతార్థుణ్ణి అయినాను:

---

# ప్రణయ గీతము

## మండ రామేశం గారు

పాంసకలుషితమైన యీప్రాణి మీంద
 హృదయమున జాలిఁ గొనక యుండెద
వేడివలపునఁ బొంగినప్రేమరసపుఁ [వుగాక!
గలికి కనునీటి చదలేటి యలలఁ దోఁగు
ప్రవిమలాత్ములకైనఁ గన్పడుము స్వామి!
తరుణకేతకీపుష్ప పత్రమ్ములందు
నీమనోజ్ఞాకృతి లిఖించి ప్రేమకుసుమ
దామశతములఁ బూజించి తనివి సనక
సొలసి యెఱుపైన నాకరమ్ములకు నేని
దొరకని మొహ్నాప్రభూ! నీదు చరణసేవ.

సుగుణగణరమ్యా! త్వద్గుణస్తోత్ర పుణ్య
గీతముల సిగ్గు విడిచి యేభీతి లేక
పరమభక్తిని పాడి, పావనతఁ గాంచు,
కోకిలల కూరు నాదుచిన్నారి నోరుఁ
ద్రావని మొహ్నాప్రభూ! నీదు మోవిసుధను.



## క్రొత్తపల్లి సూర్యారావు గారు

(వెనుకటి సంచిక తరువాయి)

### పండ్రెండవయంకురము

నెలపుట్టుదాఁక జేతిలో డబ్బు పెట్టుకొని కొంచెమో యెచ్చో మనుపటికంటె సుఖము ననుభవించుట కేమి పెరుగుటవలన-స్టేషనున వర్తకులవలన- నెలనెలకు డబ్బు పెట్టి మంచిబియ్యము వర్తకులయొద్దనే కొనుట యన్నింటిలో సుఖకరమైనది. మామగారికిఁ బ్రతిమాసమును ధారాళముగాఁ బదిరూపాయలు పంపుట రెండవ ప్రాఖ్యము. కట్టుకొనుటకు బట్టలు దొరకుచున్నవి. రెండు మూఁడు లలలోఁ గొంత కూడఁబెట్టుకొని యొక్క-చీర, యొక్క-చాపు - ఈపనులు ధాటిగా జరిగిపోవుచున్నవి. ఇక్కడఁ జాలకాల ముంటిమి. దైవ మిచ్చినది చాలునను తృప్తియొక్కటియే మాకుఁ దోడు. ఇట్లుండఁగా గోపి గారు మాకొక్కయుత్తరము వ్రాసినారు. ఆగరపారా స్టేషనునుండి వచ్చినది.

ఉత్తరము—"గోపీకృష్ణమ్మ రాంరాం. మీ పే[illegible]ను గోరి నేను దైవముపై భారము వేసి భావికాలమును నమ్ముకొని నాలుగణాలు నా జేబులోనుండి వ్యయముచేసితిని. కాఁబట్టి యీయుత్తరమునకైన వ్యయము టపాలబిళ్ల యర్ధణాయును, నేను మీకొఱకు పెలవుచేసిన నాలుగణాలును గలిపి పంపవలసినది. ఇంతే రాంరాం" అని.

ఉత్తరమున కర్ధణా, అవి నాలుగణాలు, నివి పంపుటకర ణా. అయిదణా లెవ్వరు తిన్నట్లురా, పాపము, బీదవాఁడు చేతిడబ్బు వ్యయపఱచి యేమి ప్రార్థనలు చేసినాఁడో! అని మాకు సంతోషమును, విచారమును-జీతము వచ్చిన తక్షణమే బియ్యమునకు, నువ్వు పప్పులకు నొక పొట్లము-చాకి, మంగలి, బిచ్చగాండ్రు మీఁదకు వేఱు పొట్లము-పండుగలలో వ్యయముల కొక్క-పొట్లము-ఇట్లు వేర్వేఱు పొట్లములు కట్టుకొని పెట్టెలోఁ బడవైచుకొని, నిత్యకృత్యమునకుఁ, గూరగాయలు నేతిమజ్జిగల కని కొంత చేతఁ బట్టుకొని, నెలచివరకు వచ్చునప్పటికి టకీమని పోసిన చమురునకు, వేసినవత్తికి సరిపుచ్చుచున్నారము. ఒక్కప్పుడు మామగారికిఁ బంపు సొమ్మునకు మణియార్డరు కమీషనుకుఁ జాలకుండఁ బోవునది అప్పుడా మొత్తములోనుండియే పెట్టువారము. మే మొకరియొద్ద నప్పులు చేయలేదు; మరియొకరి కప్పియలేదు. చేబదుళ్లు మేము తెచ్చికొనలేదు; చేటప్పు లొకరి కీయనులేదు. ఎవ్వరైన నడిగిన లేదనలేదు - వారిచ్చుట కెన్ని నాళ్లుపట్టునో - బదులిచ్చుటకు డబ్బేది-అంతగాఁ దప్పనిసరి వచ్చినప్పుడు పండుగ పొట్లములోనుండి యిచ్చి - మరల నిచ్చిరా యిచ్చిరి, వస్త్రద్రవ్యలాభముక్రింద గణన-వారీయకుండిరా యేదో పండుగనాఁడు పప్పులు వండుకొన్నామని సమాధానపఱచుకొనుట - అంతియ కాని ఆనెలలోఁ బండుగ

కని మఱికొంత వ్యయముచేసితిమా చాలదు నెలచివర చూచుటకు. ఇచ్చి వారివెంటఁ దిరుగుపద్ధతి లేదు. ఇట్టిపరుసులలో గోపీముద్దకఁ గాఁడు మా ప్రాణములకు యమదూతవలె - నత్తుక్రొత్తవిధలేఁ గనఁబడి నాఁడు. నిత్యము బంతిలో గార్డులచేత, పోష్టు బండ్లలోని నేవకులచేత వార్తలు పంపువాఁడు. పాపము వానికిమాత్రము డబ్బెక్కడిది? చిన్న జీతము, కంచపెరటిపలె నింటినిండ బిడ్డలు. దైవముపై భారము వేసి మాకొఱకేల వ్యయము చేయవలయును! దినయప్పట్టునకై మా నాలుగణాలు సెలవుచేసికొనరాదా! వెత్తివాఁడు. మేము వస్తిపోయినను మమ్ము వీఁడు వసలఁ జేయుని మాకది విచారమో సంతోషమో చెప్పఁజాలము. పసివాళ్లు గడవనిచ్చి, వెఱ్ఱిమండికొడుకు, ఎక్కువవ్యయము చేయించు నీగోపిగాఁడు మాపాటికి వీఁడెక్కడ వచ్చినాఁడురా యని తిట్టుచునే నాలుగణాలును, గార్డుచేఁ బంపినారము. పంపునప్పుడుమాత్రము, 'మేము తప్పుకొని వచ్చినతర్వాత నీచేతడబ్బు కిలకిలలాడుచున్నదికాఁబోలు. ఏమిది శేషములు; మాకీమైన నప్పుపెట్టకనా' యని వేగా క్రోశముగా మాటలు చెప్పిపూడఁ బంపితిమి. మీరున్నప్పుడే నయము. మాకిప్పుడు శుద్ధదూన్యముగా నున్నది. కాఁబట్టి దైవభక్తి ప్రార్థనలు, అదృష్టమునమ్ము యెక్కువైనవని బొగ్గులపనివానిచేత వాఁడు ప్రత్యుత్తరము పంపినాఁడు. ఆప్పుట్టుకొని వెళ్లినగార్డు పోఁగానే యిచ్చినాఁడా; నా చేతికిచ్చినాఁడని చెప్పుచునే వానిని యుప్పుతిప్పలఁ బెట్టి మూఁడుచెఱువుల నీళ్లు త్రాగించి యెప్పుడో యేడ్పించి యిచ్చినాఁడట-మాబరువు తీఱిపోయినది.

*మా మిత్రురాలు, లచ్చి, గౌరి, వాణిసాకలు—వీరితో* ప్రసంగము చేసికొనుచుఁ గాలక్షేపము చేయుచున్నాము. బంగారీలు, ఓగ్రములు నన్నుఁ గాంచి తమరీతిగా నన్నుఁగూడ నగలు చేయించుకొమ్మనువారు. ఈ రెండుజతలేనా కాలికి-అవమము రెండువుంచెల్ల యిన నుండవలదా యనువారు. ఉన్నవి, క్రొత్తచోటని ధరింపనని, ఒకప్పుడు డబ్బుచాలదని వినోదముగా ననుచుం డుదానను. కోడిగ్రుడ్డంత బంగారము లేనివారుందురా యనువార్లు, వారు నన్ను వారియంతకాముదనపుఁ దగినట్లు తలఁచుచుండువారు. ఒకరికష్టసుఖము లొకరికెట్లు తెలియఁగలవు? నాకేమంతిపువ్వులు, నాగరము, కేకకి, మంగళ, నండకడియములు, ముగ్గులఁ జూచి నవ్వుకొను వారు. నాకు వారిపట్టెలు, దంతపుగాజులు చూచి యెవ్వరి నగలు వారికి దేశాచారప్రకారము, కులాచారానుసారము సొంపుగా నుండునని తలఁచుదానను. మీదేశములో మీ వేషము; మాదేశమునకు వచ్చితివి; మావేషము వేయరాదా యనువారు. ఎవ్వరియాచారము వారిది; క్రొత్తయాచారము లేల యనుదానను. మీరిద్దఱేకదా; జీతమంతయుఁ దిని దాఁ జెదరా; నీకు నరదా లేదు. నీ మగని కంతెకంటె, అని, నీ కీవస్తువులపైఁ గోరికయున్న నీ మగఁడు నీకెక్కడనుండియో సొమ్ము పుట్టించి నగలు చేయింపఁడా? నాల్గువస్తువులు చేయించికొని తగిలించుకొంటివా యని నిన్న నీళ్లడుగునా, మేఁత యడుగునా— పడియుండును. వచ్చినదెల్లఁ దినుచుండిన మీ కార్జన మెప్పుడు? వస్త్రములనిన బరువుగాఁ జూచుచున్నారు మీరు. అది యొక్కపు డక్కఱకెంత సాయపడునో యెఱుఁగరు-అని బుద్ధి చెప్పువారు. అమ్మా! మీరున్న వారు; నేను గాకున్న డబ్బు మీకు సొమ్ము వచ్చును. ఆధారముపై మీవారు మీకు నగలు చేయింతురు. మా కెక్కడనుండి వచ్చును? ఏధైర్యముపై నప్పుచేసి నగలు చేయించుకొందును? ఎఱుఁగియుండి నేను మావారి నట్లు నిర్బంధపెట్టఁగలను. అట్లయిన, దినదినము వారు నన్నుఁ గాంచి యొకవిధమైన యసూయఁ గనఁబఱతురు. నన్నుఁ జూడఁగనే క్రమక్రమముగ నాపై వారికి మునుపటివలెఁ బ్రేమ కనఁబఱచుట తగ్గించుకొందు రేమో. నన్నుఁ జూడఁగనే యిది నగలకై ప్రాణము తీయుచున్నదని సంసారముపై విరాగము పుట్టునేమో. ఒక్క నగలేనా మనవలసఁ బతులవలన రావలసినవి? ఒక్కనగల నడిగి యెన్నో మేలువిషయములు పోఁగొట్టుకొందునేమో యను భయము. ముందు ముందేమో గాని యిప్పుడు లాభము లేదని సమాధానము చెప్పుచుండుదానను.

గంగాబాయి యను నొక్క ముసలియవ్వ నామాటలు విని-తల్లీ! నిజమే చెప్పితివి. కొందఱు పసుపుఁదనపుమాట లాడుచున్నారు. వీరివీరి స్వాతిశయము, వీరివీరి వాల్లభ్య ముం గని మోసపోవలదు. పతికంటె నగ వేఱొక్కటి యున్నదా? అతఁడు దూషించు దినదినాభివృద్ధియగు ప్రేమ

కంటె నైశ్వర్యము మగువకు వేఱొక్కటియున్నదా. లేని వారిని దెమ్మని బాధించుట కొందఱకు వారికెన్నిసంద్రములు నేర్పిపెట్టెనరు. ఒక దౌర్భాగ్యురాలు నీమగఁ డేమియు నగలు చేయింపఁడు; పుట్టినదానవు పుట్టినట్లున్నదానవు; ఎవ్వరు చూచినారు, నీవు ముందో యూతఁడు ముందో! నగ లున్న నీకప్పటికైనఁ బనికివచ్చునని మాఁతునకు బోధించినది. అది బుగని వేధించినది. అప్పుచేసి నగలు చేయించినాఁడు. శ్రీహరీ యన్నాఁడు. అప్పులవాండ్రు పీడించినారు. నగ లున్నందుకు ఫలము తెగనమ్మి, యప్పుతీర్చి నెత్తిన చేతులు వేసికొన్నది. పిడికెడు మెతుకులు పెట్టు వారిప్పుడు లేరు. అల్లాడుచున్నది. తానొక యుపదేశించిన లెన్ని, తండ్రి మరణించిరి. అన్న,వదినె యున్నారు. దరిఁ జేరనీయరు. అంతఉు నిల్లే యగుదురా యనవలదు. దినములు గడచిపోనిమ్ము. పతీపతులు పరస్పరానురాగముతో నుండుటయే నగలు చేయించికొనుట. ఒక్క నిర్భాగ్యురాలు ఏమి చేసినదా- పతిమించినాఁడు; చదువు [illegible]దు. పాపము దానికిని దుర్గుణములు లేవు, గాని నగలవెఱ్ఱి పట్టుకొన్నది. భోజనము చేయుచున్నప్పుడేదో సంగతి తెలుపవచ్చును. అతఁడు తనస్నేహితునియిల్లు, పిల్లలు, భార్య యని ప్రసంగము తెచ్చును. అంతలో నా వెఱ్ఱిది మొగము వాలవైచికొని, వారి కేమి, ఆమెమగఁడు గడుసరి, కావలసినన్ని నగలు చేయించినాఁడు - అని దెంపును. దానితోఁ జెడ్డప్రసంగములోనికి దింపి, నీలకంఠాయలోనికి వచ్చును. ఎన్ని చెప్పినను కష్టసుఖములు నీవు కనిపెట్టవు, నగలు నీశక్తిని కొట్టుకొందువాయని యన్నము దిగవిడిచి యూతఁడు లేచిపోవుచుండెను. అమ్మో నా కిష్టమని మంచినంకొయబజ్జి చేసినదానను- అని వెనుకఁబడి యఱచునది. నాకేమో నేఁ డాఁకలి లేదు. నాకు భోజనము వలదని - నా కడుపులో నేదో యొకలాగున్నదని చెప్పువాఁడు. నానగల ప్రసంగముచేతనే కా[illegible]ను? కాదుకాదు- కానేమి; నేను నగలమాట యెత్తినానవిరే లేచిపోయినారు. అట్టే కాదు! నాకాఁగఁ జాచినట్లే? చీచీ, లేదు. మీకడుపులో నాఁకలిగానే యున్నది. మీరు కోపగించి లేచిపోయినారు. రండు, మఱియొక విస్తరి వేసి వడ్డించెదను. బజ్జితో రెండుముద్దలు తిని లేచిపొండు. నా కక్కఱలేదు. ఉత్తరాపోశనము పట్టి మరలఁ దిందువా? నన్నుఁ జంపుకొన్నట్లే-నగలప్రసంగము గాదు? మీ కాఁకలి తీఱలేదు. నే నెఱుఁగుదును. నాకు వలదు. నాకుఁ బనియున్నది పోవలయు నని పుస్తకము చేతఁ బట్టుకొని పోవువాఁడు. నామాట వినరు? రెండుముద్దలు తినిపోరా! వలదు, రాత్రికి దాఁచిపెట్టుము. రాత్రికిఁగూడఁ గావలసినంత యున్నది. విస్తరి వేయనా? వలదువలదు. అమ్మో నాకర్మమా, అన్నము దగ్గఱ నగఁ ప్రసంగము తెచ్చి తింసి తినకుండఁ జేసితినమ్మా! మీరు దినకున్న నేనును దినను. అని యేడ్చుచు మూఁతలు పెట్టి రాత్రి దాఁకఁ బస్తుపడియుండునది. పాప మది తిండితిన లేదని కొంతతెంగ పల్లాతీ పెంపలకడ నింటికి వచ్చి యన్నము తినువాఁడు. ఇంకొక పతివ్రతాతిలకము- నీవేమి కష్టపడి యొకనికో నాకుఁ దోయదు; నెల కొక్కకాసు తూఁచుపెట్టించి మెడలోఁ గట్టుకపోయితివా, నీకు నాయింట విస్తరి లేదు. నీకుఁ జెలువుగట్టువిూఁదనే రాత్రి పడుక- అని నిమ్మక్కన్నగాఁ జెప్పునది. ఎక్కడనో ముష్టియెత్తి డబ్బు గడించి తెచ్చుచు, నెవ్వరింటనో సమారాధనలో భోజనము చేసితినని యింట భోజనము మాని, కృశించి వచ్చినాఁడు దానిమగఁడు. ఒక్కనాఁటిరాత్రి యెవ్వరో ముసిబొగ్గుతో గోడమీఁద నీయింటియిల్లాలు మగనిచేత ముష్టియెత్తించి కాసులపేరు చేయించికొన్నదని వ్రాసినారు. దారిని బోవువారెల్లఁ జదివి నవ్వుకొనువారు. కాఁబట్టి యేదో ముక్కులో ముల్లున్నది; తాళియున్నది; నల్లపూసలున్నవి; నీకుండవలసినవి యున్నవి; అందనిమ్రానికళ్లులు చాఁపకు మని-చెప్పినవారి మాటలన్నియుఁ బాటింపకు మని- నీమగఁడు బుద్ధిశాలి, నీవు తెలివిగలదానవు. నేను మీయిద్దఱను మీ రిక్కడకు వచ్చినప్పటినుండి కనిపెట్టి చూచుచునే యున్నాను. ఏమో నీకుఁ బెట్టుకొను మంచి కాలము వచ్చిన నగలు తమంతటఁ దామే వచ్చును. మగఁడే చేయించునో, నీవే చేయించికొందువో! దైవమే యిచ్చునో! మీ రొక్కరికొకరివారు కారు. ఇట్టి మీలో మీరు నగలకై యంతఃకలహములు పెట్టుకొని వైమనస్యము గల్గించుకొనకుఁడు. అపుడు మీ కీదేశములో దిక్కెవ్వరు? నీ కాతఁడు, నాతనికి నీవును నాధారముగాని నగలు మీ కెవ్వరికి నాధారము కావు. మనమెట్లు పెరుగుచుందుమో మనలోనియనురాగము నట్లే పెరుఁగుచుండవలయును.

అప్పుడే నిక్కమైన దాంపత్యము. ఎట్లు గడమనురా యని మగఁడు తిండికై యేడ్చుచుండఁగా, నాకు నగలో నగలో యని బాధించు నిల్లాలింటిలో మగనికి దయ్యమో భూతమో కాని పెండ్లము కాదు. నీలోఁతు నీకుఁ దెలియును గాని పైనుండి చెప్ప వీరికిఁ దెలియునా! పెండ్లి, యాలుమగలు-అనునది యొకవిధమైనది దానిని వివరిపఱచి చెప్పుట కష్టము. మాపిల్లకుఁ బెండ్లి పెండ్లి యని పాటలు పాడుచున్నప్పుడే పిల్లకొకవిధమైన యనురాగ ముత్పత్తి యగును; గాని యది యెవ్వరిమీఁదికిఁ బోక - అర్థము తెలిసికొనఁ దెలియకుండ-మగఁడు వచ్చును; పెండ్లియగును; పల్లకి యెక్కుదురు; చీరలు సారెలు పెట్టెదరు- ఇట్లనియుఁ, దర్వాత రామరాను మగఁడని, సంసారమని, యుద్యోగమని, ధనమని-తర్వాత బిడ్డలని-యిట్లే యిరువురలోఁ జిన్నప్పటినుండి వృద్ధియగును. నాబిడ్డా! ఒక్కటే మాట! దాంపత్యము, వివాహము ననునది చిత్రమైనది. ఏదో యంతలు బొంతలు చుట్టఁజిక్క ముండునప్పుడు రక్తస్పర్శచే నాలుమగ లొకరినొకరు పోలియుందురు. కాశిలోని పిల్లవానికి రామేశ్వరములోని పడుచును బంధుజాలము ప్రసంగములతో పాటుగా నిరువురకు ననురాగము గల్పించి వివాహము చేయుదు రనుము. కాఁపురమునకు వచ్చినది మొదలు క్రమక్రమముగా నొకరొకరి హృదయములందునవలెనే ముఖములందును సామ్యము పొడకట్టును. క్రొత్తవారైనను స్త్రీపురుషు లొక్కచోఁ బడియుండి నిల్చియుండల, బుద్ధిమంతు 'లీమె వీనిభార్య; యీతఁడీమె పెనిమిటి'యని నూఱుమందిలోఁ దొంబదిమందిని గుఱుతుపట్టఁగలరు. నేను జెప్పితిని గనుక నీవును ఇఁక మీఁద గుర్తుపట్టఁగలవు. మగనిముఖము, మగువముఖము నేదో కొంచెము సారూప్యమును బొందియుండును. అట్టి సమానరూపము గలిగినతావునఁ గలదియే దాంపత్యము. మీరిద్దఱు నెంతదగ్గఱివారో దూరపువారో నే నెఱుఁగను గాని, అత్యల్పకాలములోనే నీకన్నులు నీమగని కన్నులను బుడికిపుచ్చుకొన్నవి. చెప్పుకొనుమాటలు విని చెఱచుకొనకుము. పెండ్లి కాని, యిదియొక్కటి కాదు. ఈయనురాగము వచ్చినఱకు వృద్ధియగుచునే యుండును గాని అంకటాలియేఁడువలె వయసు మరలినకొలఁది క్షీణింపదు. నీవు బాలవు: నిన్నజ్ఞాన మింకను విడువలేదు. విదేశము వచ్చి స్వతంత్రముగా జీవించుచున్నను మీరిద్దఱది బాల్యావస్థయే. ఏది విన్నను గ్రహించుస్వభావమే కాని విమర్శించు జ్ఞానము పుట్టలేదు. మీయొద్దనేమి-లేయి ప్రసంగములు చేయరాదు. నామాటలను గూడ నీవన్నియుఁ బాటింపవలదు. నీకు, నీమగనికిఁ గావలసిన వానిని మాత్రము స్వీకరింపుము. అని మేమిద్దఱము గలసికొనినప్పు డెల్ల నాగంగాబాయిగారు చెప్పుచుండును. పాపమామె నాతో, మీరు చిన్నవారు; మీకుఁ దెలియని విషయము లెన్నియో కలవని-సంసారమునందు మీకింకను అనుభవము చాలదు- అని మాయమ్మ చెప్పకుండ విడిచినది కొన్ని సంగతులు చెప్పుచుండునది. వారియిల్లు, మాయిల్లు కొంచెము దగ్గఱ. గంగాబాయి గారి యిల్లు మాయింటికిఁ గొంచెము దగ్గఱ. ఒక్కనాఁడు నాకుఁ దలనొప్పి వచ్చినది. సలసరము దగిలినది. ప్రొయ్యియొద్దఁ గూర్చుండుటచే వేఁడిగా నున్నదనుకొంటిని. అవ్వ నాయొడలేమి నిత్యమువలె నుండక యొక్కవిధముగా నున్నదంటిని. చేయి చూచినది. ఉష్ణముగా నున్నది, నే నొకమాత్ర వేసెద నన్నది. నాయొద్ద నేనుగారి సుదర్శనవటి యున్నదంటిని. అమ్మో నీ కది వలదు. ఈరాత్రి నీ వన్నము తినకుము. మా యింటనే పండుకొనుము. కొంచెము నిద్రపట్టుచున్నప్పుడు నీ కౌషధము వేసెద నని తనప్రక్కలోఁ బండుకొనఁబెట్టుకొన్నది. ఆదినములలో రైలు సాయంకాలము పదేడుగంటలు మొదలు పదునొకండు గంటలవఱకు-పదునొకండు గంటల మీఁదఁగాని మావారు రాత్రిభోజనమునకు వచ్చువారు కారు నేను స్టేషనుకుఁ గబురంపెద నంటిని. ఎందుకు పనిలోనున్న వాఁడు తొందరపడునని సర్ది చెప్పినది. అతఁడే వచ్చినప్పుడు రానిమ్ము నీవు పండుకొమ్మన్నది. పండుకొంటిని. ధావళీవంటిది కప్పినది; నిద్రపట్టినది. 12 గంటలవఱకు నాకు మెలఁకువ రాలేదు. స్టేషనునుండి యింటికి వచ్చినారఁట. అప్పుడు మా యవ్వగారే లేచి నా[illegible]-దాదా! పిల్లకుఁ గొంచెము పులకరముగానున్నది. ఇక్కడఁ బండుకొన్నదిగాని లేపవలదు. నీ వన్నము తిని పండుకొమ్ము. నే నొకమాత్ర వేసితిని. తెల్లవాఱువఱకుఁ దేలికగా నుండునని చెప్పినదఁట. పాపమాయనయొడలు వణఁకి యేలయేల, జ్వరమెందుకు వచ్చినదో యని యడిగెనఁట.

ఏదో శరీరమైనతర్వాత జబ్బుచేయదా. తడిబట్టలు, స్నానము, ప్రొయ్యిగగ్గఱఁ గూర్చుండుట—అదియే పోవును: తేఁగ బెట్టుకొనకుము. అని బుజ్జగించి భోజనము చేయనిచ్చి నీకుఁ దోఁపకున్న విశ్వేశునిప్రక్కను మడఁతమంచముపై నిక్కడనే పండుకొనుము అని చెప్పినదఁట. నాకు భయము లేదు. మాయింటనే పండుకొందును గాని పాశమైనఁ బ్రాఁకునేమో నాయొద్ద జ్వరమాత్ర లున్నవి యన్నారఁట. నీ వొకమాత్ర, నే నొకమాత్రయు వేయవచ్చునా. పాలు పైశ్యము పైత్యోద్రేకముచేతనే వేఁడి కలుగును. ఈరాత్రి వెచ్చగాఁ బండుకొనవమ్మ. నీవు నిద్రింపుమన్నదఁట. కొంచెము చేరుమెదుకులు దిననేమో యన్నారఁట. చేరు శైత్యముగాదా! నీ కేమియు తెంగ వలదు. తెల్లవారి కషాయము నీయింటి కప్పించెదను. నేను దీనిప్రక్కలోనే పండుకొందును. మెలఁకువ వచ్చి మాయింటికి వెళ్లెదనని నేను లాంతరు వెలిగించి కొని తీసికొనివచ్చి దగబిడి వేఁడు పొమ్మన్నదఁట. అర్ధరాత్రము, చీఁకటి; మంచులో రావలదు. ప్రొద్దుననే రావ[…]ండుకొనుమని చెప్పి గూడ మహారాజు తెఁగతో బండుకొన్నారఁట. ఏమిమాత్ర వేసెనదో తెలియఁగను. ఎప్పుడు వేసెనదో తెలిసికొనలేదు. తెల్లవారి లేచితిని. నా కొడలు తేలికగానున్నది. లేచి కాకి మావారు వచ్చినారా? భోజనము చేసి పండుకొన్నారా? నే నిక్కడ నుంటినని యేమైనఁ గోపగించినారా? అని దివరుచు నడిగితిని. ఏమియు ననలేదు; నీకు భయములేదు. నేఁడు నీవు స్నానము చేయవలదు. పథ్యముగా నుండుము. ఈరాత్రికూడ మాత్రయిచ్చెదను; మాయింటికి రమ్మన్నది. ఆమె చెప్పినట్లు చేసితిని. హాయిగా నుంటిని. మే మెంత యదృష్టవంతులమో మమ్ము చూచినవారెల్లరుఁ బ్రాణము పెట్టి తమబిడ్డల వలెఁ గాంచుచుందురు. ఎంతటివారూ దయ లేకున్నఁ బ్రపంచము నిల్చునా!

సుఖముగా నున్నన్ని నాళ్లు కన్నుఁగానక తిరుగుచుండుటయే కాని, కొంచెము కాలునొప్పి యెత్తినప్పుడే యెంతో జాగ్రత్తగా నుండవలయును. చిన్నతనముచేతఁ దెలిసికొనలేక అనుభవముచేతఁ దర్వాతఁ దెలిసికొందుము. ఇందుకనియే పెద్దతల లేకున్న గద్దుతల పెట్టుకొమ్మన్నారు పెద్దలు.

## పదుమూఁడవ యంకురము

ఆది యేమోకాని నా కప్పు డప్పుడు తలనొప్పి, కొంచెము మన్నను, జలుబు, మొదలైనవి తటస్థించుచుండెను. కాని, యవి యొకటి రెండు దినములలోనే తగ్గుచు వచ్చెను. పాపము నాకు బద్దకముగా నున్నపుడును వారే మడిగట్టుకొనవలసి వచ్చుచుండెను. అయ్యో, నేనేమి పాపము చేసితినో నే నెదుటనుండియే మిమ్ము శ్రమపెట్టుచున్నదాన నని విచారించుదానను. దీనికేమిగాని నీకు గడియగడియకు నిట్లు వచ్చుటకుఁ గారణమేమి: నూతినీళ్లు పడలేదా; చెఱువునీళ్లు తెప్పించుకొందమా? నిన్న నీవేమి చేసితివి? రాత్రివేళ చన్నీళ్లు స్నానము చేసితివా, తడిగుడ్డ కట్టుకొంటివా యని యడిగిరి. నే నేమియు నెఱుఁగను. ఎన్నఁడును మీ రనినట్లు నూతినీళ్లేమి చేసెనో, చెఱువునీళ్లేమి చేసెనో భేదము కనిపెట్టనేలేదు. మునుపేవి త్రాగినను జబ్బుచేయలేదే. తడిగుడ్డలు రాత్రులు కట్టుకొనను— పట్టుపంచె యున్నది; మడిబట్ట లున్నవి. నే నేమియుఁ జేయలేదు; మీరు తినినవే నేనును దింటిని. అని నేను జెప్పితిని.

ఏమైనఁ దెప్పించుకొని తింటివా?

ఏమి తెప్పించుకొని తింటిని, నన్నెప్పుడైనఁ జూచినారా?

ఏమో జిహ్వాచాపల్యమునఁ దిననఁ దప్పేమి.

నా కెవ్వరు తెచ్చిపెట్టెదరు, నే నొకరిచేతఁ దేఁబడిన దెన్నఁడైనఁ దింటినా.

తిననఁ దప్పేమి, కలాకండ పంచదార మొదలైనవి తెప్పించుకొనవచ్చునుగదా.

మిమ్ముఁగానని యెన్నఁడైన నే నొంటిగా నోటఁబడవైచుకొన్నది చూచినారా.

అన్నియు నాకుఁ బెట్టకుండఁ దినఁగూడని శాస్త్రమా.

ఇది యేనమ్మ నేఁడీలాటిమాట యనుచున్నారు. లేచి యెవ్వరి మొగము చూచినానోగాని.

ఇదియు నొకతప్పేనా, యేమైనఁ గొని తింటివా యని యడుగనేకూడదా.

అయ్యో కర్మమా, ఇది యెక్కడిపాపము? నన్నీ నాఁ డిట్లు నిర్బంధించుచున్నారు; ఇన్నినాళ్లయి వచ్చి నను నామనస్సు మీరు కనిపెట్టలేదు గాఁబోలును.

నేనేమి తప్పంటిని, పోనీ మాటలాడను

అమ్మా! ఇదియొకకష్టమా; మీరు మాటలాడననిన— పట్టిదే నవ్వుచు ననుచున్నాను. నాతో మాటలాడరు?

ఎందుకు నీకు మాటాడినఁ గోపము వచ్చును. నేను మాటలాడినఁ బ్రయోజన మేమి?

(కన్నులు నలఁపుకొనుచు) నేను, నేనే, నేను, మీ మాటకుఁ గోపపడితి నా?

కోపమో తాపమో! ఏమిచేసితివనినఁ జెప్పవు; ఏమైనఁ గొనితింటివా యనినఁ జెప్పవు.

అయ్యో రామా! నేనేమియు నెఱుఁగనుగదా. మీతో నబద్ధమాడుదునా.

ఏల నీకీజబ్బులు మాటిమాటికి రావలయునో తెలిసికొనుట కడుగుచున్నాను.

ఏల వచ్చినవో, నేనుండి మీచేతఁ బనులు చేయించుకొనుటకు వచ్చినవి.

ఆరోగ్యము తప్పినపుడుకూడ నీవే వండవలయుఁ గాని నేను వండగూడదా? ఇది నీతప్పా! అట్లైన నీకు మఱియొక్కింత యనారోగ్యమగును.

లేకపోయిన నాపాపము నన్నిట్లింకను వ్యాధిరూపముగా బాధించుచున్నది.

ఒకప్పుడు పదార్థములలో దోషముండును. ఆ వేళలలో నేదైనఁ దినిన దోషము కలుగును. వ్యాధి వచ్చుట కనేకమార్గములు. మనుష్యులకు రాక ప్రాకులకు వచ్చునా.

నా గ్రహచారము కాకపోయిన, నే నేదో తెప్పించుకొని తింటినని పట్టించినా రేమమ్మా!

తెప్పించుకొని తినుట తప్పా, నే ననుట తప్పా.

నే నొకరిచేతఁ దెప్పించుకొని తినుట యెన్నఁడైన నెఱుఁగుదునా.

ఎన్నఁడును నెఱుఁగకున్న నీ నాఁ డెఱిఁగియుండ రాదా.

నేను మాటలాడలేనమ్మా, ఏ మనినను దప్పే వచ్చును.

సరి యిపుడు నీవు మాటలాడ ననుచున్నావు, వంతునకు వంతుతీఱినదా.

అయ్యో, నే నందుకన లేదు, క్షమింపుఁడు. నే నేమి, మీతో మాటలాడకుండుటేమి.

కారణము తెలియకయేకదా; ఏమి తినిన వచ్చుచున్నదో యని సందేహము.

నేనేమి తిందును; తిండితినలన వచ్చినది కాదు.

మీవాండ్రను జూడవలెనని బెంగపెట్టుకొన్నా నా రేమి మఱి.

లేదు లేదు; నా కా బెంగ వచ్చినట్లు జ్ఞప్తిలోనే లేదు. నీకేమైనఁ గోరికయుండి నన్నడుగలేకున్నావా.

నాకోరిక మీయొద్దఁ జెప్పలేకపోవుటకు నాకేమి సంకోచము? ఇంకెవ్వరియొద్దఁ జెప్పుదును? నాకేమియుఁ గోరిక లేదు.

బెంగ లేదు; కోరిక లేదు; కొని తెప్పి[illegible]ని తినలేదు.

ఏమిపాపమమ్మా? కొని తెప్పించుకొనుట. అనాచారము— నేను చేసికొనలేనా? కొనవలెనా? నాకేమి చేతఁగాదా?

పోనీ, చేసికొని తినలేకపోయినావా మఱి?

ఏమిటి, ఏమికోరిక, ఏమిచేసికొని తిందును.

కాదు, ఏదైనఁ గోరికయున్నఁ జేసికొని తినవచ్చును.

నా కొక్కకోరిక లేదు. నాయొద్ద నొక్క దాఁపఱికము లేదు.

ఇప్పుడే కాదు, ఎప్పుడైనను సందేహింపక యేమి కావలసినను నన్నడుగవలయును. నీచేతిలో నిపు డేమి యున్నది.

(తెల్లపోయి) నా చేత దమ్మిడికూడ లేదు. [illegible]దిన ముల్లికింపటిమంచి వెచ్చము మీరే పెట్టుచున్నారు.

ఈమాటలతో మావారికిఁ గొంచెము మొగము చిన్నఁబోయినది. డబ్బు లేకపోవుట, దీనిచేతిలో నెందుకైన నొక్కడబ్బు పెట్టుటకైనఁజాలని యీయుద్యోగ మేమిటికి అని తోఁచినది. ఛీ యీజన్మము కష్టభాజ

నము. నేను గడుపుగింటనే దీని తల్లిదండ్రులను బస్తుపెట్టనా, వారి కిచ్చి నే సాహాయ్యముండునా? ఏమి యుద్యోగము! అంతలు మావాండ్రుద్యోగము చేసిరే జీవించుచున్నారా యని విసికికొనిరి. ఏల మీకంతవిసుగు. మన కేమికష్టము వచ్చినది. మన సాహాయ్య ముండుటలేదు. మనవారు నుండుటలేదు. హాయిగాఁ దినుచుండియు నీవిరసన మెందుకుఁ బట్టినది. అని నే నంటిని. "మీనాయన యొక వెఱ్ఱివాఁడు. మానాయన యొక పిచ్చివాఁడు." అనిరి. "అదియేమి నేఁడు పెద్దవారిని నిందించుచున్నారు." అని నే నంటిని. ఏమిపెద్దవారు. ఆలోచన లేనివారు పెద్దలా!

నేను—వా రేమియనాలోచితకృత్యము గావించిరి? మా నాయనతప్పేమి?

వారు—నిర్భాగ్యునకు నాకు నిన్నిచ్చుట గొప్పతప్పు.

నేను—అయ్యో మీ కేమిలోప మున్నది?

వారు—కనఁబడుచునే యున్నది లోపము. నాకెక్కడఁ దిండి కాదో, బ్రహ్మచారినిగా నున్నఁ బ్రపంచమున కెక్కడ వెలితి వచ్చునో యని మానాయనభయపడి మీనాయన మాటల కొప్పుకొన్నాఁడు. వెఱ్ఱియుఁ గాక, పిచ్చియుఁగాక యినియేమిటి?

నేను—మీనాయనగారి తప్పు యిది. వారిద్దఱును సత్య కాలపువారు. వారు తలఁచినట్లు మంచిగానే యైనది. మన కేమిలోప మున్నది. నే నేమి చక్కనిదానను గానా?

వారు—నీవు చక్కనిదాన వగుదువో కావో, నేను గాను.

నేను—మీ కేమి తక్కువ, మన్మథునివలె నున్నారు.

వారు—ఆ మన్మథుఁడు లక్ష్మీపుత్రుఁడు, నీమన్మథుఁడు కుచేలపుత్రుఁడు.

నేను—మనము పేదవారమా? మన పెద్దవారికంటె మన మే ధనవంతులము. మనము బీదలము కాము.

వారు—బీదలమో కామో నీకెఱుఁగవా-ఎఱుఁగనిదాని వలె మాటలాడెదవు.

నేను—నిజముగా నే నాబీదతన మేదో యెఱుఁగని దాననే. మనకు ధనాభావమా?

వారు—నీచేతిలో నిప్పుడు నుపయోగించున ట్లొక్క రూపాయ, యర్ధ పెట్టలేనివాఁడను- ధనాభావము గదా! గ్రుడ్డివానికిఁ గూడఁ గనఁబడుచున్నది.

నేను—అయ్యో నాకెందుకు? మీయొద్దనే పెట్టుకొనుఁడు. దమ్మిడీకూడ నాచేతి కీయవలదు.

వారు—నాయొద్దనే పెట్టుకొనువాఁడనైన నీ కీయలేక పోయితినని విచారింతునా.

నేను—నాకేల మీ రీయవలయును. మీయొద్దనున్నవి నావి కావా? మీకు నాకని భేదభావ మేల మీకుఁ గలిగి నదో! అట్లయిన నే నొక్కనిమిషము బ్రదుకఁజాలను. మీదే నాది, నాదే మీది యని యున్న దానిని మీరు వేఱుచేయుచున్నారు.

వారు—దైవమే వేఱుచేసెను. నీవు వేఱే, నేను వేఱే యెప్పటికిని.

నేను—నే నెప్పుడు మీదాననో యపుడు మీరు నేను నొక్కటియే-వేఱెట్లు?

వారు—నీవు వేఱని భగవంతుఁడే చేసినాఁడు.

నేను—లేదు, చేయ లేదు; శరీరములు రెండు చేసినను మనస్సులు వేఱుచేయలేదు.

వారు—ఆఁడుదానిమనస్సు మగవానిమనస్సు నెన్నఁడుఁ గలియవు.

నేను—నే నంతటివంటి యాఁడుదాననేనా? నామనస్సు మీమనస్సులోనే కలసినది.

వారు—కలసినను రంగు వేఱుగానే యుండును. గడనగల మగనిఁ జూచిన - సుమతిశతకము చెప్పినవాఁడు వెఱ్ఱి వాఁడా.

నేను—ఈనాఁ డేమమ్మా మీ కీలాటిబుద్ధులు పుట్టుచున్నవి. నే నెన్నఁడయిన మీరు గడించుటలేదు, నాకు డబ్బిచ్చుటలేదని యంటినా?

వారు—నీ వనకున్నను శరీభాంకారమువలె నాహృదయములో వినఁబడుచున్నది.

నేను—నే నన లేదు, భూమితోడు-డబ్బు నామీఁదఁ బడవైచి కాల్చికొందునా.

వారు—నీవు మోటుమాటలకు దిగినదానవు.

నేను—మీమాటలకుఁ దగినట్లు చెప్పుచున్నదానను.

వారు—సరి! సరిపోయినది. నీకేమి యింటఁ బని లేదా. మాటకు మాట లాడుచున్నదానవు.

నేను—పని లేకేమిగాని, నేను మీతో వాదులాడు చున్నట్లర్థము చేసినారా. నే నెన్నఁడును డబ్బు లేదని, డబ్బు తెమ్మని మిమ్ము బాధించితినా! మిమ్ము బాధించుట కా మీయింటికి వచ్చినది.

వారు—ఎంతసైభాగ్యముగల స్త్రీకైనను బనుగు మగనిఁ జూచిన—

నేను—అయ్యో; అయ్యో! మీరు బనుగువారా! మీకు ధనము లేదా. ఈవచ్చునది మనకుఁ జాలదా. దైవము కటాక్షించి మం దింతకంటె నెక్కుడుధన మీయఁ గూడదా! యెవ్వరు చూచినారు. మీరు కుబేరులై నప్పుడుగూడ మీయొద్ద నింతకంటె నెక్కుడు వేషము వేయను. మీరు సింహాసన మెక్కినను మీ పాదములు నేనే కడిగెదనుగాని రెండవవారిని ముట్టనీయను. మీరు మేలుగా నీ కంటిరెదుటఁ గనఁబడుటయే యేమువారముల నగలు—కట్టిపెట్టుఁడు, మన ప్రసంగము చాలదూరము పోయినది. చుట్టుతిరిగి మెట్టకు వచ్చినది. ఎల్లకాలము నేదియుఁ బుట్టినది పుట్టినట్లే యుండదు వృద్ధి యగుచుండునుగాని. మన కేమిదైశ్వర్యము రానున్నదో యెవ్వరుచూచినారు. మనలను మనము నిందించికొనరాదు. అని నేనేదో పని మీఁద నింటిలోనికిఁ బోయితిని. వారు గదిలోనికిఁ బోయి క్రొత్తచొక్కాకు బొత్తములు పెట్టుకొనుచున్నారు. ఎవ్వరో తలుపు కొట్టినారు.

ఆ, ఎవ్వరో పిల్చుచున్నారు. మీరు గదిలో నున్నారా? నా చేతు లంట్లవి. అని నే నంటిని.

ఏమి: ఉన్నాఁడను. తలుపు తీసెదను. నీపని చూచుకొనుము. అని వారు వచ్చి యెవరది? యని కేకవైచిరి. పోస్టుపోస్టుమాన్ టాక్ టాక్ అనిధ్వనివచ్చెను.

వెంటనే వారును, నేనును మాతల్లిదండ్రులు వ్రాసిన యుత్తరమైయుండునని తొందరగా వచ్చితిమి. తలుపు తెఱచినారు. నేను వరండాలో నిలువఁబడి సంతోషముతో ఇంత మొగము చేసికొని చూచుచుంటిని. రిజిష్టరీ యుత్తరము. ఇద్దఱకు గుండె గుభేలుమన్నది. ఏదీ యని పుచ్చుకొన్నారు. హిందూస్థానీవ్రాత, ఆగరపారా పోస్టు మద్దనుగాఁడు వ్రాసినది. ఏమిటది! వీఁడు నాకు రిజిష్టరీ యుత్తరము కట్టినాఁడా? ఏమి కారణము? అని భయపడి. చేవ్రాలు చేసి పుచ్చుకొన్నారు. తిరుగఁగొట్టుటకు గోకిగాఁడు విరోధి కాఁడు—ఏదో రండవమా కాళరామన్న యుత్తరమని భయము. బల్లమీఁదఁ బెట్టినారు. విప్పరు. చేతులు లొటపటాయించుచున్నవి. నేను పుచ్చుకొన్నాను గదా విప్పండి యేమి చేయుదు మంటిని. పొద్దుటినుండి మనము లేచుచు నెవ్వరి మొగము చూచినామోగాని, వాదములు, తగవులు—ఉత్తరములు—అని వారు పల్కిరి. "నేను పార్వతీదేవిపటమునకు దండము పెట్టి లేచితిని. కాఁబట్టియే మనవాదములు, తగవులు బల్లఁబడిపోయినవి." అని నేను పలికితిని. ఈయుత్తరము తగవు తీరు టెట్లు? నేను లక్ష్మీనారాయణపటము చూచి లేచినాఁడను. మన పాలింటికి ఆకాశగామన్న యుత్తరములు పట్టుకొన్న నేమి గ్రహచారము అని వారు విసుగుకొనిరి.

"నేను కుట్లబొంత నగుటచేత మనలో మనకుఁ దగవులు వచ్చినవి. నారోగముతో నే మీప్రాణము విసుగుచుండఁగా నానిర్భాగ్యత్వమువలన నే మఱియు మఱియు మీకిట్టి యలజడి కలుగుచున్నది. పుచ్చుకొన్నవారు విప్పి చదువుఁడు."

"ఏమో యేమున్నదో: బంగ్రోతు దూరము పోఁడు; త్రిప్పిపై చెదను."

చేవ్రాలు చేసినారే, వాఁడు పుచ్చుకొనునా?

మఱియేమి చేయుదును. ఉపాయమేమైన నున్నదేమో వాని నడిగి వచ్చెదను,

నాఁడేమి యుపాయము చెప్పును—చదివి యబక తబక లున్నఁ జింపి పాఱవేయుఁడు.

చదివిన—మనస్సులో బాధ—వెంగ—చూడకుండఁగానే చింపి వేయుదునా? (అని పట్టుకొన్నారు.)

వలదువలదు, చూడకుండఁ జింపవలదు— ఏమి యున్నదో-

ఏమియుండును? మునుపటివలెనే యేవో చీవాట్లు, నిందలు—

మును పట్లు వ్రాసినవాఁడు మనయొద్దనే యున్నాఁడుగదా?

అతఁడు గాకున్న నింకెవ్వఁడు కావచ్చును.

ఎవ్వఁడైనను మంచిదే, విప్పినదు వ్రాయెందుకైనను మంచిదే, నాకుఁదోఁచిన దిది.

నీవు విప్పినదివి, మంచి యున్న నాకుఁ జెప్పుము. తిట్లున్నఁ జించివేయుము.

నీకు నచ్చిన యుత్తరము నీవే చింపికొనుఁడు. ఏదుర్మార్గుఁడైన నన్ను నిందించినాఁడేమో.

ఏమియున్నను సరియే, నేనుమాత్రము విప్పువాఁడను గాను; నీవే విప్పుము.

నాకు మొట్టమొదటనే భయము. మీరే విప్పికొనుఁడు.

అని యిరువురమును, ఆకాశరామన్న యుత్తరమే యగునని, శంకచేత నవ్వుకొన్నారము. ఏమియు లేక హాయిగానున్న మనమీఁద నీదుర్మార్గుల కింతపగ యేల! భగవంతుఁడు వారికన్నులలోని పాపలు మొదలైనవి మఱియొకవిధముగాఁ బెట్టినాఁడేమో. మనలను గాంచి యోర్వలేరేమి! మన మేమి ధనవంతులమని! నాపై యధికారులు నాయొద్ద నొక్కతప్పు కనిపెట్టలేదు. నేనేమియుఁ దప్పు చేయలేదు. తెలియని విషయములు కప్పిపెట్టలేదు. సంశయములు పైకి వ్రాసి కనుఁగొని మఱియుఁ జేయుచుందును. నాకుఁ దెలియనిది పోస్టు కూలివాఁడు చెప్పినను దెలిసికొని యాప్రకారము నడచుచున్నాఁడను. ఒక్కప్రమాదము లేదు. నే నొక్కరికి హాని చేయలేదు. నా కొక్కఁడు విరోధి కనఁబడఁడు. నాపై దుష్టులకేల యసూయ? ఒకటియైయుండును. విదేశము వాఁడు మనదేశములోనుండి యింతమేలుగా నుండనేల యని యుండవచ్చును. కానిమ్ము, ఇప్పుడు వలదు. స్నానములోఁ బనిచూచికొని వచ్చి, భోజనముచేసి, సావకాశముగాఁ జదువుకొందము. దీనిని బల్లమీఁద నిట్లే యుండనిమ్ము. ఈలోఁగా నేమైన విశేషములు తెలియవచ్చిన రావచ్చును. అని వారు చింపుట మానిరి.

నాకిది యొకతెంగ. చూచి, చదివి, పాఱవైచిన యొడల తెంగ తీరును. దీనికై యింత యాలోచన యేల! విషయ మేదో మన మెఱిఁగినదే. మనకుఁ జీవాట్లే యందుండును. ఎవ్వరిచేతను దిట్లు దినకుండ మంచివాఁడని పించుకొన్నవాఁ డెవ్వఁడు లేఁడు, చింపుఁడని నేను ప్రోత్సహించితిని.

ఈ త్తరము చేతఁ బట్టికొని యెగాదిగఁ జూచినారు. ముద్రలు పరీక్షించినారు. చేయి వణఁకుచున్నది. కృష్ణ యని కన్నులు మూసికొని నవ్వుచుఁ జింపినారు. నా మొగమువంకఁ దిరిగి, నవ్వుచు, విప్పనా! చదువనా! యని మాటలు విప్పుచున్నారు. నాకాళ్లు దడదడ లాడినవి. ఏదో పని గల్పించుకొని వంటయింటిలోనికిఁ బోయి, పీటమీఁదఁ గూర్చుండి, గోడకుఁ జేరఁబడి, కన్నులు మూసికొన్న దానను. లోలోనఁ జదివికొని, బల్లమీఁద నుత్తరముఁ బడవైచి కుర్చీమీఁదఁ గన్నులు మూసికొని కూర్చుండిరి. ఒడలు చెమ్మటపట్టినది. ఏమిచేయుచున్నారో యని తొంగిచూచితిని. ఈ త్తరము బల్లమీఁద గాలికిఁ గెరింతలు కొట్టుచున్నది. వీ రొడలుమఱచి మాటలాడకుండఁ గన్నులు మూసికొని యుండిరి. నాప్రాణము లెక్కడికో పోయినవి. దగ్గఱవచ్చి, యేమియిట్లున్నారు. ఈ త్తరములో నేమి యున్నది. మాటలాడ రేమి- యని మొగముమీఁద మొగముపెట్టి, గడ్డము పట్టుకొని, కాళ్లు వణకుచుండఁ, బదినిమిషములు నేనును అదేప్రకారము-పదినిమిషములు నిశ్శబ్దముగా నుంటిమి.



# శుకము

శ్రీరాజా మం. భుజంగరాయకవి గారు

కాయలు, వెన్నులున్, ఫలనికాయము, దుంపలుఁ దిండి గాఁగ న
త్తోయముఁ గ్రోలుచుం దరుల తోఁటలఁ జేరి సతంబు వాసముం
జేయుటఁ గా శుకాఖ్య విలసిల్లితి మేమని గర్వ మొందెదే?
పాయదు జాతిసంగము శుభం బెటులౌ శుకవర్యమా! కనన్.

మ. మునివాటిం గడు వేదనాదములు మేము న్విందు మబ్భంగి వి
న్నను వొప్పన్ స్వరయుక్తమానటు మహానందబునం బల్కు మా
నినికాయంబుల నున్నతస్థితిని మన్నింపంగ మే ముందుమం
చనఁగాఁ బోకు శుకంబ! తోఁటవడు జ్ఞానార్థంబు మీఁచింతలన్.

ఉ. ముక్కునఁ గోపరక్తిమము, మోటుదనంబు రసజ్ఞఁ, జేతులం
జిక్కఁదనంబుఁ, గన్నుల నిషిద్ధశమంబును, బక్షపాతముం
దక్కఁడి ముక్కువ ల్గలుగుదానవు నీవు శుకాభిధాన! నీ
వెక్కడ, మౌని వృత్తము వహించుట యెక్కడ? చాలుఁజాలికన్

ఉ. కాముని సేనలం గలిసి కాంతల నేచుట రామరామ! నీ
కాముని సంఘమందున జయంబు ఘటిల్లదు; పోల్చిచూచినం
గామునివాఁడు; వట్లగుటఁ గాదె! సఖీజనవాసపంజర
గ్రామములందుఁ జిక్కి బహుకష్టము లందెదు కీరరాజమా!

చ. ఎవ రెది వల్క నీవు నవిసో వచియింతువు గాని దాని ని
క్కువము గ్రహింపఁజాలవు తగుందగుఁ బ్రేలిన నేమి లాభ ము
త్సవమును జెందఁబోవు కవి సంఘము లర్థ మెఱుంగనట్టి వా
క్యవితతికిన్; శుకప్రవరమా! నిజసూక్తుల సంస్కరింపుమా!






# బాగుబాగు

(ఒక ప్రదర్శనము)

భమిడిపాటి కామేశ్వరరావు గారు

[వెనుకటిసంచికతరువాయి]

## 4 వ-రంగము

[సుబ్రహ్మణ్యం, చింతామణీ నడిచిపోతూ, కొంతదూరాన్న పోతూన్న చిక్కేశ్వర్రావుని కేక వేస్తారు. అతను వచ్చి వారిని కలుసుకుంటాడు.]

సు—Well Mr. Chick! ఎక్కడికి, అజేః పోత పోతున్నావ్?

చి—ఎక్కడి కుందీ? ఇంటికే.

సు—ఈవేళ నేను guest, నువ్వు host ఈను. తెలిసిందా?

చిం—నేనో?

చి—నువ్వా? You are both in one breath: నువ్వు ghost వి!

చిం—అయితేం లే, ఊహూ, మహా. భోజనానికి వస్తున్నానని చెప్పుకోటం, సుబ్రహ్మణ్యం పార్టున బాగుందా ఏమిటి? ఎక్కడేనా రమ్మని పిలుస్తారుగాని, ప్యాసయి, ఇంగ్లీషు వచ్చినంతమాత్రాన్ని, భోజనానికి వస్తామని చెప్పుకుంటారా ఏమిటి?

సు—మా యింటిమెనీ అనగా గాఢత మన్వర గవ్. అల్లాంటప్పుడు ఊరుకోడం క్షేమం. మాకు అరమరాభ్యంతరాలు nil అని చాటుటకే నేనట్లు చెప్పుట. మన్య నీకెవరు? (తల ఊపుతూ) బాగుబాగు.

చిం—(నవ్వును).

సు—అంతేకద! (చిక్కేశ్వర్రావు కేసి తిరిగి) మరేం లేదోయి చిక్కేశ్వర్! మొదట నువ్వన్నది మణి సీరియస్‌గా తీసుకున్నాడు.

చిం—నే నేమీ తీసుకోందే?

సు—ఇంగ్లీషు ఇడియమ్ తెలియనప్పుడు కిక్కురుమనకు, (చిక్కేశ్వర్రావుతో) అప్పుడల్లా తీసుకుని, ఇప్పుడు మళ్లీ సరిగ్గా తీసుకున్నాడు- నాడికేం లేస్తూ! నువ్వెక్కణ్ణించి రావటం?

చి—కొత్త డాక్టరు ఇంటిదగ్గిరనించి.

సు—నా మంచి దేవుడా! ఏం? ఏం?

చి—మా పిన్నికి తేలు కుట్టిందిరా!

సు—What a pity! బాగానే ఉంది!

చిం—(వస్తూన్న నవ్వు ఆపుకుంటూ) తేల్ని చంపారా?

చి—కనిపించలేదోయ్. చెడ వెతికాం, మా లోటు లేకుండానూ!

సు—అన్నట్టు, మణీ, నువ్వు మంత్రివేగా!

చి—మంత్రేమిటి?

సు—మాటలు చెప్పి మంత్రం వేసేవాడు మంత్రి లేక మంత్రగాడు. మణీ, నీకు తేలుమంత్రం వచ్చుగా, వెయ్యరాదూ?

చిం—వెనక వేసేవాణ్ణి. ఇప్పుడైనా వెయ్యచ్చు. కాని, తేల్ని చూడలే దంటున్నాడుగా! చూసుండాలి. ఎర్రతేలైతే, బ్రాహ్మణతేలు. దానికి వేసేమంత్రం ఒకటి. నల్లతేలైతే, అబ్రాహ్మణతేలు; దానికి వేసేమంత్రం మరోకటి.

సు—బాగుబాగు! రెండూ వెయ్యి, ఏదో ఓటి ప్రారంభించి!

చిం—నీకేం తెలుసును! ఇంగ్లీషు వాడివి! తప్పుడు ప్రారంభం చేస్తే, ఆఅబద్ధం తేలొచ్చి నన్ను కుడుతుంది.

సు—సరే. అసట్టే అబద్ధం తేలేదో జాగ్రత్తగా గమనించి, నిజం తేల్ని గ్రహించి, అప్పుడు పునహా సరియైనమంత్రం వెయ్!

చిం—ఏమైనా, నాకు జ్ఞాపకం ఉంటేకదా ఒకటేనా? కొంచెం అక్కడక్కడ నట్టుతుంది. భయం.

సు—బాగుబాగు. అప్పుడు ఆగు. నా neckలో life ఉండగా నీకు fear ఏల?

చి—ఈకవిత్వంలో ఇంగ్లీషుపాళ్లు ఇంకా తక్కువగానే ఉన్నాయి?

చిం—ఈమంత్రాలకికూడా, ఎల్లాగైనా ఒక్కరవ్వ prompting ఉండాలిరా!

సు—అయితే, నీకు రాదందూ?

చిం—రాకేం? రాదని నాచేత వస్తే అనిపించలేవు. కాని, నీ మెస్మెరిజమ్ కొంచెం చూపించుమూ, ఈపట్టుకి, వాదాకా ఎందుకు? (నవ్వును.)

చి—ఈమణిగాడు తెగ నవ్వుతున్నాడు. ఏదో ఉంది! నేను పోతాన్రా, మీకు నవ్వులాటగా ఉంది మరి!

సు—ఛీఛీ ఊరుకో (అని కనుసంజ్ఞతో చింతామణిని కోప్పడినట్టు నటించి, దరవాత చిక్కీశ్వర్రావుతో) వాడిమొహం, వాడి face వాడి కేం తెలుసు నోయ్! అసలు వాడు ఒక regular parasite. కాని నువ్వుకూడా సుస్తీగా ఉన్నట్టున్నావ్! Master Chick!

చి—మరేనోయ్! పైకి చెప్పుగోడానికి పీలులే నిజబ్బా.

సు—ఏ మంటాడు, కొత్తడాక్టరు!

చి—నన్ను చూడ్డంతోటే, repeat the same dose అన్నాడు. నేను మొదట రావడం అప్పుడే అని చెప్పాను.

సు—బాగుబాగు! ఊం!

చి—నాచెయ్యి అందుకుంటూనే, "పేరు, వయస్సు" అన్నాడు. చెయ్యిచ్చి, "రాత్రిరి fever వచ్చిందండి" అన్నాను నేను. ఆయన, తల ఊగించి, "Exactly, అదే!" అన్నాడు. "నడుం నెప్పండి" అన్నాను. ఆయన "అదీ దాని లక్షణమే" అన్నాడు. "Free motion కాలేదు" అన్నాను. ఆయన, తొందరగా, "అదీ అక్కడే ఉంది" అన్నాడు. "కాళ్లమంటలు" అన్నాను. ఆయన, "True, true, అదీ దాని బాపతే" అన్నాడు. "మిరియం తగలచ్చునాండి?" అని అడిగాను. "మిరియాని కేం, మిరియం బెస్టూ" అన్నాడు. "కారం అండీ" అన్నాను. "There's the rub. అదే దాని దుర్గుణం" అన్నాడు. "జావ పుచ్చుగోనాండి?" అని అడిగాను. ఆయన, "భేషుగ్గా. దాని కేం? నీరసం కొట్టేస్తుంది, easyగా digest అవుతుంది" అన్నాడు. "పోనీ, లంకణం ఉంటే!" అన్నాను నేను. ఆయన, "అది మరీ మంచిది, fasting awfully good—'లంకణం పరమౌషధం' అన్నాడు" అన్నాడు.

సు—Capital బాగు, capital బాగు, very బాగు, very బాగు!

చిం—(నవ్వుతాడు.)

చి—(కొంచెం ఆగి) ఏమిట్రా అదీ! ఎరగని వాడిదగ్గిర గొప్ప చూపెడుతున్నారు! చెబుదురూ!

చిం—ఏమీ లేదు గాని, మొత్తంమీద చెయ్యి చూశాడా?

చి—ఆ.

చిం—Palpitation ఎల్లా ఉందన్నాడు?

చి—చేతులోనేనా? ఆహాహా, నీమొహంలా ఉంది. బాగానే ఉందన్నాడు.

సు—బాగా ఉందన్నాడురా? బాగానే ఉందేం? ఆఁ.

చి—(కొంచెం చికాకు పడతాడు.)

చిం—లోపలికి ఇంజంక్షన్లు ఏమీ అక్కర్లేదన్నాడురా?

చి—నువ్వేది ఇంజంక్షన్లమాటేనా? ఓహో! ఇంజంక్షన్లు నాస్తికుడికి చెయ్యడం ఎందుకు, పొమ్మన్నాడ్రా?

సు—సరే. మెట్టుమాట వ్యాపారం బాగానే ఉందంటూ!

చి—మీసంభాషణ నిరర్థకంగా ఉంది, నే పోతాన్రా. ఓమాటు రండి, వీలయితే.

సు—తప్పకుండా. కాని, మనచదువు అయింది కదా! ఏమిటి మరి ముందుకూట? చింతామణి పనే బాగుందిరా. హాయిగా ఫీలవుతుంటల్లి "మళ్లీ అదే పనీ" అన్నట్టు ఫలానా అని పని ఏర్పడిపుంది. మనకేచిక్కుగా ఉంట! ప్రోగ్రాం ఓటి తయారుచేద్దాం వాన్నపుగా?

చి—ఆన్నాను అవడం. ఇదోటేనా, ఇంకా బోలెడున్నాను. అంటేమాత్రం? ఇప్పుడెల్లా?

సు—Coffee hotel పెడదామా?

చిం—మా grandmother కర్రచ్చుకు తరుము కొస్తుంది.

సు—అసలు మనకి ఆ adventurous spirit ఎక్కడ చెడిపోంది? మరోకరిది దాని monopoly. ఏ planet లో అయితేం, పెడితే వాళ్లు పెట్టాలిగాని, మనం పెట్టేం మానేం?

చిం—పైగా మరోట్, ఎంతైనా మనకే చాల్దు. For example, నాకు ఇడ్డె నిష్టం.

సు—For my part, నేను? Iwill bathe in coffee.

చి—సరే, "ఉపమా కాళిదాసస్య" అన్నట్టు, ఉపమా నాపాలు.

సు—బాగుబాగు. పోనీ S. F. మార్కు సిగరెట్లు పెడితే?

చి—మనం కొట్టుకి కొట్టు ఓనాడే ఊదేస్తే!

సు—(నిష్పృహగా) అవునురా. తినుబండాల కొట్టుకి మనకి ఘటన లేదురా. కిల్లీలకు కొట్టం పెడితే?

చి—మనకి అంతా స్నేహితులేరా! అంతా తలోటీవేసుకు చక్కాపోతూంటారు, అలవాటు లేనివాళ్లు కదాను. మనకొద్దు బాబూ అది. అదీవద్దు, బట్టలకొట్టూ వద్దు.

సు—బాగా చెప్పావు, మువ్వన్నట్టు. ఇది ఇల్లానే ఉంటూంటుంది కాని, నీపుస్తకానికి ఏం పేరెట్టావురా?

చిం—నువ్వు పుస్తకం చేశా వేమిట్రా, చిక్కేశ్వర్రావు! హరి! ఏం ప్రబ్యంరా! ఈకాలంలో అడ్డమైనవాడూ పుస్తకం చెయ్యడమే!

సు—గొప్పవాళ్లు రాయకపోడంవల్లే. ఇంకా ఎక్కడికి? నూటికి ఆరుగురుతప్ప కాయితం చూసి చదవ లేరు. పైగా, రాశారని నీకదుపుడుకేం? Ideas ఉంటూంటే, వాటికి తగు expression ఇవ్వడం కర్మా?

చిం—భావాలుంటూంటే సరే, దానికేం, ఒప్పుకోవచ్చు. చాలావాటిల్లో ఆవేలోటుంటున్నారు పెద్దలు?

సు—Silence please. ఏం పేరెట్టావురా.

చి—Experiments in Telgish అని పెడదామని ఉంది. తెలుగూ, ఇంగ్లీషూ కలగలుపు.

సు—Innovations and Inventions అనకోయ్! నీకు దాబుచెయ్యడం తెలియదేం? దబాయింపు, బుకాయింపు, బనాయింపు, బజాయింపు, ఎడ్వర్టిజ్‌మెంట్, వీటిల్లో ఉంది ప్రపంచం, వరల్డ్.

చిం—ఎక్కడ్రా ఉంటూ? నాక్కూడా చెప్పంద్రా అబ్బా, కొంచెం!

చి—నే పోతాన్రా, my mother there!

సు—ఆయన ఎవరో అన్నట్టు, "ఆహ్లాదకరమైన" Samples and Examples రెండు అని మరీవెళ్లరా!

చి—అబ్బా, సరేరా! Audience- దీనికి singular ఏమిటి?

చిం—(తెల్లబోతాడు.)

చి—ఆడియన్.

సు—బాగుబాగు.

చిం—ఓరిఇదిట్రా! (నవ్వుతాడు.)

చి—Fowl కి feminine హెన్నా? Henకి feminine ఏమిటి?

చిం—(తెల్లబోతాడు.)

చి—గ్రహించు, హెన్, షీ హెన్— Two schools of thought.

సు—బలేబలే, భేష్ భేష్, బాగుబాగు.

చిం—(నవ్వుతాడు).

చి—Question అంటే ప్రశ్న. ఈరెండిటికీ సంధి చెయ్యి.

చిం—ముందు యుద్ధం అయితేగా, సంధికి!

చి—క్రొశ్న. ఇత్యాదులు, ఫాలోబిల్, కవిత్రీ. ఇక తర్జుమా! Newness అంటే న్యూనత. Commerce అంటే కామెర్లు, etc.

సు—బాగుబాగు! ఆహాహా!

చిం—ఇది మనకి అనోన్యదశాలకి లోటులేదు లోయ్! (అని పకపకా నవ్వుతాడు.)

సు—To come to the point ; నువ్వు ఈ మధ్య పద్యాలు రాశా నన్నావే, తెలుగూ, ఇంగ్లీషూ మిక్స్ చేసి, అవి వినిపించి మరీ చక్కా-పో!

చి—ఆపద్యాలు పులగం పద్యాలురా. కాక, మీయిష్టం ఏమన్నా సరే వాటిని, As you like it. ఈమధ్య నాగొంతిక బొత్తిగా పోయింది. అంచేతనే, పద్యాలు ఓమోస్తరుగా ఉంటాయి. ఇంగ్లీషుకి తల్లి Latin, తెలుక్కి తండ్రి సంస్కృతం అవడంచేత, ఇంగ్లీషూ, తెలుగూ కలవ్వేమో అని కొందరికి డౌటే హం. తెలుక్కి కౌముది లేదు. తెలుగు ప్రమేయం కష్టం అయిపోతోంది. తెలుగుని సంస్కృతం ఒకచెంపకాయా, హిందూస్తానీ ఒకచెంపకాయా వేళ్లు అంటునట్టు కొట్టాయి. ఇక చెంపలు లేక, ఇంగ్లీషు వచ్చి, తెలుగుని ఓమొట్టికాయ వేసింది. మొట్టికాయలు ఇంకా ఎన్ని పడతాయో చెప్పడం మన తలదాటిన సంగతి. ఇన్ని దెబ్బలూ తెలుగు తినితీరింది, ప్రతీదెబ్బకీ గాయం పడకపోతేం, అనవుం బొప్పిఅయినా కట్టితీరింది. ఇవన్నీ లెక్క-చూసుకుని ముందెవడో కౌముది రాస్తాడు. వాడికి నేను చిన్నప్రాప్. ఇక, పద్యాల్లో, పాళ్లు ఎల్లా పడ్డాయని మీయాశహా! ఇడ్డెన్ and patent పచ్చడి, పంచదార and coffee, coffee and కిల్లీ, కిల్లీ and cigarette—వీటికిమల్లే. Now listen:—

1. The sky is మబ్బీ
The road is దుమ్మీ
My head is దిమ్మీ
Life, Life, Life.
2. ఇప్పుడు they do not విన్
వెనుక they do not గణ్
ముందు they do not నమ్
Life, Life, Life.
3. Man is yet తెగ అమ్మబుల్
woman is yet not నమ్మబుల్
Child alas is not పూజబుల్
Life, Life, Life.
4. They want open కనకాక్షన్
They want secret కాంతాక్షన్
They hate సన్యాసాక్షన్
Life, Life, Life.

(అంటూ నిష్క్రమిస్తాడు.)

చిం—సరేరా, Good evening.

సు—Good night రా అవసలేంది.

✓ చిం—ఏదో పోటి, మంచిదేగద నేనన్నదీను.

(నిష్క్రమిస్తారు.)

## ౫-వ రంగము

[గుమ్మంలో చిక్కేశ్వర్రావు వేచిఉంటాడు. సుబ్రహ్మణ్యం, చింతామణీ వస్తారు. చిక్కేశ్వర్రావు వాళ్లని లోపలికి తీసుకువెడతాడు. వెళ్లి "పిన్నీ" అని పిలుస్తాడు. అప్పుడు కాంతమ్మ తన కుడిబొటనవేలు ఎడమచేత్తో నొక్కి-పట్టుకుని మూలుగుతూ ప్రవేశిస్తుంది.]

సు—ఎవరికండీ, తేలు కుడతా?

కాం—నాకేనండీ! లాగేస్తోందరా, దేవుడా!

సు—చిక్! మీ mother పేరు?........

చి—కాంతమ్మ.

సు—(నేను ఇదివరకు ఎరుగున్నట్టూ, జ్ఞాపకం అప్పటికి వచ్చినట్టూ నటిస్తూ) అవునవును. కాంతమ్మ గారు కాదూ అన్నట్టు! ఏమండీ కాంతమ్మగారికి తేలు కుట్టిందన్నారే, వీకులో కొంతమంది? (అని మెస్మెరిజమ్ చేసినట్టు చేతులు తిప్పుతాడు.)

కాం—వాళ్ల మొహం మండా, వాళ్లకేం తెలుసు నండీ! మతిలేనివాళ్లు గావునండీ, వారు చెప్పడానికీ మీరు వినడానికీనూ!

సు—కుట్టినమాట నిజమే అయితే, నాకేసి చూడండి. పోయిందా, లేదా?

కాం—మీకేసి చూస్తే ఏం ఉందండీ? మొహాన్ని బొట్టేనా లే దాఖలికి! అబ్బ! అబ్బ! రామయ్య తండ్రీ.

సు—ఇప్పుడు తేలుగురించి తల్చుగోకండి, పోయిందా?

శాం—తేల్చి తల్చుగోకపోతే, ఇంకేం తల్చుకో మన్నావయ్యా! పోవడమేమిటి? ఇంకా ఎక్కువవుతూంది రా, దేవుడా!

సు—ఇదా పోతుందీ అన్నప్పుడు అల్లా ఎక్కువ అవుతుందలెండి, మీరెరగరు; లేలు అసలే కుట్టలే దను కోండి. ఈమాటు పోయిందా?

శాం—వాకే కాదుటండీ, కుడతా? 'కుట్టలేదని మరెవరేనా అనుకోవాలిగాని, నే నెల్లాగండీ అనుకోడం? దేవుడోయ్! మీచేతిమంత్రం మీమొహం లానే ఉండం డోయ్!

సు—చూశావోయ్, చిక్కేశ్వర్రావ్! నేను కూడా, చింతామణికిమల్లే, ఊరికే ఒక ordinary నోటిమంత్రగాణ్ణి అనుకున్నది, ఈమె. Impress upon her that I am a medallist mesmerist of uncommon talents.

చిం—బాగుందిరోయ్! నీవు వచ్చిన పాటు మెస్మెరిజమ్ని తిట్టుకోక, నేను మరిచిపోయిన తుంచిమంత్రాన్ని తిడతావేం?

సు—(చేతులు గబగబా pass చేసి) ఈమాటు పోయిందా లేదా?

శాం—ఏం పోడమండీ, మీశార్థమూ నాశార్థమూనూ! (అని మూలుగుతుంది).

సు—"శార్థం,"—That's the word. Annual ceremony! Not at all befitting an ameteur mesmerist. Well, Master Chick, I shall withdraw. ఇదేనా manners! బాగు బాగు!

చి—కాదు, పిన్నీ. ఈయన, బాగా ఇంగ్లీషు దమవుతున్న మంత్రిగాడూ! ఇంగ్లీషుని చెప్పి పూర్తిగానే పోలేందిగాని, విలకడగా పోతుంది. చెప్పి ఛటుక్కున పోకపోతే, తిట్టకూడదు. ఏమన్నా అనుకుంటారు, ఆయన!

శాం—అనుకుని ఏంచెయ్యగలడబ్బాయి, నీపిండాకుడూ నాపిండాకుడూనూ! అబ్బబ్బ! తీసుకుపోరా! దేవుడా! బతకన్రా!

చిం—పోనీ, నేను తెలుగుమంత్రం వెయ్యనాండి, జ్ఞాపకం చేసుకుని?

శాం—వాడి ఇంగ్లీషుమంత్రం ఇంత రేపిసింది, ఇహాను నీ తెలుగుమంత్రం ఏడుస్తుంది! పైగా, నువ్వు జ్ఞాపకం చేసుకునే దేమిటి, ఇప్పుడు వేసే దేమిటి? నీమొహం నామొహమూను! చంపుకుపోరోయ్! దేవుడోయ్! పీకెక్కడ రక్షిస్తావ్రోయ్!

సు—డాక్టర్ని మీకై వచ్చావు కాట్రోయ్?

చి—మనిషిని చూడండీ కీళ్లదన్నాడ్రా. ఇంకో చోట కొల్లొస్తా మందు, పిన్నీ!

శాం—మంత్రాలు పండేశాయి, ఇహాను మందులు పనిచేస్తాయి! నీమొహం పెట్టుకు నువ్వు బయలుదేరితే, నిప్పైనా పుట్టదు. దేవుడోయ్, దేవుడా!

(చింతామణీ, సుబ్రహ్మణ్యం, చిక్కేశ్వర్రావూ ముందరివాకిట్లోకి వస్తారు.)

సు—Well, Chickeswara Rao, మన ఉద్యోగంవిషయం future programme గూర్చి?

చి—అబ్బా! ఇప్పుడేమిటోయ్! ప్రొగ్రామ్ అంటావు!

సు—సరిపోయింది. లేలుగూర్చి నువ్వు ఇంకా రేమి చెయ్యగలవోయ్! అక్కడికీ చిన్నదగ్గజంవంటి mesmerist ని తీసుకొస్తే, ఆమె తృణీకరించి పారేసి, మంత్రం వెయ్యనీదాయిరి!

చిం—ఆవిడతో లెందుకు, నువ్వు మంత్రం వెయ్యాలిగాని?

సు—Nothing is possible without co-operation. ఆవిడ అంత విముఖత్వం కనపరుస్తూంటే ఎటుల mesmerise చేయుట?

చి—అల్లాయితే, ఏమీ అక్కర్లే దంటావా, ఇహాను?

సు—ఏమీ అక్కర్లేదు. Natural remedy is the king of remedies. మొండిగా తీరుకుంటే నేగాని చాలారోగాలు కుదరవు. మన ప్రోగ్రాంవిషయంలో, మనం అబద్ధంసాక్ష్యాలు చెబితే డబ్బు దొరక దంటావా?

చి—దొరుకుతుందిగానీ, ప్లీడరు ఓటి నూరిపోస్తాడు, మనకోటిచెప్పాలని ఉంటుంది, అవతల లాయరు మరోటి అనుకుంటాడు, జడ్జీ ఇంకోటి అర్థంచేసుకుంటాడు, మనం వేరే ఓటి చెబుతాం, నిజం ఇవేవీ కాదు. మనస్సు చంపుకోవాలి రా!

చి—అందుకేనూ, పైగా, ఈకాలంలో file గుప్పెడు, bar బారెడు అయింది. అర్జనమాట అటుంచి, సార్థకంగా పౌరుడు అవడానికి 'లా' చదవవలసి చదివేస్తున్నారు! సాక్ష్యాలు మనకి మిగలవ్.

సు—పోనీ, బ్రాహ్మణార్థాలకి చిన్న limited company పెట్టి పనిజేస్తే!

చి—బాగానే ఉంటుంది.

సు—బాగుబాగు. కాని, గొప్పచిక్కు ఓటి ఉంది. భోజనంచెయ్యడ మనేది ఒక art. కొందరు కొందరు తిన్న విస్తరి శేసి చూస్తే, అది వేసిందో, తీసేసేదో తెలియదు. అట్టి art of eating కొన్నాళ్లు అభ్యసించి నేర్చాలి. ఇంగ్లీషు వచ్చినవాళ్లు మామూలుగా బాగా భోంచెయ్యలేరు, ఉదాత్తమై కాస్త కక్కుర్తి ఉంటే తద్దినానికి once more కొట్టాలి. Hence, ఇంగ్లీషు చదివినవాళ్లు బ్రాహ్మణార్థాలకి exactly unfit.

చిం—అవున్రా. మనం కాఫీ,చచ్చినా మానలేం. పుచ్చుగునే బ్రాపతు అని తెలిసిపోతే!

చి—ఫర్వా లేదుట్రా. ప్రస్తుతం తద్దివాళ్లో, కాఫీ కిల్లీలు పొడుంవగూ చుట్టనతూగా పట్టింపు అక్కర్లేకుండా వాడమ్మట.

సు—ఒరేయి, మణీ! ఏఇలాకావాడూ నీదర ఖాస్తు అందింది అనేనా రాయలేదుకదా, చివరికి రైల్వేడిపార్టుమెంటుకిగూడా నువ్వు అక్కర్లేదు గనక, పోనీ, నువ్వు మేష్టరీ ట్రైనింగులో సర్దుకోకూడదూ, మళ్లీ చదవకపోతేనూ!

చిం—నువ్వూ ఆక్షేపణ ఎందుకురా? ఇతర ఉద్యోగంలేక కవిత్వం మొదలెట్టి, కవిత్వం చెప్పలేక విమర్శనలో పడ్డవాడవు!

["సా......ర్" అనే దీర్ఘమైన కేకతో ఓ ఉత్తరం ముందరవాకిట్లో పడుతుంది.]

చి—(అది తీసుకుని) మా father కిరా. (ఉత్తరం పైవేపు చూసి) "తుమ్మపిల్లి"—మా sisterగారి ఊర్నించిరా. (అని లోపల చదవడానికి ఉత్తరం తిప్పుతాడు).

సు—మన కెందుకు? వాడి కియ్యరా! ఒరేయి మణీ! Please read the contents. నీ optional తెలుగు! మేము ఆ optional తీసుకోకపోవటం, కొంత inconvenience కలుగుతోంది, ఒకొక్కప్పుడు!

చిం—(చదువును) "తుమ్మపిల్లి. రుధిరోద్గారి సం. శ్రావణ బహుళ తదియా బుధవారం. బ్రహ్మశ్రీ ములగా భాగయ్య భావగారికి, పొన్నాడ గంగాధరం కృతానేకనమస్కారములు—త."—

సు—That is 'తరువాత'—Read on please.

చిం—(చదువును) "మేము కొంతదూరముదాక బాగుగనే వచ్చినాము. సగముదారిలో బండి బోల్తా కొట్టి మురుగుకాలవలో పడిపోయినది."

చి—అరెరె, దిక్కుమాలి మురుక్కాలువ!

చిం—(చదువును) "కాని, ఈత రక్షించినది."

సు—ఆయన బాగా ఈత్తాడుగావును!

చిం—"ఈత" అనేదాల్లో అరసున్న లేకపోడంవల్ల ఈదడం అర్థంకాదులే మరి. ఈతచెట్టు అన్నమాట.

సు—ఉన్నమతికూడా పోతోందిగానీ చదువ్!

చిం—(చదువును) "వచ్చిన దగ్గరనుండియు,అసలు బాగుండలేదు. ఈమధ్య మీపిల్లకి జ్వరము వచ్చి పోయినది. వచ్చి, చూసి వెళ్లండి.—విధేయుడు పొన్నాడ గంగాధరం."

సు—Startling ! Call your mother.

(చిక్కేశ్వర్రావు 'పిన్నీ' అని పిలుస్తాడు.
కాంతమ్మ వస్తుంది.)

కాం—(మూలుగుతూ)-ఏం కొంప మునిగిందీ, గావుకే కెట్టావు?

చిం—వియ్యంకుడుగారి దగ్గిర్నించి ఉత్తర మొచ్చిందండీ!

శాం—చదువు నాయనా, చదువు, నే అను కున్నా!

చిం—(మొదటినించీ చదివి) - "దారిలో బండీ బోల్తాకొట్టి మురుగుకాలవలో పడిపోయినది."

శాం—అయ్యో, అయ్యో, ఏం పాపిష్టిసావేఁ! "మురుగుకాలవ" కాదు నాయనా! "మురుగు" నాయన, కాలవలో పడి తగలడిపోయింది.

చిం—నిజమేనండోయి! మురుగు అని శకట రేఫ ఉంటేనూ కుళ్లు అర్థం. ఇందులో రాసింది అది కాదు, సాధురేఫే. సాధురేఫంటే అర్థం చేతికి పెట్టు కునే అలంకారమే. అవును. పోయింది మురుగే!

సు—ప్రస్తుతం బండీవిషయం గనక, ఇదే బండి 'ర'అని నా hope.

శాం—అఘోరించావులేవోయ్! అదికాదోయ్! నువ్వెరిగవ్! దానికి వస్తువులు పారేసుగోడం ఉన్నదే. నే ఎరుగుదు.

సు—ఆమాట ఉత్తరం రాకముందు మీరు చెప్ప లేదేం మరి!

శాం—మొగాళ్లు అపవర్థపురకం అయినప్పుడు ఆడ దింతకన్న ఏం జేస్తుంది?

సు—Abusing the male sex! Odd!

శాం—అక్కడికీ, నేను, దానికి, చెయించద్దు, చెయించద్దు, అని మొత్తుకున్నా. విన్నారా, విన్నారా- (తనలో) నాకు చెయింపనందుకు రోగం కుదర్చాను.

చిం—(చదువును) "కాని, ఈత రక్షించినది. వచ్చినదగ్గిరనుండియును, అసలు బాగుండలేదు. ఈమధ్య మీపిల్లకి జ్వరము వచ్చి పోయినది."

శాం—(కళ్ల నీళ్లు పెట్టుగుని) మాపిల్లే! మాపిల్లే! ఎల్లాంటిపిల్ల! ఎల్లాంటిపిల్ల! అది బతకదని నేను అప్పుడే అనుకున్నానండోయ్! మంచివాళ్లు బతకరుట, మంచిగా ఉండకే అమ్మ అంటే వింది కాదండోయ్! బంగార బ్బొమ్మ, కుందనం. ఒచ్చా ఒరమూ లేదు. కూర్చొండి తే ఒక్కత్తెకే సరిపోయేది, బతుకుతుందా!

చిం—మీరు పొరబడుతున్నారు. "పిల్లకి"- షష్ఠీవిభక్తి. "జ్వరము"-ప్రథమావిభక్తి. జ్వరమే కర్త. పోయింది జ్వరమే గాని పిల్ల కాదు.

చి—పోయింది జరమేట పిన్నీ. మణికి తెలుగు గొప్పగా వచ్చును. వ్యాకరణప్రకారం అంటేట.

శాం—కుర్రవాగమ్మలు, మీరు ఇంగ్లీషునిబట్టి అనుకుంటున్నారుగావును, మీకేం తెలుసునోయ్! స్నానం చేద్దాం పదవోయ్!

చిం—తొందరపడకం దమ్మా. నిజంగా చని పోవడమే జరిగిఉంటే, "స్వర్గస్థురాలయ్యెను" అనో, "మమ్ములను దిగవిడిచి చనిరెను" అనో వ్రాస్తారు.

శాం—(ఏడుపుకంఠంతో) ఆడసంగతులు పైసలు చెయ్యడం మొగాడివల్ల కాదయ్యా నాయనా! ఇంకా చదువు. ఇంకా ఎవరు పోయారో! మళ్లీ స్నానం చెయ్యాలి.

చిం—(చివరదాకా చదువుతాడు.)

(శాంతమ్మ నిష్క్రమిస్తుంది).

సు—ఈవిడకి పాపం ఎంత feelingరా? నిజం ఎల్లా తేలడం?

చిం—"పిల్లకి" షష్ఠీవిభక్తిరా!

సు—మళ్లీ, ఎక్కడో చదువులాగ, ఊరికే, "షష్ఠీవిభక్తి" "షష్ఠీవిభక్తి" అంటా వేమిటి? ఎవడి క్కావాలి, ఆషష్ఠి? అసలు పంచప్రాణాలూ పోయిం తరవాత నీషష్ఠీవిభక్తి ఎవడిక్కావాలిరా, yuor షష్ఠీ విభక్తి?

[భాగయ్యా ఘంటయ్యా, పిక్కిగుమ్మందగ్గిరికి వచ్చి, లోపల జరిగే మాటలు ఆలకిస్తారు]

సు—Anyhow, మీనాన్న రావాలిరా, your father should come!

భా—చూశావా? ఆకుబ్బిగా డిక్కడే ఉన్నా డు. నాన్న ఫాదరీమతం అంటున్నాడు వింటూన్నావా?

సు—That will adjust itself soon. సరే కాని, మన future programme సంగతిలో!

చి—అబ్బబ్బా! చచ్చేటప్పుడు సంధిమంత్రం అన్నట్టు, వ్యాపారం చావు బతుకులుమీ దుందిగదా, ఇప్పుడూ ఉద్యోగంగొడవేట్రా!(అని దిగాలుపడతాడు.)

ఘం—మీవాడు చావూబతుకూ అంటున్నా డేమిటి?

సు—బాగుబాగు. Even after death, మన ఉద్యోగంసంగతి తేలద్దూ మరి!

భా—చూశావా? నేను లేకుండా చూసి మావా ళ్లంటున్నాడు ఆమాట. లోపలికెళ్లి తాళవడా ఆవవడా వాయిద్దాం పదూ.

ఘం—ఉండవయ్యా! కోప్పడకు. ఆనందించు. నీమూలేగా అదీ దాంతో నిన్నే స్మరిస్తున్నాడు.

సు—పోనీ, మనం ఏదేనా Business పెడితే?

చిం—అవునురా. బాగుపడ్డా సరే, దివాలా తీసినా సరే గాని, చేస్తే బిజినెస్సే చెయ్యాలి. పనికేస్తే ఉండేలాభం మరోదాల్లో బుర్రపోతే లేదు.

భా—అంతే మరి. విన్నావా? ఘంటయ్యా! వీళ్ల పనిచెయ్యడం మొదలెడతార్ష! విన్నావా? క్షౌరాలు.

ఘం—ఊరుకోవయ్యా, ఉండూ.

సు—పోనీ, కేవల నాటకకంపెనీ కాకుండా, సినీమాతో మిళితంచేసి స్టేజీపెడితే?

భా—హోరి మీయెత్తులు తగలెయ్యా! మంచి పోతుల్లా ఉండి, వీళ్లకి ఎనీమా పెట్టడం రోగమేమో! లోపలికెడదాం, రా, ఘంటయ్యా!

[భాగయ్య, ఘంటయ్య మందరివాకిట్లోకి వస్తారు.]

భా—అబ్బాయి! అల్లా దిగాలుపడి ఉన్నావేం? వెధవల్ని అందర్నీ ఎందుకూ, తీసుకురావడం మనింటికి?

చి—బాగానే ఉంది.

భా—ఛీ! నోరుముయ్.

చి—అదేమిటి నాన్నా! పిన్నికి తేలు కుడితే మెస్మరిజమ్ చెయ్యడానికి తీసుకొచ్చాను! తప్పా!

భా—తే లెవరికిరా? తేలు కుడితే మిస్మరిజాలా జన మేమిట్రా? అప్రయోజకపు కుంకల్లారా?

[లోపలినించి, 'దేవుడోయి, దేవుడా' అని ఏడుస్తూ కాంతమ్మ వస్తుంది.]

భా—అదేం ఏడుపు! దరిద్రగొట్టేడుపు! తేలు కుడితేమాత్రం? గడ్డకట్టేవాళ్లలే కేడుస్తున్నావ్ మరీను!

కాం—బాగానే ఉంది. మీకేం తెలుసునండీ నాబాధ? ప్రతీదానికీ బాగానే ఉం దిదీ!

భా—అదే, నే వొద్దన్నమాట! నాకుతెలియక పోవ డేమిటి? నీమొహం! పింజారీయేడుపూ నువ్వూను! నీయిష్టం వచ్చిన ట్లేడవడ మేం? ఇల్లాంటి ఏడుపు మొగుడు చస్తే యేడుస్తారు. మాన్తావా మానవా?

కాం—ఎల్లాగండీ, మానడమూ? చావడంమాత్రం మనవశముటండీ! ఇప్పుడు మనఅమ్మాయిసంగతి యే మయిందండీ?

భా—అమ్మాయిసంగతి యేమవడ మేమిటే, నింపగ,లేయ్యా!

కాం—ఉత్తరం వచ్చింది చూడండీ, మీమొహం మండా!

భా—అందులో ఏముందేవు, నీమొహం కాల్చా!

కాం—ఆఅబ్బాయిని చదవమనండీ, మీమొహం ఇదైపోనూ! బాగా వొచ్చింది నాకూ!

భా—మళ్లీ ఆకూతెందుకే నిన్ను గోతులో పెట్టా! ఘంటయ్యా, నే బతకనోయ్! కన్నకొడుకు శత్రుపక్షం వాదించేవా డయాడు. పుస్తెకట్టిన పెళ్లాం మేకైంది. చదవరా అబ్బాయి!

చిం—(చదువును) "తుమ్మపిల్లి. రుధిరోద్గారి సం. శ్రావణ బహుళ తదియా బుధవారం. బ్రహ్మశ్రీ ముల గా భాగయ్య భావగారికి, పోన్నాడ గంగాధరం కృతా అనేకనమస్కారములు. తః॥"

ఘం—కానీవోయ్, నాన్నకా!

చిం—ఉండండీ! అంతా వినగల్రు గాని అంతా చదవలేరు. "మేము కొంతదూరముదాక బాగుగనే వచ్చినాము."

భా—ఆరి, వీణ్ణి వరికెయ్యా! వియ్యంకుడు బెంగ వకే తెలిసిందిగావును. వాడికీ ఇదే మాట. పూటకి టికా ణా లేదు. నెత్తిమీద రూపాయెట్టి అమ్మజూపితే దమ్మిడీకేనా కొనకపోవడం అటువంటి బేరమేనా ఆడ్రదు వీణ్ణి! తాళికట్టకుండా నన్ను.........

సు—(నవ్వుతాడు).

చిం—(కూడా నవ్వుతాడు).

భా—ఈ తరం చదవమంటే నవ్వు లేమిట్రా, అపాత్రపు వెధవల్లాలా? వీా కప్పుడు నవ్వడమో, ఎప్పుడేడవడమో కూడా తెలియదేం?

చిం—(తక్కినదంతా గబగబా చదివేసి)—“వీా పిల్లకి జ్వరమువచ్చి పోయినది.”

భా—(గుండె బాదుకుంటూ) హాయ్యో!హాయ్యో! ఎంతమాట విన్నాన్రా! ఎంతమాట చదివావురా, నీ వసుప్రతుకులడా! ఇదేమిటోయ్! ఘంటయ్యా! నువ్వు వెళ్లి వచ్చావవ్!

ఘం—నే వక్కణ్ణించి నిన్న నొచ్చాను. ఉత్తరం వ్రాసింది వాలుగుర్రోజుల్రకితం, ఎందేతోగాని ఆలస్యంగా అందింది. నిన్న వీావియ్యంపుణ్ణిమూశాను. అంతా బాగున్నారు. ఫర్వా లేదు...కాంతమ్మగారూ! వీాకు తేలుకుడతా ఎక్కడా?

కాం—వేలు వీాదండి!

ఘం—అంటే కుట్టినఫలం!

కాం—వేలేనండి.

ఘం—కట్టిపెట్టవమ్మా నీఅమానుషత్వం! చేర్పు దపోయావు మరీను! ఇంట్లోనా, దొడ్లోనా, ఇంకోళ్లింట్లోనా, ఎక్కడని.

కాం—పరమటింటో గూట్లో!

ఘం—మళ్లీ ఓమాటు చూసొద్దాం రండి. చిక్కన్నా, రా.

[ఘంటయ్యా, చిక్కన్నరావూ, కాంతమ్మా వెడతారు.]

భా—ఉత్తరమేనా, చదవలేరునాయన్లు! గోరోజనాలకి లోట్లేదు, మళ్లీ!

సు—Crack లాగ prattle చెయ్యక, stone లాగ ఊరుకో, illiterate beast.

భా—ఏడిశావు. యంబ్రహ్మో! తిడతావుట్రా, జాతిభావులో!

సు—ఊరుకుంటావా లేదా, scoundrel! I will bisect you.

భా—పోరా, నమ్మరంతిగా! శేఖ్యం!

సు—పోరా, rogue ఎట్సెట్రాగా!

భా—పోరా లుచ్ఛా! శ్రీయాళపకోడీ! వియపరాలకిడీ!

సు—నీసంస్కృతం మాని తెలుగుని తిట్టూ, ఎంచేస్తానో!

భా—నీ ఇంగ్లీషు మాని తెలుగుని తిట్టూ, ఎంచేస్తానో!

చిం—ఉండండిరోయి! అప్పతెనుగున తిట్టుకుంటే, అసలు తెలియదు, మిశ్రమాన్నే తిట్టుకోండిరోయ్!

భా—రా! (అని పంచికట్టు దోపుకుంటాడు.)

సు—నువ్వురా!(అని చొక్కాఎగఫందోస్తాడు.)

భా—(ఎల్లానూ రాడుగదా అని) ముందు నువ్వు రా!

సు—ఇదిగో వచ్చాను. ఎంచేస్తావో చెయ్యి (అని వస్తాడు.)

భా—(వాడు తీరా వచ్చింతరవాత) సిగ్గ లేకపోతే సరి, ఇల్లాంటివాళ్లని ఏమిటి అనడం?

సు—కొట్టరా మరి చూస్తాను.

భా—నీబతు కెట్టుగుని నువ్వు కొట్టూ!

సు—కొట్టేమిటి, బియ్యపుకొట్టు.

[ఘంటయ్య వగైరా లోపలనించి వస్తారు.]

ఘం—బియ్యపుకొట్టుకాదు, మరమరాలకొట్టు. మరమరాలు బియ్యానికి సరికి సరి ఇస్తారు. తినడానికేం, మరమరాలు మా బాగుంటాయి.

సు—(కోపంతో చూస్తాడు.)

చిం—(సుబ్రహ్మణ్యం చెవులో) మనకి ఆ మరాభ్యంతరాలు లేవు గనక......

సు—ఊరుకో! Idiot.

చిం—తల్లకిందులైం దేమిటి?

చి—తల్లకిందులంటే జ్ఞాపకం వచ్చింది. ఓ ఆయన మరా, మరా, మరా అంటూ జపంచేసి, రామభక్తుడై మోక్షం పొందాడట.

సు—నువ్వుకూడా్రనా! ఛీ! You too!

ఘం—సుబ్బన్న ఇంగ్లీషు మంత్ర తంత్రాలు నేర్చాడు. యంత్రాలుకూడా నేరిస్తే, ఇక "యంత్ర యంత్రాల సుబ్రహ్మణ్యం" అనాలి.

సు—యంత్రం ఏమిటిరా, your face, your head, నీపిండాకుడు, your food-ball! Oh! They must be roasted! They must be written kerosine oil and then set fire to. They must be put on the kashtam—so to speak.—Puppies and curs without originality... (అంటూ నిష్క్రమిస్తాడు.)

చిం—అదేమిట్రా, అదేమిట్రా! నే చెప్పలా? పన్నడం యుగం, బయటపడ్డం క్షణం.

(అంటూ గబగబా వాడివెనకాల వెడతాడు.)

భా—వీడి ఇంగ్లీషుకోపం కూడా తెలుగుకోపం లానే ఊరుకుండేం, చాలాభాగం!.........కనపడిం దిటోయ్? తేలూ? ఈతేనుకు ఆకాస్తఏడుపూకుడా లేదేం? ఇప్పుడు?

ఘం—చూసొచ్చాం. తేలూ లేదు, గీలూ లేదు. కండచీమ.

భా—వోర్రి కండచీమకి, నీయేడుపు మానిపోను, యేం ఏడు పేడిచావే! నాటకంలో వేషంలాగా? నాటకాల్లో ఆడవాళ్లుకూడా వేషా లేస్తే, నిజానికీ అబద్ధానికీ తేడా, ఇప్పటిమాత్రం తెలియకుండా పోతుంది గావును. నవ్వు నవ్వూ కాదు, ఏడుపు ఏడుపూ కాదు, ఏదీ అది కాదు. మరి దయచెయ్! ఇక్కడ మొగాళ్లు!

కాం—అల్లానే. మొగాళ్లు బాగుపడేవరకూ, ఆడది గుట్టుగానే ఉండాలి. గత్యంతరం లేదు. వెడుతున్నా. (వెళ్లిపోతుంది.)

చి—ఘంటయ్యగారూ, ఏమి టీనాటకం? నవ్వు లల్లా పువ్వులయాయి!

ఘం—ఏముందీ! అల్లానే అవుతాయి సాధారణంగా. మీనాన్నకి నువ్విచ్చినకోటు తొడుక్కోడంచేత గాక తిట్టిలుగా తొడుక్కున్నాట్ట. అందుకోసం, 'బాగు బాగు' అన్నారట ఒకజ్ఞాని, ఆదిని. అజ్ఞానాన్ని నాశ కోశం చెయ్యడానికే కొందరు తమజ్ఞానం ఉపయోగించేది. అంతేగాని అజ్ఞాన్ని జ్ఞానులుగా చేతామని కాదు. మన్లో, లాభం లేని వ్యాపారాల్లో, ఒక దేమన్నా అంటే అంతా అదే గాని, మరోటి లేదు. సుబ్రహ్మణ్యం ఆఎంగిలిమాటతో తమఓకథానాయకుడుఅవుదామని వచ్చాడు. ఏంకార్యం! తనసంగతి వచ్చేటప్పటికి-అదీ ఏంలేదు మళ్లీ-ఎక్కడలేని క్రోధరసం చూపెట్టాడు. తను ఇతరుల్ని అంటే, తమాషాట. తన్ని అంటే ఇతరులు, ఈర్ష్యట. ఇదిట న్యాయం. సరి, స్వయంగా దెబ్బ తిని ఇప్పుడు గ్రహించాడు. స్వయంగా దెబ్బ తిన్నతరవాత, మనిషిదాకా ఎందుకు? పశువే గ్రహిస్తుంది! మనిషైతే, దెబ్బ తిని కాదు, తినే గ్రహించాలి.

చి—(తల పైకీ కిందికీ ఊపుతూ) ఉఁహూఁ, అందుకా! నాచేత లేనిపోని సంగతులు సకలమైనవీ వాగించి, బాగుబాగని అనుకుంటూ అన్నిమాట్లు నవ్వుకున్నారు! అడిగినా చెప్పకుండానూ! ఓ! అదే మనం కోరేది. మన్ని చూసి నవ్వుకుని, ఆనందపడిపోయే జనం ఉంటూన్నప్పుడు మనం ధన్యులం. కాని,ఎల్లా మానాడో, మానాన్న కోపం వదులుకున్నాడు, దాన్ని M. S. మన్యం అందుకున్నాడు. Perhaps, Nickname is after all a Transferred Epithet!!!

[అంతా నిష్క్రమిస్తారు. తెర.]





# నేఁటితోఁ దీరె భ్రమలు

పూడిపెద్ది వెంకటరమణయ్య గారు

పద్మరేఖలుగల పాద పద్మయుగము
జాడ లీనేల నర్మిలిఁ జాటికొనుచుఁ
గానవచ్చెడి! మోహనాకార! నేను
బేలనై కూర్కులేకయు వేచియుంటి!

* * * *

అకట! నడురేయిఁ జుక్కల యదటులోనఁ
గమ్మతెమ్మెర కెరటాల కలఁతలోన
వెడఁగు వెన్నెల వేఁడిమి వెతలలోన
నెట్లు వేగించితో గ్రహియింపఁ జాల!

* * * *

చీమ చిటుకన్న నీయడుగేమొ యనుచుఁ
జెవికొలందిని వింటి నిశ్చేష్ట నగుచుఁ
గాని నీచడిఁగనిపెట్టి కాంచనైతి!
పిరికి గుండియ నీవచ్చువేళలోన
దడదడఁ జలించి యన్యశబ్దముల నెల్ల
మాటుపఱచెను గాఁబోలు మాన్యచరిత!

* * * *

జాగిలముఁ బోలి నీమేని చందనంపుఁ
గమ్మవాసనఁ బసిపట్టఁగాఁ దలంచి
యన్ని దెసలను వచ్చు మందానిలంబు
దీక్షమై పీల్చియును భవదీయ లీలఁ
బోల్పనైతిని! నీవచ్చు ప్రొద్దులోన
పాడునిట్టూర్పు లడ్డమై పఱచెఁ బోలు!

* * * *

రెప్పవేయక త్రోవలఁ దప్పకుండ
మొగము నిండినకనులతో ముద్దుకృష్ణ!
కాచికొని యుండియును నినుఁ గాంచనైతి!
సమయమున కడ్డువచ్చె బాష్పములు వోలు!

* * * *

అంత దవ్వున నీకౌఁగిలింత సుఖము
నెఱిఁగి గోపాల! నీవచ్చు టెఱుఁగ నెంచి
నాదు నెమ్మేని నట్టిధ్యానమున నిల్పి
తెలియనైతిని! నీరాక తెన్ను లవము!
'ఇదియె తెరి' యని యావేళ కెగసి మొగసి
యలమికొనెఁబోలు మెయిఁబుల కాంకురములు!

* * * *

నిత్యమవశంబులయిన యింద్రియము లొకటఁ
గూర్పుమని దేహమును నమ్మఁగూడ దనుచు
శాస్త్రములు చెప్ప నామేలి చదువు తేట
తెల్లమయ్యెను నేఁటితోఁ దీరె భ్రమలు!

— రాగిక.



# నాదేశాటనం డైరి

దువ్వూరి రామిరెడ్డి గారు

ఈ డైరీని ప్రకటింపవలసిన యక్కఱనుగుఱించి కొన్నిమాటలు ఉపోద్ఘాత ప్రాయముగ చెప్పవలసి యున్నది. చిరకాలమునాడు దేశసంచారము చేయుటకై పోయియుండిన నాబాల్యమిత్రుడు రాఘవశాస్త్రి మొన్ననే యొకయుత్తరము వ్రాసెను.

ఆయుత్తరమును చదివిన వెంటనే ప్రవాసమునుండివచ్చిన మిత్రుని చూచినంత సంతోషమదయించెను. ఈజాబుచేరిన మఱునాడు రిజిస్టరు పోస్టుద్వారా పంపబడిన నోటుబుక్కు కూడ నాకు చేరెను. పాఠకులకు ఉత్తరములోని విషయములు తెలియుటకొఱకు దానినిచ్చట పొందుపఱచితిని:

ప్రియమిత్రుడా:—

ఇంతకాలంవఱకు నీకు ఉత్తరము వ్రాయకుండా ఉండినందుకు మన్నించవలసిందని హృదయపూర్వకంగా వేడుకొంటున్నాను. రయిలుమార్గంగా యాత్రచేయవలసిందని మొట్టమొదట అనుకొన్నానుగాని, అదినాకు ఇష్టంలేకనైతేనేమి, ద్రవ్యాభావంచేతనైతేనేమి, తుదకు కాలిమార్గంగా యాత్రచేస్తున్నాను. ఈమధ్య నాకు జ్వరబాధచేత శరీరం అస్వస్థంగా వుండి ఈవూరి ఆసుపత్రిలో వారం దినములనుండి మంచం కరుచుకొని వున్నాను. ఈవిషయం మాయింట్లో చెప్పవద్దు.— నాకేమైన అపాయం సంభవిస్తే నా డైరి అన్యాక్రాంతం అవుతుందనే భయంచేత నీకు పంపుతున్నాను. నీకంటె నాకు ప్రియమిత్రులు లేరు. నా డైరీలో సారస్వతవిషయాలు, నాటకవిషయాలు, చిల్లర పాలిటిక్సు, ఇంకా ఏమేమొ వ్రాసిపెట్టియున్నవి. అవి అన్నీ ప్రకటింపవలె ననుకొంటె అనంతరంగంపిళ్లె డైరీకంటె పెద్దదవుతుంది. కాబట్టి ముఖ్యమైన విషయాలుమాత్రం ప్రకటింపవలసింది. దీనితోకూడా నా జీవితచరిత్రం లంకించినాను. ఆత్మక ప్రాయంగా జీవితచరిత్రం వ్రాయవలెనుకొన్నాను గాని కవిని కానందువల్లనూ, లేనిదాన్ని సృష్టించడం నాచేత కాని దానివల్లనూ తుదకు ఉండినది ఉండినట్లె వ్రాయవలసివచ్చింది. ఈలోపాన్ని మన్నించవలసింది. ఇప్పటికే పెద్దజాబు వ్రాసి విసుగు పుట్టించినాను. ఒక్కమాట! మాతల్లిదండ్రులు, మామగారు, నాభార్య యేలాగా వుందో కూడా నాకు వుత్తరం వ్రాయవలసింది. నేను మళ్లీ యెప్పుడు వస్తానో ముందుగా చెప్పలేను.

ప్రియమిత్రుడు, రాఘవశాస్త్రి.

మొట్టమొదట అతని జీవిత చరిత్రమును ప్రకటించి తర్వాత నాతీజీక ననుసరించి డైరీలోని విషయములను క్రమక్రమముగా ప్రకటించెదను.

## జీవితచరిత్ర

అసలు నా డైరీని ప్రచురించడానికి పూర్వం నా సొంతచరిత్రంగూడా వ్రాసి డైరీకి అనుబంధంగా లంకించమని నాస్నేహితులకొందరి అభిప్రాయం. "నాస్నేహి

కులు" అని అనడంతోనే మీకు అనుమానం కలగడానికి యేలాటి అభ్యంతరమూ లేదు. "నాగ్రంథమును దిలకించి భాషాభిమానులైన నాప్రియస్నేహితులు కొందఱు దీనిని ప్రచురించుమని నన్ను పదేపదే కోరినందువలన వారిమాటలకు మాఱాడలేక యీచిన్ని కావ్యమును మీకందించుటకు సాహసించితిని." అని పీఠికల్లో వ్రాసుకోవడం పోతన్న స్వప్నవృత్తాంతంలాగా చాలామంది గ్రంథకర్తలకి ఆచారమైంది కాబట్టి నాస్నేహితులుకూడా కవిసమయంలో అవతరించిన ఊహామూర్తులని మీరు భ్రమపడవద్దు. నేను వ్రాసేది కావ్యంకాదు గనుక అలాటిసందేహాలు కలగనవసరంలేదు.

డైరీలో విషయాలకి గౌరవం కలిగించడానికి వ్రాసిన పెద్దమనిషి జీవితవృత్తాంతంకూడ కొంచెం తెలిసివుండడం భావ్యమని నామిత్రుల నమ్మకం. ఒకవేళ నావుద్దేశంకూడాను. ఎవరికైనా వొకగ్రంథం పట్టుకెళ్లియిస్తే ముందుగా గ్రంథకర్తపేరు, అచ్చాఫీసుపేరు, ఉపోద్ఘాతం వ్రాసిన పండితుడిపేరు, అభిప్రాయాలిచ్చిన గొప్ప మనుష్యులపేర్లు చూచుకొని తర్వాత పుస్తకం వెలగమనించి ముందుగా గ్రంథంపైన తమ అభిప్రాయం యేర్పరచుకొని అనంతరం చదవడం ప్రారంభిస్తారు. నాకొోప రేషకాలలో కాస్తాకూస్తా తిరిగిన గ్రంథకర్తలు వ్రాసే పుస్తకాల్ని పత్రికలు ఆదరిస్తాయి. కొందరికి గ్రంథం యోగ్యత వెల తీర్మానిస్తుంది. కొందరికి వుపోద్ఘాతం ప్రమాణం. మరికొందరికి అచ్చులోపడ్డనంతా ప్రమాణం. ఈలాటి ఆచారం నాకు తెలియకుండా నాలోనే దాగివున్నదని నాకు సందేహంగూడాను. మాసపత్రికల్లో వచ్చే వ్యాసాలని, పద్యాలని ఆక్రరు పేరు చూచే తోసివేస్తుంటాను. దురాచారాలు చాలాతొందరగా పట్టుబడతాయి. వదలించుకోవడం కనాగష్టం.

ఇంగ్లాండుదేశంలో ఒకరాజ్యాంగ తంత్రవేత్త "If you want to succeed flow with the current good or bad" అని అన్నాడు. నేనుగూడా అలాంటి Easy going philosophers తెగకు సంబంధించినవాణ్ణై కనుక లోకాన్ని ప్రతిఘటించి నిలుచుకోవడం ఇష్టంలేక, ఎట్లయినా సొంతచరిత్రం వొకటి వ్రాసి డైరీకి ఉపోద్ఘాతంమోస్తరుగా అంటింతామని సంకల్పించాను. అందులో మధ్య వొకసందేహం. సొంతచరిత్రం వ్రాస్తే యెక్కడ గొప్పమనిషి నాతానో అనేభయం కూడా పీక్కుతింటుంది. సామాన్యులెవరు తమచరిత్రాలను వ్రాసుకోరు. సామాన్యులెవరు స్వీయచరిత్రాలు వ్రాసుకోరు కాబట్టి వ్రాసుకొన్న వారందరు సామాన్యులు కారు అనే లాజిక్కులో పడ్డాను.

నేను కొంతమంది జీవితచరిత్రాలు చదివినాను. వాటన్నిట్లో సామాన్యంగా వుండేలక్షణాలు కొన్ని అవపడుతవి. తల్లిదండ్రులు బీదవాళ్లుగానో, అనామికులుగానో, అప్రయోజకులుగానో వుంటారు. గొప్పవాడు కాబోయ్యే కుఱ్ఱవాడు స్వయంకృషిచేతనూ, తెలివితేటలచేతనూ అభ్యంతరా లన్నీదాటి తుదకు పొద్దుపొడుపు సూర్యుడిమాదిరిగా ప్రకాశిస్తాడు. నాచరిత్రకూడా ఈమసోదాకు సరిపొయ్యేరకంగా వ్రాయవలసి వుంటుంది అన్నాను. నామిత్రుడు Mind, you are writing for the future అని అన్నాడు. వాడికి ఉత్సాహం కలిగినప్పుడు ఇంగ్లీషుతో మాట్లాడే అలవాటు. త్వరితం కొంచెం తగ్గినప్పుడు ఇంగ్లీషులో చెప్పినదానిని తెలుగులోకి తర్జుమాచేస్తాడు. "writing for the future" అంటె యేమిటి? అని అన్నాను అది Genius యొక్క లక్షణం అని వాడు వాదించాడు. సమకాలీకులు తన్ను తెలిసికోలేరని చెప్పడం, భవిష్యత్ కాలానికిగా వ్రాస్తున్నానని తన్నుతాను వోదార్చుకోవడం Genius లో అంతర్గర్భితమని నామిత్రుడి విశ్వాసం. ఈ గొడవ గద్యం వ్రాసేవారికి పనిలేదని నేను చెప్పినాను. అర్థము స్ఫురింపని పదసమాసాలు గుప్పించే స్వతంత్రకవులు కొందరు భావప్రకటనా సామర్థ్యములేని లోపాన్ని ప్రతిభగా సమర్థించి యితరులను దూషించడమే గాకుండా భవభూతి తెచ్చుకొన్నంత కోపము తెచ్చుకొని "యేనామకే చిదిహనః ప్రథయంత్యవజ్ఞాం" అనే శ్లోకం నమూనా పెట్టుకొని పద్యాలువ్రాస్తారు. కొందరిపట్టుదలలుచూస్తే చిత్రంగావుంటుంది. Present generation నోట్లోమట్టి గడ్డకొట్టాలనే వుద్దేశం మనస్సులో పెట్టుకొని కవిత్వాలల్లుతున్నారు అనిఅన్నాను. నామాటలు నామిత్రుడికి కర్ణకఠోరంగావుండేవి.

నేను—ఒకవేళ నేనుజీవితచరిత్రం ఆదర్శప్రాయంగా వ్రాస్తే నాసంగతి తెలిసినవాళ్లు చూచి నవ్వుతారనుకొంటాను.

మిత్రుడు—నీకేమాత్రం సందేహం వద్దు. ఎవరైనా నాసమకాలికులు కొంచెము హేళనంగా మాట్లాడినప్పటికీ "మానావమానములు దేహంబునకేగాని ఆత్మకు లేవు" అనే పెద్దలవాక్యం చెప్పిన philosopher's breadth of mind తో కొంచెం కోర్చుకొంటె భవిష్యత్ కాలమంతా నీదే అవుతుంది. కాలం ప్రతివాడికీ గౌరవం తెస్తుంది. బ్రతికి నన్నిదినాలు తిట్టిపోస్తుండే అత్తగారు కోడలు చచ్చిపోయినతర్వాత "మాకోడలంత వినయవతి నేను పుట్టిబుద్ధెరిగినాక చూడలే"దని వొట్టుపెట్టుకొంటుంది.

మిత్రుడివాదధోరణి సాగుతవచ్చింది. No greatness with-out sacrifice అని అన్నాడు. ఏసుక్రీస్తు ప్రజలను ఉద్ధరించడానికిగా కొరతబడి దేవుడికొడుకై ప్రతిక్రీస్తుదేవాలయంలో శిలువ అవతారంతో వెలుగుతున్నాడు. నేను మాత్రం మానాన్ని యెందుకు బలియ్యకూడదు. Any sacrifice అని అన్నారు.

అయితే యిందులో నాకొక్క అనుకూలం. ఆదర్శప్రాయమయిన జీవితచరిత్ర వ్రాయడానికి సగము సామగ్రి చేకూరినట్లె. నేను గొప్పమనిషినో కానో అనేవిచారం లోకానికి వదలిపెట్టివేశాను. కాని దైవదత్తంగా మాతల్లిదండ్రులుమాత్రం బీదవాళ్లె. ఉద్యోగం వల్ల జీవనం. ఉద్యోగం అంతపెద్దదికూడా కాదు. తాలూకాకచ్చేరిలో మాతండ్రిగారు Despatching clerk గా నౌకరీచేసి ఆపదవికి చలనంలేకుండా పింఛను పుచ్చుకొన్నారు. మేము యిద్దరము అన్నదమ్ములము. నేను పెద్దవాణ్ణి. చిన్నవాడు థర్డుఫారమువరకు చదివి పరీక్షలదినాల్లో అయ్యవారిపై తిరగబడి సస్పెండయి శుభ్రంగా యిల్లుచేరినాడు. పరీక్షకు పోకపోతే పరువు దక్కుతుందనే వుద్దేశంతో వాడట్లా చేశాడని బడిపిల్లల అభిప్రాయం. అందులో నేనుకూడా యేకీభవించాను.

నాయనగారి నసకొట్లుపడలేక వాడు వంట పాకోశయ్యరుగారి కాఫీహోటలులో నవ్కరికి ప్రవేశించాడు. ఈనౌకరి మాతల్లిగారికి అవమానకరంగా వుండింది. ఈనౌకరీమూలంగా వాడిపైన కసితీర్చుకోవాలని మాతండ్రిగారి పట్టుదల. ఎవరిపుద్దేశాలు ఎట్లాగైతేనేమి వాడికిమాత్రం మంచికాలం. కరిన రెండునెలలు దాకా వాడు అమ్మినదానికంటె రెట్టింపుగా ఫలహారాలు తిన్నాడని హోటలుఅయ్యరు నాతో చాలా విసుగుకొన్నాడు. మంచిమాటలతో సరసపెట్టినాను. మాతమ్ముడు నేననుకొన్నంత తిండిపోతురామన్నగాడు. ఇప్పుడు స్వతంత్రంగా వొక కాఫీహోటలుపెట్టి కర్చులుపోను యిన్నూరురూపాయలు సంపాదించుకొంటూ యేగ్రాడ్యుయేటుకంటె కూడా నెమ్మదిగా సంసారము జరుపుకొంటున్నాడు.

మానాయనగారు Old lower secondry చదివినారు. ఆయన గుమస్తాగిరి చేస్తుండేటప్పుడు పొరుగింటి కామక్షమ్మ "మీయజమానుడు మాజిస్ట్రేటు అవుతాడటే?" అని మాతల్లిని అడిగిందట. ఆమాట దెబ్బతో తల్లోదూరి మళ్లీ బయటికి రాలేదు. నీవెప్పుడు మేజిస్ట్రేటు అవుతావు అని పాప మానుసలాయన్ని ప్రతిదినం పీడిస్తూవుండేది. "మనకెవ్వరిస్తారే మేజిస్ట్రేటు ఉద్యోగం" అని మానాయనగారు ఒక్కొక్కసారి బతిమాలుకొన్నట్లూ ఒక్కొక్కసారి విసుగుకొంటూ కోపగించుకొంటూ చెప్పేవాడు. మాతల్లి నమ్మేదిగాదు. "మీదంతా ప్రతిదీరహస్యమేనండీ" అని నిష్టూరాలాడేది. ఈపరస్పరం వాదప్రతివాదాలతోనే యిరవయినాలుగు సంవత్సరాలు గడచిపోయి మానాయనగారు పింఛను పుచ్చుకొన్నారు. నేను స్కూల్లో చదివేటప్పుడు "అబ్బాయీ, ఒకవేళ మీనాయన గొప్పవుద్యోగాలు చేయకపోయినా నీవైనా బియ్యే ప్యాసయ్యి మేజస్ట్రేటు ఉద్యోగంచేసి నాముచ్చట తీరుస్తావుగదూ" అని నన్ను ముద్దుపెట్టుకొని మాయమ్మ నాకు జోబీనిండా పకనాలుగింజలు పోసేది. ఆమెకు అధికారంపైన కొంచెం ప్రీతి. మాతండ్రిగారికి గొప్పతనంమీద యిష్టంలేక మేజస్ట్రేటు కాకుండాపోయినాడని ఆమె కనుమానం. నేను గొప్పవుద్యోగం చేస్తే చుట్టుపట్టుయిండ్ల ఆడవాళ్లని మజ్జిగతెచ్చిపోసే గొల్లదాన్ని కొంచెంగద్దించి మాట్లాడవచ్చునని ఆమెయిష్టం.

మానాయనగారి యిష్టం వేరే. నన్ను వకీలు వృత్తికి తయారు చేయవలసిందని ఆయన పట్టుదల. నాబియ్యే

చదువుకే చాలాడబ్బు ఖర్చుపడ్డది. మాకుండే రెండెకరాల భూమి అనుమానంలో చిక్కుకొన్నది. మాఅమ్మనగలు కూడా కొన్ని అమ్మివేసి నాచదువుకే అర్పించింది. ఇక నాలియ్యల్ చదువుకు డబ్బెవరిస్తారు? అవిషయం నాకు వదలిపెట్టవోయ్, నే నొకప్లాను వేసినాను అన్నాడు మాతండ్రి. వకీలైతే గౌరవానికి గౌరవం, ధనానికి ధనం Independence కు independence, public life, politics, patriotism హడావుడి తథసం, every blessed nonsense లో ప్రవేశింప వచ్చునని ఆయన తలంపు నాన్నా, యీ కాలంలో ప్లీడరీ వృత్తిలో లాభంలేదు. యింటికి రెండేసి మూడేసి బోర్డులు తగిలించి వుండడమే గాని గ్రాసానికి కూడా జరగడం కనాకష్టం అని నేను జాలిపడ్డాను. ఇదంతా వృత్తఅబద్ధం. మననెల్లూరు జిల్లా పుష్పకవిమానం వంటిది. ఎందరెక్కినా యింకొక్కరికిచోటు వుంటూనే వుంటుంది. ఆహా! Nature లో నూకావా యెంత inter-dependence యెంత compensation! మన జిల్లాలో రెడ్లున్నారు. కల్పతరువులు! పాడియావులు! మనకు దేవుడు తెలివిచ్చినాడు. వాళ్లకి తెలివితక్కువతనం యిచ్చినాడు. గోటితో పొయ్యే దగవును కొండంత చేస్తారు. ఆ-పూ-అంటె పార్టీలు పెట్టుకోవడం, కూనీలు, దొంగసివిలుకేసులు. కష్టపడి సంపాదించిన డబ్బు ప్లీడర్ల కాళ్లముందర పోసి దాసానుదాసులై ప్రవర్తించడం; పెద్దవాళ్లు సంపాదించిన మాగాణిభూములను అడుమానం పెట్టడం; ప్రయివేటుబ్యాంకులలో రెండు రూపాయలకు వడ్డీకి తేవడం; మూడుసంవత్సరాల్లో వడ్డీ అసలంత కావడం; అయ్యాకు లోకం తెలియడం; పశ్చాత్తాపపడడం; వెనుకచింతించుట వెఱ్ఱితనమని స్నేహితులు తమాషాగా వోదార్చడం! ఇట్లాంటి పరిస్థితులలో ప్లీడరీవృత్తి లాభకారి కాదని చెప్పడం బుద్ధిమాంద్యమని మాతండ్రి నొక్కి చెప్పినాడు. ఆయనవుత్సాహాన్ని తొలగించడం కష్టము. ఎట్లా అయితేనేమి నాలియ్యల్ చదువుకు, నావివాహానికి కలసి వచ్చేటట్లు మానాయన ఒకపన్నాగం ఆలోచించాడు.

మాబంధువుల్లో కొంచెం డబ్బుగలిగిన శ్రోత్రియందారు డొకాయన వున్నాడు. వచ్చినమక్తాధాన్యం యింటిఖర్చులకు పెట్టుకొంటూ, యితరుల పనులుచేసి పెడ్తూ సాయంకాలం నాలుగుగంటలయ్యేసరికి గ్రాంట్ సిస్ యూనియన్ రీడింగు రూములో హాజరవుతాడు న్యూసుపేపర్లకి యీయనంత faithful గా వుండేవాని వీని మరెవ్వరిని నేను చూడలేదు. అడ్వర్ టైజ్మెంట్లు పేజీల మొదలుకొని Printed and published by so&so అనేవరకు వోపికతో చదువుతాడు. ఈయనగారు పేపరుతీసుకొంటె సాయంకాలముయేడుఎనిమిదిగంటలవరకు యింకొక్క సభ్యునికి ఆశలేదు. యుద్ధకాలంలో కామయ్యశాస్త్రి అంటె రీడింగురూముకు వచ్చేవారికంతా హడలు. లేటుగా ఆఫీసులకు పొయ్యేవారు, తొందరపని వుండి అవలా బాదలా పొయ్యేవారు కామయశాస్త్రి కనుబడితే దూరంగానేమూడి సందుదారులో జారుకొనే వారు. గ్రహచారంచాలక దొరికితే కనీసపక్షం ఒకగంటైనా నిలవేసి జర్మనుయుద్ధాన్ని గురించి నేవలునడిచిన స్ట్రాటజిక్ పాయింట్లనుగురించి laborious గా వివరించేవాడు. ఎవరూ అడగకపోయినా తానువ్రాస్తుండేయుద్ధ చరిత్రం యింకా పూర్తిగాలేదు ఇంకాకొన్ని అథారిటీసు కావలె అని బలాత్కారంగా ప్రస్తావించేవాడు. ఆయన్నకొంచెము భూషించవలసింది అని అనుకొంటె short-cut వొకటివుంది." యేమండి కామయ్యశాస్త్రిలుగారు మిమ్మల్ని walking encyclopaedia of war news అని రీడింగురూములో అంటుండినారండి" అంటెచాలు.

రీడింగురూము న్యూసుపేపర్లలో కొంతకాలము War news columns బహుచిత్రంగా మాయమైపోతుండేవి. కారణంతెలిసేదిలేదు. Librarian కు కామయ్యశాస్త్రిపై అనుమానం తట్టింది. కొంచెం ముక్కుచాడిపెట్టండి అని హఠాత్తుగా జోబీలో చేయిపెట్టేసరికి రెండు కాలముల రూటరు టెలిగ్రాముల తునకలు దొరికాయి! పాప మాయన బిత్తరపోయాడు. నాయుద్ధచరిత్రంలోకి అథారిటీసుకావాలె అందుకోసం చింపుకొన్నాను అని గౌరవంగానే చెప్పినాడు. నీయుద్ధచరిత్రందొంగలుదోలా, అందరు చదివిందాకానైనా వుండనీయవయ్యా అని అందరూ చీవాట్లు పెట్టినారు.

ఒకతూరి రీడింగురూములో ఆయనకు, చాలాపరాభవంఅయింది. అంటివెర్పుకోట జర్మనీవాళ్లు పట్టుకొ

స్నారని ఆవేళ పేపర్లో తెలిసింది. ఇక అక్కడ చదువు కొనేవాండ్లను సరిగా చదువనిచ్చినవాడు కాడు. ఆయన దగ్గర యుద్ధం జరిగిన నాలు గేళ్లు సర్వకాల సర్వావస్థల్లో రాయల్ అట్లాసు వుండేది. యూరపు మ్యాపునిండా రెడ్లుసిరాచుక్కలూ గీతలూ. పేపరు చదువుకొనేవాళ్ల ముందు అట్లాసు పెట్టి "ఏమండి నూ చారా యీమార్గంగా సేనలు నడిచాయి"... అనేసరికి "యిహ్యా–మమ్మల్ని వూర్కోవనివ్వి పెట్టండి. మాకు గూడా దేవుడిచ్చిన మెదడుంది. కళ్లున్నాయి." అనే వాళ్లు. పాపము యీలాగా ప్రతివారివద్దిర విసిరి కొట్లు తిని మెల్లగా యింటికి పొయ్యేవాడు.

కామ—ఏమె; యిట్రా. మల్లీ పోదువు. నేను విన్నుకొన్నట్లే అయింది.

భార్య—ఏమీ – వాళ్లొపయికం యిచ్చారా. అయితే లేండి–పెట్టెలో పడవేస్తాను.

కామ—నీకేం పగలు నలభయిగెళ్లు పయికం తోనే కలవరింపుగా వుంది. ఆవెనవవిషయాలు నీతో చెప్పవచ్చినాననుకొన్నావా...అదికాదే – ఆంటివర్ప్ కోటా జర్మనీవాళ్లుపట్టుకొన్నారె. ఏడుమైళ్లనారంలో వుండి మూడుదినాల్లో నాలుగుఫిరంగి దెబ్బలతో ధ్వంసం చేసి పట్టివేశారె!

భార్య—యిందుకేనా నన్ను పిలవడం. మీకు యింతకంటె వేరే వుద్యోగం కనబళ్లేదు. ఆపెద్దవాళ్ల పుణ్యాన సంపాయించిన ఆకాస్త్రా శ్రోత్రియం వుండబట్టి ఈగంకనీళ్లయినా దొరుకుతున్నాయి. కట్టెలదొడ్డికి పోయి కట్టెలు ఎత్తించుకరమ్మని నెత్తిన నోరుపెట్టు కొని కొట్టుకోంగా యీనాటి వెధవను పంపించారు. ఆకుంకి పచ్చికట్టెలు తెచ్చి పడవేశాడు. ప్రొద్దుటినుండి వూదుతుంటె యింతవఱకు పోయి మంటాలేదు మాడా లేదు. గంటలప్రకారం విస్తరిముందు కూసోవాలి. పాపం వండన్నా పెడ్తే తినన్నైనా తింటారు. అదెంత కుసుణం అని విసుగుకుంటూ భార్యయింట్లోకి పోతుంది. "ఇంట్లోగాని బయటగాని డబ్బు–డబ్బా–డబ్బా–అని వొకటేగోల! విజ్ఞానంపైన రోమమాత్రం ఆసలేదు. ఆసరణ లేదు. ఎక్కడపట్టినా స్వార్థపరత్వం–ఎగతాళి–హేళన– ఏదో పెద్దమహామ్మారిరోగం యీలోకాన్ని చుట్టుకోని పీల్చేస్తుంది" అని కామయ్యశాస్త్రిగారు మంచంమీద తుంకుగుడ్డ పఱచుకోని నిదురపోవడం సామాన్యంగా ఆయన యుద్యోగం.

శాస్త్రిగారికి పెండ్లికి యెదిగిన వొక కొమార్తె వుంది. ఆ స్థితిలేకపోతే అంతసొగసైందని చెప్పడానికి వీలులేని సామాన్యరూపవతి. మానాయన చేనిపోని పను లుకల్పించుకొని వారియింటికి పోతూవస్తూ పాతబంధు త్వం కలియవేస్తూ మధ్యేమధ్యే నా తెలివితేటలు పొగు డ్తూవుండేవాడు. ప్రస్తుతరాజకీయ విషయాలనుగురించీ ఆంధ్రవాఙ్మయాన్నిగురించీ విధవా వివాహాలనుగురించీ ఆంధ్రపత్రికకు వ్యాసాలు వ్రాస్తుండేవాణ్ణి. ఆవ్యాసాలు పడ్డపత్రిక తీసుకోని మెల్లగా as if nothing happened to the world అన్నట్లు మానాన్న కామయ్యశాస్త్రి యింటికిపోయి రేవోన్యూస్ చదివినట్లుగా అభినయించి అకస్మాత్తుగా నావ్యాసాన్ని చూచినట్లుగా నటించేవాడు. అంతలో రేమండి సోమన్నశాస్త్రులు గారూ అందులో యేమున్నా చిత్రమైన న్యూస్ వుందా అని ఆయన అడిగేవాడు. ఏమీ లేదండి, మనవాడు న్నాడే రాఘవుడు భారతాన్నిగురించి వొక వ్యాసం వ్రాశాడు. అది అచ్చులో పడ్డాదండి. మనవాడిప్పు డిప్పుడు కొంచెం ప్రయోజకుడవుతున్నాడు. వాడికి వివాహం గూడ తలపెట్టుకొన్నాను అని మెల్లంగా unconcerned గా ఒకముక్క జారవిడిచేవాడు మా నాన్న. నాకున్నూ శాస్త్రిగారికిన్ని రీడింగురూములో మాటలు జరిగాయి. ఆయన వస్తుండగానే కలావొక్కొక్క న్యూసుపేపరు అందరు జాగ్రత్త చేసుకొన్నారు. తీసుకొంటె యివ్వడని భయం. నేను గతసంవత్సరం పేపర్లో వొక అడ్వరుటయిజుమెంటుకొరకు వెదుకుతూ వుండినాను. కామయ్యశాస్త్రి నాదగ్గరకూర్చొని బహు దీనంగా పేపరు అడిగినాడు. నేను ధారాళంగ' యిచ్చి నాను. నమ్మకంమీద లేదీమాడకుండా పేపరంతా చదివి టేబిలుపైన పెట్టినాడు. ఇట్లా అప్రయత్నంగా ప్రారంభమైన మాపరిచయం అన్యోన్యప్రశంసలవల్ల మఱీ కొంత గాఢమైంది. ఆయనవ్రాసిన యుద్ధచరిత్రను నా కంటే వోపికతో వినేవాళ్లు ఇంకెవరూ లేరు. నా వ్యాసాన్ని ఆయనకంటె మెచ్చుకొనేవాళ్లు అంతగా లేరు. వొకరికి వొకరు అంతా ఆదరింపూను.

నావోర్పూ మానాయనగారి ప్రయత్నం గట్టెక్కింది. కామయ్యశాస్త్రిగారి కూతురినే నాకిచ్చి వివాహం చేసినారు. పెళ్లి అయింది మొదలుచేసి "ఏమండో మీ అల్లుణ్ణి బియ్యేల్‌కు చదివించరూ" అని మానాయన అడిగేవాడు. మీ కెందుకండీ ఆవ్యామోహం. వాడి tendencies ప్రకారం develop కానీయండి. వాడికి పత్రికలకు వ్యాసాలు వ్రాయడంలో మహానిపుణత్వం వుంది. Geniusను ఇప్పుడెవ్వరును recognise చెయ్యరు. second rate మనుష్యులదే కాలము. నాయుద్ధచరిత్రను గురించి యెవరైనా శ్రద్ధతీసుకొంటున్నారా. నేను మరణించినతర్వాత ఏసాహిత్య పరిషత్ వారికో నాపుస్తకం దొరికితే అప్పుడువారు ప్రచురిస్తే అది బయటికి వస్తుంది అని మా మామగారు చెప్పేవారు. సాహిత్యపరిషత్తువాళ్లు పాతపుస్తకాలేగా అచ్చువేస్తారు అని మానాయనగారు అన్నారు. నేను వ్రాసినపుస్తకంగూడా పాతకాకితాలపైన్నే వ్రాస్తుంది. చాలాకాలం అయ్యేవఱకు వారిచేతుల్లో పడకుండా భద్రంచేస్తాను, అని మామగారన్నారు. మీపుస్తకాన్ని వాళ్లుఅచ్చువేయరండి. ఆపరిషత్తు కొన్ని మూలసూత్రాలపైన నడుస్తుంది. పుస్తకంపాతదిగావుండవలసింది. ఎంతపాతదైతే అంతమేలు. అచ్చువేయుటకు తగని చెత్తగావుండినప్పటికిన్నీ సరే కనీసపక్షం మున్నూరేండ్లవయస్సుండవలెను. మనుష్యులకలకాయలు Literary museums అని వీరిఅభిప్రాయం, అని మ నాన్న అన్నాడు. అందుకైతే నాపుస్తకం ఉపకరిస్తుందని మామగారు సంతోషపడ్డారు. 'అయితే మనపిల్లవాణ్ణి బియల్‌కు చదివించవద్దంటారా?' 'ఎందుకండివాడు యెడిటర్ కావలసినంత మనిషి. ఇటువంటివాడున్నాడని తెలిస్తే ఆంధ్రపత్రికకు సంపాదకుడుగా తమ్మునిపిలుస్తారు. ఇప్పటికే తెలిసివుంటుం దనుకొంటాను.' ఈసంభాషణలు వినివిని నాయోగ్యతపై కొంచెము నాకు నమ్మకం పొటమరిస్తూవుండేది.

మాతండ్రిగారి యిష్టప్రకారం బియల్ చదవడమున్నూ, మా మామగారి భ్రాంతిప్రకారము నేను సంపాదకుణ్ణి కావడమున్నూ, మాతల్లిగారి అధికారేచ్ఛప్రకారం నేను మేజస్ట్రేటు కావడమున్నూ నాకు ఏమాత్రం యిష్టంలేదు. మాతల్లిదండ్రులకు ఆశాభంగం కలిగించే దుర్బుద్ధి నాకొకటి కలిగింది. దేశాటనం చేయవలసిం దనేకోరిక అంతరంగంలో అడుగుభాగాన్నుంచి బొగడబొడిచి నేటికి పైకి తేలింది. దినదినం ప్రేరేపణ మిక్కుటమైంది. విదేశాలు చూడడానికి ప్రస్తుతం వీలులేక పోయినప్పటికినీ స్వదేశమైనా చూడవలసిందనే కోర్కె నన్ను బాధిస్తుండేది. చెప్పితే నాన్న వొప్పుకోడు. మామగారు కోపగించుకొంటారు. తల్లికంటికి కడివెడునీళ్లకు ఏడుస్తుంది. భార్య యింకా సంసారానికి రాలేదు. ప్రణయసంబంధమైన చిక్కులు విరహాలు ఏమీ లేవు. యోచించినాను. ఏమీ తోచలేదు. మామగారు యింట్లోలేని సమయంచూచి శారదా అన్నాను భార్యను. ఏమండీ అన్నది.

నేను—నేనొకరహస్యం చెబుతాను. దాచివుంచుకోగలవా? మీనాన్నకు అమ్మకు మరెవ్వరికి చెప్పగూడదు.

భార్య—పూర్వపతివ్రత లెవరైనా యీలా భర్తల రహస్యాలు దాచిపెట్టున్నారా?

నేను—చాలామంది.

భార్య—అట్లయితే చెప్పండి.

నేను—నాకుహిందూదేశమంతా ఒకమాటుతిరిగి చూడాలని బుద్ధిపుట్టింది. నాప్రయత్నానికి నీవుకూడా సహాయం చేస్తావుగదూ?

భార్య—నేను మిమ్మల్ని వదిలిపెట్టి వొక్కనిమిషంగూడా వుండలేనండి. రాముడితోగూడ సీత అరణ్యాలకు పోయింది. హరిశ్చంద్రుడితోగూడా చంద్రమతి అన్ని అష్టకష్టాలు పడ్డది. దమయంతి సమాచారంమొన్న ఆంధ్రసభవాళ్లు వేసిన చిత్రవళీయంలో చూశాంగా; పతివ్రతలెప్పుడు వాళ్లభర్తల్ని వదిలిపెట్టి వుండరట. యుద్ధంలోకిగూడా వాళ్ల వెంబడి పోతారట. సత్యభామయుద్ధం చేసిందట గదండీ.

నేను—నేను రాముడిమోస్తరుగా పితృవాక్య పరిపాలనం చేయడానికి బియల్ చదవడానికి పోవడంలేదు. హరిశ్చంద్రుడి మాదిరిగా వొకసుగుణాని కొరకు నూటతొంభయి సుగుణాలను బలిచ్చి కష్టపడడానికి పోవడంలేదు. నలుడిమోస్తరుగా మీనాన్న ఆటలో

రాజ్యం పోగొట్టుకొని అడవిదారిపట్టడానికి తయారు కాలేదు. అట్లాంటి సమయంలో పతివ్రతలు భర్తల వెంటపడవచ్చును. నేను దేశంచూడడానికి పోతున్నాను.

భార్య—నేను మీవెంటరాకపోతే పతివ్రతను కానో యేమోనని భయమేస్తూంది(కళ్ల నీళ్లు పెట్టుకొనును).

నేను—ఎందుకు ఏడుస్తున్నావు. నీకీపిచ్చి యెప్పుడు తల్లోకి యెక్కిందీ?

భార్య—మొగవేషంతో వుండే ఆడవాళ్లని మా నాన్న మీకిచ్చి పెండ్లి చేయలేదు.

నేను—ఓయిబాబో! యెక్కడి దీపురాణథోరణి? ఒక్కనిమిషంలో మనము నాయికా నాయకుల మైనాము. ఏ ఆసుకవియైనా దగ్గరవుంటే మనలనుగురించి అడుగుతిప్పకుండా ప్రబంధం అల్లేవాడు! శారదా నిజం చెప్పు. ఎక్కడివి నీమాటలు.

భార్య—రాముడు అరణ్యానికి పొయ్యేటప్పుడు సీతనుకూడా తీసుకొని పోనంటే సీత అట్లానిందించిందట.

నేను—అట్లాచెప్పు. My good god! నీవెక్కడ చదువు కొన్నావు?

భార్య—National School లో

నేను—ఓ say so, అందువల్ల నే యీ Patriotic పాతివ్రత్యము! నీవు పతివ్రతవేనని certificate యిస్తాను. నీకాభయం లేదు.

భార్య—అయితే పతినివదలిపెట్టివుండిన పతివ్రత పేరు వొకటి చెప్పండి చూస్తాం.

నేను—నీకాపిచ్చ యింకాపోలేదు. ఎవరో వుంటారు-తలంపునకు రాలేదు—ఆ—ఊర్మిళ. లక్ష్మణుడి భార్య పన్నెండేళ్లు భర్తనువదిలిపెట్టి అమ్మగారింట్లో వుణ్ణింది.

భార్య—ఆమె పేరు పతివ్రతలపట్టీలో లేదండి,

నేను—లేకపోతే మనము చేరుస్తాము. లక్ష్మణుని భార్య పతివ్రతకాదని యెవరంటారో చెప్పమను చూస్తాం.

భార్య—అట్లయితే మీప్రయాణానికి నే నొప్పుకొంటానండి.

నేను—వొప్పుకోవడమేగాదు. ఈసంగతి యెవ్వరికి తెలియకూడదు. మామగారు నిన్నడిగితే స్నేహితులను చూడడానికి ఉత్తరాదికి వెళ్లవలెనని అనుకొంటూవుండినాడని చెప్పు. తెలిసిందా. సరేనన్నది భార్య. ఆవేళ రాత్రే నెల్లూరు వదలినాను—ఇంకా నాజీవితచరిత్రం పూర్తికాలేదు. నేను దేశాటనంచేసి యూరుచేరినతర్వాత వస్నెవరైనా గొప్పమనిషిఅంటె అప్పుడు కొరవ పూర్తి చేస్తాను.

---

# కేసబియాంక

## నాళము కృష్ణారావు గారు

భగ్గుమని మండు నోడ పైభాగ మందు
నిట్టనిలుచుండె బాలుండు నిబ్బరముగ,
తనదుజనకుని యానతి తలను దాల్చి;
పఱచి రెల్లరు నాతఁ డొక్కరుఁడు తక్క.

సంజ కెంజాయనడుమ భాస్కరుఁడు వోలె
దట్టముగ మండు మంటల నట్టనడుమ
విమలకాంతుల బాలుండు వెలుఁగుచుండె;
వీరరస మూర! మూర్తీభవించె ననఁగ.

ఉజ్జ్వలంబుగ జ్వాలలు ప్రజ్వరిల్లె
కాని, యాబాలుఁ డొక్కింత కదలఁడయ్యె
తండ్రియానతి భక్తిమై తలనుదాల్చి;
బళిర! ఎంతటిధీరుండొ బాలకుండు?

'చెప్పుమా తండ్రి! నే నింక నిప్పుడైన
అవలి కేఁగుదునే?' యంచు నఱచె నతఁడు;
ఎఱుఁగఁ డక్కట! తనతండ్రి యింతమున్నె
అగ్నిహోత్రుని కాహుతి యయ్యె నంచు.

భీకరకరాళ సర్పజిహ్వాకలభాతి
బుస్సుబుస్సని చిచ్చులు బుగులు కొనియె;
విలయకాలము శాసించు విభునిఁబోలె
నిర్భయుంబుగ నిలుచుండె నర్భకుండు.

వేడ్కమై మృత్యుదేవిని పెండ్లియాడ
తమక మొందెడు పెండిలికొమరుఁ డనఁగ
తీవి మీఱఁగ నిలుచుండె డింభకుండు
వీర శృంగారరసములు పెనఁగులాడ.

'ఏల పలుకవు? నాయని యిప్పుడైన
అయ్యెనే?' యని క్రమ్మఱ నఱచె నతఁడు;
వానిపలుకులు చిటపెటార్భటుల నడుమ
నడఁగి యివలికి వెలువడ వయ్యె నకట!

పాదముల సోఁకి, యూరులపైకిఁ బ్రాఁకి,
కౌనునఁ బెనంగి, కంఠంబు కౌఁగిలించి,
చిట్టిచుబుకంబు చుంబించె; ఎంతతీపొ
వీతిహోత్రుని కాముద్దుబిడ్డమీఁద?

జ్వలన మొందెడు వహ్నికాజ్వాలల పయి
అతని జీరాడుకురులు నాట్యంబు సలిపె,
విరియఁ బూచిన మందారతరువుమీఁద
వాలిమై మూఁగు తుమ్మెదపాళి యనఁగ.

మరల గొంతెత్తి కడసారి యఱచె నతఁడు
'నిలుతునే యింక నీయాజ్ఞ తెలుపు మయ్య'
జాలి గుల్కెడి యూపల్కు లాలకించి
కొందలముఁ జెంది జలనిధి ఘోషపెట్టె.

అంతకంతకు పెనుమంట లగ్గలించి
గుప్పుగుప్పున కుప్పించి యుప్పరమున
కెగసి, యట్టిట్టు గాలిలో నెగురుచున్న
ధ్వజముమీఁదికి దండెత్తి దాడి సలిపె.

అక్కటా! ఏమి చెప్పుదు?—నంతలోన
బెడిదమగు భీషణధ్వని పిడుగుఁబోలె
ఉదధిమధ్యమునందుండి యుద్భవించి
బోరుకలఁగెను దిక్కులు మాఱుమ్రోఁగ.

బళ్లుమని యంత నానావ బ్రద్దలగుచు
చాఁపకొయ్యయు, చుక్కాని, చాఁపతోడ
చిదురచిదురలై జలధివీచికలఁ దేలె;
అక్కటా! ఎందు నున్నాఁడొ యనుఁగుబిడ్డ?
కడలికడుపున నడఁగెనో? గాలిలోన
లీన మయ్యెనో? బాలుండు కాన రాఁడు;
మిణుఁగురులఁ బోలె ధగధగ మింట మెఱయు
అగ్నికణముల నడుగుఁడీ యతనిజాడ.

దారుణంబగు నానాఁడు తరణియందు
మ్రంది రెందరో మనుజులు మంట మ్రగ్గి;
నిలిచెనే వారినామముల్ నేటి దనుక
ధీరుఁ డగు బాలుఁ డీతనిపేరు దక్క?

వసుధ నెన్నెనిభాషలు వఱలుఁ గాక!
ధీర 'కేసబియాంకుని' దివ్యచరిత
మధురగీతికఁ బాడు నామాన్యభాష
ధరణి నాచంద్రతారమై వఱలుఁగాక!

---

# విద్యుచ్ఛక్తిశాస్త్రము

## మూలసూత్రములు

## (FUNDAMENTAL PRINCIPLES)

### విద్యుత్కృతి (CELL)

విద్యుచ్ఛక్తిని ముఖ్యముగ రెండువిధములుగ తయారు చేయవచ్చును. మొదటిది మొట్టమొదట కని పెట్టబడుటవలనను, దానికి చాల ఉపయోగము లుండుట వలనను దానినిగురించి మొదట చెప్పవలసి వచ్చినది.

ఒక గాజుబుడ్డి తీసికొని దానిని గంధకద్రావకము తో నింపి తుత్తునాగపురేకు(Zinc Plate) నొకదానిని, కర్బనము (Carbon) లేక బొగ్గుకణిక నొకదానిని ఒక దానికొకటి తగులకుండునట్లు ఆద్రావకములో నుంచుము. తుత్తునాగపురేకు, బొగ్గుకణికల నొండొంటిని రాగి తీగతో గలుపుము. అప్పుడు విద్యుచ్ఛక్తి ఆతీగెలో ప్రవహించును. ఇన్నిటితో గూడిన యట్టి గాజుబుడ్డిని విద్యుత్కృతి (Cell) అందురు. దీనిలో విద్యుచ్ఛక్తి కొద్దిగా పుట్టును. ఈపుట్టువిద్యుచ్ఛక్తి విద్యుత్కృతికి వెలుపల బొగ్గుకణికనుండి తుత్తునాగపురేకునకు పోవు చున్నట్లు ఫలితములనుబట్టి తెలియవచ్చును. అందువలననే బొగ్గుకణికను ధనధ్రువ మనియు, తుత్తునాగపురేకును ఋణధ్రువమనియు నందురు. విద్యుచ్ఛక్తి పుట్టించుటకై ఆ గాజుబుడ్డిలో పైనిచెప్పిన తుత్తునాగము కర్బనములే కాక మరికొన్ని యితరపదార్థములను గూడ నుంచవచ్చును. గంధకద్రావకము ద్రవపదార్థ మగుటచేత నీపైని చెప్పిన విద్యుత్కృతిని మనయిచ్ఛవచ్చినట్లు ఇష్టమువచ్చినచోటికి తీసికొనిపోవుటకు వీలుగా లేదు. అందువలన దానికి బదులుగా ఘనపదార్థములైన నవాసారము (Ammonium Chloride), మాంగనద్వ్యామ్లజనితము (Manganese Dioxide) ఉపయోగించినట్లయిన పూర్వము వలెనే విద్యుచ్ఛక్తి పుట్టును. ఇట్టిదానిని నిర్ద్రవవిద్యుత్కృతి (Dry cell) అందురు. దీనినే ఆధునికులు 'పాకెట్ లైట్' అనబడు 'జేబులో వేసికొని కొనిపోవ వీలగు 'విద్యుద్ద్యుతి'' (Electric Light) కుపయోగింతురు. పైనిచెప్పిన ద్రవపదార్థ విద్యుత్కృతిని తపాలకచ్చేరిలలో తంతివార్తలు పంపుట కవసరమైన విద్యుచ్ఛక్తిని తయారుచేయుటకు వాడుక చేయుదురు.

### ఒత్తిడి (Pressure); నిరోధము (Resistance)

విద్యుచ్ఛక్తిశాస్త్రములో ఒత్తిడి అనగా నేమో అర్థముచేసికొనుట చాలముఖ్యము. విద్యుత్కృతిలో విద్యుచ్ఛక్తి బొగ్గుకణికనుండి తుత్తునాగపురేకుదగ్గఱ కెందుకువచ్చును? దీనికి కారణమిది: రెండుస్థలము లున్నవను కొనుడు. అందులో నొకటి రెండవదానికంటె నెత్తు; అందుచేత నీరు ఉన్నతస్థలమునుండి పల్లపుస్థలముదగ్గఱకు ప్రవహించును. ఈరెండుస్థలములకుగల ఔన్నత్యములోనుండు భేదమునుబట్టి ప్రవాహవేగ ముండును. ఎత్తు ఎక్కువయినచో ఉరవడి యెక్కువగును. ప్రవాహ మెక్కువవడిగా నున్నచో దానిభావ మేమనగా మొదటిస్థలము రెండవ దానికంటె నెత్తుమీద నున్నదని. అట్లే విద్యుచ్ఛక్తి బొగ్గుకణికదగ్గఱనుంచి తుత్తునాగముదగ్గఱకు ప్రవహించుచున్న దనగా ఈరెంటికి నేదో యొకవిధమైన భేదము కలదని తెలియనగును. ఈభేదమునే ఒత్తిడి యందురు. ఇది రెండులోహములయొక్క నైసర్గికవ్యత్యాసముకల్ల కలుగుచున్నది. విద్యుచ్ఛక్తి ప్రవాహ మున్నప్పుడెల్ల ఆప్రవాహము బైలుదేఱుధ్రువమునకును, చేరుధ్రువమునకును కొంతఒత్తిడిభేద ముండితీరవలయును. ఈయొత్తిడి వలననే విద్యుత్ప్రవాహము ప్రవహించును. ఒత్తిడి ఎక్కువగా నున్నంతమాత్రమున ప్రవాహరాశి ఎక్కువగా నుండునని చెప్పుటకు వీలులేదు. అందు క్రిందియుదాహరణమును గమనింపదగును.— రెండుదేశము లున్నవనుకొ

నవి: హిందూదేశము, టిబెట్టుదేశము. ఈరెంటిలో హిందూదేశము చాలఫలవంతమైనది. అందువలన ప్రజలకు టిబెట్టుదేశమునుండి హిందూదేశమునకు రావలెనని ఆసక్తి యెక్కువ; అనగా ప్రజలు తమదేశమును వదలుటకు కొంతఒత్తిడి కలదు. కాని మధ్య హిమవత్పర్వతములు కలవు. దాటిపోవుట చాలకష్టము. అట్టిసమయములో రెండుదేశములకు భేదమున్నను రెంటిలో హిందూదేశమున నివసించుట కనుకూలముగ నున్నను పర్వతనిరోధముండుటచేత జనులు బాహాటముగ పోరు. గంజి త్రాగి స్వదేశమున నుండుటకే సంతృప్తి చెందుదురు. రెంటికిని మధ్య పర్వతము లేదనుకొనుడు; లేక కైబరుకనుమల వంటి కనుములు కలవనుకొనుడు. అప్పుడు జరుగువృత్తాంతము వేఱ చెప్పనక్కఱలేదు. హిందూదేశమంతయు టిబెట్టుదేశప్రజలతో నిండిపోవును. ఇది సహజము. ఇట్లే విద్యుచ్ఛక్తిప్రవాహమునకు ఒత్తిడి యున్నంతమాత్రమున విద్యుచ్ఛక్తి ఒకధ్రువమునుండి మఱియొక ధ్రువమునకు ప్రవహింపవలెనని లేదు. అది పోవుమార్గమునుబట్టి యుండును. రాజమార్గమైన ప్రజలు ఎడతెరపిలేకుండ పోవునట్లు విద్యుచ్ఛక్తికూడ మార్గము సరళమైన దైనయెడల నిరాఘాటముగ ప్రవహించును. ఇట్లు విద్యుత్ప్రవాహమున కెక్కువనిరోధము కలిగింపకుండ, నిరాఘాటముగ ప్రవహించునట్లు చేయులోహములను 'వ్యాపకములు' (conductors) అనియు, ప్రవాహమునకు నిరోధము (Resistance) కలిగించువాటిని నిరోధకము లనియు అందురు. నిరోధకములైనను ఒత్తిడి యెక్కువగుచో నవి వ్యాపకములుగ మాఱునని వేఱ చెప్పనక్కఱలేదు, పై నిచ్చిన యుదాహరణమున టిబెట్టుదేశము కఱవుబాధచేత కమిలిపోవుచున్న దనుకొనుడు. వర్షము లతివృష్టిగ గురియుచున్నను మార్గ నిరోధకములైన హిమవత్పర్వతములు దాటినచో సుభిక్షమైన హిందూదేశము క్షామపీడితులకు శరణ్యమొసగగల దనుకొనుడు. అట్టిస్థితిలో టిబెట్టుదేశీయులు దేశాంతరనివాసు లగుటకు ఒత్తిడి ఎక్కువయినదికదా! ఇట్లుఒత్తిడి ఎక్కువయినప్పుడు ఇతరసమయములలో దేశమునుండి కదలుటకు అశ్రద్ధచేయువారు నిరోధకము లైనకొండలనుగూడ దాటుచున్నారు; అనగా కొండలు మార్గనిరోధకము లైనను ఒత్తిడి యెక్కువగుటచేత రాజమార్గమువలె మారుచున్నవి. ఇట్లే విద్యుచ్ఛక్తిలోను రెండుధ్రువముల మధ్య ఒత్తిడి యెక్కు వైనచో మధ్య నిరోధకము లున్నను విద్యుత్ప్రవాహ మేర్పడును.

## కొలతప్రమాణములు (Units of Measurement)

విద్యుచ్ఛాస్త్రము బాగుగ బోధపడవలయునన్న ఈభాగములను గొంత శ్రద్ధతో జదువవలయును. అన్ని వస్తువులకు ప్రమాణము కలదు. ప్రమాణమువలన ఒక వస్తువు నింకొకవస్తువుతో పోల్చుటకు సదుపాయము కలుగుచున్నది. రెండుగడ లున్నవనుకొనుడు. అందులో నేది పెద్దదైనది అంచనా వేయవచ్చును కాని స్పష్టముగా తెలియుటకు అడుగుబద్దతో వాటిని కొలిచి మొదటిగడ పదిఅడుగులు, రెండవది ఇరువదిఅడుగులు ఉన్న యెడల రెండవది మొదటిదానికంటె పెద్దదని చెప్పుదుము. ఇట్లు రెంటిని పోల్చిచూచుటకు ఒక్కప్రమాణ మవసరము. ప్రకృతిశాస్త్రములలో సాధారణముగ అడుగుకు బదులు సెంటిమీటరు అను ఫ్రెంచి వారిప్రమాణము నుపయోగింతురు. అట్లే ప్రతివిధమైన గణనమునకును ప్రమాణ ముండవలయును. విద్యుచ్ఛాస్త్రమున ఒత్తిడికి ఆదిమప్రమాణము (Unit) వోల్టు అని చెప్పుదురు. దీని కీపేరు విద్యుచ్ఛాస్త్రవేత్తయైన వోల్టు వలన కలిగినది. ప్రవాహమునకు ఆదిమప్రమాణము ఏంపియరు. విద్యుచ్ఛక్తి ఒక జలపాత్రలో ప్రవహించుచున్నప్పుడు ఉదజనిగాలి వెలువడుచుండును. నిమిషకాలములో 6.96 ఘనసెంటిమీటర్ల[1] ఉదజనిగాలి వెలువడుచో ఆజలపాత్రలో ప్రవహించు విద్యుత్ప్రవాహము ఒక ఆంపియరు అని చెప్పబడును. ఇట్లే నిరోధమునకు కూడ ప్రమాణము కలదు. ఇందువల్ల దేనికి ఎక్కువనిరోధకశక్తి కలదో తెలిసికొనగలము. ఒకచతురపు మిల్లీమీ

---

1. ఒక అడుగుకు 30.5 సెంటిమీటర్లు. ఎత్తు ఒక సెంటిమీటరు, పొడుగు ఒక సెంటిమీటరు, వెడల్పు ఒక సెంటిమీటరు గల ప్రవాహమును ఒక 'ఘనసెంటిమీటరు' ప్రవాహ మందురు.

టరు[1] క్షేత్రఫలము (Area) గల రాగితీగ 60 మీటర్ల పొడుగు ఉన్నయెడల దాని నిరోధకశక్తి ఒక 'ఓమ్'.

ఈనిరోధకశక్తినిగురించి యింక కొంత తెలిసికొనవలయును. తీగ పొడుగైనకొలది నిది యెక్కువగుట సహజము. అడ్డకట్టు ఎక్కువ ఎత్తైనకొలదిని ప్రవాహమున కడ్డు ఎక్కువకదా. అందుచే నైరుధ్యము (నిరోధకశక్తి) తీగ పొడవునుబట్టి ఎక్కువగుచుండునని గ్రహింపవలయును. ఇంతియేకాదు. ఇది తీగ అడ్డుభాగము (Cross Section) యొక్క క్షేత్రఫలమునుబట్టికూడ నుండును. రెండు గుండ్రనితీగె లున్నవనుకొనుడు. (విద్యుచ్ఛక్తివ్యాపకములయొక్క అడ్డుభాగ మెప్పుడును గుండ్రముగ నుండును.) ఒకదానివ్యాసము (అడ్డుకొలత= Diameter) ఒక మిల్లిమీటరు. రెండవదానిది రెండు మిల్లిమీటరులు. ఈతీగెలు రెంటిని విద్యుద్వ్యాపకములుగ నుపయోగించుచుంటి మనుకొనుడు. రెంటిలోను ప్రవాహమును గలిగించు ఒత్తిడి సమానమే యైనచో దేనిలోనుండి విద్యుచ్ఛక్తి మిక్కిలిసులభముగా ప్రవహింపగలదు? పోవుటకు మార్గ మెక్కువవెడల్పుగా నున్నచో ప్రజలు తండోపతండములుగ పోవుట కనుకూలముగ నుండునుకదా! అట్లే తీగెలోని అడ్డుభాగముయొక్క క్షేత్రఫల మెక్కువయైనచో విద్యుచ్ఛక్తి నిరాఘాటముగ ప్రవహింపగలదు. ఈ నైరుధ్యము ఉపయోగించు వ్యాపకముయొక్క స్వభావగుణమును బట్టికూడ ఉండును. నదీప్రవాహము కొండప్రదేశములలో యథేచ్ఛముగ పాఱుచున్నను, అది పాఱు ప్రదేశము ముళ్ల రాగిటిమట్టికలప్రదేశమైన వడి తగ్గును. అనగా భూమిస్వభావమునుబట్టికూడ పాఱుదల ఉండును. నైరుధ్యము తీగెలపొడుగు ఎక్కువయినకొలది ఎక్కువగును. తీగె అడ్డుభాగముయొక్క క్షేత్రఫల మెక్కువయినకొలది తగ్గును. అది వ్యాపకస్వభావమునుబట్టికూడ నుండును. వీటినన్నిటిని ఈక్రిందిసూత్రము స్పష్టపఱచుచున్నది:—

$$\text{నైరుధ్యము (నిరోధకశక్తి)} = \frac{\text{పొడవు} \times \text{గుణప్రమాణము.}^{2}}{\text{క్షేత్రఫలము.}}$$

పైసూత్రమునుబట్టి నైరుధ్యము మూటిమీద ఆధారపడియుండునని స్పష్టమగుచున్నది. మూడును ఏవన (1) వస్తువుయొక్క పొడవు (2) వస్తువు అడ్డుభాగముయొక్క క్షేత్రఫలము (3) వస్తువుయొక్క స్వభావగుణము. ఈ విషయము స్పష్టముగ దెలియుటకై మనము రెండు వేఱువేఱు లోహపుముక్కలను తీసికొందము. ఆముక్కలు రెండును సమానమైన పొడవుకలవి. ఆరెండుముక్కల అడ్డుభాగముయొక్క క్షేత్రఫలముగూడ సమానమే. ఇక భేద మెచ్చట గలదు? ఆరెండుముక్కలయొక్క స్వభావగుణమున గలదు. వేఱువేఱు లోహపుముక్క లగుటవలన నవి వేఱువేఱు స్వభావగుణములు కలవి. ఈరెండును కడమరెంటిలో సమానమే యగుట వలన, ఈరెంటినైరుధ్యము మనకు దెలిసినచో అది స్వభావగుణముమీద నెట్లు ఆధారపడియుండునో మనకు దెలియగలదు. ఈరెండు ముక్కలును ఒక సెంటిమీటరు పొడవును, ఒకచతురపు సెంటిమీటరు క్షేత్రఫలమును గలిగియున్నయెడల వాటినైరుధ్యమే ఆయాలోహముల గుణసంఖ్యను తెలుపును.

ఆదిమగుణ ప్రమాణసూచిక

| | | |
|---|---|---|
| వెండి | 1. 6 | [3]మైక్రోఓమ్ |
| రాగి | 1.67 | ,, |
| బంగారము | 2. 0 | ,, |
| అల్యూమినము | 3. 3 | ,, |
| ఇనుము | 10. 0 | ,, |
| మాంగనిన్ | 46. 0 | ,, |
| పాదరసము | 94. 0 | ,, |

దీనివల్ల వెండి అన్నిటికన్న తక్కువ నిరోధకస్వభావము కలది యని తేలుచున్నది. కాని అది ఖరీదు కల దగుటచేత దానితరువాత నిరోధకశక్తి తక్కువకల

1. పదిమిల్లిమీటర్లు ఒక సెంటిమీటరు. నూరు సెంటిమీటర్లు ఒకమీటరు. పొడుగు వెడల్పు సమముగా నున్నదాని క్షేత్రఫలము (Area)నకు చతురము అని పేరు.

2. గుణప్రమాణము అనగా వ్యాపకముయొక్క స్వభావగుణమును దెలుపు సంఖ్య.

3. పదిలక్షల మైక్రోఓమ్‌లు ఒక ఓమ్ అగును.

రాగినే తరుచుగ నుపయోగించుచుందురు. నైరుధ్యము ఎక్కువ కావలసినచోట ఘనపదార్థ మగుటచేత మాంగనిన్ ఉపయోగింతురు.

...ష్ణము హెచ్చినచో నైరుధ్యము హెచ్చును.

## ఓమ్‌సూత్రము

'ఓమ్' శాస్త్రవేత్త కనిపెట్టిన సూత్రము విద్యుచ్ఛక్తిశాస్త్రములోనికెల్ల ముఖ్యమైనది. ఈసూత్ర మిట్లు చెప్పుచున్నది:

$$\text{ప్రవాహము}=\frac{\text{ఒత్తిడి}}{\text{నిరోధకశక్తి}}$$

అనగా ఒత్తిడి ఎక్కువైన కొలది ప్రవాహ మెక్కువగుచుండును. నైరుధ్యము ఎక్కువైన కొలది ప్రవాహము తగ్గుచుండును. ఇది సహజమేకదా! ఈ ఓమ్‌సూత్రము నింకొకవిధముగాకూడ చెప్పవచ్చును:

$$\text{ప్రవాహము}\times\text{నైరుధ్యము}=\text{ఒత్తిడి}$$

$$\text{నైరుధ్యము}=\frac{\text{ఒత్తిడి}}{\text{ప్రవాహము}}$$

ఈపైసూత్రముల ననుసరించి ఏరెండు తెలిసినను మూడవది కనిపెట్టవచ్చును. ఓమ్‌సూత్రోదాహరణములు: ఓమ్‌సూత్రము బాగుగాబోధపడుటకు ఈక్రింద కొన్ని ఉదాహరణముల నిచ్చెదను: (1) ఒకవిద్యుద్ద్యుతికి (Electric Light) సాధారణముగ అదిమప్రమాణమైన ఏంపియరులో నాఱవవంతు కావలసియుండును. దాని నైరుధ్యము సుమారు 1320 ఓమ్ లుండును. అట్లయిన ఆద్యుతి కొనలను ఎంత ఒత్తిడి ఉన్నచో దీపము వెలుగును? విద్యుద్ద్యుతినిగురించి ముందు మన మెక్కువగ తెలిసికొనగలము. అది యెక్కువ నైరుధ్యముగల ఒకతీగె. దాని నుండి విద్యుచ్ఛక్తి ప్రవహించునప్పుడు నిరోధ మెక్కువగా నుండుటచేత వేడిమి పుట్టును. ఈ వేడిమి అధికమైనప్పుడు వెలుతురు కలుగును.

రెండవసూత్రము ప్రకారము దీనిని చేయవచ్చును.

$\text{ప్రవాహము}=\frac{1}{6}$ ఏంపియరు.

నైరుధ్యము $=1320$ ఓమ్‌లు.

అందుచే $\text{ఒత్తిడి}=\frac{1}{6}\times 1320=220$ వోల్టులు.

2. ఉదా.—మద్రాస్ సెనేట్ హౌస్ దగ్గర పెద్ద విద్యుద్ద్యుతి కలదు. దానికి సుమారు 2 ఏంపియరుల ప్రవాహము కావలసియుండును. దాని నైరుధ్యము 110 ఓమ్‌లు అయినచో వెలుతురు రావలెనన్న ఎంతఒత్తిడి కావలసి ఉండును?

$\text{ఒత్తిడి}=2\times 110=220$

(ప్రవాహము × నైరుధ్యము.)

3. ఉదా.—తోలుబొమ్మలు కనబడునట్లు చేయుటకు తెరవెనుక కాగడాలు పెట్టుదురుకదా. అట్లే నూతనముగ వెలసిన సినీమాలోకూడ బొమ్మలు కనబడుటకు ఏదైన దీపిక ఉండవలయును. అట్లుపయోగపడునది విస్ఫులింగము. విస్ఫులింగము అనగా విద్యుత్ప్రవాహ మార్గమున ఒకటిరెండు మిల్లిమీటరులమాత్రము వ్యాపకము లేకయుండును. ఆప్రదేశమందు ఒత్తిడి ఎక్కువగుటచేత నిరోధకమైన గాలి వ్యాపకముగ మారి ప్రవాహమునకు దారి యిచ్చును. ఆవ్యాపకము లేనిభాగమున గాన్పించునదే విస్ఫులింగము. ఈ విస్ఫులింగమునకు సుమారు 10 ఏంపియరుల ప్రవాహము కావలయును. గాలియొక్క నైరుధ్యము 5 ఓమ్‌లైనచో విద్యుచ్ఛక్తి ఎంతఒత్తిడితో ప్రవహింపవలయును?

$\text{ఒత్తిడి}=\text{ప్రవాహము}\times\text{నైరుధ్యము}.$

$=10\times 5=50$ వోల్టులు.

4. ఉదా.—పాకెట్ లైటుకి విద్యుచ్ఛక్తి అందిచ్చబడిన నిర్ద్రవవిద్యుత్కృతినిబట్టి వచ్చుచుండును. విద్యుత్కృతియొక్క ఒత్తిడి 2 వోల్టులు. దీపము వెలుగుటకు సుమారు ఏంపియరులో పదవభాగము కావలయును. అట్టిచో ఆద్యుతియొక్క నైరుధ్య మెంతో?

$$\text{నైరుధ్యము}=\frac{\text{ఒత్తిడి}}{\text{ప్రవాహము}}=\frac{2\times 10}{1}=20 \text{ ఓమ్‌లు.}$$

5. ఉదా.—విద్యుచ్ఛక్తి తయారుచేయు యంత్రశాలనుండి అది ఉపయోగింపబడు స్థలమునకు 500 లమీటర్లు. (అనగా 8 మైలు) దీనికుపయోగించు రాగితీగెయొక్క క్షేత్రఫలము నాలుగుచతురపు మిల్లిమీటర్లు అయినచో దాని నైరుధ్య మెంత? విద్యుచ్ఛక్తి ఉపయోగింపబడుస్థలమున 220 వోల్టులు ఒత్తిడి కావలయును,

విద్యుత్ప్రవాహము 10 ఏంపియరు లయినచో యంత్రశాలయందు విద్యుచ్ఛక్తి ఒత్తిడి యెంత ఉండవలయును? (ఇక్కడ నిరోధకసూత్రము నుపయోగింపవలయును).

$$\frac{\text{పొడుగు} \times \text{గుణప్రమాణసంఖ్య}}{\text{క్షేత్రఫలము}} = \text{నైరుధ్యము}$$

ఇందులో పొడుగు 1000 మీటర్లు. ఎందువల్ల ననగా విద్యుచ్ఛక్తి ప్రవహించుట కొకపరిధి కావలయునని తెలిపియుంటిమి. అందుచే విద్యుచ్ఛక్తి యంత్రశాలనుండి ఉపయోగింపబడుస్థలమునకు ప్రవహింపవలయునంటే కనీసము రెండుతీగలైన నుండవలయును. అందుచేత ఈలెక్కలో తీసికోవలసిన పొడవు 1000 మీటర్లు.

1000 మీటర్లు=100000 సెంటిమీటర్లు

4 చతురపుమిల్లిమీటర్లు= $\frac{4}{100}$ చతురపు సెంటిమీటర్లు

గుణసంఖ్య =1.67 మైక్రోఓమ్‌లు.

నైరుధ్యము= $\frac{100}{4} \times \frac{100000}{1} \times \frac{1.67}{1000000}$

=4.175 ఓములు.

ఓమ్‌సూత్రప్రకారము తీగలనిరోధమువల్ల తగ్గిన ఒత్తిడి=నైరుధ్యము × ప్రవాహము=4.175 × 10=41.75 వోల్టులు.

అందుచే పుట్టుస్థలమున నుండవలసిన ఒత్తిడి=ఉపయోగింపబడుచోట ఉండవలసిన ఒత్తిడి+తీగల నిరోధమువలన తగ్గినఒత్తిడి=41.75+220=261.75 వోల్టులు.

## అంతర్నిరోధము

## (Internal Resistance)

విద్యుచ్ఛక్తి ప్రవహించుటకు విద్యుచ్ఛక్తి పుట్టుచోటికి మరల వచ్చుటకు ఒకమట్టువ్యాపక మేదైన నుండవలయును. అందువలన విద్యుత్పరిధిలో విద్యుచ్ఛక్తి పుట్టుటకు విద్యుత్కృతియు, ప్రవహించుటకు వ్యాపకమును, ఉపయోగించుట కేదైనసాధనమును ముఖ్యముగా ఉండును. విద్యుత్కృతిలో గంధకద్రావక ముండునని చెప్పబడినది. దాని నైరుధ్య మెక్కువ. అందువల్ల విద్యుచ్ఛక్తికి కొంత అంతర్నైరుధ్యము కలదని రూఢిగ నగును. ఒకపరిధిలో ఒకఓమ్ అంతర్నైరుధ్యమును, వ్యాపకనైరుధ్యము 2 ఓమ్‌లు, పరికరనైరుధ్యము 3 ఓమ్‌లు నున్న దనుకొనుడు. మొత్తము నైరుధ్యము 6 ఓమ్‌లు. విద్యుత్కృతికి 12 వోల్టులు ఒత్తిడి యివ్వగలశక్తి ఉన్నదనుకొనుచో విద్యుచ్ఛక్తిప్ర[illegible] యొక్క కొలత $\frac{12}{6}$=2 ఏంపియరు లగుచున్నది. ఓమ్ సూత్రప్రకారము విద్యుచ్ఛక్తి ప్రవహించునపుడు అంతర్నిరోధమువల్ల కొంతఒత్తిడి తగ్గును. ఎందుకనగా ఒత్తిడి=ప్రవాహము × నైరుధ్యముల అందువల్ల అంతర్నైరుధ్యమువల్ల తగ్గిపోవుఒత్తిడి=2 × 1=2 వోల్టులు. అందుచేత బాహ్యమునకు 12-2=పదివోల్టులుమాత్రము ఒత్తిడి మిగులుచున్నది. అంతర్నిరోధమును దాటుటకు వినియోగింపబడుఈయొత్తిడి ప్రవాహమెక్కువయినకొలది ఎక్కువగును. ఇట్లు విద్యుత్కృతి అంతరమున నుపయోగింపబడుచున్న ఒత్తిడి నిరుపయోగ మగుచున్నది. అందువలన దానిని తగ్గించుటకు ప్రయత్నింప వలయును. దానిని తగ్గించుట ఎట్లన అంతర్నిరోధమును తగ్గించుటయే.

ఎక్కువవ్యాపకశక్తిలేని గంధకద్రావకము నుపయోగపఱుచుటయే అంతర్నిరోధమునకు కారణము. విద్యుత్కృతిలో తుత్తునాగపురేకును, బొగ్గుకణికయు సాధారణముగ గొంతవఱకే యుండును. తుత్తునాగమురేకుయొక్క కొనయు, బొగ్గు కణికయొక్క కొనయు గంధకద్రావకములో నుండును. విద్యుచ్ఛక్తి బాహ్యమున బొగ్గుకణికనుండి తుత్తునాగమునకు బోయి, దానిఅడుగుకొననుండి గంధకద్రావకముద్వారా విద్యుత్కృతిలోపలి బొగ్గుకణిక అడుగుకొనకు బోయి యీవిధమున బాహ్యమునను, అంతరమునను చుట్టుచుట్టి వచ్చుచుండును. విద్యుత్కృతిలో బొగ్గుకణిక, తుత్తునాగములు అడుగుకొనలవఱకే విద్యుత్ప్రవాహము ప్రవహించుచుండును. అంతకు దిగువభాగమున విద్యుత్ప్రవాహ ముండదు. ఇందువల్ల ఈబొగ్గుకణికయు, తుత్తునాగమును విద్యుత్కృతిలో అట్టడుగుభాగమువఱకు నుండగూడదని కాదు. అట్లున్నను ఉండవచ్చును. ఇక గంధకద్రావకముయొక్క నైరుధ్యమును తగ్గించు మార్గ మిది. ఈగంధకద్రావకము విద్యుత్కృతిలో నుండు నంతర్వ్యాపకము. దీనిపొడవు తుత్తునాగమురేకునకు, బొగ్గుకణికకు మధ్యనుండు భాగము. దీని అడ్డుభాగము యొక్క క్షేత్రఫలము ద్రావకములో మునిగియున్న

తుత్తునాగపురేకుయొక్క క్షేత్రఫలమే. ఇటువంటిదాని నైరుధ్యము తగ్గవలెనన్న సూత్రప్రకారము పొడుగునైనను తగ్గింపవలయును, లేదా క్షేత్రఫలమైన హెచ్చింపవలెను. పొడుగు తగ్గించుటకు వీలులేదు కావున క్షేత్రఫలమునే హెచ్చింపవలెను: అనగా పెద్దపెద్దరేకుల నుపయోగింపవలయును. అప్పుడు అంతర్నిరోధము తగ్గును. ఒత్తిడి వ్యర్థముగ తగ్గిపోదు. కాని పెద్దపెద్దరేకులగు విద్యుత్కృతిని ఒకచోటినుండి మరియొకచోటికి తీసికొనిపోవుట సులభసాధ్యము కాదు.

### పరిధి, (Circuit)
### సమాంతర, పంక్తి యేర్పాటులు
### (Parallel and Serial Circuits.)

ఇట్టి పెద్దవిద్యుత్కృతి యుపయోగించుటకుబదులు చిన్న 'విద్యుత్కృతిభాండాగారము'(Battery of Cells) నుపయోగింపవలెను. విద్యుత్కృతిభాండాగారమున ననేకవిద్యుత్కృతు లుండును. ఈ విద్యుత్కృతులను రెండువిధములుగ నేర్పాటు చేయవచ్చును. వాటి నన్నిటిని ఒకపరిధియందు పంక్తిలో నుంచవచ్చును; అనగా విద్యుత్కృతు లన్నిటిని ఒకపరిధియందే యుంచుట యని యర్థము. అట్లు చేయుటకు మనము ఒకవిద్యుత్కృతియొక్క తుత్తునాగపు ధ్రువమును, ప్రక్కనున్న విద్యుత్కృతియొక్క బొగ్గుధ్రువమును తీగెవలన గలుపవలయును. ఇట్లు చేసినచో విద్యుచ్ఛక్తి ఒక విద్యుత్కృతిలో బయలుదేరి ప్రతి యితర విద్యుత్కృతిలోనుండి పోవుచు తిరిగి పుట్టినచోటికి వచ్చుచుండును. వీటి అన్నిటియందును ఒకే ప్రవాహము ప్రవహించుచుండును. అందుచే దీనిని పంక్తిపరిధి అందురు. ఒకబల్లమీద పంక్తిగా పదిమందిబాలు రున్నారనుకొనుడు. ఇంకొ మఱి అయిదుగురు వచ్చి అబల్లమీద కూర్చున్నచో ఒత్తిడి యెక్కువగుచున్నదికదా. అట్లే భాండాగారములోని కృతు లన్నిటిని పంక్తిగా ఒకేపరిధిలో నేర్పాటు చేసినచో ఒత్తిడి ఎక్కువ కాగలదు. మోటారుబండ్లలో దీపములు వెలిగించుటకు 110 వోల్టులఒత్తిడిగల భాండాగారము కావలయును. ప్రతికృతియొక్క ఒత్తిడి 3 వోల్టులైనచో $\frac{110}{3}$ లేక 37 కృతులు ఆ భాండాగారమున నున్నవని గ్రహింపవలెను.

ఈపైయేర్పాటుగాక విద్యుత్కృతులను ఇంకొక విధముగకూడ చేర్పవచ్చును. తుత్తునాగపు ధ్రువముల నన్నిటిని జంటగా కలిపినచో అది భాండాగారముయొక్క ఋణధ్రువముగా నేర్పడును. అట్లే బొగ్గు ధ్రువముల నన్నిటిని గలిపినచో ధనధ్రువముగా నేర్పడును. ఇట్టిభాండాగారమునకు ఒకఋణధ్రువమును, ఒక ధనధ్రువమునుమాత్రమే యుండును. ఇట్టి యేర్పాటుగల దానిని సమాంతరవిద్యుత్కృతిభాండాగారము అని చెప్పుదురు. పంక్తిగా కూర్చుండక ఒకరివెనుకనొకరు కూర్చున్నచో నింకను ఎంతమందివచ్చినను పంక్తిగా కూర్చుండనంతసేపు ఒత్తిడి ఏమాత్రము హెచ్చునేరదు. ఇట్లే సమాంతరవిద్యుత్కృతి భాండాగారమునందును ఒత్తిడి ఏమాత్రము హెచ్చునేరదు. ఆభాండాగారముయొక్క ఒత్తిడి ఒక్కవిద్యుత్కృతిఒత్తిడికే సమానము. ఇట్టి యేర్పాటులో ప్రవాహరాశి ఎక్కువగ నుండును. అందువలన ఎక్కువప్రవాహ మెచ్చుట కావలయునో అట్టిచోట్ల నీసమాంతరవిద్యుత్కృతిభాండాగార ముపయోగపడును.

ఇట్లే మనము విద్యుచ్ఛక్తి నుపయోగించు కొను పరికరములుకూడ పంక్తిగానైనను, లేక సమాంతరముగానైనను నుంచవచ్చును. ఒకానొక పరిధిలో మూడు నిరోధకములు పంక్తిగా నేర్పాటుచేసినా రనుకొనుడు. అందుచేత అన్నిటియొక్క సంకలనము వాటియొక్క మొత్తపునైరుధ్యమునకు సరిపోవుచున్నది. మూడునిరోధకములలో మొట్టమొదటిది 10 ఓమ్‌లు, రెండవది 5 ఓమ్‌లు, మూడవది 15 ఓమ్‌లు నైనచో వాని మొత్తమునైరుధ్యము $5+10+15=30$ ఓమ్‌లు. ఇట్టిశక్తిని 150 వోల్టులఒత్తిడిగల విద్యుచ్ఛక్తిపరిధిలో చేర్చినచో వీటిగుండా $\frac{150}{30}=5$ అంపియరుల ప్రవాహము పాఱును. ఈ ప్రవాహము అన్నినిరోధకములలోను ఒక్కటే.

రెండవది సమాంతరపు టేర్పాటు. ఒకజతకొనల నన్నిటినికలిపి ఒకవైపునను, మరియొకజతకొనల నన్నిటిని కలిపి మరియొకవైపునను విద్యుత్కృతిలోని ధన ఋణధ్రువములకు వ్యాపకముద్వారా ముడిపెట్టుదురు. ఇందువలన నిరోధకము లెన్నికలవో అన్నిపరిధు లేర్ప

డును. కృష్ణానదిలోనుండి రెండుకాలువలు చీలుచున్నవి. నదిలోనినీరు ప్రతికాలువలోనికి సమానముగా పోదు. తక్కువనిరోధము కలదానిలో నెక్కువనీరు ప్రవహించును. ఇట్లే విద్యుద్భాండాగారపరిధిలో 3 నిరోధకములను సమాంతరముగ నేర్పాటుచేసితి మనుకొనుడు. అందులో నొకదానినైరుధ్యము 5 ఓములు, రెండవదాని నైరుధ్యము 10 ఓములు, మూడవదానిది 15 ఓములు యనుకొనుడు. పైభాండాగారము 150 వోల్టులఒత్తిడి కల దనుకొనుడు. అప్పుడు మొదటిమట్టులో ఓమ్సుసూత్ర ప్రకారము $\frac{150}{5}=30$ ఏంపియరులును, రెండవదానిలో $\frac{150}{10}=15$ ఏంపియరులును, మూడవదానిలో $\frac{150}{15}=10$ ఏంపియరులును ప్రవహించును. మొత్తము 55 ఏంపియరుల ప్రవాహము వెలువడును. ఇందునుబట్టి మనము తెలిసికొనవలసినవిషయ మొకటి కలదు. అది యేదన: పైభాండాగారపరిధిలోని మూడునిరోధకములను తీసివేసి ఆమూటికి బదులుగా ఆమూటియొక్క మొత్తపునైరుధ్యమునకు సమమైన నైరుధ్యముగల ఒకనిరోధకమును బెట్టితి మనుకొనుడు. అప్పుడు దానినైరుధ్య మేమి?

$$\frac{\text{ఒత్తిడి}=150}{\text{ప్రవాహము}=55}=\text{కొంచె మించుమించు 3 ఓములు.}$$

అనగా మనము పైభాండాగారమున మొదట నుంచిన 3 నిరోధకముల నైరుధ్యము 3 ఓములకు సమానమని తెలియగలదు. దీనికిని పంక్తి ఏర్పాటునకును గలవ్యత్యాసము సులభముగా గ్రహింపనగును. పంక్తిఏర్పాటులో ప్రవాహము 5 ఏంపియరులుమాత్రమే; కాని నైరుధ్యము 30 ఓములైనది.

వీటినిబట్టి పంక్తిఏర్పాటులోకంటె సమాంతరపుటేర్పాటులో నైరుధ్యము తక్కువగ నుండునని స్పష్టము కాగలదు. ఈకారణముననే విద్యుద్ద్యుతులు సమాంతరపుటేర్పాటులోనుంతురు. ఈద్యుతులను పంక్తిఏర్పాటులో గాక సమాంతరపుటేర్పాటులో నుంచుటవలన గలుగు లాభ మిది. సమాంతరపుటేర్పాటులో ఎన్ని విద్యుద్ద్యుతు లున్న అన్నిపరిధు లేర్పడును: పంక్తిఏర్పాటులో అట్లు గాక పరిధి ఒక్కటే యేర్పడును. ద్యుతులన్నియు ఒక్కటేయేర్పాటులో నుండుటవలన ద్యుతికి కావలసిన ప్రవాహము ఏంపియరులో ఏడవభాగమే కాని నైరుధ్యము మాత్రము ద్యుతులనుబట్టి యుండును: ఎన్నిద్యుతులున్న నైరుధ్యముకూడ అన్నిటిమొత్తము అగుచుండును. కాని ద్యుతులన్నియు నొకేపరిధిలో నుండుటవలన విద్యుత్ప్రవాహమును పుట్టించువిద్యుత్కృతియందలి ఒత్తిడి సాధారణముగ ఒకద్యుతిని వెలిగించుటకు కావలసిన $\frac{1}{7}$ ఏంపియరు ప్రవాహమును పుట్టించుట కవసరమైన 220 వోల్టులఒత్తిడి కంటె ఎక్కువ కావలెను. ఇక సమాంతరపుటేర్పాటులో అట్లు కాదు. ఒక్కొక్క పరిధిలో ఒక్కొక్క ద్యుతియుండును. ద్యుతి ఒకటింటికి $\frac{1}{7}$ ఏంపియరు ప్రవాహ ముండును. అందువలన ఎన్నిసమాంతరద్యుతులుండునో అన్ని $\frac{1}{7}$ ఏంపియరుప్రవాహము లుండును. కాని ఒత్తిడి మాత్రము ఒకద్యుతిని వెలిగించుట కవసరమైన $\frac{1}{7}$ ఏంపియరుప్రవాహమును పుట్టించుటకు కావలసిన 220 వోల్టుల ఒత్తిడియే చాలును.

## విద్యుద్బలము
## (Electrical Energy)

ఇంతవఱకును విద్యుచ్ఛక్తియొక్క ఒత్తిడి, ప్రవాహము ఈరెంటినిగురించియే తెలిసికొనియున్నాము. వీటిఅన్నిటికన్న ముఖ్యమైనది బలము. బలమనగా కార్యసాధనమున కుపయోగింపబడు శక్తి. ఒకనదిలో బరువైనఇత్తడిపదార్థ మొకటి పడియున్న దనుకొనుడు. దానిని కదలించుటకు ప్రవాహరాశియత్యధికముగ నుండి ఉరవడి తగ్గియున్నచో లాభము లేదు. లేక ఉరవడి అధికముగానుండి నీరు తక్కువయున్నను అదియు ప్రయోజనము లేదు. ఆయిత్తడిపదార్థము నున్నచోటినుండి కదలింపవలెనన్న ఉరవడి నీరుకూడ అధికముగ నుండవలెను. ఇట్లున్ననే కాని ప్రవాహము బలముగ నున్నదని చెప్పము. అట్లే విద్యుచ్ఛక్తిచేయుపని రెంటిమీద నాధారపడియున్నది. ఒత్తిడిలేని గొప్పప్రవాహముకాని, ఒత్తిడికలిగిన స్వల్పప్రవాహముగాని ఎక్కువబలముకలిగి యుండజాలదు. ఇట్లు రెంటిమీద నాధారపడియుండుటవల్ల విద్యుద్బలమును ఈక్రిందిసూత్రమువల్ల తెలిసికోవచ్చును.

బలము=ఒత్తిడి × ప్రవాహము.

ఇట్టిబలముయొక్క ప్రమాణము వాట్ అని చెప్పుదురు. వాట్ అనువతడు రైలుబండిని గనిపెట్టిన మహనీయుడు. ఒకానొకపరిధిలో ఒకవోల్టుఒత్తిడియు, ఒక ఏంపియరు ప్రవాహము నున్నచో దానియొక్క బలము ఒక్కవాట్. మన ముపయోగించు విద్యుద్దీపము వెలుగుటకు 220 వోల్టుల ఒత్తిడి ఉండవలయును. ఒక్కొక్క దీపము $\frac{1}{7}$ ఏంపియరుప్రవాహమును తీసికొనును. అట్టిచో మన ముపయోగించుచున్న బలము $\frac{1}{7} \times 220$=రమారమి 30 వాట్లు. మనము విద్యుచ్ఛక్తిని చేయుటకుగూడ ఇంతశక్తి నుపయోగింపవలసియుండును. ఈపైసూత్రము నే ఇంకొకవిధముగ వ్రాయవచ్చును.

ఒత్తిడి=ప్రవాహము × నైరుధ్యము.

బలము=ఒత్తిడి × ప్రవాహము.

ఇందులో ఒత్తిడికి బదులుగ పైసూత్రము నుపయోగించిన నది యిట్లగును.

బలము = ప్రవాహము × ప్రవాహము × నైరుధ్యము
=ప్రవాహము$^2$ × నైరుధ్యము.

అనగా ఏపరిధిలోనైన నుపయోగింపబడు విద్యుద్బలమును తెలిసికొనవలయునన్న ప్రవాహము, నైరుధ్యము తెలిసిన చాలును.

ఒకగంటకాలములో ఉపయోగించిన వేయివాట్ల విద్యుద్బలమును ఆర్థికప్రమాణ మందురు. దీనినిబట్టి విద్యుద్బలమునకు విలువ కట్టుచుందురు.

55 పౌనుల బరువురాయిని 10 అడుగులఎత్తు ఎత్తినచో మనము చేసినపని 55 × 10=550 పౌను అడుగులు. ఇది పనికి ప్రమాణము. ఇట్టి 550 పౌను అడుగులపని ఒకసెకనుకాలములో చేసినచో అట్లు చేసినశక్తిని అశ్వశక్తి (Horse Power) అందురు. విద్యుచ్ఛక్తికిని, మిగిలిన శక్తిరూపములకును భేదము లేదని చెప్పియున్నాము. ఒకఅశ్వశక్తి 746 వాట్లకు సరిసమానము.

1. ఉదా.—చెన్నపట్టణములోని ఒక బంగాళా యందు 5 విద్యుద్దీపములు కలవు. అవి ప్రతిదినము 7 మొదలు 10 వఱకు వెలుగుచుండును. దీపము ఒక్కొక్కటి 30వాట్లబలమును తీసికొనును. ఆర్థికప్రమాణము 8 అణాలైనచో ఆబంగాళానివాసులు నెలకు విద్యుద్దీపార్థ మెంతసొమ్ము చెల్లింపవలెను?

దీపములలోనుపయోగించుబలము 5 × 30=150వాట్లు.

వెలిగిన గంటలు 3 × 30=90.

ఆర్థికప్రమాణములు=$\frac{150 \times 90}{1000}$=13.5

చెల్లించవలసినసొమ్ము=13.5 × $\frac{8}{16}$= రు 6-12-0.

---

# స్వర్భంగము

మొసలికంటి హనుమంతరావు గారు

మనుజుఁ డవిధేయుఁడై మును
వినిషిద్ధ మహీజఫలము వినియోగింపన్
మనకు బహుసుజలు మృతియును
బనుపడిన విధంబుఁ దెలియఁ బలికెదఁ దల్లీ.

ఘనభువనోత్పాదన కథ
తనజనులకుఁ దొలుతఁ బలుకుఁ దద్విజమణికిన్
జనవిరహిత 'రమ్యారబు
సినియాధరశిఖరములను' జెప్పవె తల్లీ.

ఏవం విధహ్యాత నిరవ
ద్యావాసము నేటిదాఁక నంబరకుసుమం
బై వరలదె మఱి సాధ్యము
గావింపకయున్న నరశిఖామణి తల్లీ.

సియనావసీ ధరోపరి
నియతస్థలమున నొ దేవనిలయోపాంత
ప్రయతశిలాతీరముననొ
ప్రియమారఁ జరించు జనని విద్యారమణీ.

పద్యమున గద్యమున మును
నుద్యమ మొనరింపనట్టి యుత్కృష్ట చరి
త్రోద్యోగమునకుఁ జొచ్చెద
నుద్యదయోనియను గన్నునున్నతఫణితిన్.

కరుణింపవె విమలమనో
వరనిలయైక ప్రతాప! ప్రకృతింవిహాగ
స్ఫురణను గరుడావరణముఁ
బఱపి పొదుగు తొంటిప్రోడ! భవ్యాత్మ!నను౯.

పరమేశ్వర సంకల్పము
లరయ ననింద్యములు నరుల కనిరూఢముగా
విరచించెద సజ్జ్ఞానముఁ
బఱపఁగదే వెనుపఁగదవె భావోన్నయము౯.

నిగ్రహ ముండిన సర్గ
శ్రీగ్రథితులుగాఁ దనర్చువృద్ధుల దైవా
నుగ్రహము సౌఖ్యములు పో
వ్యగ్రులఁగావించె నెద్ది స్వర్నిరయజ్ఞా.

కదియం దగుదని బలములు
పొదలం దివిఁ బొదివి దైవమును నాతఁడు పో
నదమఁగఁబడు కాలాహిమె
ముదుసలిఁ బ్రేరేచెమదిని మునుకొనుపగచే౯.

తలక్రిందుగ విక్లబమున
జ్వలితుండై గూలఁ దన్నెఁ బాపప్రహిలో
ఖలుని జగత్పతిఁ దలకొను
పలువనిఁ బటుపాశనిశితవహ్నులఁ గుందగ౯.

మనమానమునను దొమ్మిది
దినముల నలజలధిఁ దేలె దితవిజయేచ్ఛ౯
గన నశుభులైన సహచర
జనములతో నమరుఁ డయ్యు సంభ్రమపరుఁడై.

ఈవిధి పీని నితోధిక
దైవాగ్రహపాత్రునిగను దగ నేర్పఱిచెం
గావునఁ బోయినసౌఖ్యము [గు౯.
పోవనివెత దలఁచుకొనుచుఁ బారి క్షుభితుఁడ

దీనములై దుఃఖమున క
ధీనములై హృద్వ్యథాప్రదీపంబులు నై
గానవిగర్వములై మఱి
మానవి ద్వేషంబులైన మలినేక్షణము౯.

కలయంగ నెఱపి దిశలను
దిలకింపఁగ దేవమాన దీర్ఘంబుగఁ ద
త్ఖలుఁ డంతఁ గాంచె దుఃఖా
కలిత పరిస్థితి నిరర్థకము భీకరము౯.

చండశిఖావృతమగు శిఖ
కుండికవలెనొప్పు ఘోరకూపము గదె వాఁ
డుండినయెడ తత్కీలా
దండ మకట! తిమిరపిహిత తనుతేజమగు౯.

పరగఁ దమోముద్రితమై
కొఱవోయినకాంతి దుఃఖఘూర్ణితపటము౯
పరికింపఁ జేసి మానస
మెరియించుటె కాని సౌఖ్యమొనయింప దట౯.

హృచ్ఛాంతియు విశ్రాంతియు
నచ్చటలేవాన సహజ మది పొడమదు బా
ధోచ్ఛ్రయము పోదు విడువదు
చిచ్చు తఱుగకుండ మండు చెడు గాంధకమై.

తన తేజమునకు వెలిగా
మనభూవ్యాసమును మించి మఱి నగ మెడగాఁ
జను దట్టపుఁ జీకటిచెఱ
నునిచెను సత్యస్వరూపుఁ డాగి విప్లవుల౯.

ఇది యేడ నాకలోకం
బదియేడఁ గటా! మహానలాసారములో
నదవదపడువారలె తన
పదగులు నరకమున నెందుఁ బరికించునెడ౯.

కుటిలతఁ జటులతఁ దనయం
తటివాఁడు దురంత తాపతప్తుఁ డగుచుఁ జెం
గటఁ దోఁచె వాఁడె బెలిజెబు
పటునామంబునఁ జెలంగెఁ బాలావనిలో౯.

---

# ఆంధ్రవిశ్వవిద్యాలయము—ఆంధ్రసారస్వతాభివృద్ధి

నండూరి బంగారయ్య గారు

(వెనుకటిసంచిక తరువాయి)

ఇట్టి Comparative study of literature అందునుముఖ్యముగ సంస్కృతాంగ్ల సారస్వతపఠనమువలన ఆంధ్రులకు శాశ్వతలాభము కలుగనున్నది. వీరేశలింగముపంతులుగారి జననమునకు పూర్వము మనవాణి సంస్కృతభారతియొడిలో పెరిగినది. మనకున్న యుత్తమకావ్యములు, భారతభాగవతములు రెండునుకూడ వ్యాసవరప్రసాదములనియే పలువురతాత్పర్యము. కాని కొందరు విబుధాగ్రేసరు లీరెండుగ్రంథములు పేరునకుమాత్రము భాషాంతరీకరణములు కాని నిజమునకు స్వతంత్రగ్రంథములే యని చెప్పుచున్నారు.

ఇది యెంతవఱకు సత్యమో ఆంగ్లేయవిమర్శనాపద్ధతుల బరిశీలించిన యువకుల తీక్ష్ణదృష్టులు సంస్కృతసాహిత్యముపై బ్రసరించినప్పుడు తేలగలదు.

ఇది నిజమయినను, కాకున్నను తెనుగుగ్రంథములను మాతృకలతో బోల్చి చదువుట మనవిధాయకకృత్యము. ఇంగ్లీషు భాషాసంపర్కము కొన్నియెడల మనకు సంస్కృతసంపర్కముకంటెను హెచ్చువిలువగలది. ఎంతజాతీయత ప్రబలినను ఇతరులలో మంచిగుణములున్నప్పుడు స్వీకరింపకుండుట జాతి కనర్థదాయకమయినట్లే ఇతరసారస్వతములో విశేషములు గ్రహింపకుండుట సారస్వతాభివృద్ధికి పెద్దయవరోధము. మనవచనరచన చాలవఱకాంగ్లసారస్వతసంపర్కమున పెంపొందినదే. మననవలలు ఇంగ్లీషువారి నవలలను జదువుటవలన బయలువెడలినవే. మన నాటకములుకూడ కొంతవఱకు సంస్కృతసంపర్కముచే జనించినవైనను, చాలవఱకు షేక్స్పియరువలన బాగుపడినవే. ఇంకను మన యింగ్లీషునుండి పొందవలసినలాభము లంతరింపలేదు. మనలో విమర్శన మనునది మృగ్యము. వారిలో నొక్కొక్కవిమర్శకుడు తనజీవితమునంతను ధారవోసి యొకమహాకవి ఘనతను లోకమునకు వ్యక్తీకరించుచు వచ్చెను. మన కీలువేల్పులగు తిక్కనపోతనలనుగూర్చి యేవూలమాలలనో వ్రాసినవ్యాసములు తప్ప, ఒక్కవిమర్శనగ్రంథమైనను లేదే. ఆంగ్లేయుల బోధనవిధానములను, వచనరచనాపద్ధతులనుకూడ మనము విమర్శనబుద్ధితో పరిశీలించి, వలయు మార్పులతో జాతీయతకు భంగము లేకుండ గ్రహింపవలసియున్నది. అందువలన నీరెండువాఙ్మయములు తెనుగువాఙ్మయపఠనమునకు పైదోడులుగ నుండుట మంచిదని నాకు తోచినది. ఇంకను వలసినచో, ధనాభావము లేనిచో, యూనివర్సిటీవారు కొందఱు యువకులను బంగాళీ మున్నగు ఇతర హిందూదేశీయభాషలను, జర్మను ఫ్రెంచి మున్నగు విదేశీయభాషలను కూడ బాగుగ పఠించునట్లు చేయవచ్చును.

## బోధనాక్రమము

ప్రస్తుతబోధనపద్ధతులు మారనిదే ఎంతయుత్తమగ్రంథములను పఠనయోగ్యములుగా నిర్ణయించినను లాభము లేదు. సర్ రఘుపతి వేంకటరత్నమునాయుడుగారు షేక్స్పియరుపాఠము చెప్పుచున్నప్పుడు చాల ఆవేశజనకముగను,హరికథవలె నానందదాయకముగను నుండెడిదట! ఇంతమందియొద్ద జదువుకొంటినికాని యానందదాయకముగ పాఠములు చెప్పువారు నా కొక్కరును కానరాలేదు. అంతయుత్తమపద్ధతిని గాకపోయినమానిరి, సాధారణముగా నందరు నింగ్లీషుసాహిత్యమును బోధించునట్లు సంసారపక్షసార్వరస్యగ్రహణమైన మనవారిబోధనలలో గానరాదే! పానుగంటి నరసింహారావుపంతులుగారు చెప్పినట్లు "తెనుగుపాఠమనిన" బాలురకు "కైవామాత్ర" వలె గాన్పించుచున్నది. కేవలము ప్రాచీనపండితులయందు నాకు నమ్మకము చెడినది. ఎవరో యొకరి

ద్దరు స్వారస్యగ్రహణశీలు రున్నను మొత్తముమీద తెనుగు బోధించు పండితులకు విమర్శనసామర్థ్యము తక్కువ. ఇంచుమించుగా ప్రాచీన తెనుగుపండితు లందఱకు శ్రోత్రపోకడలన్న కోపము. ప్రాత దేదైనను పథ్యాహారమే.

ఆధునికు లయినవారికావ్యములు పఠనార్హ్వములుగ జేయబడినపుడు వారందఱు సమకాలికులగుటచే పండితు లాగ్రంథములలోని తప్పులుమాత్రమే వెదకి గ్రంథకర్తను కపితీరునట్లుగా దిట్టుచుందురు. వీరేశలింగముగారి మతము నచ్చనివారు ఆయనగ్రంథ మేది వచ్చినను ఏవిసంధినో నెపపెట్టుకొని గోత్రనామములతో సహా వారిపూర్వుల నందఱిని దిట్టుచుందురు. అంతేకాని వ్యక్తులపాంతకు బోక, ఉన్నదున్నట్లుగా కావ్యమును గ్రహించి "దీనిలో నిది మంచి- ఇది చెడ్డ" యని బోధించు నిష్పాక్షికస్వభావు లెవరైన మన యింగ్లీషుచదువుకొనినవారిలో నున్నారు కాని శుద్ధ తెనుగుపండితు డొక్కడును వాకు గానరా లేదు.

పోనిండు; ఆధునికులపై కోపపడుటకు వారి కేవైన కారణము లుండవచ్చును. పూర్వగ్రంథములను బోధించునప్పుడైన సారస్యగ్రహణబుద్ధితో నుపన్యసింతురా యనిన నదియును మృగ్యమే. పాండిత్యమనగానే మనవారికి విపరీతాభిప్రాయము లున్నవి. నిలుచుండినపాటున అమరని ఘంటువు నప్పచెప్పగలవా డెవడో వాడు ఘనపండితుడు. ప్రతి తెనుగుపండితుడు తాను చదివినగ్రంథముల జూపి తాను మనయెదుట బారవైచి, యేదైన సందేహముతీర్చుకొనబోగా "నిన్నగాక మొన్న కన్నులు తెఱచిన నీకేమి తెలియును? నీ కత్తరములైనను రా" వని కసరికొట్టునే! విద్యార్థులయెడల సానుభూతి చూపువా రరుదుగా నున్నారు.

మనవారు వ్యాకరణదాసులు. భారతమంతటి యుత్తమగ్రంథమును బోధించుచున్నపుడైన జీవితమునకు సారస్వతమునకు గలసంబంధమునుగూర్చి కాని, యున్నతాదర్శములనుగూర్చికాని యుత్తమపాత్రోన్మీలనమునుగూర్చి కాని తలపెట్టనైనను తలపెట్టక, వ్యాకరణవిశేషములను గూర్చి ముచ్చటించి పాండిత్యప్రకర్షణము జేసికొందురు. శ్రీడాభిరామ మనుసాహిత్యగోష్ఠీసందర్భమున వ్యాకరణవిషయములను దీసికొనివచ్చుట వైవాహికమంగళాశీర్వచనమునకు శ్రాద్ధబ్రాహ్మణుని బిలుచుటవంటిది. ప్రేతకళలీనువానిని జూడగనే బాలురు జడిసికొందురు. అప్పుడే మొదటిఫారములో చేరి యానందవాచకమును చేతబట్టిన పాలబుగ్గలుగల పసిబాలురచేతగూడ "డుముఫులు ప్రథమావిభక్తి, డుముఫులు ప్రథమావిభక్తి" యని వ్యాకరణము బండగ వల్లెవేయింతురు. బాలురుతమకు విషయమవగాహనము కాకపోయినను మాస్టరుగారు కొట్టెదరేమో యనుభయముతో బట్టీపట్టుకొని పోయెదరు. బాల్యభయంకరు లగునిట్టియుపాధ్యాయులచేతులలో బడినవారికి తెనుగుభాషలో నభిరుచి కమ్మనిన నెక్కడనుండి వచ్చును! ఇంటరుమీడియటువరకు తెనుగు చదువుకొనినవారుకూడ తెనుగుకావ్యములను చదువుచున్నప్పుడు స్వారస్యగ్రహణమనునది యొకటి యున్నదని గుర్తింపనే గుర్తింపరు.

స్వతంత్రబుద్ధిని మనపండితులు సహింపరు. ప్రాచీనకవులనుగూర్చి నాలుక మెదపినను మహాపరాధము. "తిక్కననుగూర్చి తప్పు పట్టుటకు వీడెంతవాడు!" అని నిరసించివైతురు. తప్పులైనప్పు డెవరివైనను తప్పులే కావా యనుసహనబుద్ధి వారికి లేదు. గ్రంథప్రాశస్త్యనిర్ణయమున ప్రాచీనతయే ప్రధానాంశము. తిక్కనకంటె పూర్వుడు గావున నన్నయ తిక్కనకంటె గొప్పవాడు. పోతనకంటె పూర్వుడు గావున తిక్కన పోతనకంటె గొప్పవాడు. అంతేకాని వేరువేరుగ దీసికొని వీరిరువురికి ఏయే విషయములలో తారతమ్య మున్నదని పరిశీలించినవారి సంఖ్య మిక్కిలి తక్కువ. అందువలననే యుత్తమకవులను, అధమకవులను గూడ కట్టగట్టి యొకే తరగతిలో గూర్చుండబెట్టి మనవా రూరేగింతురు. ఈచర్విత చర్వణాభిప్రాయదాస్యము పోవువఱకు నాంధ్రసారస్వతమునకు సుదినములు రానేరవు.

విద్యార్థులను బండగా వల్లెవేయుటునక, కావ్యరసమును గోరుముద్దలుగా బెట్టి నోరూరింపగల యుపాధ్యాయులు మన కిప్పుడు గావలయును. "విన్నన్న చెప్పినదే వేద"మని కూర్చుండక బుద్ధిసూక్ష్మతకు, స్వతంత్రాలోచనకు ప్రోత్సాహ మిచ్చుచు, జీవితమునకు, సారస్వతమునకు సామరస్యమును గల్పించి చెప్పజాలు నుపాధ్యాయులు మన కిప్పుడు గావలయును. అప్పుడే తిక్కనాదుల కావ్యములపై ప్రశస్తములగు విమర్శనములు బయల్వె

వెడలి యాంధ్రుల కావ్యనిర్మాణవైభవము నాంధ్రులు సంపూర్ణముగా గ్రహింపగలుగుదురు.

ఈగ్రహించిన భావములకు వారు శాశ్వతరూప మీయవలె నన్నను, లేక వీనినిబట్టి నూతనగ్రంథములు వ్రాయవలె నన్నను, వచనరచనాదక్షత యావశ్యకము. అందువలన విద్యార్థులకు నవీనపద్ధతుల ననుసరించి వచన రచన నేర్పుటకూడ విద్యాలయమువారి విధ్యుక్తధర్మము.

## వచనరచన

ఆంగ్లేయభాషలోని వచనగ్రంథములను వేనిని జూచినను మనసారస్వతమువంక దృష్టి నిగుడ్చినప్పు డొక్కనిట్టూర్పు విడువవలసివచ్చును. ఆగ్రంథములకున్న భావౌన్నత్యము, స్వరూపసౌష్ఠవము, శైలిమాధుర్యము మనలో నెక్కడ నున్నవి? చిన్నవ్యాసము మొదలుకొని పెద్ద భారతమంతటి గ్రంథమువఱకు దేనికది యెంతమనో హరముగ నుండును! వారిశైలివైవిధ్యము మనవారి కెక్కడ నున్నది? కార్లైలు శైలి అగ్నిజ్వాలవలె తీవ్ర ముగ నుండును. రస్కిను శైలి పూవులతోటవలె నలంకార భూషితము. గోల్డుస్మిత్తుశైలి చంద్రజ్యోత్స్నవలె చల్లగ నుండును. రవీంద్రుని వచనశైలి కవితానిగుంఫనము. గాంధీ శైలి బ్రహ్మవర్చస్విని యగు ఋషిపత్ని. ఇట్లొకటి రెండు కావు: వారిలో రచయిత లెంతమందియున్నారో యందర కన్నిశైలులు నున్నట్లు తోచును. ఒక్క శైలి విషయమునసే కాక ఏవిషయము నెత్తుకొనినను వా రెంత గాఢముగ నాలోచించెదరు! ఎంత గంభీరముగ, ఎంత సర్వాంగసుందరముగ నుపన్యసించెదరు!

ఇటీవల మనభాషలో బయలువెడలుచున్న చిన్న కథలను జూచినను, సాహిత్యవ్యాసములను జూచినను మనము తలవంచుకొనవలసియుండును. మనలో సహజ పండితుల సంఖ్య యత్యధికమైపోయినది. బి. యె. తర గతి ప్యాసగునంతవఱకు తెనుగుగ్రంథమును చేత బట్టనే బట్టడు. ఒకానొకసాయంకాలము సిగరెట్టు కాల్చుకొ నుచు షికారుపోయి యొకచిన్న Short Story నాలో చించి వచ్చును. మనకు భావమే ముఖ్యము కాని భాష ప్రధానము కాదుగా? అందువలన గ్రామ్యాగ్రామ్యవిభే దమును వదలిపెట్టి, యౌచిత్యాదికావ్యగుణముల నన్నిటిని వదలిపెట్టి, సర్వసంగపరిత్యాగులై గ్రంథములు, నవ లలు రచించెదరు. ఈనవలలో నొకపేరగ్రాఫులో నొక వాక్యము కొబ్బరచెట్టునుగూర్చి, మరియొక వాక్యము కోమటిదుకాణమునుగూర్చి, యింకొకటి కోయవాండ్ర జీవితమునుగూర్చి యుండును. ఈవాక్యములు వేనికవే వ్యక్తిస్వాతంత్ర్యమును జాటుచు, ఒకదానికొకటి యతు కకుండ నీరసముగ నిలుచుండిపోవును.

మన కీవచోదారిద్ర్యము ముఖ్యముగ రెండుకారణ ములవలన జనించుచున్నది. మన కింకను ఒకవ్వాల భూమి మీద పాదము పెట్టకుండగనే గ్రంథరచనము చేయవలె నన్నయుబలాటము మెండు. అందువలన ప్రాచీనగ్రంథ ములను దరికి రానీయము. వానిలోనున్న శైలియౌన్న త్యము గ్రహింపనక్కరలేదు. మనకు ప్రకృతియే ప్రబ లాధారముగదా! ఇంక మన కున్న యాలోచనములనైన సరిగా జీర్ణముచేసికొని వ్యాసమున కొక స్వరూప సౌష్ఠవము నిచ్చుటకైనను మనము తాళజాలము. ఎందు వలన? ఈలోపుగ నావేశము దిగజారునేమో యని భయ ము. మనవారీనిర్వికల్పసమాధులను విడిచిరానంతవఱకు తెనుగువచనరచన బాగుపడదు.

రెండవది, తెనుగువచనరచన బోధించుపద్ధతులు బా గులేవు. సరిగా వ్యాసమనిన నేమో తెలిసి, శైలికి వలసి నస్వాలభ్యము,బిగి,జాతీయత,మితభాషావిరచనము, ధారా శత మున్నగు గుణములను గుర్తెఱిగి బోధించువారు చాల తక్కువ. విషయమంతయు జడయల్లికగా నుండవలెనని యు, అలలవలె నొకవాక్యమునుండి యింకొకవాక్యము బయలుదేర వలెననియు, అన్నిటికి ఐక్యముండవలెన నియు తెలిపి వ్యాసరచన బోధించువా రెంతమంది యు న్నారు? వ్యాసము వ్రాసినచో అందులోనున్న "బండిరా ల"ను, "అరసున్నలను", "ంబు" (కోశంబు) లను లెక్క పెట్టుకొని మార్కుల నిచ్చువారుకూడ కలరు. అందువలన నికముందు నవీన బోధనాపద్ధతులలో కృతార్థులు కాని వారిని తెనుగు బోధించునుపాధ్యాయులుగా నియమింప రాదని యొకతీర్మానమును పెట్టిన బాగుండును.

ఈసందర్భమున మనవిద్యార్థులను ఇంగ్లీషులో శైలికి పేర్వడిన స్విఫ్టు, గోల్డు స్మిత్తు, గాంధిమున్నగు వారిగ్రంథములను బాగుగ పఠించునట్లుచేయవలెను. అందు

వలన శైలినడక యెట్లుండునో, విషయము నెట్లు సంపూర్ణముగ జీర్ణముచేసికొననిదే కాగితముమీద కలమును బెట్టరాదో కొంతవఱకు గోచరించును.

కాని అంతమాత్రము సరిపోదు. ఇంగ్లీషు చదువుకొన్న మనవారికి వచోధారాళత తక్కువ. వివిధాభిప్రాయవైఖరులను (Shades of Thought) తెనుగులో చిత్రించుట కష్టమని మనవారి యభిప్రాయము. ఈయభిప్రాయముతో దినచర్యగ్రంథములను,జాబులనుకూడ ఇంగ్లీషుననే వ్రాయుచున్నారు. ఇందు కొంతసత్యమున్నది. ఇంగ్లీషుభాషాసాంగత్యము గాఢముగ సాగుటవలన మన యభిప్రాయములే ఇంగ్లీషులో పుట్టి, వానిని తెనుగులోనికి తర్జుమాచేసికోవలసిన యగత్యమువచ్చినది. వీరేశలింగముపంతులుగా రంతటివాడు "నాప్రియమైన అయ్యా! (My dear sir), దయనీయుడనైన మీ సోదరుడను (I am your pitiable brother)అని యీవిధముననింగ్లీషుబందుకట్టువాక్యములు వ్రాయవలసివచ్చినది. మనరచనలలో నెట్లును కొంతవఱకు విదేశసాంప్రదాయము చొరకుండనుండదు. మఱియు మనభాషలో లేని "ఇంజను"మున్నగుశాస్త్రసంబంధములగు పారిభాషికపదముల నెరవు తెచ్చుకొనుటలో మనము సందేహింపవలసినపనిలేదు. అభివృద్ధిచెందిన యేభాషయైనను నీక్రమము నవలంబించినదే. కాని మనభాషలో నున్న సామగ్రి చాలనపుడే ఇతరభాషలకు పోవచ్చునుకాని యూరక పోవుట ధర్మముకాదు. వచోధారాళతకు మనపూర్వగ్రంథములు,ముఖ్యముగ భారతము చాల తోడ్పడగలదు. ఉత్తమశైలిరచయిత యనదగిన వీరేశలింగముపంతులుగారికయిన నొక్కొక్కభారతవచనమునకున్న అతిమానుషతేజము పట్టుపడినదికాదు. అదిగాక భారతము అర్థగౌరవప్రధానమగు మహాగ్రంథము కావున అందులేనియభిప్రాయ వైఖరులరుదు. కావున వాక్సమృద్ధియలవరచుకొనదలచువారికది గురుస్థానము నాక్రమింపదగినది. ఆధునికులగు వీరేశలింగముపంతులు, చిలకమర్తి లక్ష్మీనరసింహముగార్లు రచించినగ్రంథములు చదివినను, పానుగంటి నరసింహారావు పంతులుగారు రచించిన గ్రంథములు చదివినను మంచి వాగ్ధారాళత యలవడును. ఈయున్న యాదర్శములను బాగుగపరీక్షించి,వానిలోపములను దిద్ది,అభినవాంగ్ల గ్రంథములనుకూడ పఠించి వానిగుణములనుగ్రహించి, ఈరెండింటినడుమ తమవ్యక్తిత్వములను విడిచిపెట్టక తేజోవంతమును, సజీవమునగు నూతన శైలి నిర్మాణమునకు గడంగు భాషాచక్రవర్తులకు ఆంధ్రవిశ్వవిద్యాలయము పుట్టినిల్లు కావలసియున్నది!

## పరీక్షలు (Question Papers)

మద్రాసు విశ్వవిద్యాలయము తెనుగుపేపర్లను జూచినవారి కొక్కవిషయము సువ్యక్తము కాగలదు. ఇంటరుమీడియటు పేపరేకానిండు,బి.యే పేపరేకానిండు విద్వాన్ పేపరే కానిండు,ఏదిచూచినను అందుపరీక్షకుని "దురాశ"వారికి సువ్యక్తము కాగలదు. వామనమూర్తి మూడుపదములతో త్రిలోకము లాక్రమించినట్లు సారస్వతమునంతను గూర్చి యొక్కప్రశ్నలో, నొక్కభాగములో నడిగివేయవలెనని వారియాశ. తొమ్మిదిపెద్దప్రశ్నలున్న పేపరులో ఒక్కొక్కదానికి పది అ, ఇ, ఉ (a,b,c) లను జేర్చి,అందులో నొకభాగమున, "రామరాజభూషణ శ్రీనాథ తెనాలిరామకృష్ణ ధూర్జటుల కావ్యములనుగూర్చి సంక్షేపముగా వ్రాయునది" అని ప్రశ్నించిరి. ఇట్టియుదాహరణముల నెన్నిటినైన నీయవచ్చును.

పరీక్షకుడేమాత్రము వ్రాసినను తృప్తిపడి మార్కులనిచ్చు అల్పసంతోషియే కావచ్చును. కాని ప్రశ్నయెంత దూరమువఱకు పోవుచున్నదో తాను గుర్తించియుండ నక్కరలేదా? ప్రశ్ననిచ్చునప్పు "డిక్కడనుండి యింతవఱకు సమాధాన"మని నిర్ణయించుకొని మఱియు ప్రశ్ననీయ నక్కరలేదా? అశ్వత్థామవలె నస్త్రోపసంహారణము తెలియకుండ నస్త్రములను ప్రయోగించు పరీక్షకులవలన నేమిప్రయోజనము? ప్రశ్నకుసమాధాన మేమి వ్రాసినను, ప్రశ్నయెంతదూరమువఱకు పోవుచున్నదో యాలోచించుట, తానీయబోవుసమాధానమునంతను సూటిగప్రశ్నమున కన్వయించునట్లు త్రిప్పుకొనుట-వీనిలోనే విద్యార్థి తెలివితేట లెక్కుడుగ బయలుపడునని పరీక్షకులు గ్రహింపవలసియున్నది. గుక్కత్రిప్పుకొననీయకుండ అంతేమందికవులనుగూర్చి నిమిషములో వ్రాయుమన్నచో విపులముగ విద్యార్థి యెవరినిగూర్చి వ్రాయగలడు? విపులముగ వ్రాయక సూత్రరచనకు గడంగినచో విద్యార్థి

తనసొంతముగ చెప్పెడుదానిని గ్రహించి వ్రాయుచున్నాడో, జనాపవాదమునే ప్రమాణముగా గైకొని వ్రాయుచున్నాడో ఎట్లు తెలియగలదు?

## భారతము

భారతామృతమును గ్రోలనియాంధ్రు డెవ్వడును ఆంధ్రసాహిత్య పట్టభద్రుడు గానేరడు. ఆంధ్రజాతి కళాప్రపంచమునకు మూడుకోహినూరువజ్రములను దానముచేసి యున్నది. అందు మొదటిది అజంతాగుహాలయములు. దీనియపురూప లావణ్యములను గ్రహించి ప్రాచ్యప్రతీచ్యఖండము లేక ముఖముగ నారాధించుచున్నవి. రెండవది త్యాగరాజుగీతములు. వీని నాంధ్రభాష తెలియని తమిళులు, మళయాళీలుకూడ నిత్యపారాయణముచేసికొనుచు శిరసావహించుచున్నారు. తృతీయము, మహోత్తమమునగు ఆంధ్ర మహాభారతమునందలి యమృతసంగీతము నింకను ఆంధ్రులే యాలకింపలేదు. కాని భయము లేదు: ఆచంద్రార్కముగ నిలిచి, తనదివ్యకళావిలాసముచే విశ్వమునంతను విభ్రాంతముగా జేసి, విదేశములందును మంగళహారతు లందుకొనగలశక్తి జగన్మోహినియగు నాంధ్రమహాభారతమునకు లేకపోలేదు. గ్రహగతులకైన చలనమున్నది కాని యాంధ్రభారతవాణీ విరావమునకుమాత్రము చలనములేదు. విరామములేదు. అది సత్యముతో తుల్యముగ శాశ్వతమైనది. ప్రణవరావముతో తుల్యముగ పవిత్రమైనది.

ఆంధ్రమహాభారతము మనవారందరనుకొనునట్లుగ సంస్కృతమునకు భాషాంతరీకరణముకాదని బహుభాషాకోవిదులును, విశేషించి యుత్తమరసగ్రహణపారీణులు నగు శ్రీయుత కామరాజు లక్ష్మణరావుపంతులుగారు సెలవిచ్చియున్నారు. హిందూదేశచరిత్రమును వ్రాయుచు కాళిదాసాదులనుగూర్చి ముచ్చటించు సందర్భమున నాంధ్రకవులలో తిక్కనయోగినిగూర్చి "జగత్తునమతియేకవియు నిన్నినియమములఁ బాటించుచు నింతచక్కగ నిట్టిగ్రంథమును వ్రాయలేదని చెప్పినను చెప్పవచ్చును" అనియు, ఉభయభారతములను దగ్గర నుంచుకొని కేవలకథాశ్రవణకుతూహలపరత్వముతో గాక ఇంగ్లీషువారు షేక్స్పియరును, మిల్టనును పఠించునట్లుగ పఠించినచో విమర్శకుల కాంధ్రమహాభారతము యొక్క నిజమైనవైభవము గోచరించుననియు వారు సెలవిచ్చిరి. అట్లని సంస్కృత మహాభారతమును వారు కొంచెపరుపలేదు. "ఇతిహాసముగను, కావ్యముగను దానిఘనత గొప్పదని మే మెఱుఁగకపోలేదు. కాని సంస్కృతమహాభారతము బంగారపుముద్దవంటిది. తెనుఁగు మహాభారతమందునుండి తనకుఁ గావలసిన బంగారము నెత్తికొని స్వర్ణకారుని బుద్ధివైభవముచేఁ జేయఁబడిన సువర్ణ కమలమువంటిది. ఈయుభయభారతములను పరీక్షించి స్వర్ణకారుని బుద్ధివైభవమును వెల్లడించుటయే మాయుద్దేశ్యము" అనినుడివిరి. ఇంగ్లీషులో షేక్స్పియరు, మిల్టను మున్నగుకవులతోను, సంస్కృతమున వ్యాస వాల్మీకి కాళిదాసాదులతోను చెలిమిచేసివచ్చిన యీచరిత్రకారుని వాక్యము లెంతవఱకు సత్యములో నిర్ణయించుకొనవలసినభార మాంధ్రవిశ్వవిద్యాలయముపై నున్నది. సంస్కృతభాషాజ్ఞానము లేనివారైనను రసాస్వాదనచణులకు ఆంధ్రభారతమాహాత్మ్యము గోచరింపకపోదు. ఒకభాషలోనున్న కావ్యములోని దివ్యతేజము నింకొకభాషలోనికి తర్జుమాచేయుట కెన్నడును వీలులేదనియు, ఒకవేళ నట్లెన్నడైన జరిగినను ఆ మొదటికవిచే కావ్యమునునిర్మింపించిన యాద్యశక్తియే ఈద్వితీయకవినిగూడ ఆవహించియుండక తప్పదనియు కావ్యరసగ్రహణశీలురకు చెప్పవలసినపనిలేదు. అవతారమూర్తియనదగిన తిక్కకవి దివ్యతేజ మారాధనతత్పరులగు నాంధ్రులకెల్ల నవ్యదర్శన మిచ్చుచున్నది.

ఇంటింట నీయాంధ్రభారతవాణీవిరావము నవనవానందభరితమై మారుమ్రోగవలయును. ఆంధ్రకుమారులు తమప్రాచీనుల పురాణకళావైభవముతో ప్రతీచ్యుల నవీనకళావిలాసమును వియ్యమందించి నూత్నసృష్టికి గడంగవలెను. వేయేల! ఆంధ్రసారస్వతచరిత్రమున నూత్నయుగోదయమును గావించువఱకు విద్యాలయాధికారులకు, సభ్యులకు కంకణవిసర్జనమునకు వల్లపడదు. ప్రస్తుతము కార్యభారము భారతారాధన తత్పరులును, రసికులు నగు రామలింగారెడ్డిగారిమీద నున్నది.



# అక్రూరుఁడు

వాసిరెడ్డి వేంకటసుబ్బయ్య, బోడేపూడి వేంకట్రావు గార్లు

తనచేయుదానికంటెఁ బరునిచేఁ జేయించునట్టి ద్రోహము లోకం
బున వేమడుంగు లధికం-బని చెప్పిరి ప్రాజ్ఞులైన యాదిమునీంద్రుల్.

మ. తన కీకుండ యశోదపుత్త్రునకు సత్రాజిన్మహీపాలకుం
డనుఁగుం గూఁతు నొసంగినాడని యసూయాదాసుఁడై యేమె
ఱుంగని వానిన్ శతధన్వుఁ జేరి యెవియో కల్పించి బోధించి వృ
ద్ధుని నిద్రాణునిఁ జంపఁ బంచిన దురాత్ముండున్ మహాభక్తుఁడే.

ఉ. మామనుజంపె నన్ దురభిమానముచే హరి యెత్తివచ్చుచో
నీమెయిఁ బ్రాణముల్ నిలుచు నెంతకు నంతకుఁ బోరువాఁడ నం
చేమియొ రజ్జ యాతఁడు పయిం బఱతే శతధన్వువీడి ప
ల్కా మెయి బొంకొనర్చిన దురాత్ముఁడు భాగవతోత్తముండటే.

తే. బ్రహ్మహత్యాదులగు మహాపాతకంబు లెన్నికల వన్నియును నొక్కయెత్తు చూడ
తన్నునమ్మినవాని గోతఁ బడఁద్రోయు పాపమది యొక్కయెత్తని పలుకు శ్రుతులు.

శా. నోరూరం బలుకుల్ వచించి శతధన్వున్ బట్టి నిర్మాయికుం
జేరందీసి శ్యమంతరత్నమును జేఁ జిక్కించుకోనేర్చెఁ గా
నీ రవ్వంతయు కష్టకాలమున వానిం జేరఁ డవ్వాని న
క్రూరుండంచు వచించు కన్నను మహాక్రూరుండనన్ జెల్లదే.

సీ. సత్యభామాదేవి శౌరిపాలయ్యెఁగా యని కుమారిలు నసూయాగుణంబు
నర్ధరాత్రమున నిద్రావస్థనున్న వృద్ధు వధింపఁ బంచిన ద్రోహబుద్ధి
నమ్మించి శతధన్వు నట్టటఁ ద్రోచి వెన్కకు జారిపోయిన కపటవృత్తి
యాశ్యమంతక మట్లు హరియించి కుక్షి నింపుకొనఁ జొల్పడినట్టి ముచ్చుదనము
తే. నెందుఁబోయెనో యక్రూరుఁ డిద్ధరిత్రి-నెచోటు వాసిన నట కనావృష్టి యయ్యె
భక్తజనములలో మేలుబంతి యయ్యె-కట్టుకతలకు తలయు తోఁకయును కలవె.





# ఆంధ్ర దేశపు జైన కవులు

ఆంధ్ర దేశమునందు పూర్వకాలమున జైన మతస్థులు మెండుగా నుండిరనియు, వారు గొప్పవిద్వాంసులయికూడ నుండిర నియు నందఱకు తెలిసినవిషయమే. అయినను ఆంధ్రభాషలో నిప్పుడున్న వాఙ్మయము పుట్టు కాలమునకు జైనులప్రతిభ తగ్గిపోయినది. కను కనే ఆంధ్రసారస్వతములో ద్రవిడకర్ణాట సార స్వతములలోవలె జైనగ్రంథములు లేవు. అట్టివి [illegible]ముననుండి యుండవలెననియు, వాడుక లేమిచే కాలక్రమమున నష్టములై యుండు ననియు పండితులయూహ. ఆంధ్ర దేశము నేలిన రాజుల శాసనము లనేకములందు ప్రతిగ్రహీ తలు జైనపండితులు. బెజవాడలో పదవశతా బ్దమున "నడుంబివసతి" యను జైన దేవాలయ ముండెనని యావసతి భూదానము చేసిన యొ కానొక పూర్వచాళుక్య తామ్రశాసనమువలన తెలియుచున్నది. ఆంధ్ర దేశము నేలిన సుప్రసి ద్ధులగు కాకతీయరాజులు మొట్టమొదట జైనులైయుండి పిదప వైదికశైవమతావలంబ కులైనట్లు చరిత్రశోధకులకు తెలిసినవిషయమే. అనుమకొండలోని పద్మాక్షి దేవాలయము మొట్టమొదట జైన దేవాలయమైయుండినట్లం దలి శిలాశాసనములే చాటుచున్నవి.

ఇప్పు డాంధ్ర దేశమున నాంధ్రజైను లున్నట్లే తోచదు. ఎచ్చటనైన నుండినను ప్రతిభ లేక వారున్నవిషయమే లోకమెఱుగ కున్నది. పండితారాధ్యుని శివతత్త్వసారము, పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్ర ము, బసవపురాణము ఇత్యాదిగ్రంథములు కొన్నిటిలో జైనులప్రస్తావ ముండి వారిమత మొకవిధముగా ఖండింపబడినను ఆగ్రంథకర్త లకు జైన బౌద్ధమతములు రెండును వేఱ్వే ఱనికూడ తెలిసియున్నట్లేర్పడదు. ఇట్లుండ ఆంధ్ర దేశములో పూర్వముండిన జైనబౌద్ధ పండితులవిషయము ఎంతకాలదిగా నైనను క్రొత్తగా దొరకిన విలువగల విషయమే. ఆంధ్రమునకు లక్షణమును, ఛందస్సును వ్రాసి మహాభారతమును గూడ తెనిగించెనని ప్రసిద్ధి వడసిన యథర్వణాచార్యుఁడు జైనమతావ లంబియని కొందఱుపండితుల యభిప్రాయము. ఈయన రచించిన భారత మిప్పుడు దొరకకనం దున వెనుకటిలక్షణగ్రంథములలో నుదాహృ తములగు కొలదిపద్యములతోనే చదువరులు తృప్తినందవలసియున్నది. ఇతఁడు సంస్కృత మునను, తెనుగునను వ్రాసినలక్షణగ్రంథములు మాత్రము నేటికి నిలిచియున్నవి. అథర్వణ కారికల తుదను "ప్రమాణ మకళంకస్య పూజ్య పాదస్యలక్షణమ్" అనిపూర్వకర్ణాటకవ్యాకరణ కర్త లుదాహరింపబడిరి. ఇందుదాహరింపబడిన అకళంకుడును, పూజ్యపాదుడును కర్ణాటక

భాషలో ప్రాచీన కవులును, గ్రంథకర్తలును. వీరిలో అకళంకుడు రాష్ట్రకూట కృష్ణరాజు కాలముననుండి 'యుత్తర పురాణ' మను కర్ణాటక ప్రబంధమును రచించెను. పూజ్యపాదుడు జినేంద్రబుద్ధి యను నామాంతరము గలిగి, శబ్దావతారమను కర్ణాటవ్యాకరణమును వ్రాసి పశ్చిమగాంగరాజైన దుర్వినీతుని యాస్థానియం దతని యాచార్యుడై యుండెను.

వేములవాడ భీమకవి కృతియని ప్రసిద్ధి చెందిన భీమనఛందస్సున నింకొక జైన విద్వాంసుఁ డగపడుచున్నాడు. లోకమున నీ గ్రంథము భీమకవి రచించినట్లు ప్రసిద్ధమైనను ఇందలిపద్యము లనేకములలో నిది 'రేచన' యను జైన ప్రభువు కృతిగా గన్పట్టుచున్నది. ఈ రేచనను వాగీంద్రచూడామణిచరణసరసీరుహామధుకరాయమానుడనియు, శ్రావకాభరణుడనియు నా గ్రంథమే వాకొనుచున్నది.

ఈకాలమునకు పిదపగూడ నంధ్ర దేశమున సుప్రసిద్ధులైన జైన విద్వాంసు లుండిరి. వీరిలో ప్రసిద్ధుడు బైచదండనాథుని పుత్త్రుడైన ఇరుగపదండాధినాథుడు. సంస్కృతమున సుప్రసిద్ధమగు 'నానార్థ రత్నమాల' యను నిఘంటువు వ్రాసిన దీదండనాథుడే. అయిన నిత డాంధ్రుడుగాక కర్ణాటకుడేమో యని తోచుచున్నది. ఈరాజు విజయనగర చక్రవర్తి హరిహరరాయల యాస్థానమున నుండి యనేక ధర్మకార్యముల నొనర్చియున్నాడు.

కాకతీయులనుగూర్చిన స్థానికచరిత్రములయందును, గాథలయందును నారాజులువీర శైవులుగాను, జైనమతమునకు ప్రబలశత్రువులుగాను నుండిన ట్లేర్పడుచున్నది. వీ రనేక జైనవసతులను పడద్రోయించి శివాలయములుగా మార్చినట్లు కథ లున్నవి. అయినను చరిత్రశోధకుల కీగాథలన్నియు వాస్తవములా యనుసందేహముమాత్ర మప్పుడప్పుడు పొడముచునే యుండును. కాకతీయ రాజులలో ప్రతాపరుద్రుని కాలమున జైనులుండినట్లుగాని, వారికి రాజునొద్ద నెట్టిసౌకర్యములు కలిగినట్లుగాని, చరిత్ర మెఱుగదు. ఈ ప్రతాపరుద్రుడు ఆంధ్రమున స్థానిక చరిత్రములలో పండితారాధ్యులయొద్ద శైవదీక్షబొందినట్లున్నది. ఇతనికి పూర్వ్వ[illegible] న రాజులగు గణపతిదేవుడును, రుద్రమదే[illegible] నా కాలమున దేశమంతయు సుప్రసిద్ధము[illegible] డిన 'గోళకిమఠ'మను శైవమఠమున కాచార్యులగు విశ్వేశ్వరశివ దేశికుడు, సోమశంభు దేశికుడుమున్నగువారిచే దీక్షబొందినట్లు శాసనములవలన నేర్పడుచున్నది. ఇట్లీ రాజులు వీర శైవులై యుండియు వీరికాలమునగూడ కొందఱు జైనాచార్యులు కాకతీయ రాజ్యములో నుండినట్లు తెలియుచున్నది. జైనమతము నీ రాజులు ధ్వంసముచేసినట్లు చెప్పెడిగాథలు నిజమైనయెడల జైనమతమునకు జెందిన యేయాచార్యుడును తన గ్రంథములో నీరాజులను ప్రసిద్ధముగాఁ జెప్పియుండడు. కాకతీయ రాజధానియందు కొన్ని జైన దేవాలయము లుండినవి. ఇట్టియాలయములలో నొకదానిని ఆంధ్ర కావ్యమగు క్రీడాభిరామము పేర్కొనుచున్నది. అయినను దానివలన క్రొత్తగా నే జైనాచార్యుని పేరుగాని మనకు తెలియరాలేదు.



ద్విజేంద్రలాల్‌రాయి



హొయిసలవిష్ణువర్ధన మహారాజు

రెండవ ప్రతాపరుద్రుని కాలమున నప్పయార్యుడను జైనాచార్య్య డేకశిలానగరము ననుండెను. ఈతడు ఆనగరమందే యుండిన పుష్పసేనాచార్యుని శిష్యుడట. రెండవప్రతాపరుద్రుని కాలమున శకవర్షము 1241 నీతడు 'జైనేంద్రకల్యాణాభ్యుదయ' మనియు, 'ప్రతిష్ఠాసార'మనియు పేరుగల్గిన గ్రంథమును రచించెను. ఇతడు తనగ్రంథగద్యమునతన్ను 'సకలతార్కిక చక్రవర్తి' యని చెప్పికొని యున్నాడు. ఈ జైనాచార్యుల చరిత్రము మన కింతవరకు తెలియక యిపుడు సెంట్రల్ ప్రావిన్సెస్ అండు బీరార్' అనువిదర్భదేశమున ఆకోలాజిల్లాలో కారంజగ్రామములో ప్రసిద్ధమైన 'సేనగణ'మను జైనగణమునకు జెందిన మందిరమున దొరకినది. ఆగ్రంథమందు గ్రంథకర్త తన్నుగూర్చి యీక్రిందిశ్లోకమును జెప్పి యున్నాడు:—

'శాకాబ్దే విధువేదనేత్ర హిమగే(?)
సిద్ధార్థిసంవత్సరే
మాఘే మాసివిశుద్ధపక్ష దశమీ
పుష్యార్కవారేఽహని
గ్రంథోరుద్రకుమారరాజ్యవిషయే
జైనేంద్రకల్యాణభాక్
సంపూర్ణో భవ దేకశైల నగరే
శ్రీపాల బంధూర్జితః.

ఈశ్లోకముచే నితడు తన గ్రంథమును శకాబ్దము 1241 సిద్ధార్థిసంవత్సరము మాఘమాసము శుక్లపక్షము దశమి పుష్యనక్షత్రముఁ గూడిన భానువారమున పూర్తిచేసెనని దేర్పడును. ఆగ్రంథమందలి గద్య మిది:—

'ఇతి సకలతార్కికచక్రవర్తి శ్రీసమంతభద్రమునీశ్వర ప్రభృతి కవిబృందారకవంద్య మానసరోవర రాజహంసాయమాన భగవదర్హత్ప్రతిష్ఠాభిషేక విశేషవిశిష్ట గంధోదక పవిత్రీకృతోత్తమాంగేన అప్పయార్యేణ శ్రీపుష్ప సేనాచార్యోపదేశక్రమేణ సమ్యగ్విచార్య పూర్వశాస్త్రి భసారముద్ధృత్య విరచితః శ్రీ జినేంద్రకల్యాణాభ్యుదయాపర నామధేయ త్రిదశాభ్యుదయే అర్హత్ప్రతిష్ఠా గ్రంథః సమాప్తః. (పరిశోధకుడు)

---

# కవి కుమారుఁడు

భమిడి ఉమామహేశ్వరావధాని గారు

లలిత సుకుమారమాధురీకలితమయిన
మలయమారుత వీచికామాలఁ దేలి
ప్రకృతిసౌందర్య లక్ష్మీవిలాస భాస
మాన వస్తుప్రదర్శన మందిరమునఁ
గల విచిత్రంబు లన్నింటి చెలువు గాంచి
పొంగి పొరలెడు మోదతరంగడోలి
కలను దూగులాడుచు నట్టి లలిత కళల
ననమహానట్టి పేరు ప్రఖ్యాతి గాంచి
నట్టి మహిమాఢ్యు నుతియించునట్టి నోట
భక్తిపరవశమగా పాటఁ బాడుకొనుచు
లీనమైపోదు నా సుధాగానమందు.

---




# కళింగవిశేషములు

కట్టీ సాంబమూర్తి శాస్త్రి గారు

1937 సం. జూన్ 16, 17 తేదులందు ముఖలింగమునందు జరిగిన కళింగవర్ధంత్యుత్సవమునకు నేనుగూడ వెళ్ళియుంటిని. సభకు వచ్చిన విద్యాధికుల ప్రసంగాలవల్ల కళింగ దేశచరిత్రలో కొన్ని విశేషాలు నాకు స్ఫురించినవి. వాటిని పత్రికలో ప్రకటిస్తే పండితులు వాటి యాథార్థ్యం నిర్ణయిస్తారనే తలంపుతో అట్లుచేస్తున్నాను.

## కళింగరాజధాని

కళింగ రాజధాని విషయములో చాలవరకు సందేహాలు వీడిపోయినా ఇంకా చర్చకు అవకాశం మాత్రం లేకపోలేదు. ఇప్పటి కళింగపట్నమే కళింగనగరమని దృఢముగా ఎవరూ చెప్పలేరుగాని కాళిదాసు రఘువంశం ఆరోసర్గలో వర్ణించిన హేమాంగదుని రాజధాని అయివుంటుందేమో నని చాలమందికి అభిప్రాయాలున్నాయి. గొప్పచారిత్రికులని పేరుపడ్డ యువకులు మాత్రం కాళిదాసు తప్పాకొట్టాడని బాగా నమ్ముతున్నారు. కాని వీరు పొరపాటుపడ్డారేమో నని నా తలంపు.

గాంగవంశపురాజుల శాసనములలో పేర్కొనబడిన కళింగనగరము, కళింగావనీనగరము అను నామాంతరములుగల నగరమే కాళిదాసు వర్ణించిన కళింగరాజధాని యనుకొనుటవలన ఉభయమతములవారికిని చిక్కువచ్చుచున్నది. కొంచెము సూక్ష్మాలోచన చేస్తేనేగాని యీచిక్కు విడదు. కాళిదాసుడు తనరఘువంశకావ్యములో రెండుమాఱులు కళింగప్రశంస చేసియున్నాడు. నాల్గవసర్గలోను, ఆఱవసర్గలోను——

శ్లో. ప్రతిజగ్రాహ కాళింగ స్తమస్త్రై ర్గజసాధనః,
పక్షచ్ఛేదోద్యతం శక్రం శిలావర్షీవ పాదపః. 4-౪౦

శ్లో. తాంబూలీనాం దళై స్తత్ర రచితాపానభూమయః,
నారికేళాసవం యోధా శ్శాత్రవం చపపు ర్యశః 4-౪౨

శ్లో. గృహీతప్రతిముక్తస్య స ధర్మవిజయీ నృపః,
శ్రియం మహేంద్రనాథస్య జహార న తు మేదినీం.
4-౪౩

శ్లో. తతో వేలా తటేనైవ ఫలవత్పూగమాలినా,
అగస్త్యచరితా మాశా మనాశాస్యజయో యయౌ.
—4-౪౪

శ్లో. అథో మహేంద్రాద్రిసమానసారః
పతి ర్మహేంద్రస్య మహోదధేశ్చ,
యస్య క్షరత్సైన్యగజచ్ఛలేన
యాత్రాసు యాతీవ పురో మహేంద్రః.
6-౫౪

శ్లో. య మాత్మన స్సద్మని సన్నికృష్టః
మంద్రధ్వనిత్యాజితయామతూర్యః,
ప్రాసాదవాతాయనదృశ్యవీచిః
ప్రబోధయ త్యర్ణవ ఏవ సుప్తమ్. 6-౫౬

శ్లో. అనేన సాకం విహ రాంబురాశే
స్తీరేషు తాలీవనమర్మరేషు,
ద్వీపాంతరానీతలవంగపుష్పై
రపాకృతస్వేదలవా మరుద్భిః. 6-౫౭

అని దేశనైసర్గికవర్ణనము గావించియున్నాడు. ఈ వర్ణనములు యథార్థములా, కావా అని సందేహించేవారు క్రిందిగీట్లు గల స్థలములను మళ్ళీ మళ్ళీ ఆలోచిస్తే వాస్తవము బోధపడుతుంది. ఇంతే కాకుండా విజయయాత్రారంభములో మొదట తూర్పుసముద్రమునుగూర్చి బయలు

చేరి, తిన్నగా తాళీవనశ్యామ మయిన మహోదధి ఉపకంఠమును చేరి, వంగదేశము జయించి, గంగాస్రోతో౽ంతరములందు జయస్తంభములు నాటి, కపిశానది నుత్తరించి, ఉత్కలదేశముమీదుగా కళింగాభిముఖుఁడై వచ్చె నని చెప్పినాడు. దీనివలన రఘురాజు సముద్రతీరము ననుసరించే కళింగాంతమువరకే కాక కావేరివరకు గూడ వెళ్లినాడని తేలుచున్నది. కనుక ఆ కాలములో కళింగరాజధాని సముద్రతీరమందే ఉండేదని సిద్ధాంతముగా తేలుచున్నది. అయితే అస్థలం ఇప్పు డెక్కడ వుందో చూడాలి. కొందరు మహేంద్రపర్వతము ప్రత్యంతమందున్న మందసానగరమే అది అని అంటారు. ఆపట్నంలోకి సముద్రం కనబడుతుంది, రాత్రివేళ చప్పుడు వినబడుతుంది కనుక అదే అనడానికి అవకాశ మున్నా, అక్కడ పురాతనకాలమందు రాజధానీనగర ముండడానికి తగిన భూసన్నివేశము లిప్పు డేవీ కనపడక పోవడంచేత దాన్ని కొందరు విశ్వసించకుండా వున్నారు. పూర్వకాలములో మహారాజ్యాల రాజధానులన్నియు (నేవో కొన్నిమాత్రంతప్ప) సముద్రములో నొకగొప్పనది కలిసేస్థలంలోనే ఉండేవి. గాంగులు, చాళుక్యులు, చోళులు మొదలగువారిరాజధానులీమాదిరినే సముద్రమునకు నాతిదూరముగానే ఉన్నాయి అని వారిఅభిప్రాయము. మరికొందరు ప్రస్తుతమున్న కళింగపట్నమే కాళిదాసునాటి రాజధాని అంటారు. వంశధారా మహానది ఈపట్నందగ్గరనే సాగరములో సంగమిస్తుంది. ఓడల కిక్కడ ఇప్పటికిన్ని రేవు ఉన్నది. ఇక్కడసముద్రములో అప్పుడప్పుడు కెరటములువచ్చి వెనుకకు తగ్గుతున్నపుడు ఏవో పడిపోయినగోడలవంటివి కనబడుతూ వుంటాయి అని పల్లెవాళ్లు చెప్పుదురని గ్రామస్థులు చెప్పుతారు. కాని ఇదికూడా అంతసిద్ధాంతముగా తోచదు. ఇక్కడ ఇప్పు డున్నపట్నం అంతా క్రొత్తగా కట్టినదే కాని ఎక్కడ త్రవ్వినా, ఏంచేసినా పురాతనవస్తువు లేవీ కానరావు. కనుక ఇదీకూడ వాస్తవము కానిదే. కాని యిప్పటి కళింగపట్నము పురాతన రాజధానికి సమీపమున ఉండెనని మాత్రం చెప్పడానికవకాశం ఉన్నదని నా నమ్మకము. కళింగపట్నానికి ౫ మైళ్ల దూరమున వంశధార ఒడ్డున సాలిహుండాం అనే గ్రామమును, గనికొండ అనే చిన్నకొండయున్నూ గలవు. ఈగ్రామము పూర్వకాలమున శాలివాహనుని రాజధానిగా నుండెడిదని జనశ్రుతి గలదు. ఈ కొండమీద ఒకచోట ప్రాచీనశిథిలగృహము లగపడగా వానిని త్రవ్వింపగా వానిలో ప్రాచీనవిగ్రహము లనేకములు బయలుదేరినవి. ఈకొండమీదనే రాజగారికోట యుండెడిదని వాడుక. ఈకొండకు సమీపముననే వంశధారానదికి ఆనకట్టుండెడిదట. దానిచిహ్నముమాత్ర మిప్పుడును గలదు. ఈకొండ కెదురుగా పనికెముండల మను గ్రామము గలదు. ఆకాలమున రాజాంతఃపురమే యీకాలమున నీపేరుమోసికొనుచున్నదని ఐతిహ్యము. ఈ కొండ త్రవ్వుచున్నపుడు ప్రాచీనశిథిలములలో నొక అంగుళీయకము దొరకినది. ఆ యుంగరముపైని బ్రాహ్మీలిపిలో నేవో కొన్నియక్షరములు గలవు. (ఆ యుంగరముసంగతి ముమ్ముందు ప్రకటింతును) కావున వీనినన్నిటిని సమన్వయము జేసికొన్నచో కాళిదాసునినాటి కళింగరాజధాని యీ సాలిహుండామే కాదగు ననుట సాహసము కానేరదు. ఇక్కడకు సముద్రతరంగము లిప్పుడును పోటువేళ వచ్చును. సముద్రఘోష మిప్పుడును వినబడును. కావున కాళిదాసుని వర్ణనమెల్ల శిలాక్షరములవలె యథార్థమే కాని అతిశయోక్తి యెంతమాత్రమును గాదు. పైశ్లోకముల బాగుగ నాలోచించిన సహృదయములకు స్వరూపకథనమే స్ఫురించునుగాని అతిశయోక్తి యెంతమాత్రమును స్ఫురింపదు. కావున మందసాకోటగాని, సాలిహుండాముగాని కాళిదాసుని కాలమందలి కళింగరాజధాని యనుట కేసంశయమును లేదు.

## గాంగరాజధాని

అతిప్రాచీనకాలమున గాక మధ్యకాలమున కళింగదేశమును రెండుతెగలరాజులు పాలించినారు. వారిలో గాంగవంశమువారు పూర్వులనియు, గంగవంశమువా రర్వాచీనులనియు చారిత్రికుల నిశ్చయము. గాంగవంశమువారి రాజధానీనగర మేదో నిర్ణయించుటకు ప్రమాణము లంతగా కానరాలేదు. హస్తివర్మ మొదలు దేవేంద్రవర్మవరకు గల రాజులు తమరాజధాని విజయకళింగనగర మని మాత్రమే చెప్పియున్నారు. విజయకళింగనగర మనగా ముఖలింగమునకు సమీపమున ప్రస్తుతము నగరికటక మనబడు గ్రామమే. రెండవతెగవారిలో మొదటివాడగు కామార్ణవుడు దంతాపురము రాజధానిగా కళింగము

చేలెను. వానితరువాత మరియొక కామార్ణవుడు రాజధానిని నగరమునకుమార్చెను. దేవేంద్రవర్మ యనంతరమున రాజ్య మరాజకముగా నున్న హేతువుననో, లేక రాజు దుర్బలుడుగా నుండుటచేతనో రెండవవంశమువారు రాజ్యమాక్రమించుకొనిరి. దంతాపురమునకు ప్రాగుత్తరపశ్చిమ దిశలందు కొండలు వలయాకారముగా కొన్ని మైళ్ల దూరమున ప్రాకారమువలె గిరిదుర్గముగా నున్నవి.

దంతాపురముకంటె నగరికటకము రాజధానిగా నుండుటకు అధికావకాశము లున్న కొమ్మనాపల్లి మొదలుకొని ముఖలింగము ఏటివఱకు నొకలంకగానుండెడిది. ముఖలింగమున కుత్తరముగా ఏఱు రెండుపాయలై, ఒకపాయ తూర్పుభాగమునందు కొమ్మనాపల్లివఱకు ప్రవహించి తిరిగి నదిలో గలిసిపోయెడిదట. సభాదినములలో దేశపూర్వసన్నివేశమును తెల్పుటకోయన వచ్చిన మహాప్రవాహము ఈ వాదుకను సత్యముగా రుజువు చేసినది. వంశధారానది యిప్పటివలె గాక ప్రాచీనకాలమునందు మహాగంభీరముగా నుండియుండవలెను. గోదావరివలె ఎల్లకాలమును అత్యధికముగు నీరు జానియందు నిలిచియుండవలెను. సముద్రపుపోటుపాటులకు అక్కడినీరు గూడ వశమై ఓడల రాకపోకలకు అనువైయుండవలెను. అట్లుండినయెడల నానదీమధ్యద్వీపమందున్న నగరమునకు రాజధానిత్వాన్వర్థతయెంతైనాకలదు. నదిరెండుశాఖలుగా చీలినమొగయందే కోణాకారముగానున్న ద్వీపాంత్యభాగమున ముఖలింగేశ్వరుని యాలయము కట్టబడినది. ఆకాలమున ముఖలింగము కేవలము దేవస్థానముమాత్రమై అర్చనాదులకు వలయు కతిపయగృహమేధుల యిండ్లలోను, బహుళ దేవాయతనములతోను నిండియుండెడిది. నగరికటకము రాజధానిగా నుండి యనేకసౌధాదులతో విరాజిల్లెడిది. ఇపుడు ప్రాచీనసౌధములన్నియు శిథిలములై రెండును రెండుపల్లెటూళ్లుగా నున్నవి. పైనివ్రాసిన యూహ లన్నింటిని సుప్రసిద్ధచారిత్రిసులగు శ్రీ. భావరాజు వేంకటకృష్ణారావు బి. ఏ., బి. ఎల్. గారుగూడ సమ్మతించిరి. కాని సముద్రమునకు నదికిని గల సంబంధము వా రంగీకరింపరు. అదిగూడ నంగీకరించుటకు వలయు ప్రమాణము లున్నవి.

ముఖలింగమున కెదురుగా ఏటి యావలియొడ్డున నున్న వాడవలస యను గ్రామమునుబట్టియు, ఇపుడు నశించిన వాడపాలెమును బట్టియు, "పూర్వకాలమున రాజకుమారు లానదియందు నౌకాయాన మభ్యసించెడివారు" అని వారు అనుమానప్రమాణముచే సాధించిరి. అనుమానమువలన సాధింపదగినంత సాధింపరైరి. ఓడలు సామాన్యముగా సముద్రమునందును, సముద్రములో మహానదులు సంగమించుస్థలములలోను మాత్రము సంచరించును. అట్టిస్థలములలోనే వాడవలస, వాడపాలెము మొదలగుగ్రామము లుండుట అనుభవసిద్ధము. కళింగపట్టమునకు సమీపమున వాడపాలెము, కొంచెము దూరమున పల్లెపేట, ముఖలింగముకడ వాడవలసయును గలవు. పూర్వకాలమున నీమూడుగ్రామములు నొకరీతి సౌకర్యములనే గలిగియుండు ననుట సమంజసము. ఇది కాక అఖండముగా ప్రవహించు మహానదులు శాఖలుగా చీలుటకు మార్గమధ్యమున పర్వతము లుండుటకాని, సముద్రమునందు నీరంతయు నిముడకపోవుటకాని, హేతువులుగా నగపడుచున్నవి. ముఖలింగముకడ నది పాయలగుట ప్రసిద్ధమేకదా! సముద్రమువఱకుగూడ కొండలెక్కడను నదికి అవరోధము గలిగింపలేదు. సముద్రము సమీపించి నీరు నిముడ్చుకొనకుండుటయే నదిపాయలగుటకు హేతువుగా నిర్ణయింపక తప్పదు. ౧౪, ౧౫-౬-౨౪ తేదులందు వచ్చిన మహాప్రవాహ మీయూహను సిద్ధాంతముగా జేసినది. కావున పూర్వమొకప్పుడు సముద్రనిరోధము ముఖలింగమువఱకు ఎగదన్నుచుండెడిదని నిర్ణయింపవచ్చును.

## గాంగ గంగ వంశములు

భారతిపత్రికలో కళింగము నేలిన గంగ గాంగ వంశములనుగురించి చాల చర్చ జరిగియే యున్నది. శ్రీ. మల్లంపల్లి సోమశేఖరశర్మగారీవంశములు రెంటికి భేదమల్పముగా నున్నను నొక్కవంశమేయని సాధించిరి. దేవేంద్రవర్మ చీడివలసశాసన విమర్శనమున నేనును ఐక్యమునే నిర్ణయించితిని. ఈరెండువంశములకును భేదముమాత్ర మధికముగానే యగపడుచున్నది. మొదటి గాంగవంశ

మువారు తమశాసనములలో మూడుబిరుదములనే చెప్పుదురు. గోత్రము పేర్కొనరు. రెండవ వంశమువారు తమది ఆత్రేయసగోత్రమని చెప్పుదురు. తమపూర్వులను పెక్కుతరములవారిని రాజ్యముచేసిన కాలములో గూడ పేర్కొందురు. మొదటివారు తమది గాంగవంశమని పేర్కొనగా రెండవవారు తమది గంగవంశమని పేర్కొందురు. మహేంద్రగిరి మహోదధి ప్రభుత్వములు, పరమ మాహేశ్వరత్వము, విజయ కళింగ నగరనివాసము, గోకర్ణస్వామిప్రసాదము ఉభయులకు సమానమే. కాని రెండవవంశమువారు తమశాసనములందు గోత్రమును, పూర్వుల రాజ్యకాలమును, పూర్వుల మహత్త్వవర్ణనములను చెప్పికొని యున్నారు. ఇంతే కాకుండా మొదటివంశమువారి పేరి చివర వర్మపదముదక్క నింకేపదము నుండదు. రెండవతెగవారు తమ పేరిచివర దేవపదమును జేర్చెదరు. రెండవవంశములోనివారగు ప్రకృత పర్లాకిమిడి, కల్లికోట, చీకటి, సురంగి, టెక్కలి, పెదకిమిడి మొదలగు సంస్థానముల ప్రభువుల పేర్ల చివర 'దేవు' అనుపద మున్నది. వీరెల్ల రాత్రేయసగోత్రులే; గంగవంశ్యులే. కావున దేవపదము రెండుతెగలకును ప్రబలభేదకమే. అయిన నొక వైచిత్రి కలదు: రెండవ తెగవారుగూడ మొదటి చాళుక్యులవలెనే గోత్రములు లేకయుండి, కొంత కాలమునకు బిదప "కదంబుల సాహాయమువలన చాళుక్యులవలె" దాము చాళుక్యులతోడి మైత్రివైరాదిసంబంధములవలన గోత్రప్రవరాదులందును, వంశవర్ణనమునందును, బిరుదావళులందును, పూర్వగాథాకల్పనమునందును సర్వవిషయముల చాళుక్యులనే యనుకరించి రనుట ఉభయుల శాసనములను బరిశీలించిన తేటపడును.

## ప్రాచీన శిథిలములు

ముఖలింగమునకు చుట్టుపట్ల అనేకశిథిల చిహ్నములు, శివలింగములు గలవనుట వినిరేమేకదా? ఇట్టివే శ్రీకూర్మము, నరసన్నపేట, పోలాకి, ఉర్లాము మొదలగు ననేకగ్రామముల పొలములలో నగపడుచున్నవి. ఈదేశమందున్న శివలింగములు సామాన్యముగ ఒడ్డుపొడవు నొక్కరీతి నుండి మలచిన రాతిదూలపు ముక్కలవలె నుండును. హీరమండల మను నొకగ్రామము ముఖలింగమున కుత్తరముగా ౬ మైళ్లదూరమున వంశధారానదీతీరమున గలదు. అక్కడ దిబ్బదేలిన కోటయొక్కటి నేటికి గలదు. ఆకోటయందు హేలుడు రాజ్యము చేసినట్లు వాడుక గలదు. ఆకోటయు దాని చుట్టియున్న గ్రామదేవత కోపముచే నశింపగా నిప్పటిహీరమండలము నూతనముగా నిర్మింపబడినదని స్థలజ్ఞులు చెప్పుచున్నారు. దీనివిషయము చారిత్రికులు పరిశోధింతురుగాక.

కళింగపట్నమునకు దగ్గర పోలాకియను గ్రామము గలదు. దానిలో చిన్న ఆలయమొకటి కలదు. ఆలయము ముఖలింగాలయముల ననుకరించియున్నది. అందుండు విగ్రహములుగూడ ముఖలింగమందలి విగ్రహములవలెనే యున్నవి. ఆవిగ్రహములకు పూజాపురస్కారములు లేక ఆలయము బూజుపట్టియున్నది. ఆ ఆలయముకడ నొక శిలాశాసనఖండ మున్నది. ఆంధ్రాక్షరాత్మకమగు నాశాసనము అనంతవర్మ కొర్ని శాసనములవలె నున్నది. ఈశాసనఖండమును, ఆలయమును బరిశోధకులు పరిశోధింపవలసియున్నది. ఆసమీపమున నున్న ముబుగాము, తలసముద్రము మొదలగు గ్రామములందుగూడ పెక్కుప్రాచీనశిథిలములు గలవు. శ్రీకాకుళము పర్లాకిమిడి నరసన్నపేట టెక్కలితాలూకాలలో గల యిట్టి ప్రాచీనవస్తువులనెల్ల బరిశీలించిన కళింగదేశచరిత్ర చాలవఱకు పూర్తియగును.

ముఖలింగమునకు దక్షిణముగా వంశధారా నదీతీరమున కొమ్మనాపల్లి యను గ్రామము గలదు. ఒకప్పుడు వెలనాటిచోడనరేంద్రుని మంత్రియగు కొమ్మన దండనాథుడు కళింగమును రాజప్రతినిధియై పాలించెను. ఆతడు తనపాల్యదేశమునం దటనట తనపేరిట గ్రామములను, దటాకములను నిర్మించి కీర్తిని చిరస్థాయినిగా నొనరించెను. ఈగ్రామ మాతనిచేతనే నిర్మింపబడినది. ఇందు నదీతీరమున బ్రాచీనమగు శివలింగ మొకటి కలదు. శిష్టులనబడువారీగ్రామమును కొమ్మనాపల్లియని వ్యవహరించినను గ్రామ్యులు కొమ్మనపల్లియని సాధురూపమునే వాడుచున్నారు.

చారిత్రికుల కుపయోగపడు నను నూహతో నిప్పటికి దొరకినవానిని బ్రకటించితిని. మున్ముందు విశేషములు లభించిన వానినిగూడ బ్రకటిస్తాను.

# సుకవ్యభినందనము

సోమంచి వాసుదేవరావు గారు

(గీతమాలిక)

వాక్సతీయోద్యానవాటికఁ బరిఢవిల్లు
లలిత చంపకవనమరజములను దెచ్చి
పలుకు పూఁబోఁడి యడుగుఁదమ్ముల భజించి
సుకృతివగుదువు నినుఁ గొల్తు సుకవిచంద్ర!

ప్రకృతివిలసిత బ్రహ్మాండభాండపంక్తిఁ
గాంచి యిసుమంతమార్పు లేకయ తదీయ
చిత్రము రచింతు దానిలో సృష్టికర్త
కార్యకారణభావంబుఁ గాంతు సుకవి!

ప్రథితహృదయయంత్రంబుచే భావనా ర
విప్రభాసహాయత నీవు విమలమైన
ప్రకృతిప్రతిరూపము రచించి పరిఢవింతు
నీసమానుని భువిఁ గాన నేను సుకవి!

ప్రకృతి నానావిచిత్రచిత్రములు నీదు
భావదర్పణాంతరమునఁ బ్రతిఫలించు
నవల నవి నీదుకృతులలో నాకృతిఁ గను
నహహ! నిన్నెన్న నాతరమగునె సుకవి!

భావనాఖని భావమణీవితతులఁ
ద్రవ్వి హారాళి గ్రుచ్చి భారతి నలంకృ
తాంగిఁ జేసెద వహహ నీ వధికభక్తి
నీ పదంబులఁ గొలిచెద నేను సుకవి.

మెఱుఁగుఁదీఁగలలోఁ గల మెఱుపు గలిగి
విమలపీయూషవరమధురిమఁ దనర్చి
గగనగంగాతరంగవేగమునఁ బొలిచి
తనరు సుకవి! భవత్కవితాఝరంబు.

సౌమ్యరససౌరభోపేత శబ్దపుష్ప
సంఘటితమాలికల సరస్వతిని గొలుతు
మాతృపదపద్మసేవావిభూతి మెఱయు
నీ పదంబులఁ గొలిచెద నేను సుకవి!

మధురసంబట్ల భవదీయ మధురకవిత
పండువగు చెవిఁబోయి కఖండముగను
బ్రహ్మసుఖవార్ధిఁ దేలెద భవదమేయ
మధురకవితారసంబు జిహ్వకును రాఁగ.

సురుచిరాలంకృతులు వెట్టి సరసవిశ్ర
మంబుఁ గూరిచి సలలితార్థంబుఁ దనిపి
సారకవితాసుధారసధార నిచ్చి
భారతీమాతఁ బోషింతు వౌర సుకవి!

వాక్సతీనిత్యసంబంధవశతఁ జేసి
నీవ తానాడు వట్లాట నిన్ను నపర
భారతీమూర్తిగా నెంచి భవదుదంచి
తపదవనజార్చనాధన్యతన్ జరింతు.

నుడువులపడంతి యడుగులఁ గడుగు నీదు
మధురకవితా సురాపగాంభః ప్రపూర
ధౌతాశేషకల్మషజాలుఁడనయి
ముక్తికాంతాపరీరంభమున సుఖింతు.

దివ్యవేదాంతసౌధవీథీవితాన
సంచర ద్భారతీకృపా సరసవీక్ష
ణ మధుపావళి భవదీయ నవ్యకృతిమ
రందపానంబు గావించురా కవీంద్ర!

నిన్నుఁ గని తన్ను నీలోన నెమ్మిఁ గాంచు
కతన ముకురంబవౌ సరస్వతి కటంచు
నిన్నుఁ బలికెద రాఖ్యలు నిక్కువ మది
యేను నిట్ల గొల్చి సుకవి! నీ కృప గడింతు.

నీటిలోనున్న జాడలు నెమకుచుందు
రవియుఁ గానని వస్తుపరంపరలను
గాంచుచుందువు నీ కుశాగ్రత గణింప
లేను; నినుఁ గొల్చి బ్రదికెద నేను సుకవి!




# కళింగ శిల్పము

గో. రామదాసు గారు

ఫెర్గూసన్ మొదలైన పాశ్చాత్య విద్వాంసులు హిందూదేశ శిల్పము విషయమై వ్రాస్తూ, దీనిని కొన్ని రకములుగా భాగించిరి. వీరు చేసిన విభజన కేవలము వారుచూచినకట్టడము లున్న ప్రదేశములనుబట్టిచేసిరి. ఒరిస్సా ప్రదేశమందున్న పూరీ, భువనేశ్వరము, కోనార్కములలోని ఆలయములను మాత్రమే చూచి, ఒరిస్సాశిల్పవిధానమని యొక రకము ఏర్పాటు చేసిరి. ఆరీతి కట్టడముల కన్నిటికి ఒరిస్సాలోని కట్టడములే నమూనాయని ఆలోచించిరి. ఈకట్టడములన్నీ క్రీ. వె. 1090 కి యీవలికాలమందే నిర్మింపబడినవిగానిఅంతకు పూర్వము అవి యున్నట్లు నిదర్శనములు లేవు. పూరీయందున్న జగన్నాథదేవలము క్రీ. వె. 1090 కి ముందు నిర్మించబడలేదని శ్రీమాన్ మానమోహన చక్రవర్తిగారు బెంగాలు యేష్యాటిక్కు సొసైటీజర్నలులో వ్రాసినారు. భువనేశ్వరాలయములు, కోనార్కుఆలయము దీనికి దరిమిలానే కట్టబడినవి. వీటికి పూర్వమందు కట్టిన ఆలయములు కనబడలేదు. కనబడిననూ వాటియందు శిల్పనైపుణ్యము లేదేమో! అందుచే పాశ్చాత్య పండితులకు వీటి కంటె యితర ఆధరవు లేకపోయినది.

జూన్ నెల 16, 17 తేదీలలో ముఖలింగమందుజరిగిన కళింగసామ్రాజ్య వర్థంత్యుత్సవమునకు నేను వెళ్లియుంటిని. అప్పుడు అస్థలమునందున్న దేవాలయములను జాగ్రత్తగా పరిశీలించి చూచితిని. ఇందులో నొకటైన మధుకేశ్వరాలయపుదేవిడీ మంటప స్తంభమందు త్రికళింగాధిపతి అనంతవర్మవజ్రహస్తదేవు మహారాజాధిరాజుల (క్రీ. వె. 1038-1071) కాలమునాటి శాసనములున్నవి. దేవాలయప్రాకారములో ఒకటిరెండుశాసనములు వాటి అక్షరాకృతిచేత యింతకు పూర్వమైన కాలమును సూచించుచున్నవి. అసలు ఆలయము రెండవ కామార్ణవుడు కట్టించినట్లు అనంతవర్మ చోళగంగదేవు మహారాజాధిరాజుల విశాఖపట్న, కొర్ని తాంమ్రశాసనములతో వక్కాణించియున్నది. అందుచే క్రీ. వె. 748-1071 మధ్యను ఈదేవాలయు మేవత్తూ పూర్తిఅయినట్టు కనబడుచున్నది.

విశాఖపట్నంజిల్లాబొబ్బిలితాలూకాలో కొప్పలి నారాయణపురం అను ఒక గ్రామమున్నది. అందు ఒక శివాలయ మున్నది. దీని స్తంభములపైని 42 శాసనము లున్నవి.వీటిలో మొట్టమొదటిదాని తారీఖు క్రీ. వె. 1081 కి సరియైన శకాబ్దమందున్నది. ఇది ముఖలింగ

క్షేత్రమందున్న దేవలమునకు దరిమిలా దిన్ని పూరీలోనున్న జగన్నాథాలయమునకు పూర్వపుదిన్ని యని చెప్పవచ్చును.

అనంతవర్మ చోళగంగదేవమహారాజాధి రాజుల విశాఖపట్నపు శాసనములలో నొక దానియందు తనతండ్రి రేంగుజేడు అను గ్రామములో నొక శివాలయము కట్టించినట్లు చెప్పబడినది. సాలూరుతాలూకా మక్కువ గ్రామమునకు సమీపమున రేజేరని యొక గ్రామ మున్నది. దానియొద్ద నొక శివాలయ మున్నది. దానిపైన శిల్పముగాని శాసనములు గాని కనిపించకుండా సున్నపు గిలాబా చేసి యున్నారు. గాని లోపున అస్థాన మంటపము లోని స్తంభముల యాకృతినిబట్టి ఈ యాల యమే రాజరాజువలన కట్టబడిన దని నిశ్చ యించవచ్చును.

ఈ మూడాలయములు ఒరిస్సాలోని ప్రఖ్యాతికెందిన దేవగృహములకన్న ప్రాచీన ములైన వైనప్పటికి మారుమూలగా నుండి యొబట్టి యెవరికీ తెలిసినవి గావు. ముఖలింగా లయమున్ను, రేజేరాలయమున్ను 'సీవెల్లు' దొరగారు వ్రాసిన జాబితాలలో వక్కాణించ బడనేలేదు! అట్టిస్థితిలో కళింగరాజులచే మొట్ట మొదట కట్టించబడి తర్వాత నిర్మింపబడిన దేవగృహములకు నమోనాఅయిన ఈమూడు ఆలయములు పాశ్చాత్య శిల్పవిద్యా విమర్శకు లకు తెలియకపోవుటయేగాక ఇప్పుడు గవర్న మెంటువారిచే నియోగించబడిన ప్రాచీనకట్టడ ములను బరీక్షించు ఉద్యోగస్థులకు సహితము తెలియవు. ఈదేవాలయముల వాస్తువు జిలుగు శిల్పము మొదలైన శృంగార చిహ్నములన్నీ ఒరిస్సా దేవలములయందున్న వాటికి బీజము లని తోచుచున్నది. ఈదేవాలయము[illegible] ర్వము కళింగమునేలిన గంగవంశపు [illegible] మొదటి నివాస దేశమందున్నవి. ఆరాజులచే కట్టించబడినవి. ఆసమయమునకు ఈరాజులకు ఓఢ్ర దేశముతో సంపర్కమంతగాగలుగ లేదు. ఈహేతువులచే దీనికి కళింగశిల్పమని పేరుబెట్టి తిని. ఈశిల్పముయొక్క ముఖ్యచిహ్నములు అందరికీ తెలియుటకై ఒక్కొక్క దేవాలయ మును వర్ణించబూనుకొంటిని

జూన్ నెల 16, 17 తేదీలందు ముఖలింగ క్షేత్రమున జరిగిన కళింగసామ్రాజ్యవర్ధంతికి నేను వెళ్లియుంటినని యిదివరకే చెప్పియుంటి ని గదా! అప్పుడు అచ్చటనున్న ఆలయము లను పరిశీలించి చూచితిని. మధుకేశ్వరాల యము యిచ్చట ప్రధానమందిరము: ప్రాచీన మైనది. దీనిప్రక్క సెక్షను 2 వ చిత్రమందు చూపబడినది. పునాదిపటము 1 వ పటమం దున్నది. ఈపటమందు 'ఆ' గర్భదేవాలయ ము. దీనిపైన యావత్తూ సున్నపు గిలాబా చేసియున్నది. అచ్చటచ్చట ఈగిలాబా యూడి యుండుటచే దీనికట్టు చూడగలిగితిని. సున్న పదునుగాని లేక మరియేయితర దినుసుగాని వేసి అంటించకుండా రాతిపలకపై రాతిపలక మోపికచేసి లేవనెత్తబడిన దీగర్భగుడి. దీనిలో వేసిన రాళ్లపైన జిలుగులుగాని చిత్రప్రతి మలుగాని లేవు. ఆలయముయావత్తూ ఛాయా పటమందు (3 వ చిత్రము) గనిపించును.

దీనినంటి దీనిమెదుట ఆస్థాన మంటప మున్నది. ఇది రెండు వేర్వేరుకాలములయందు







చిత్రము ౧.

కట్టినట్లగుపడుచున్నది. 'క' యనుభాగములో 1, 2, 3, 4 నాలుగుజతల స్తంభములు. ఒక్కొ-




చిత్రము ౨.

క్క స్తంభము, పాదము, కాండము, శిరస్సు అని 3 భాగములు గలిగియున్నది. పాదము సుమారు 2'×2'×2' పరిమాణము గల యొకరాతిఫలకము. దీనిపైన 7'×1¾×1¾' పరిమాణముగల యొక రాతిఫలకము నిలువ బెట్టియున్నది. ఇదియే స్తంభకాండము. దీని పైన 4'×2'×2' ప్రమాణముగల రాయి అమర్చబడినది. ఇదియే స్తంభశిరస్సు ఇట్లు 8 స్తంభములను నిలబెట్టి వాటిపైన రాతి ఫలకములు శ్రేణీకమ్ములుగా వేసిరి. దానిపైన 9" దళసరిగల రాతిచప్టాలు ఒకశ్రేణిపై నుండి రెండవశ్రేణీపైకి వేయబడినవి. ఈ రాళ్లు చుట్టూ శ్రేణీలపైకి ఒక అడుగుపైకి చూరు వలె త్రోసుకువచ్చియున్నవి. ఈచూరు ముఖమందు సుందరములైన చిత్రములు చిత్రించ బడి యున్నవి. అడవియందున్న జనులుచేయు వ్యాపారములను ఈచిత్రములు ప్రదర్శించు చున్నవి. స్తంభముల శిరస్సులుగా వేయబడిన



ముఖలింగేశ్వరాలయము, సింహద్వారము

రాళ్లకు వెలుపలిభాగములు శ్రేణీలకన్న ఒక అరయడుగుపై నున్నవి. స్తంభములకు 4 లేక 5 అడుగులదూరమున మధ్య మంటపమునకు చుట్టూ ఒకగోడ కట్టియున్నది. స్తంభముల శిరస్సులకు వెలుపలనున్న ½' పైన ఒక కొనయు గోడపైన ఒకకొనయు మోపిక చేసిన రాతిఫలకములు అమర్చబడినవి. ఈఫల కములుగూడ 9" దళసరిగలిగియున్నవి. ఈదళ సరియందుకూడా చిత్రప్రతిమలు చిత్రించ బడినవి. ఈ విధముగా నేర్పడిన పంచాది (Verandah) కప్పుకన్న మధ్యమంటపకప్పు రెం డడుగులు యెత్తుగా నున్నది. అందుచే పైకప్పు చూరు పంచాదిచూరు రెండుచూరు లున్నవి. ఈచూరుల ముఖములందు చిత్రించిన ప్రతి మలు, యివి ప్రదర్శించుకథలు మొదలైనవి ముందు చెప్పెద.

ఆస్థాన మంటపమునకు చుట్టూయున్న గోడలోదక్షిణపువైపునయొకద్వార మున్నది. ఇది చిన్నది. ముఖ్యద్వారము తూర్పువైపున నున్నది. ఈ రెండుద్వారములయందున్న కలుగు, ప్రతిమల విషయమైన్ని చుట్టూగోడలయందు గూళ్లలో చెక్కబడిన ప్రతిమల విషయమైన్ని ముందు చెప్పెద.

ముఖద్వారమున కెదురుగా సుమారు 25 అడుగుల దూరమున ఒక తోరణద్వార మున్నది. (ఖ) దీనికెదుట సుమారు 30, 40 అడుగులదూరమున దేవిడీమంటప మున్నది. ఈదేవిడీ మంటపములో ముందుకు రెండు చొకపు స్తంభము లున్నవి. (గ)వీటిలో ఉత్త రపు స్తంభముపైన త్రికళింగాధిపతి అనంత వర్మ వజ్రహస్తదేవు మహారాజుల కాలపు రెండు శాసనము లున్నవి. ఈరెండు స్తంభ ములమధ్య నుండి లోపుకు ప్రవేశించుటకు మార్గసూచకములైన సోపానము లున్నవి. దక్షిణ స్తంభమునకు వెనుకకు గోడకంటియొక ఫలకము సుమారు 2' ఎత్తుది నిలువబెట్టి యున్నది. దాని తూర్పుముఖము రెండు



భాగములుగా చేసి పై దానియందు సూర్యుడు చం ద్రుడు చెక్కి వాటిమధ్యను హస్త మొకటి వేళ్లుచాచి యున్నట్లు చెక్కియున్నది. దిగువభాగమందు స్త్రీ పురుషు లిద్దరువారిమధ్యనున్న లింగమును పూజించు చున్నట్లు చెక్కబడియున్నది. ఇట్టిరాళ్లు దక్షి ణదేశమందు 'వీరకల్' అనుపేరుతో బరగుచు న్నవి. అనగాపతివ్రతైన స్త్రీయొకతె సహగమనము బొందినప్పుడు యిట్టిరాళ్లు స్థాపించెదరు. పైన జెప్పినరాయిగూడ అట్టిదేఅయియుండును. ఈ దేవిడీ మంటపము క్రొత్తగా మరమ్మత్తు చేసి నప్పుడు 'ఈవీరకల్' యిచ్చట వేసియుండురు.

ఈ మంటపమునకు ఇరుపార్శ్వముల యందున్న అరుగులపైన రెండు సింహములు మండీపైనుండి తూర్పువైపుకు ముఖములను బెట్టి అమర్చబడినవి. ఈదేవిడీ కెదుట పైకి ధ్వజస్తంభ మొకటి యున్నది.

మధుకేశ్వరాలయము యొక్క ముఖ్యప్రా కారములో చుట్టూ చిన్నచిన్న దేవాలయము లున్నవి. ఇందులో 'చ' ఒక్కటితప్ప అన్ని యును శివాలయములే. ఒక్క 'చ' యనుఆల

యములో కుమారస్వామి ప్రతిమ యున్నది. శిలుగు, ప్రతిమలు మొదలైన చిత్రముల 'ఘ' 'ఛ' యను ఆలయముల ద్వారముల వైఖరీ చెప్పినప్పుడు వీటి విషయమై కూడా యందు శిల్పపుపని చాలా సొగసుగానున్నది. ప్రస్తావించెదను.

---

# ఇల్లాలి వేడికోలు

మంగిపూడి వేంకటశర్మ గారు

నిదురా పిల్చిన పల్కరేమిదయి కాని కాపురం బింతె చే
యుదురా యెన్నటికైన సౌఖ్యమున నే నోలాడ లాలించి యే
లుదురా మీమదిలోన నేపగిది నాలోచించుకొన్నారొ ప
ల్కుదురా విన్నప మాలకించి కృప నాలోకించి ప్రాణేశ్వరా.

పలుకే బంగర మాయెనా యహహా నాభాగ్యంబునన్ గంటి చూ
పులకే కాటక మాయెనా యవుర నాపుణ్యంబునన్ మీదువీ
నులకే ముల్కులచంద మాయెనొకొ నా నున్బల్కు కేమందు టూ
యలు కేలాగున నోర్తు నెట్లు మిము బాయన్ నేర్తు ప్రాణేశ్వరా.

నెనరా పెండిలిచేసుకొన్న గరితన్ మీ రిట్లు లేడ్పించుటల్
కనరా మీపరివార లెట్లు సతులన్ గామించి ప్రేమింతురో
వినరా లోకులు మీదు వింతనడతల్ వీక్షించి యే మందురో
ధనరామామణితోడిపొందు మరిగూడా మీకు ప్రాణేశ్వరా.

తినరా దివ్యఫలంబులన్ బెరటియుం దే పండె నన్నంతనే
కనరా గారెలు మిన్నకే దొరకినన్ గాంక్షించి యేతేర జే
కొనరాదా కులకాంతమీద దయ మీకున్ లేకగా కక్కవా
ధనరామామణి సౌకుమార్యమును సౌందర్యంబు ప్రాణేశ్వరా.



చెన్నపురిరాజధానియందు ౧౯౨౫ సం. జూలై-సెప్టెంబరు నెలలలో ముద్రితములై ప్రచురింపబడిన

# ఆంధ్ర గ్రంథములపట్టిక

## ఆరోగ్యము

ఆరోగ్యమార్గములు, భాగము ౨—గొల్లకోట వెంకట్రామయ్య

సుఖాధారబోధిని, మొదటిపుస్తకము—జి. రత్నంపిళ్లె

## ఇతరము

ఉపాధ్యాయసహాయిని—యస్. భూషణం

ఎన్నికవిూణులు, భా. ౧—యం. రామచంద్రశాస్త్రి

" భా. ౨— "

ద్విజధర్మప్రకాశిక—బి. హనుమయ్య, యస్. వెంకటరత్నమ్

ప్రపంచోజ్జ్ఞానము—వి. రామచంద్రయ్య

సివిక్సుమాన్యుఅల్—యం. నరసింహారావు

స్వరాజ్యప్రచారము-చరకాపాటలు, కోటుపదాలు—కొండపల్లి జగన్నాథదాసు

## ఇతరశాస్త్రము

ఎలిమెంటరిసైన్సు, ఆరవఫారమునకు—యం. సాంబశివరావు

పదార్థవిజ్ఞానశాస్త్రము— "

ప్రకృతిశాస్త్రపాఠములు, నాల్గవఫారము — గొల్లకోట వెంకట్రామయ్య

ప్రకృతిశాస్త్రపాఠములు, మూడవఫారము "—

శాస్త్రవాచకపాఠములు, మూడవఫారము—యం. సాంబశివరావు

శాస్త్రవాచకపాఠములు, మొదటిఫారము "—

శాస్త్రవాచకపాఠములు, నాల్గవతరగతి "—

## ఇతిహాసము

ఆంధ్రమహాభారతము: విరాటపర్వము, తృతీయాశ్వాసము—తిక్కనసోమయాజి [య్య

పతిలవనిర్వచనరామాయణము — మానవోలు కామాక్ష

ద్రౌపదీస్వయంవరము—నన్నయ (సి. హెచ్. వి. జోగారావు సంపాదితము, టిప్పణవిమర్శనాదులతో.)

రామాయణము బాలకాండము—లేళ్ల కనకయ్య

సీసమాలిక శ్రీమద్రామాయణము—చెరుకుపల్లి నరసింహసిద్ధాంతి

## కథలు-ఐతిహాసికపురాణేతిహములు

ఆంజనేయచరిత్రము—కొప్పరపు వేంకటరమణయ్య

కథాముక్తావళి, ప్రథమభాగము—కె. రామకృష్ణశాస్త్రి

" రెండవభాగము— "

కుచేలోపాఖ్యానము—బమ్మెరపోతనామాత్యుడు

" సటిప్పణము "—

గంగానది—ముడియం సీతారామరావు

గజేంద్రమోక్షము—బమ్మెర పోతనామాత్యుడు

చంద్రహాసచరిత్రము—పిల్లలమర్రి పినవీరభద్రకవి

దశావతారములు—జనమంచి వెంకటసుబ్రహ్మణ్యశర్మ

ధ్రువోపాఖ్యానము—బమ్మెర పోతనామాత్యుడు

నీతికథానిధి—అబ్బరాజు హనుమంతరాయశర్మ పాక

నోములకథలు—కె. అప్పయ్య అండ్ సన్సు [యాజి (ప్రకాశకులు)

బాలనీతిచంద్రిక—డి. సీతారామరావు

భాగవతకథావళి—చిల్లరిగె మాధవశ్రీయోగానందయ్య

భీష్ముడు—జయంతి వెంకటకృష్ణరావు

మయసభ—కేశవపట్టణం వేంకటరత్నంనూరి

రుక్మిణీకళ్యాణము—బమ్మెర పోతనామాత్యుడు

విక్రమరాఘవము, పరిణయవిభ్రమములు (జానకీపరిణయము)—దేవరాజు వెంకటకృష్ణరావు

విష్ణుచిత్తునికథ (ఆముక్తమాల్యదనుండి-టీకాతాత్పర్యసహితము)— కృష్ణదేవరాయలు

శ్రీకృష్ణావతారతత్త్వము, మూడవప్రకరణము—జనమంచి శేషాద్రిశర్మ

భానుమజ్జరితము—శిష్ట్లా వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

## కథలు-కల్పితములు

కాశీమజిలీకథలు, పదవభాగము—మధిర సుబ్బన్నదీక్షితులు
నీతికథావళి—కె. యస్. సోమయాజులు, వి. యల్. నరసింహము
ప్రతాపదౌర్జన్యము—వాడ్రేవు మల్లపరాజు
బిలమందిరము—వడ్డాది శేషగిరిరావు
యాత్రికుని ప్రయాణము—బి. సీనయ్యపంతులు
శ్రీనాథవిజయము—అనివిళ్ల చినవెంకటశాస్త్రి
హ్యాంలెట్ డెన్మార్కు-కుమారరాజా—గోగులపాటి వీరేశలింగంపంతులు

## కామశాస్త్రము

కామకళానిధి అను శృంగారశాస్త్రము—నెల్లూరి శివరామకవి

## క్రీస్తుమతము

అర్చ్య ఫ్రాంసీస్ క్సారివారి చరిత్రము—బి. శామయ్య
ప్రకటన లేక ప్రత్యక్షీకరణము—యం. బి. స్నెడ్డరు
మతబోధిని—క్రిశ్చన్ లిటరేచర్ సొసైటీ ఫర్ ఇండియా (ప్రకాశకులు)
మలాఖీతరువాతికాలపు చరిత్ర—రివరెండ్ బనియన్ జోసెఫ్ (అనువాదకుడు)
యేసుచరిత్రము ,, ,,
సాధుసుందరసింగు—రివరెండ్ జి. శాంతయ్య (అనువాదకుడు)

## ఖగోళశాస్త్రము

గోచారసర్వస్వము—విష్ణుభట్ల సత్యనారాయణమూర్తిశాస్త్రి

## గణితము

గణితసంగ్రహము, రెండవభాగము—డి. రామమూర్తి
గణితసారము (నాల్గవతరగతి)—ఆర్. వీరభద్రరావు
పైమరీస్కూలు ప్రాక్టికల్ మేథమాటిక్సు. మొదటిపార్టు—జి. బాపన్నశాస్త్రి

## గేయము

ఈశ్వరాంబికానామసంకీర్తనలు—జనంగుల నాగభూషణదాసు
ఘాలిసుబ్బారావుపాటలు—ఘాలిసుబ్బారావు
దశావతారములకీర్తనలు—ఆర్. వెంకటరత్నం
నూతనభజనకీర్తనలు—కట్టి వెంకయ్య
పరిణయగానముక్తావళి—ములుమూడి బసవాచార్యులు
బాలవినోదగీతావళి (౧,౨ భాగములు)—ఇ. శ్రీరాములుచౌదరి
బ్రహ్మానందభజనకీర్తనలు-కారుపర్తి సుబ్రహ్మణ్యస్వామి
భజనకీర్తనలు—సి. యెరకయ్యదాసు
మతిమంతవిలాసము—మూలపూరు రామలింగేశ్వరరావు
వీరబ్రహ్మేంద్రనామ సంకీర్తనలు—జనంగుల నాగభూషణదాసు
వేంకటేశచిద్విలాససరస—సి. ఆర్. చెన్నకేశవులు నాయుడు
సుభద్రాకళ్యాణము-పాట—పి. యస్. రావుఅండుసన్సు (ప్రకాశకులు)
హరిభజనామృతము—పొన్నగంటి యల్లయ్య
హరిశ్చంద్రోపాఖ్యానము-పదము—పొడుగు రామబ్రహ్మము

## జీవితము

తెనాలిరామకృష్ణకవి చరిత్రము—ములకపల్లి పెదశేషగిరిరావు
దురాచారభంజనుడు—ఆదిపూడి వసంధర
పండిరివీరన్నగారి చరిత్రము—చాగంటి వీరభద్రకవి
మతోద్ధారకుడు(బసవచరిత్రము)—గంటిజోగిసోమయాజి
అల్లూరి సీతారామరాజచరిత్ర (రంపపితూరి)—వై. కృష్ణరావు

## దేశచరిత్ర

బౌద్ధమహాయుగము—వేలూరి సత్యనారాయణ
రామాహిందూదేశచరిత్రము—చిన్నకోట వెంకటరంగారావు
హిందూదేశచరిత్రకథలు-వేమవరపు సీతారామకృష్ణయ్య

### నవల

కుమార్పణము — వేదుమళ్ల రామచంద్రరావు
చక్రపాణి — చెలికాని సత్యనారాయణ
చోరశోధకుడు — అయ్యగారి నరసింహమూర్తి
మాధవీలత — బాలాంత్రపు నీలాచలం
దొంగరాముడు — గోటేటి వెంకటచలపతిరావు
రాజసుందరి — శేషవరపు వెంకటశాస్త్రి
రూపవతి — అట్లూరి వెంకటసీతమ్మ
లలిత — వేదుమళ్ల రాజగోపాలరావు
విలాసకుమారి — కలిదిండి వేంకటనరసింహరాజు
సర్వమంగళ — వారణాసి నరసింహారావు
సురస — డి. పి. రాజు (ప్రకాశకుడు)

### నాటకము

ఆరోగ్యతత్త్వము — వనం శంకరశర్మ
ఇంద్రసభానాటకము — సూర్యవిట్ఠలరావు (ప్రకాశకుడు)
కనకవల్లి — కురపాల సీతారామస్వామి
గర్వభంజనము — గండికోట బాబూరావు
చంద్రకళ — బి. యస్. పద్మనాభరాజు
పాదుకాపట్టాభిషేకము — మంగిపూడి శ్రీరామచంద్రశాస్త్రి
పుండరీక — అయినాపురపు సోమేశ్వరరావు
ప్రతాపరుద్రీయము అను యుగంధరవిజయము — సోమరాజు రామానుజరావు
మధుసేవ — కె. యస్. నారాయణరావు
మధ్యమవ్యాయోగము అను భీమవిలాసము — ఎలమర్తి శ్రీనివాసరాయుడు
మార్కండేయవిజయము — అక్కినపల్లి పైడి లక్ష్మయ్య
మీవారుపతనము — జె. సత్యనారాయణమూర్తి
యోసేఫు నాటకము — బిర్లా జోసఫ్
రాణాప్రతాపసింహ — ఎస్. కామేశ్వరరావు
రాణాప్రతాపసింహ — జె. శివన్న శాస్త్రి
లంకాదహనము — మంగిపూడి సూర్యనారాయణశాస్త్రి
వరవిక్రయము — గరికిపాటి కామేశ్వరరావు
శివలీలము — ఎస్. డి. శంకరామాత్యుడు
సంగీతసత్యహరిశ్చంద్రీయము — మంగిపూడి సూర్యనారాయణశాస్త్రి
సంపూర్ణరామాయణము — అయినాపురపు సోమేశ్వరరావు
హనుమజ్జనన నాటకము (యక్షగానము) — విశ్వబ్రహ్మ లక్ష్మణార్య

### నాట్యకళ

ఆంధ్ర నాటకములు-రంగస్థలములు — వేదుమళ్ల అచ్యుతరావు

### నిఘంటు

పూర్వగాథాలహరి — వేమూరి శ్రీనివాసరావు
శబ్దార్థచంద్రిక — మహాకాళి సుబ్బారాయుడు

### పద్యము-ఇతరము

అఖండకావ్యములు, ఒకటవభాగము — కరిమెళ్ల సత్యనారాయణ
అద్భుతరామాయణము విద్యానందసరస్వతి — కె. వెంకటరమణమూర్తి
ఆత్మవ్యక్తి — కవికొండల వేంకటరావు
కమ్మకులప్రబోధము — జి. రామబ్రహ్మం (స[illegible]కుడు)
ఖండకావ్యములు — కరిమెళ్ల సత్యనారాయణ
చిత్రమైన పొగచుట్టలు — పి. హనుమంతప్ప
దసరా పద్యములు — బొడ్డుపల్లి శేషయ్య
దివారాత్రములు — బలభద్ర బాలచెన్నయ్య
ద్రౌపదీస్వయంవరం — బుస్సావరం వెంకటప్పలదాసు
నాగేశ్వరనక్షత్రమాల — జయంతి స్వామినాయన
పద్యమంజరి — తంగిరాల రామనాథశర్మ
పాతకపూరికోటమాంబా సంస్మరణతారావళి — కోటమరాజు కోటేశ్వరరావు
పౌణిమి — కూరత్తాళ్వార్ అయ్యంగార్
భర్తృహరిసుభాషితము — ఏనుగు లక్ష్మణకవి
రామనామస్మరణ — చెంచురామకవి
రామాయణాక్షరమాలిక — తాటిచర్ల వెంకటసుబ్బయ్య
శ్రవణానందము — వరదా మంగియ్య
శ్రీ భుజంగరాయసందర్శనము — ఆర్. సి. హెచ్. వి. సుబ్రహ్మణ్యము
శ్రీరామనక్షత్రమాల — వాసిరెడ్డి వెంకటసుబ్బయ్య, బోడపూడి వెంకటరావు

150

సత్యదేవచరిత్రము—ముసునూరు వెంకటరమణకవి
సూక్తిరత్నావళి—వి. లింగన్నశాస్త్రి
కర్మవిజ్ఞానము, భా. ౧—కామఋషి మృత్యుంజయవర్మ

పౌరాణికము

శివపురాణము, వాలంగవసంపుటము—యస్. వీరరాజు

ప్రబంధము

బిల్హణీయము—చిత్రకవి సింగరార్యుడు
రామదాసుచరిత్రము—చల్లా పిచ్చయ్యశాస్త్రి
వసుచరిత్రము—రామరాజభూషణుడు
శశాంకవిజయము—శేషము వేంకటపతి

ప్రహసనము

రంగుసింగులరాజలక్ష్మి—వి-వి. రావు

యక్షగానము

ద్రౌపదీవస్త్రాపహరణనాటకము—బెడుసూరు రామాచార్య

భూగోళశాస్త్రము

నూతనభూగోళశాస్త్రము, మూడవపుస్తకము—బి. రామచంద్రరావు
భూగోళశాస్త్రము—జె. వీరరాఘవులు

మాహాత్మ్యము

కూర్మక్షేత్రమాహాత్మ్యము—జోస్యుల అప్పన్నపంతులు
దక్షారామాయణము—భాగవతుల లక్ష్మీపతిశాస్త్రి
శ్రీమహానంది మాహాత్మ్యము—జె. పద్మనాభరావు

రాజకీయము

ప్రాచీనభారతగ్రామపరిపాలన—ముదిగంటిజగ్గన్నశాస్త్రి

వచనము-ఇతరము

అహింసాపరమోధర్మః—మళయాళస్వామి
జీవకారుణ్యము ,,
నీతినిధి—వి. ప్రభాకరశాస్త్రి
ప్రాచీనసాహిత్యము—వి. వి. సుబ్బారావు, టి. రామశర్మ (అనువాదకులు)
ప్రేమ—గుడిసేవ నాగమణిదేవి
మద్యపాననిషేధము—మిస్. మెక్లారిన్

మరణానంతర జీవితము—పి. రామయ్య
లోకడేలు, పయినీర్లచరిత్రము—నరసింహదేవర సత్యనారాయణ
వివేకానందస్వామివారి "ప్రాక్పశ్చిమములు"—కూచి నరసింహము
శ్రీవెల్లాల సంజీవరాయసంకీర్తనము—కె. వెంకటసుబ్బారెడ్డి
సంతాననిరోధము—గుండు నరహరి
సంస్కృతభాషాప్రబోధము—మొటపర్తి చినసోమయ్య
సహకారవిద్య—నరసింహదేవర సత్యనారాయణ
సహకారోద్యమము ,,
స్వయంపరీక్ష—(పంచానన బుక్ డిపోవారు)
హిందూదేశమునందలి సహకారోద్యమఫలితములు—నరసింహదేవర సత్యనారాయణ

వేదాంతము

విచారచంద్రోదయము—జనార్దనస్వామి చైతన్య

వ్యాకరణము

ఆంధ్రభాషానుశాసనము, ౧-వ భా.—మల్లాది సూర్యనారాయణశాస్త్రి
,, ౨-వ భాగము ,,

శతకము

అభినవకుసుమతిశతకము, మొదటిభాగము—గాజులపల్లి వీరభద్రరావు
కుమారీశతకము—పక్కి నారసింహకవి
కృష్ణశతకము—నృసింహకవి
దాశరథిశతకము—కంచెర్ల గోపకవి
నీలకంఠేశ్వరశతకము—క్రొత్తపల్లి రాజలింగకవి
భక్తవత్సలశతకము—శేషాద్రిరమణకవులు
,, ,, మంగిపూడి వేంకటశర్మ
భక్తిరసశతక సంపుటము—వి. రామస్వామి శాస్త్రులు అండు సన్సు (సంపాదకులు)
మంగళాద్రి నృసింహశతకము—జి. ఇందుమతి
మంగళాద్రిలక్ష్మీనరసింహశతకము—నవనుపరం రామానుజాచార్య
మార్కండేయశతకము—రాజా యం. భుజంగరావు

రాజరాజేశ్వరీశతకము—జి. ఇందుమతి
లోచనానందికరశతకము—దాసరి రామదాసకవి
శతకమంజరి-భక్తిసంపుటము—కె. నాగేశ్వరరావుపంతులు (సంపాదకుడు)
శారదాశతకము—వక్కలంక శ్రీనివాసరావు
శ్రీకృష్ణశతకము—సుబ్రహ్మణ్య భాగవతులు
శ్రీపరమాత్మధ్యానశతకము—శ్రీపతిసుదర్శనాచార్యులు
శ్రీరామశతకము—ఓరుగంటి నారాయణప్ప
సుమతీశతకము సటిప్పణము—యస్. సన్యాసయ్య అండు సన్సు (సంపాదకులు)
" యం. శ్రీరామచంద్రశాస్త్రి (సంపాదకుడు)

### స్తోత్రము

ఆంజనేయదండకము—యస్. వి. రాఘవయ్య
రామలింగేశ్వరతారావళి—రావినూతల వేంకటప్పయామాత్యుడు
శ్రీభావనారాయణపద్యమణిహారము—పిసుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి

### హరికథ

రుక్మిణీకల్యాణం హరికథ—కె. నారాయణదాసు
శ్రీకృష్ణచైతన్య చరిత్రము—బంకుపల్లి మల్లయ్యశాస్త్రి
శ్రీత్యాగరాజస్వామిచరిత్రము—నిత్యభూమానందస్వామి

---

# ఆటవిడుపు పద్యాలు

(కలిమహిమ)

అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి గారు

పండిత మణులకుఁ బామరులకుఁగూడ దాసవృత్తుల మతుల్ దార్చినావు
తాతముత్తాతల తరములం గల పూర్వవేషంబులను మార్చివేసినావు
సంప్రదాయాగత సరసధోరణి నున్న మంచితెల్గును రూపుమాపినావు
ఇంటిపెద్దలు మది నిస్సిరో! యని కొంకఁ జిన్నవారల మతుల్ చెఱిచినావు
బాగు రే! కలిరాజశాసనమహత్త్వ-మా! నినుం జెప్పి పెఱలను మరలఁ జెప్ప
వలనుపడ దెప్పుడును మఱపులకు రావు-చేసితివి మేలికర్ణ దయచేయు మమ్మ.

సీ. జాగిరీదార్లకుసైత ముద్యోగాల మాటలే వరహాల మూట లయ్యె
వంటలక్కకును గేవల మాంధ్రభాషలో మాటలాడుట రోఁతమాట యయ్యె
సోమిదమ్మలకును సుతుల పరీక్షల ముచ్చటలే కడు మెచ్చు లయ్యె
అవధానిగారి భార్యకుఁ గూడ పిల్లల ముందుజుట్టులటన్న ముచ్చటయ్యె
బాగు రే! కలిరాజశాసన మహత్త్వ-మా! నినుం జెప్పి యితరుల మరలఁ జెప్ప
వలయు మా కెప్పుడును మఱపులకు రావు-చేసితివి మేలికర్ణ దయచేయు మమ్మ!

---



## నల్లమందు : చీనాభారతదేశములు

డాక్టరు సుధీంద్రబోస్‌గారు 'మోడరన్ రెవ్యూ' జూలై సంచికకు, 'నల్లమందుపై కత్తిగట్టుట' (War on opium) అనుపేర నొక వ్యాసము వ్రాసిరి. అందుండి యాక్రింది భాగము (ఆంధ్రానువాదము) ఉద్ధృతము.

సుమా రేబదిసంవత్సరములకు పూర్వము అమెరికా దేశీయు డొకడు, నలుబదియేండ్లలో నల్లమందు ప్రపంచము నంతను జుట్టుకొనుననీ, హిందూదేశమునుండి యమెరికాకు వ్రాసెను. ఆ భవిష్యద్వాణి యక్షరశః సిద్ధించినది. అదియె ప్రారంభ మయ్యెను! ౧౭౭౬-వ సంవత్సరములో ఈస్టిండియాకంపెనీవారికి లాభకరమగు నాయవ్యయపట్టికను తయారుచేయవలసివచ్చినప్పుడే నిజముగ నది యారంభ మయ్యెనని చెప్పవచ్చును. గసగసాల మొక్కను భారతవర్షమున పైరుచేసి నల్లమందు తయారుచేసి చీనాదేశమున కమ్మవలయునని నిశ్చయింపబడెను. ఈవిధానము సూచించిన వారన్ హేస్టింగ్సు, ఈమూలిక చాల విపత్కర మయినదనియు, నందుచే నాంగ్లేయుల చెంతకే యది రాకుండ జాగ్రత్తపడవలయు ననియు, చీనాతోడి వ్యాపారమున మాత్రమే దాని నుపయోగింపవలయు ననియు నింగ్లండునకు వ్రాసెను. ఈ విషమైన వ్యాపారములతోడి సంబంధముగల చీనాదేశీయునికి చీనాప్రభుత్వము మృత్యుదండనము విధించెను. అయినను ఎట్లో యొకట్లు చీనాలోనికి ఆ మొక్కను జేర్ప మార్గము కనిపెట్టబడెను. అది జాతిజీవనమునకే భంగము గలుగజేయునంతటి శీఘ్రగతిని దేశమంతట వ్యాపించిపోయెను.

చీనాప్రభుత్వము చీనాదేశము నీపిశాచము బారినుండి తప్పించు ప్రయత్నమున సాహసపూర్ణమగు విధానము నొకదాని నవలంబింప నిర్ణయించుకొనెను.

1839 సంవత్సరమున కాంటనుహార్బరులో నిషిద్ధమైన దొంగసామ్మను కారణముతో ఇంగ్లీషువారి 1440 టన్నులమందునుబట్టుకొని విధ్వంస మొనరించిరి. అప్పుడు నల్లమందు యుద్ధములు రెండు నారంభమయ్యెను. 1858 సంవత్సరమునాటికి నల్లమందువిషయమున చైనావారి నిరోధమంతయు భగ్నమయ్యెను. నల్లమందు దిగుమతికను మతించుపద్ధతిని రాజీపడుటకు చీనాదేశము నిర్బంధింపబడెను. నల్లమందుప్రవాహమువలె దేశమున వచ్చిపడెను. అదికాక తనధనమును రక్షించుకొనుటకై చీనా విరివిగా గసగసాలమొక్క పైరుచేయ మొదలిడెను. క్రమముగ జాతియంతయు దానికి లొంగిపోయి దాని ప్రలోభనమునకు వశమైపోయెను.

అప్పుడు మరల ప్రబోధముకలిగెను. 1906 సంవత్సరములో చీనావారు తమదేశమున నల్లమందును విధ్వస్తమొనరింప నుద్యమించిరి. 2000000 ఎకరముల భూమిపైనగల మొక్కల నాశన మొనర్చివైచి 500000 నల్లమందుకొట్లను మూసివైచిరి. అది జాతీయ సంస్కారణోద్యమములకాలమై యుండెను. కొంతకాలమువరకు చీనాదేశము నల్లమందునుండి విముక్తమై యుండెను.

'ప్రారంభమున నిర్బంధముగ చీనాదేశములో నల్లమందు వ్యాపింపజేసినది తెల్లవానిదురాశయే. అంతకన్న పదిరెట్లధమతరములగు 'మార్ఫియా' 'హిరోయిను'లను నిర్బంధముగ చీనాపై ద్రోసినదియు నదియే', అనియొక అమెరికాదేశీయుడు వ్రాయుచున్నాడు. 1911 సంవత్సరమునాటి చీనాలోని విప్లవకాలమునుండియు నాదేశ

మున వ్యాపించియున్న శిక్షాగారహితములగు పరిస్థితుల యందు నల్లమందు మొక్కలను పండించుట మరల యారంభమయ్యెను. కొలదివత్సరములకు పూర్వము నాటి మహా ప్రతిఘటనమంతయు వ్యర్థమైపోయెను. ప్రతిఘటనము మరల మొదటినుండియు నారంభింపవలసినట్లయ్యెను.

నేడు చీనా, హిందూదేశములు ప్రపంచములో నల్లమందు మొక్కను బండించెడి ప్రముఖదేశములు. నల్లమందు మొక్క నశింపవలెను. నల్లమందు అంతర్జాతీయము విపత్తైనది. హిందూచైనాదేశముల మద్యపదార్థములు ప్రపంచమునంతను ముంచివేయుచున్నంతకాల మేజాతియు క్షేమముగ నుండజాలదని యమెరికనులవాదము. గడచిన యైరోపాయుద్ధమున, భారతదేశము 'హూణు'ను అణచిపెట్టి ప్రపంచనాగరికతను రక్షించెనని చెప్పుదురు. దానికి నూరురెట్లుగ విషపూరితమై ప్రపంచమునకుశత్రువైయున్న యీనల్లమందు పిశాచముబారినుండి తమదేశమును బ్రపంచమును రక్షించుకొనుటకు భారతీయులకిప్పుడేల యనుమతి యొసంగబడకున్నది?

---

## భూమియుత్పత్తి

['మాధురీ' (హిందీ) పత్రిక ఆషాఢసంచికలోని విజ్ఞానవాటికనుండి]

'భూమియుత్పత్తినిగూర్చి యిప్పటి కనేక సిద్ధాంతములు వెలువడినవి. భూమి మొట్టమొదట వాయుపదార్థములవలన నేర్పడి, క్రమక్రమముగా ప్రస్తుతరూపమును గాంచినదని ప్రతీతి. నేటివరకు వైజ్ఞానికుల యభిప్రాయమదియే. కాని చికాగో విశ్వవిద్యాలయాచార్యులగు టి. సి. చేంబర్లేన్‌గారొక నూతనసిద్ధాంతమును ప్రతిపాదించినారు. సూర్యునినుండి చల్లబడిన శకలము లెప్పుడును నిర్గతములగుచుండునట; ఆశకలములలో నొకటిభూమియట. ఇరువదివత్సరము లధ్యయనమొనర్చినపిదప వారు భూమియంతయు సమగ్రముగ ఘనపదార్థములవలననే యేర్పడినదను సిద్ధాంతము గావించినారు. భూమియొక్క నిమ్నోన్నతస్వరూపము వారిసిద్ధాంతమందలి సత్యతకు తార్కాణమని జ్యోతిష్కు లనుచున్నారు. అగ్నిపర్వతముఖమున వెలువడుపదార్థముల యాకారములో భూమి యాకారమునకు సామ్యమున్నది. కావున భూమిసూర్యునివలననే యుత్పన్నమైనదనుట కెట్టి సంశయమును లేదు.'

---

## హొయిసల విష్ణువర్ధనవిగ్రహము

దక్షిణ హిందూదేశమున క్రీ. శ. పండ్రెండు పదుమూడు శతాబ్దములలో పాలించిన రాజవంశములలో హొయిసల రాజవంశమొకటి. ఈవంశజులలోని విష్ణువర్ధనమహారాజు (క్రీ. శ. ౧౧౧౧–౧౧౪౧) విగ్రహము బేలూరి చెన్నకేశవస్వామి ఆలయములోనుండగా మైసూరు పురాతత్వశాఖవారు కనుగొని, దానికి ముందుభాగమునుండియు, వెనుకభాగమునుండియు రెండుఛాయాపటములుతీసి వాటినుండి దిమ్మలు తయారుచేసి వారినివేదికలో ప్రకటించిరి. ఆనివేదికలోని చిత్రమునుసరించియే యీచిత్రములు తయారుచేయబడినవి.

"చెన్నకేశవాలయమున ఒకతిన్నెమీద నిలుచుండినట్లున్న ఈవిష్ణువర్ధనవిగ్రహము రమారమి ఒకటిన్నర అడుగులయెత్తుఉన్నది. వైష్ణవాచారపద్ధతిని తలవెనుకభాగమున జుట్టుముడికలదు. (అది ఛాయాపటమున కనబడుటలేదు. విష్ణువర్ధను డీరీతిని తనజుట్టుముడివేసికొనుచుండె నేమోమనకు స్పష్టముగ తెలియరాదు. కర్ణాలంకారములతోను, హారములతోను, ఇతరాభరణములతోను ఆవిగ్రహము చాలయలంకృతమైయున్నది. కటిబంధనినుండి ఎడమప్రక్కకుఒఱలోనుండిన కత్తియొకటియును, కుడిప్రక్కకు కైజారొకటియు వ్రేలాడుచున్నవి. విగ్రహముమీద అదృష్టసూచకముగ శంఖచక్రములును, ఇతర రేఖలును, చక్రములును అరచేతిమీదను, వ్రేళ్లమీదను, కాళ్లమీదను వ్రాయబడియున్నవి. ఇవి ఛాయాపటమున గానవచ్చుటలేదు.

---

## సంపూర్ణసూర్యగ్రహణచిత్రములు

"జూన్ నెల 29–వ తేది సంపూర్ణసూర్యగ్రహణము జరిగెను. ఇట్టి గ్రహణము జరిగి 200 సంవత్సరములైనది. ఇక 72 సంవత్సరములకుగాని మరల ఇట్టిగ్రహణము జరుగదు. ఇంగ్లండులో ఈగ్రహణము చక్కగ కనుపడెను. ఈప్రకృతి సంఘటనమును చూచుటకై పలువురు ఇంగ్లండునకు వెళ్లిరి.

"సూర్యునకును భూమికిని మధ్య చంద్రుడు వచ్చుటచే ఈసంపూర్ణగ్రహణ మేర్పడుచున్నది. రెండుగంటల కాలము చంద్రుడు సూర్యకాంతిని అడ్డగించును. ఏయే ప్రదేశములందు గ్రహణము స్పష్టముగ కనుపడునో చిత్రమునందుచూపబడినవి. చంద్రునినీడ కోణాకారముగ పశ్చిమోత్తరఆఫ్రికాఖండముపైని, యిరోపాఖండమున స్పెయిను, ఫ్రాన్సు, జర్మని, దక్షిణఇంగ్లండు దేశములపైనిబడుటచే ఈప్రదేశములవారికి గ్రహణము బాగుగకనుపడును."

---

## విదేశములయందు మహాభారతకథల ప్రభావము

['మనోరమా' (హిందీ) పత్రిక జూలై సంచికయందురామగోపాలశాస్త్రిగారిట్లువ్రాసిరి

సంస్కృత సాహిత్యమున మహాభారతమునకు గొప్ప గౌరవము గలదు. నిజమునకు సంస్కృతసాహిత్యమున ప్రాచీనేతిహాసమును దెలియజేసెడు గ్రంథములు శ్రీమద్రామాయణ మహాభారతాదులు లెక్కకు మూడు నాల్గు మాత్రమే కలవు.

వందలకొలది దేవాలయములందు మొదటినుండియు భారత కథాకథనము జరుగుచు వచ్చుచున్నది. శివాజీయు, పాంచాల కేసరియగు రణజిత్ సింగును ఈ మహోబ్ధినుండి యనేకనీతిరత్నముల గ్రహించిరి. ఈ మహద్గ్రంథమున ననంతములగు కథలుగూడ మిక్కుటముగ నీతులు జేర్చబడినను రాజనీతి పూర్ణములు, శిక్షాప్రదములు నగు కథలుగూడ ననేకములుగ నున్నవి.

ఈ గ్రంథమును మునీశ్వరుడగు వ్యాసభగవానుడు రచియించెను. ఇందు ముప్పదినాలుగువేల శ్లోకములు గలవు. మహాభారత యుద్ధమునకు మూడువత్సరముల యనంతర మిది రచియింప బడినది.

భారతీయ సాహిత్యమున నీ గ్రంథముయొక్క ప్రభావ మత్యధికము. మూలకథను మహాభారతమునుండి గ్రహించని నాటకముగాని, కావ్యముగాని యుండదు. ఈమహాభారతకథల ప్రభావము భారతదేశముననే కాక దేశాంతరములయందుగూడ మిక్కుటముగ వ్యాపించెను. యూరోపుఖండమునగూడ నీకథ లధికముగ స్వీకరింపబడినవి. ఈవిషయమునకు నిదర్శనము జూప మేము కొన్ని యుదాహరణముల నిచ్చుచున్నాము.

### బ్రాహ్మణునికథ

మహాభారతమునందలి స్త్రీపర్వమున నొకబ్రాహ్మణునిగూర్చి ధ్వనిప్రధానములగు కథలు వ్రాయబడియున్నవి. అందిదియొకటి. "ఒకవిప్రుడు ఘనాటవిని దారితప్పి యొకకూపమున బడెను. పడగనే యతడొకచెట్టు కొమ్మ బట్టుకొని వ్రేలాడ జొచ్చెను. అటనుండి చూడగనే యావృక్షశాఖక్రింద నొక యురగమును, నూతియొడ్డున ఘాతుకమగు నొక మత్తగజమును నిలిచియుండెను. ఈరెంటి భయముచేతను అతడు క్రిందికి దిగనుజాలడు; పైకిపోవను జాలడు. ఇట్టి యాపదలోగూడ నతడు వ్యాకులత నెరుగడు. ఏలయన, నాచెట్టుపై తేనెపట్టొకటి యుండెను. దానినుండి తేనెచుక్క లతనినోట బడుచుండెను." భగవంతుడగు వేదవ్యాసుడు, భవిష్యద్జ్ఞానము లేకుండియు విషయ రసాస్వాదన లోలుడగు మానవుని గూర్చి వ్యంగ్యప్రధానమగు నీకథను వ్రాసినాడు. ఈ కథను స్వదేశీయ పండితులవలెనే విదేశీయపండితులును స్వీకరించిరి. మధ్యకాలమున క్రైస్తవమతము ననుసరించెడి దేశములందు Balaam and Joseph అనుగ్రంథమెక్కుడు వ్యాప్తిగలదై యుండెను. ఈగ్రంథము నొక ఫాదరీ రచియించెను. ఈపుస్తక మేడవశతాబ్దమున మూలభాషనుండి యరబ్బీ సిరియక్ భాషలలోని కనువదింపబడెను. సిరియక్ నుండి గ్రీకుభాషలోనికిని, గ్రీకునుండి లేటినులోనికిని అనువదింపబడెను. ఆలేటిను అనువాదమునుండి యన్ని యైరోపీయ భాషలయందు ననువాదములు వెలువడెను. ఆప్రాచీన పుస్తకమున మహాభారతమందలి యీకథ యనువదింపబడియెను.

ఫారసీభాషయందలి సుప్రసిద్ధమగు "కలీలగ్ దమనగ్" అను పుస్తకమునగూడ నీకథ యుల్లిఖితమయ్యెను. జలాలుద్దీన్ రుమీ అనునాయన ఫారసీలోనికీకథను మొట్టమొదట సంస్కృతమునుండి యనువదించెను. ఆఫారసీయనువాదమును జర్మనీభాషలో Mr. Ruckert అనునాయన యుల్లేఖించెను. ఈజర్మనీయనువాదము ప

ద్యములలోనున్నది. ఈపద్యములను ఇప్పటికిగూడ జర్మనీ యందు బాలకులు పాడుకొనుచు ఆడుకొనుచుందురు.

ఈభారతకథయొక్క లోకప్రియత్వము దీనివలన బాగుగ నెరుగగలుగుచున్నాము.

## నలోపాఖ్యానము

మహాభారతమునందలి నలదమయంతుల చరిత్రము భారతీయు లాబాలగోపాలము నెరింగి యుందురు. ఈకథ యూరపునగూడ మిగుల వ్యాప్తి గాంచినది. ఈ కథను మొదట క్రీ. శ 1819 సం. న Frawry Bopp అను నాయన Latin భాషలోని కనువదించెను. ఇప్పుడు దీనియనువాదము సాధారణముగ యూరపునందలి యన్ని భాషలలోను గలదు. యూరపుఖండమునందలి విశ్వవిద్యాలయము లన్నింటిలో సంస్కృతము నేర్చుకొనువారిచే ముందుగా నీకథ చదివింపబడును.

## సావిత్ర్యుపాఖ్యానము

సావిత్రీసత్యవంతుల కథయు మిగుల రసవంత మయినది. యూరపునందలి యన్ని భాషలలోను దీని యనువాదముగూడ గలదు. ఒక్క జర్మనీ భాషలోనే యే డనువాదములు కలవు. జర్మనీయందలి సుప్రసిద్ధమగు Prague ప్రాంతమున నీనాటకము గూడ ప్రదర్శింపబడెను.

ఈ మూ డుదాహరణముల బట్టియు మహాభారత కథలు విదేశములలో నెట్టి జనప్రియతను గాంచెనో పాఠకులు బాగుగ నెరుగగలరు.

---

## గుంటుపల్లి ముత్తమంత్రి

శాలివాహనం ౧౫౦౭ అగు నేటి విక్రమనామ సంవత్సరములో హజరత్ యిభురాహీము పాదుశాహ గారు కర్నాటకపాదుశహా అయిన శ్రీరంగరాయదేవ మహారాయులవారిని జయించి యీదేశం ఆక్రమించుకుని సదరహీ పాదుశహాగారున్ను వీరి కొమారు లయిన మహమ్మదుకొల్లి పాదుశహాగారున్ను ప్రభుత్వం చేసినారు గనుక మహమ్మదు కొల్లిపాదుశహావారి ప్రభుత్వకాలమందు కొండప్పభాస్కరుని వంశీకుడయిన రామలింగ భాస్కరుడు బహు గొప్పగా ప్రవర్తిస్తూ వుండి గుంటుపల్లి వీరయరాజు కొమారుడయిన ముత్తరాజును బాల్యకాలాన చూచిన యాదివుంచి అతనియందు రేఖావిశేషాలు చాలావుండుటచేతను శ్రేయోవంతుడని విచారించి వినికొండను కొత్రగుంటవారి వెంబడి పోయినప్పుడు తన తోడబుట్టు అయిన గంగను చింతగుంట పెంటమరాజును కొమార్తె అయిన తిమ్మగారిని యీముత్తరాజుకు యిచ్చి వివాహంచేసి ఆ వివాహకాలాన తిరుమలయగారిచేతను అన్నగారి వెంకటయచేతను అనుమతిపడసి తనతాతలు కొండప్ప బాచన్న చిన్నంన కృష్ణప్పగారి నలుగురిలోను తనతాత బాచన్న హంశపాతికెను సహిరణ్యోదక కన్యాదానపూర్వకంగా ధారబోసి తిమ్మగారికి తన పేరిటి దానపత్రికె యిచ్చి ఆపడుచుకు జనియించిన కొమాళ్లు తనహంశభాస్కరులని నియతిపరచి ఆనియతికి తిరుమలయగారిని వెంకటయగారిని వడంబరచి అనంతరకాలాననే ఆస్వాస్థ్యానకు దక్షత ముత్తరాజుయందేవుంచి యీలాగుగా తనసంస్థానం ఆయన ఆధీనంగా చేసివుండగా అంతట కొన్ని దినములకు దైవయోగంచేతను దేశంలో కుట్రమున్నీలుబలిసి భాస్కరుని వారితో పగగొని పోరుతూవుండగా అకాలోచితానను వారిబలిమి యెక్కువగనుక యేనుగవారు పట్టుకుంటవారు కురుచేటివారు రామరాజువారు మొదలయిన వారు బహుపగతులు గనుక దేశంవిడిచి తిరుమలయగారు వకస్థలానకు భాస్కరయగారు వకస్థలానకు పోయిరి. మంగళసుంటలో వాడవారివగ్గిర పిన్నవారిని ముత్తరాజునువుంచి భాస్కరయగారు గోలకొండకుపోయి పాదుశహావారి దర్శనం అయి సకలబహుమానాలుపొంది పగవారిని అణచే యత్నాలకు స్నదులు పుట్టించుకోగాను ఆపగవారె వేరువుండి రామలింగభాస్కరునిగారి శ్రేయస్సు సహించక శాబరకృత్యం చేసిరి గనుక భాస్కరయగారు అక్కడనే అంతరించిరి. ఆప్రాణోత్క్రాంతికాలమందు తనపగ అణచగలవాడు ముత్తరాజు వున్నాడని స్మరించి శరీరం విడిచెను. ఆస్థితినివిని పరితపించి ముత్తరాజు అనంతరకాలమందు రామలింగభాస్కరునికి పూర్వదైహికక్రియలు నిర్వర్తించి ఆయన పొష్యమైన పరిజనమును రక్షణచేసుకుంటూవుండిరి. అంతట కొంత

కాలానను జేళమన్నెలు బలుసుట రాజు తెలుసుకుని తమరు ఆదుర్గములు సాధించుట తడవులేదు. గనుక చాలిన తరఫుదారుణ్ని అంపదలచి యఖిలాంఖానును బహుతంత్రవంతుడైనందున ఆకాలానను తగినవాడని మహమ్మదు ఖోల్లిషాదుశహావారు అతణ్ని కొండపల్లిలో వుంచినవాడై తరఫు అతనికి యిచ్చెను. అతను పాలిస్తూ వుండగా ముత్తరాజు మంగళకుంటనుంచివచ్చి యఖిలాను ఖానునిలోను ప్రవేశం కలిపించుకునివుండి అంతకంతకు భాగ్యోదయంచాతను దార్ఢ్యుడై కార్యదక్షతతో వుండి భాస్కరుని భాస్కరయగారు అవుసానమందు అన్న వుత్తరం చిత్తమందువుంచి వారిపగతులైన మన్నెవారిని వొకరొకరిని వొక నెపం చేత చంప్పించి యీలాగుగా కొంత పగ పలచనగాచేసి జేళముఖ్యుడు భాస్కరుని తిరుమలయగారు విద్దూరంచేత వున్నారని ప్రభువుకు తెలుపుడు చేసి కొలుయిప్పించి పిలుపించి వారికి బహుమానం చేస్తే మగుడీ సీమకు వచ్చివుండిరి. అనంతరమందు ముత్తరాజు వినికొండసీమమాత్రం ప్రభువుచేతను గుత్తకు పుచ్చుకుని కడమనరభులకు పెత్తనంచేస్తూవుండగా గోలకొండకు రాజుగారు తలబుచేస్తే ఖానుడు పాయను ఆయన వెంబడిని ముత్తరాజు పోయెను. అక్కడ యఖిలానుఖానుడు వారు గతించినందున ఆయనకొడుకు శాభాసుఖానుకు తరఫుకట్టించుకునివచ్చి యిక్కడ ముత్తరాజు అతను విరోధించి తిరిగి ముత్తరాజు గోలకొండకువెళ్లి పెనకటి మోసుబా నిమిత్తం ప్రత్యహం కచేరికి వెళ్లుతూ వొక నాటిరాత్రి కచేరిలో మరచి నిద్రించగా అర్ధరాత్రి ఢిల్లీనుంచి వుత్తరములు వచ్చినందున ఆసమయంలో ప్రభుత్వంచేస్తూవున్న షాహెమహమ్మదు షాదుశహాగారు నిషాగావుండి ముసద్దీని పిలువమని కారుపర్దార్లకు ఫరుమాయించినంతల్లో వారువచ్చిచూడగా ముత్తరాజు కచేరీలో నిద్రపోతూవున్నాడుగనుక లేపుకొనిపోయి హాజరు చేసినందున షాదుశహావారు ఢిల్లీనుంచివచ్చిన వుత్తరాలు యీయనచేతికియిచ్చి వుత్తరఅభిప్రాయం చిత్తగించి జవాబుచెప్పకనే మారుత్తరములు వ్రాయమని ఆజ్ఞాపించి నిద్రాసక్తులైవారు గనుక ముత్తరాజుగారు దైవజ్ఞుడైనందున వుత్తరాభిప్రాయం చొప్పున బదులు వుత్తరంవ్రాసి షాదుశహావారు నిద్రలేచినతర్వాతను అగపరచినాడు గనుక తమమనస్సునవున్న మతలబే వుత్తరములో వున్నందున యితను ప్రజ్ఞశాలియనితోచి పెనకటిమోసుబా వ్యవహారము పరిష్కారం చేయించి కొండపల్లి వినుకొండ బెల్లంకొండ కొండవీడు యీ నాలుగు దుర్గాలున్ను అద్దంకిసీమ పలనాటిసీమ కందుకూరిసీమ నెల్లూరిసీమ వుదయగిరిసీమ చుండిసీమ పొదిలెసీమ మాచెర్లసీమ దూపాటిసీమ దరిశిసీమ కంభంమెట్టుసీమ నందిగామసీమ నల్లగొండసీమ మొదలయిన పద్నాలుగు సీమలకు అధికారంయిచ్చి పన్నెండువేలగుర్రం నలభైవేల బారున్నూ తయినాతిచేసి రేనుగరాయుడు చుండివారు జల్లివారు మొదలైన పాళెగాండ్లను శిక్షించేటట్టు హుకుం దయచేసి రేనుగబహుమానమున్ను అందలాందోళికాశ్వములు మొదలయిన వాహనములుయిచ్చి షాదుశహా అనేకితాబున్ను దయచేసినారు గనుక ముత్తరాజయ్యవారనే పద్దుపుచ్చుకొని దేశములోకి వచ్చి సదరహి పాలెగాండ్లను శిక్షించిన భాస్కరునివారి పగవారిని కొందరిని తలలుకొట్టించి కొందరిని రేనుగు కాలకట్టించి నశింపచేశి ఘట్లు చడదున్ని నసాస్వస్త్యాలు పునః నిర్వహించి భాస్కరుని తిరుమలయగారి వెంకటయ గారిని కూర్చుకొని రామలింగభాస్కరుడుయిచ్చిన దానపత్రికచూపి మీరున్ను దానపత్రిక యిప్పించి యియ్యవలెనని చెప్పగానే సంతోషపడి షట్వాది పంచలోహ విశుద్ధిగా గృహారామ సస్యక్షేత్ర వాపీకూప తటాకవన నిధినిక్షేప గ్రామ గ్రామకరణీక అగ్రహార ఖండ్రిక ఆగామిగ్రామ భవిష్యల్లాభ సహితంగా పంచి దాసదాసీ జనులను కమతగాండ్లను దేశీలుపంచి పాతికభాగంయిచ్చి ప్రతిగ్రామస్వాస్త్యం పంచియిచ్చి అగ్రహారాలు తోటలుచెట్లు పంచియిచ్చి పునః తమరు దానపత్రిక యిచ్చి పరమేశ్వరార్పితంచేసిరి గనుక తదాదిగా అవిఛిన్నానుభవం అవుతూవుండును వారుయిచ్చిన దానపత్రం తిమ్మగారి పెద్దకొమారుడు భాస్కరయగారి పేరిటిది భాస్కరయకె యిద్దరి యీలాగుగా పాతికె ముప్పాతికె భాగాలచొప్పున భాగభాగాలు చెల్లుతూరాగాను బహుదినములు ముత్తరాజయ్యవారు రాజ్యంచేశి సకలదానాలచాతను అర్థిజన దారిద్ర్యమును దరిద్రపెట్టి రెండవషాదుశహా పదురెండవరుద్రుడను రుద్రప్రతాప మార్తాండుడను

పీఠము త్తరు ప్రధానశిఖామణి పీఠుగో మహీమండల మండలీకృతపిఠండిల చండిల మ త్తము త్తవే వండభుజా భుజార్గలంచు కంద్రడీ ధనార్థులకల్ల పీఠుగో చెండనఘాదు ళాహా అనేపద్యాలు రాజసాన్నిధ్యమందు చెల్లించుకుని సకలకీర్తులువడసి బానశాస్త్రాలచాతను కీర్తిప్రతాపాలువడసి సకలమన్నీలను గెలిచి సకలపగలుఅనాది వచు లేటి వండాపురాలకుపోయి జయించి జయమురాజాను యిచ్చి సర్కారువవృకరీలో మక్షిముబారకు దయసంపాదించుకుని సవరుస వ్రాసిన దేశములకు శాలీవాహనశకవరుషంబులు ౧౫౨౪ అగునేటి శుభకృతుసంవత్సరంలగాయతు శా ౧౫౯౦ అగునేటి కీలకసంవత్సరంవరకు అరువై ఆరు సంవత్సరములు రాజ్యంచేశి శివఅయిక్యముపొందెను.

(స్థానికచరిత్రలనుండి)

---

# నాట్య సుందరి

టి. ప్రసాదరావు గారు (నవకవి మండలి)

ప్రియసఖునికంఠము నలంకరింప స్వచ్ఛ
చంద్రికలు పూయు ముగ్ధపుష్పములు తె
సరసశృంగారనాట్యమందిరమునందు [చ్చి
గ్రుచ్చుచుంటి మనోరథ కుసుమమాల!

అరవిరిసరంబు కన్నుల కద్దుకొనెడు
ఆర్ద్రదృశ్యంబులో తెర యస్తమించె
తరుణమాధుర్యమూర్తి యప్సరసవోలె
సవిధ రంగస్థలంబున నవతరించె.

నందనసుమనస్సౌరభ స్యందనములు
మందమారుతంబులు చిందె మధురసంబు
కిన్నెర రచించె స్వాగత కీర్తనంబు
కులుకువగలాడి గిలుకుటందెలు ధ్వనించె.

విమల విద్యున్నటీ నాట్య విలసనంబు
తీర మెచ్చుట నేర్చె నీ యభినయంబు
ఎంత సమ్మోహనంబు రా యీనవధూటి
నృత్య మాత్మ బ్రహ్మానంద నిలయ మయ్యె!

అమృత కలకంఠ కలకంఠ మాస్వదించి
అంగవిన్యాస సౌందర్య మనుభవించి
భ్రూనటన కౌశలములోన పులకరించి
రక్తి గట్టినది రసార్ద్రరంగసీమ.

తత్క్షణంబున తన్మయత్వము భజించి
నిలువునీరయి నృత్యసన్నిధిని జేరి
అప్సరస్సుమధుర వదనారవింద

* * * *

మనిమిష దృగంచలముల జూరాడు కొంటి!

ఎవ్వరో నన్ను కలకల న్నవ్వువారు
కమ్రకలకంఠ కంఠ, శృంగార సరసి!
కాదుకాదు! కట్టెదుట సాక్షాత్కరించె
నా ప్రియసఖుండు నారతనాల పంట.

వికృత గద్గదస్వరము కంపించిపోయి
గాఢలజ్జాభరంబున గ్రాగిపోతి!

* * * *






## అలంకారసారసంగ్రహము

కర్త: మహోపాధ్యాయ వేదము వేంకటరాయ శాస్త్రిగారు

డెమ్మిసైజు; ౮౬ పుటలు. వెల ౧౨ అ.

సాహితీసమరాంగణమున గండరగండఁడై పేర్వెలసిన వేదము వేంకటరాయశాస్త్రిగారు కడువార్ధకమునఁ గూడఁ గలముసాము సల్పఁగలిగియుండుట యాంధ్రభారతీదేవి యదృష్టవిశేషము! ఆంధ్రభారతి కడుపు చల్లగా శాస్త్రిగారింకను బదియేండ్లపాటు సారస్వతసేవ సల్పఁగల్గియుందురుగాక! పది పండ్రెండు దినములలో నాముక్తమాల్యదావ్యాఖ్యానము, అముద్రితగ్రంథము వెల్వడనున్నదట! రసికులందు కావ్యామృతరసమును జబ్బునఁ జాలు జుఱ్ఱఁగలరు!

ఇప్పుడు, అలంకారసారసంగ్రహమని చిన్నియలంకారశాస్త్రగ్రంథమును బ్రకటించిరి. ఇది ఇప్పటికి నలుపదియైదేండ్లకు ముందు వారు రచించి ప్రకటించినదే; కాని మరల నిప్పుడు చక్కఁగా సంస్కరించి ప్రకటించిరి. జయదేవుని చంద్రాలోకాలంకారప్రకరణమున కిది తెలుఁగుసేఁత. గణపవరపు వేంకటకవి, అడిదము సూరకవి మొదలగువారు దీనిఁ దెలిఁగించిరి. కాని యా తెలిఁగింపులకు దీనికి మిక్కిలి భేదము గలదు. శాస్త్రిగారిగ్రంథములం దొక్కయక్కరముగూడ వ్యర్థముగా నుండఁగూడదు. శాస్త్రిగారీ తెలిఁగింపు సంతకట్టుదిట్టముతో నెఱపిరి. తక్కినవారి రచనము లట్టులేవు. క్లుప్తములయిన కందపద్యములలో సర్వాలంకారములను వీరు వివరించిరి. మంచివివరణము వ్రాసిరి. ఈ గ్రంథమే నాంధ్రాలంకారకారికలని నేను పేర్కొందును. ఈ కందపద్యముల నన్నింటిని కంఠపాఠము చేసినచో సర్వాలంకారలక్షణములు నుపస్థితములుగా నుండఁగలవు. విద్యాశాలలలో విద్యార్థులకు, విద్వాంసులకు నిది బహూపకారకము.

మచ్చునకు చిత్రాలంకారలక్షణము నుదాహరణముగ జూపుచున్నాను.

"ల. ఏయది చిత్రము యుత్తర, [మగుఁగా
మాయెడఁ బ్రశ్నోత్తరాంత రాభిన్న
ఉ. నాయంబె యీవి; కడు మే
లేయది? సీరిపుల నోంచు నెది? నాయంబే.

ల. (1) ఒకప్రశ్నకు ఆప్రశ్నవాక్యమే ఉత్తరమును, (2) అనేకప్రశ్నములకు శ్లేష(చేత)ఒకటే ఉత్తరమగుటయు - చిత్రాలంకారము ద్విప్రకారము.

ల. [ఏయది చిత్రము అయెడఁగా=చిత్రాలంకారమందు, ప్రశ్న ఉత్తరా(ర + అ)ంతర అభిన్నము.[ప్రశ్న అభిన్నము = ప్రశ్నవాక్యమే-ఉత్తరాంతర అభిన్నము= వేఱు ఉత్తరమునకుం గూడ అభిన్నము]

'చిత్రాలంకారమందు, (1) ప్రశ్నవాక్యమే ఉత్తర(వాక్య)ము నగును; ఇది యొకప్రకారము; పెక్కుప్రశ్నలకు ఒకటే యుత్తరవాక్యము;—ఇది యింకొక ప్రకారము.'

ఉ. [నాయంబె=న్యాయమా? ఈవి=త్యాగము మంచిదా?] ఒకప్రకారము—'నాయంబె ఈవి?' ఇట 'త్యాగము న్యాయమా?' అని ప్రశ్న. 'త్యాగము న్యాయమే' యని యుత్తరము; రెండు వాక్యములకును

'నాయంటె యీని' అని ఒకటే స్వరూపము గాన భేదము లేదు. ఇంకొకప్రకారము—'శుభం లేయది? నీరిపుల నోంచు కెది?' 'నాయంబే;' ఇందు 'శుభం లేది?' ఇది యొక ప్రశ్న. 'నీరిపుల నోంచు కెది?' ఇది మఱియొక ప్రశ్న. రెంటికిని 'నాయంబే' అని ఒకటే యుత్తరము.—న్యాయ్యమే (శుభము) అని మొదటి ప్రశ్నకు ఉత్తరము, 'నాయొక్క అంబే (=బాణమే) నారిపుల నోంచునది,' అని రెండవప్రశ్నకు ఉత్తరము."

కడువాృకమునఁ గనుచూపు దగ్గియు శ్రీ శాస్త్రిలవా రింకను గొప్పగ్రంథముల రచించుచున్నారు. సాహిత్యదర్పణమును దెలిఁగించిరి! ఏమి రచించిన నేమి! లక్ష్మీదేవమ్మగారు వారిని లక్షింపకున్నారు. భాగ్య భోగ్యములు లేకున్న మానె ఋణము లేకుండ అభ్యసనో రమునకుఁ గొఱఁతలేకుండ వయినఁ గడుపలదా! శ్రీ శాస్త్రిలవారి కీవయస్సున నిట్టిక్లేశముగూడ నుండవలె నా? వీరిట్లు క్లేశపడుట యాంధ్రసారస్వతమునకే యనర్థము గాదా! ఆంధ్రభాషాభిమాను లాలోచింపవలదా?

ఈగ్రంథము వలయువారు గ్రంథకర్తగారి పేర 'నెం. 4, మల్లికేశ్వరవీధి, జార్జి టౌను, మద్రాసు' అని వ్రాయవలెను.

—వే. ప్ర. శాస్త్రి.

---

# గ్రంథస్వీకారము

## గౌతమధర్మసూత్రములు

ఇది 'ఆర్యభారతీగ్రంథమాలిక ౧-వ కుసుమము.' డబిల్ క్రౌను ౧ా సైజున ౫౩౧ పుటలును, క్యాలికో బైండును గలిగియున్నది. వెల ఆర్యభారతీగ్రంథమాలిక చందాదారులకు రు. ౪-౨-౦; ఇతరులకు రు. ౯-౦-౦.

బ్రహ్మశ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి గారు దీనిని 'హరదత్తాచార్యుని మితాక్షర యను సంస్కృతవ్యాఖ్యానముతోను,' తేటతెల్లము గు తమ ఆంధ్రవివరణ విశేషాంశములతోను ప్రశస్తముగ ముద్రించి ప్రకటించిరి.

వలయువారు 'ఆర్యభారతీప్రెస్సు, 7, ఆర గంగన్నవీధి, మద్రాసు' అని వ్రాయవలయును.

## విజయాశ్వచరిత్రము

పురాణం పిచ్చయ్యకవి ప్రణీతము

డెమ్మీసైజు ౨౩౫ పుటలు. వెల రు. ౧-౪-౦.

ఈప్రబంధము వలయువారు 'ఇండియా ప్రింటిం వర్క్సు, మద్రాసు' అని వ్రాయవలెను.

## జ్యోతిర్లీల

దీనికి 'ఆంధ్రవీరలక్ష్మీవిజయ' మను న మాంతరము గలదు.

కర్త: శ్రీ రాజా వేంకటాద్రి అప్పారా బహద్దర్, ఉయ్యూరు యెస్టేట్ జమీందార గారు.

డబిల్ క్రౌను ౧ా సైజు: ౧౪౯ పుటలు. వెల రు. ౨-౦-౦

వలయువారు 'డాక్టరు జోగయ్యశర్మ, ఆంధ్ర భట కార్యదర్శి, పవరుపేట, ఏలూరు, పశ్చిమగోదావరి' అని వ్రాయవలెను.

## రాఘవశతకము

కర్త: దేవిరెడ్డి వెంకటనారాయణరెడ్డిగ రు

క్రౌనుసైజు ౨౧ పుటలు. వెల ౦-౨-౦.

వలయువారు 'బోడె వెంకట్రామయ్య, మనపల్లె రోడ్డు, సి. టి. యమ్. పోస్టు' అని వ్రాయవలెను.

## బంగారము

కర్త: వేదుల సూర్యనారాయణశాస్త్రిగారు

క్రౌనుసైజు ౩౧ పుటలు. వెల ౦-౪-౦.

వలయువారు గ్రంథకర్తగారి పేర 'కాకరపర్రు తణుకుతాలూకా, పశ్చిమగోదావరి' అని వ్రాయవలెను.

## లోకనాయకశతకము

గ్రంథకర్త: మునగపాటి చిన హనుమయ్య

క్రౌనుసైజు ౩౭ పుటలు. వెల ౩ అ.

వలయువారు 'భారతగ్రంథమండలి, చత్తెనపల్లి గుంటూరుజిల్లా' అని వ్రాయవలెను.

### శ్రీలక్ష్మీపతిసోమయాజీయమ్
(అను ధర్మశాస్త్రము)

కర్త: శ్రీపాద శివరామసిద్ధాంతిగారు

డెమ్మీసైజు ౩౪౭ పుటలు. వెల రూ. ౨-౮-౦.

ఈ గ్రంథము కావలయువారు గ్రంథకర్తగారి పేర కోటరామచంద్రపురము (గోదావరిజిల్లా) నకు వ్రాయవలెను.

### ఒథెల్లో—వెనీసునగరపుమూరు

కర్త: గోగులపాటి వీరేశలింగము పంతులు, బి. ఏ. గారు

క్రౌనుసైజు ౮౪ పుటలు. వెల ౦-౫-౦.

'కావలయువారు ఏ. రాజగోపాలురెడ్డికం పెనీవారికి నెం. ౧౬౫, స్ట్రింగర్సు స్ట్రీట్, పెరంబూరు బ్యారక్సు, చెన్నపట్టణము—వ్రాసి తెప్పించుకొనవచ్చును. లేదా కృతికర్తకు, కాకినాడకైనను వ్రాయవచ్చును.'

### సోదరి

గ్రంథకర్త్రి: గుడిపూడి ఇందుమతీదేవిగారు

ఫూల్‌స్కేప్ ౧౬ సైజు ౭౫ పుటలు. వెల ౦-౩-౦.

కావలయువారు 'గుడిపూడి రామారావు గారు, గాంధీనగరం, బెజవాడ' అని వ్రాయవలెను.

### భోజుఁడు

కర్త: సోమంచి గురుస్వామిశాస్త్రిలుగారు

క్రౌనుసైజు ౬౬ పుటలు. వెల ౦-౬-౦.

కావలయువారు గ్రంథకర్తగారి పేర 'తెలుగు పండితులు, సి. సి. సి. హైస్కూలు, పెరంబూరు, మద్రాసు' అని వ్రాయవలెను.

### చంటిబిడ్డ (వైద్యగ్రంథము)

కర్త: వైద్యశాస్త్రి తాతా రామమూర్తి గారు

క్రౌనుసైజు ౪౫ పుటలు. వెల ౦-౫-౦.

కావలయువారు గ్రంథకర్తగారి పేర 'శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాల, విజయనగరము' నకు వ్రాయవలెను.

---

## కాఁపుపడఁతి

కె. అన్నమరాజశర్మ గారు

ఇనుఁడు పడమటిచఱులందు నింకిపోయె
దారి తేఁజీఁకటులు నిన్ను తరుము నేమొ
కడవపై లయ సంధించి కాఁపుపడఁతి!
ఏలపాటలతో నింటి కేఁగు మింక.

మోమున నమాయికత్వంబు మూర్తిగొనఁగ
సహజసౌందర్య మొడలిపై జాలుచుండ
పంటపొలములదరి కాలిబాటలందు
భావ ముప్పొంగ నవ్వుచు పాడ రమ్ము.

ప్రకృతి సర్వత్ర శాంతంబు పాదుకొనఁగ
సంజకెంజాయ నీదు ప్రసన్నగీతి!
పద్మరాగాంచితస్వర్గపథములందు
పాడఁబడు దివ్యగానంబువగిదిఁ దోఁచు.

చెమటముత్యాలు నొసటిపైఁ జిందులాడ,
గాలితాఁకున ముంగురుల్ కదలుచుండ,
ఎంత భావంబు కుదిరెనో యెమ్మెలాడి!
కులికి పాడెదు చిఱునవ్వు తొలకరింప.

దైనికారవక్షోభిత స్థలములందు
విమలమగు నీదు రాగంబు వినఁగ నెట్లు?
పసిఁడిపూఁతల సిరి గల్గు పైరుచేల
గట్లపైఁ గాదె నీముగ్ధగాన మొదవు.

రాగనిష్యందపూరంబు రేఁగ బాల!
పవలు కష్టించి విశ్రాంతిఁ బడయఁగోరు
ప్రాణిసంతతి కానందభాగ్య మబ్బ
హృదయమును గ్రమ్మరింపుమా పదము లెత్తి.

"మల్లెపువ్వులు."

# శ్లిష్టాక్షరపదబంధము

(CROSS-WORD PUZZLE.)

ఆషాఢమాసమున ప్రకటించినదానికి ఉత్తరము

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ము 1 | ద 2 | ర | ప్తా 3 | ■ | ర 4 | ■ | మా 5 | చ | క 6 | మ్మ |
| ఖ | శా 7 | ■ | ము 8 | ద్రి | త | ము 9 | లు | ■ | లి | ల 10 |
| ర 11 | వ | ళి | ■ | మ్మా 12 | న | కు | ■ | వి 13 | కా | స |
| ము 14 | తా | వ | ర 15 | ■ | ము | ■ | ఆ 16 | ధా | ర | ము 17 |
| ■ | రం | ణా | సా | నం 18 | ■ | వి 19 | జ | య | ము | ■ |
| ■ | ■ | ర 20 | య | ■ | ■ | ■ | వం 21 | క | ■ | ■ |
| ■ | చి 22 | కి 22a | న | ము | ■ | ధ్వ 23 | జ | ము | లు | ■ |
| పా 24 | ఋ | ■ | ము | ■ | ము | ■ | వ | ■ | ము 25 | ది 26 |
| దు 27 | త | ము | ■ | ము | య | హా 28 | ■ | మా 29 | ర | న |
| షా 30 | పు | ■ | వి 31 | మ 32 | లా | దే 33 | వి | ■ | సా 34 | ము |
| హా 35 | లి | కు | డు | ■ | వా 36 | ■ | అ 37 | అ | కా 38 | లు |

ఈ బంధమును ఇరువదిముగ్గురు పూర్తిచేసిపంపిరి. ౧౩ మాత్రము సరిగానుండినవి.

'సంపాదకుడు.'

గెలిచినవారు

మొదటి బహుమానము—చల్లా సూర్యనారాయణగారు, ముక్త్యాల.

రెండవ బహుమానము—టి. నరసింహాచారిగారు, బి. ఏ., యల్. టి., విజయనగరము.

మూడవ బహుమానము—గు. నారాయణమూర్తిగారు, యల్. యమ్. యస్, రాయపురము.



# సాభిప్రాయ విశేషములు

వర్తమానయుగము మహాసంరంభయుగము. భావపరంపరలు వాయువేగముతో విశ్వమునం దంతటను వ్యాపించుచున్నవి. వివిధ దేశములకును, జాతులకును మానవరంగము నం దన్యోన్యాశ్రయ మేర్పడినది. లండనునగరమునందు చీమచిటుక్కుమనిన, అద్ధ్వని ప్యారిసు, ఢిల్లీ, పెకింగు, టోకియో, న్యూయార్కు మొదలగు నగరములందు మారు మ్రోగుచు గడియలో ప్రపంచ సంచారము చేయుచున్నది. ఒకక్షణము సంగ్రామము, ఒకక్షణము శాంతి, ఒకక్షణము శాస్త్రపరిశోధనము, ఒకక్షణము కళాప్రదర్శనము, ఒకక్షణము మతావేశము, ఒకక్షణము వ్యభిచారములు, హత్యలు, ఒకక్షణము యుద్ధనావలు, ఒకక్షణము వాయువిమానములు, ఒకక్షణము న్యాయనిర్ణయములు, ఒకక్షణము భూకంపములు, ఒకక్షణము వినోదములు, ఒకక్షణ మాటపాటలు మొదలగు విషయములు చిత్తవృత్తి నాకర్షించుచు మనశ్శాంతికి భంగము కలుగజేయు చున్నవి. అనంతవేగము మనస్సు నొక విషయమునుండి వేరొకవిషయమునకు మరల్చుచున్నది. ఏవిషయమునం దైనను ధ్యాస గలుగకున్నది. అన్ని విషయములును తెలిసినటులు గనుపడును. శాంతముగ యోచించినపు డేవిషయమును తెలిసినటులు గనుపడదు. అన్నియును సంశయముతో నిండియుండును. మహానుభావులు జీవితమునంతయును ధారవోసి తెలిసికొనిన విషయములు అతిసులభముగ గనుపడును. కళలు, సాహిత్యము, రాజ్యతంత్రము, సంపద్ధర్మములు, ధర్మశాస్త్రములు, తత్త్వనిర్ణయములు కరతలామలకములుగ నున్నవి. అజంతాచిత్రములు, తిక్కనసాహిత్యము, మహాత్ముని సత్యాగ్రహము, శంకరుని వేదాంతము, చాణక్యుని రాజ్యతంత్రము, పరాశరుని ధర్మశాస్త్రము సామాన్యులకు సహితము సులభములుగ గనుపడుచున్నవి.

పత్రికలు సిద్ధాంతములను స్థాపించుచున్నవి. వాయువార్తలు సిద్ధాంతములను సర్వత్ర వ్యాపింపజేయుచున్నవి. ఢిల్లీకి, పల్లెకు భేదము పోయినది. దూరశ్రవణయంత్రము దూరము నస్తమింపజేయుచున్నది. లండను నగరమునందు పాడెడిపాటలు, ఆడెడిమాటలు బొంబయియందు వినబడుచున్నవి. నిరంతరము పత్రికలయందును, సభావేదికలయందును తమ యభిప్రాయములను వ్యక్తముచేసెడి వారల బోధలు చిత్తవశీకరణమును జేయుచున్నవి.

సర్వత్ర ధనము రాజ్యముచేయుచున్నది. శ్రీమంతులు ముద్రణాలయములను బెట్టి వారివాదమును విశ్వవ్యాప్తముచేయుట సులభసాధ్యమైయున్నది. డెయిలీమెయిలు, లండనుటైమ్సు మొదలగు పత్రికలు స్వపక్షవాదమును దిన దినమును లక్షలకొలది ప్రజలచిత్తములందు ప్రతిబింబింపజేయుచున్నవి. పండితులు, పామరులు పత్రికాభిప్రాయములను విమర్శలేకయే తమ అభిప్రాయములనుగను గ్రహించుచున్నారు. ప్రజల నిత్యజీవనమందు అన్నపానాదులవలె పత్రికాభిప్రాయములును పరమావసరములుగ నున్నవి. శ్రీమంతులు పూనిన మార్గమును సామాన్యులును నవలంబించుచున్నారు.

ముద్రణాలయమును స్థాపించుట, పత్రికలను ప్రచురించుట, స్వాభిప్రాయములను వ్యాపింపజేయుట సులభమైనది. అన్నశాలలందు సిద్ధాన్నమువలెవార్తాపత్రికలందు సిద్ధభావములుసులభగ్రాహ్యములైనవి. ఏవిషయమునుగాని శ్రద్ధతో చదువుటకును, చదివినదానిని ధ్యానమననాదులు చేసి విజ్ఞానమును బడయుటకును అవకాశములు చాలకున్నవి. రంగాచార్యులుగారు ఆస్ట్రేలియా అనుభవములను ఉపన్యసించుచున్నారు. రామదాసుగారు ఆంధ్రులకు నాయకులు లేరని చింతిల్లుచున్నారు. బ్లాకెట్ గారు భారతీయరాజ్యతంత్రజ్ఞుల ప్రాబల్యము విస్తరిల్లుచున్నదని భయపడుచున్నారు. విశ్వేశ్వరయ్యగారు ప్రజల ఆర్థికస్థితి సన్నగిల్లు చున్నదని చింతిల్లుచున్నారు. మదనమోహన మాలవ్యగారు హిందూసంఘము క్షీణించు చున్నదని తలపోయుచున్నారు. గాంధీమహాత్ముడు ప్రజలు ఖద్దరుపట్ల నభిమానమును జూపుటలేదని దుఃఖించుచున్నాడు. నాయకుల భావములను చదువునపుడు యుక్తముగ నున్నటులు కనుపడుచున్నను, ఆచరణమునందు యోగము లేకను ఏదియును సాధ్యము కాకున్నది.

గతమాసమునందు విశ్వేశ్వరయ్యగారు, గాంధీమహాత్ముడు, ఇర్విను ప్రభువు మైసూరు సంస్థానమునందు చేసిన ప్రసంగములు భారతీయుల నిస్సహాయస్థితిని, దౌర్బల్యమును విశదము చేయుచున్నవి.

* * * *

## ప్రజల దారిద్ర్యము

బెంగుళూరులో గత మాసమునందు దక్షిణభారతీయ ఖద్దరు ప్రదర్శనము గాంధిమహాత్ముని యాజమాన్యముక్రిందను జరిగినది. ఆప్రదర్శనమునందలి ఖద్దరు నిర్మాణములను సందర్శించినవారలకు విషాదానందములు గలుగుచున్నవి. సన్నని దారమును వడుకగల సూరమ్మలును పీరమ్మలును, నేత నైపుణ్యము గల బాలప్పలును, అద్దకపు తెలివితేటలు గల రాఘవశర్మలును, ఏకులుచేయగల మణియమ్మలును గలరని యానందము గలుగుచున్నది. ప్రదర్శనమునందు గల ఢక్కామజిలినులు, శ్రీకాకుళము వస్త్రములు, నానాఘర్నవిసు కోటు మొదలగు వస్తువులు ప్రాచీనకళాకౌశలమును సంస్మరింపజేయుచున్నను, విషాదమును గలుగజేయుచున్నవి. ప్రాచీనౌన్నత్యమును వర్తమానపతనస్థితిని ఖాదిప్రదర్శనము బుద్ధిగలవారికి ప్రత్యక్షము చేసినది. హిందూ

దేశమునందు 2,316 పట్టణములు, 6,85,665 గ్రామములు గలవు. పట్టణములందు 100కి 10 వంతున 3,24,75,276 ప్రజలును, గ్రామములందు 100 కి 90 వంతున 28,61,76,205 ప్రజలును నివసించుచున్నారు. ప్రజలయందు 2,240 లక్షల ప్రజలకు వ్యవసాయము జీవనాధారముగ నున్నది. వ్యవసాయము సంవత్సరమునం దైదారుమాసములు మాత్రమె సాగుచున్నది. శేషించినకాలమునందు వీరి కాలము వ్యర్థముగను గడుచుచున్నది.విశ్వేశ్వరయ్యగారు చెప్పినటులు, పనిపాటులు చేసినటులు కాలయాపనముమాత్రము జరుగుచున్నది. మీదు మిక్కిలి రచ్చలు పేకాటలు దుర్వ్యసనములను పరిపాటి చేయుచున్నవి. రయితులు వ్యవసాయమునం దార్జించెడి ఆదాయము వారి యుదరపోషణమునకు చాలక, వారు దుర్భరదారిద్ర్యదుఃఖము ననుభవించుచున్నారు. హిందూదేశమునందు రూ. 36, గ్రేటుబ్రిటనునందు రూ. 750, అమెరికాయందు రూ. 1080, కనడాయందు రూ. 600 చొప్పున మనుజునకాదాయము వచ్చుచున్నది. హిందూదేశమునందు దినమున కొకమనుజునకు 0-1-7 ఆదాయము వచ్చుచున్నది. ఈయాదాయ మవసరమైన యన్నవస్త్రములకే చాలకున్నది.

ఈ యాదాయమును వృద్ధిచేసి దరిద్రనారాయణులను రక్షించుటయె ఖద్దరునకు ప్రయోజనము. ఆర్థిక ప్రయోజనమువలనను ధార్మికనైతికప్రయోజనములును సహజముగను గలుగవచ్చును. భరతఖండమునకు జేరతటను 1926 సంవత్సరమునందు రూ. 23, 76, 670 ల ఖద్దరు విక్రయింపబడినది. హిందూదేశమునందు 1925 వ సంవత్సరమునందు 24,000 లక్షల రతుల దూది పండినది. ఆ దూదియందు సగ మితరదేశముల కెగుమతి యగుచున్నది. స్వదేశమునుండి దూది, దూది నిర్మాణములు 110 కోట్లరూప్యముల విలువగలవి ఎగుమతిచేయబడుచున్నవి. సంవత్సరమునకు 80 కోట్ల రూప్యముల విలువగల నూలు బట్టలు దిగుమతి యగుచున్నవి. మనుజుడు తల యొకటికి సంవత్సరమునకు రూ. 4 చొప్పునను బట్టలకు వ్యయముచేయుచున్నాడు. ఆవ్యయమునందు తలఒకటికి ఒక రూపాయి తగ్గినను సంవత్సరమునకు 30కోట్ల వ్యయము తగ్గి దేశాదాయము వృద్ధికాగలదు. గతసంవత్సరమునందు తయారైన 23 లక్షల ఖద్దరును దేశమున కవసరమైన బట్టలో 500వ వంతైనను గాకున్నది. స్వదేశమునందు బట్టలను తయారుచేయుటకు గల యనంతావకాశములను నీలెక్కలు తెలుపుచున్నవి. హిందూదేశ మితరదేశములకు 1800 సంవత్సరమువరకును బట్టల నెగుమతిచేయుచుండెను. 1879 నందు 7 కోట్ల రూపాయల బట్టలును; ఇపుడు 80 కోట్ల రూపాయల బట్టలును దిగుమతి యగుచున్నవి. అన్నము, బట్ట సకలజనులకును ముఖ్యావసరములు. పోటిలేనపు డేదేశపు బట్టను ఆదేశము నేయుట వాడుట సహజము. యంత్రాలయములు మిల్లుబట్టను చవుకచేసినవి; ఖద్దరును ప్రియముచేసినవి. మిల్లుబట్ట ఒకరూపాయికిని, ఖద్దరు రెండురూపాయ

లకును విక్రయింపబడునపుడు మిల్లుబట్టను కొనుటయే మానవస్వభావము. దొడ్డియందు ప్రత్తియును, ఇంటియందు నూలును నుండునపుడు బట్టకు వెలను నిర్ణయింప నవసరము లేదు. సొమ్ముపెట్టి కొనునపుడు వెలయందలి వ్యత్యాసము గనుపడుచున్నది. ఇపుడు నూలు వడికెడు వారును, ఖద్దరును నేయువారును కూలికి పనిజేయుచున్నారుగాని స్వయముగను ఖద్దరును వాడుటలేదు. ఖద్దరును కొనెడివారున్నపుడు కావలసినంత ఖద్దరు దేశమునందు తయారుగాగలదు. శ్రీమంతులును దేశాభిమానులును మిల్లుబట్టలకు బదులు ఖద్దరు బట్టలను కొనుటకు బూనుకొనుటవలనను దరిద్రనారాయణులు శ్రీమన్నారాయణులగుట కవకాశములు గలవు. ఖద్దరు బట్టలను కట్టుకొనుటకు ఇష్టములేని సంపన్నులు ధనసహాయమును చేసి ఖద్దరు నిర్మాణ వ్యాపకములకు దోడ్పడవచ్చును. ఖద్దరువ్యాపనము కొనెడివారికొ, అమ్మెడివారికొ ద్రవ్యరూపమైన నష్టమును గలుగజేసినను దేశమునకాత్మగౌరవమును, ధర్మాభ్యుదయమును, ధనసమృద్ధిని గలుగజేయుచున్నది. ప్రజలయందు భక్తి శ్రద్ధలును, త్యాగశీలమును వర్ధిలునపుడు ఖద్దరువ్యాపనము సహజముగను గలుగగలదు. గాంధిమహాత్ముడు గద్గదస్వరముతో బెంగుళూరునందు జేసిన హితోపదేశము కఠినాత్ములయందును విచారము గలుగజేయగలదు. అధోగతిపాలైన ప్రజలహృదయమునందు పరితాపము గలుగుట దుర్లభము గదా!

* * * *

యంత్రాలయములు

దూది జనుపనార యంత్రాలయములయందును,ఇతరపరిశ్రమలయందును 21 లక్షల జనులును, చేతిమగ్గములయందు 20 లక్షల మందియును మాత్రమె పనిజేయుచున్నారు. భరతవర్షమునందలి ఏయంత్రాలయ పరిశ్రమయందును ప్రజల యాదాయమును వృద్ధిచేయుట కవకాశములు గనుపడవు. ప్రజలయందు 100 కి 90 మందికి వ్యవసాయము జీవనాధారమై గ్రామసీమలు నివాసస్థలములుగనున్నపుడు యంత్రాలయపరిశ్రమలు వికసించుటకును సాధనములు గనుపడవు. వ్యవసాయయోగ్యదేశము పరిశ్రమదేశముగ మారుటకును చిరకాలమును, అపారమైన సంపదలును గావలయును.యంత్రయుగమునందు యంత్రోపయోగమునుబహిష్కరించుట యనుచితము. అమెరికాయందు ప్రజలు యంత్రసహాయముననువారి సంపదలను వృద్ధిచేయుచున్న విధమును విశ్వేశ్వరయ్యగారు హృద్యముగను వర్ణించిరి.

ప్రతిమనుష్యునకును ఇరువది నౌకరుల పనిని యంత్రములు చేయుచున్నవి. యంత్రములు ప్రజలకు విశ్రాంతిని, సంపదలను, సౌకర్యములను సమకూర్చుచున్నవి. యంత్రములన్నాహారము లడుగని బానిసలుగను పని జేయుచున్నవి. యంత్రసహాయమునను పని జేసెడివారి పోటికి యంత్రసహాయము లేనివారు నిలువజాలరు. బ్రిటీషు ప్రభుత్వము ఆరంభమునందు ఖద్దరుపరిశ్రమను సుంకములనువేసి నాశనము చేసినది; ఇపుడు యంత్రాలయముల

సాధనమునను పునరుద్ధరణమును దుర్లభము జేయుచున్నది. గ్రేటుబ్రిటను పోటీకన్నను జపానుపోటీ బలీయముగ నున్నది. ఇపుడు జపానునుండి 10 కోట్ల రూప్యముల బట్టలు దిగుమతి యగుచున్నవి. స్వదేశమునందలి దూదియంత్రాలయముల పరిశ్రమము క్షీణించుచున్నది. ఖద్దరు చవుకయైనస్వదేశయంత్రాలయముల పోటీకిని, విదేశ యంత్రాలయముల పోటీకిని నిలువజాలకున్నది. అణాలు పైసలు లెక్కలు వేయునపుడు ఖద్దరు వెనుకబడుచున్నను స్వధర్మనిర్వహణ సమస్యయందు ఖద్దరు ప్రముఖముగనున్నది. ఖద్దరునకుపెట్టిన సొమ్ము విదేశములపాలు గాకను స్వదేశమునందుండి దేశాదాయమును వృద్ధిచేయుచున్నది. అన్నాతురులైన సోదరుల కన్నము నొసంగి జాతీయసత్త్వమును సంరక్షించుచున్నది. జాతీయసత్త్వమును సంరక్షించుటకు సమష్టిప్రయోజనమువలెను వ్యక్తిలాభములు ప్రయోజనకరములుగావు. ఖద్దరు స్వధర్మమునకును, స్వాతంత్ర్యమునకును బాహ్యచిహ్నమై ప్రత్యభిజ్ఞానమును సంస్మరింప జేయుచున్నది. ఖద్దరు త్యాగమునకు చిహ్నమై మానవసోదరత్వమును స్థాపించుటకు సాధనముగ నున్నది. లోకమునందు పరిత్యాగశీలమున కసాధ్యమేదియును లేదు. గాంధిమహాత్ముడు సత్యాగ్రహధర్మమునందు త్యాగధర్మము ప్రధానమని చేయుచున్న యుపదేశమును భారతీయులు సార్థకము చేయుటకు ఖద్దరు దీక్షను బూనుదురుగాత!

విశ్వేశ్వరయ్యగా రుపదేశించిన యంత్రోపయోగము ఖద్దరు ప్రచారమును ప్రతిఘటించుటలేదు. భరతఖండమునందు 300 దూదియంత్రాలయము లున్నను 20 లక్షలమంది చేతిమగ్గములమీదను పనిజేయుచున్నారు. ప్రజలయందు ఖద్దరుదీక్ష ప్రబలునపుడు ఖద్దరు పరిశ్రమయును లాభనష్టములతో నిమిత్తము లేకను వ్యాపకమును సహజముగ బొందగలదు. మిల్లుబట్టలును స్వదేశమునందును, విదేశములందును వ్యాపకమును గలిగియుండుటకు విశేషావకాశములు గలవు. ఆసియా, ఆఫ్రికా దేశములందు బట్టలవ్యాపారముచేయుటకు మిల్లుల యజమానులకు మంచి యవకాశములు గలవు. మిల్లులయజమానులు వారి లాభమును తగ్గించుటయును, వ్యాపారనౌకలు దేశమునందు ఏర్పడుటయునుమిల్లుబట్టలవ్యాపారవ్యాపనమునకు సాధనములుగ నున్నవి. యంత్రములయుపయోగముమిల్లులపరిశ్రమయందే కాకయితరపరిశ్రమలయందునుచేయుటకు దేశమునందు విశేషావకాశము గలదు. యంత్రోపయోగమును దేశమునకు ప్రధానపరిశ్రమయైన వ్యవసాయపరిశ్రమయందు జేయుటకు విశేషావకాశములు గలవు. ప్రజల పరాధీనస్థితియందు దేశావసరములను నిర్ణయించుటకును, నిర్ణయములను సార్థకముజేయుటకును దుర్లభముగ నున్నది. బ్రిటిషు ప్రభుత్వదృష్టి వ్యాపారవాణిజ్యములందు లగ్నమైనట్లు భారతీయ పరిశ్రమలందు లగ్నము గాకున్నది. రాయల్ కమీషను లన్నియును భారతీయుల పరాధీన స్థితిని స్థిరతరము జేయుటకు వివి

1 యోగపడుచున్నవిగాని పరాధీనస్థితిని శిథిలము చేసి స్వాధీనస్థితిని స్థాపించుటకు వినియోగపడుట లేదు. వ్యవసాయవిచారణసంఘము, రాజ్యాంగవిచారణ సంఘము మొదలైన రాయల్ కమీషనులు వచ్చిపోవుచుండును. ఈ విచారణసంఘములనిర్ణయములు పరాధీనస్థితిని బలపఱుచుటకు వినియోగపడుట బ్రిటీషుసామ్రాజ్య ప్రయోజనములకు సహజఫలముగనున్నది. భారత దేశవిమోచనము భారతీయులహస్తము నందుగలదని ప్రజలు గ్రహించి పాటుపడనంత వఱకును స్వరాజ్యమున్ని హితముకాజాలదు. స్వరాజ్యము కేవలము విద్యావంతులమీదను గాకను ప్రజాసామాన్యముమీదను ఆధారపడియున్నది. గ్రామసీమలందు నివసించెడి ప్రజాహృదయమునందు స్వరాజ్యానురాగము గ్రామపునర్నిర్మాణమూలమునను గలుగునంత వఱకును స్వరాజ్యము దుర్లభము. వర్తమాన కాలమునందు నాయకులదృష్టియును, ప్రభుత్వదృష్టియును గ్రామపునర్నిర్మాణమునందు లగ్నమగుట భావిభాగ్యోదయమునకు శుభలక్షణముగ నున్నది.

* * * *

గ్రామపునర్నిర్మాణము

దేశమునం దంతటను గ్రామపునర్నిర్మాణ విషయమై ఆందోళనము బయలుదేరినది. గాంధిమహాత్ముడు నిర్ణయించిన నిర్మాణకార్యవిధానము గ్రామపునర్నిర్మాణమును కోరుచున్నది. దేశబంధు చిత్తరంజనదాసు గ్రామపునర్నిర్మాణావసరమును ప్రకటించెను. అభివృద్ధి శాఖా మంత్రి గౌ॥ రంగనాథ మొదలియారుగారు వారిజీతమునుండి కొంత ద్రవ్యమును వినియోగించుచున్నారు. కాంగ్రెసు ప్రచారకులు గ్రామపునర్నిర్మాణమును చేయుటకు దలపడుచున్నారు. గ్రామపునర్నిర్మాణము మామూలుపద్ధతులమీదను సాధ్యము కాదు. గ్రామములకు నీటిసౌకర్యము లేదు. బాటలు లేవు. తపాలాసౌకర్యములు లేవు. వైద్యసహాయము లేదు. విద్యాలయములు లేవు. పరపతి లేదు. గ్రామములు పార్టీలతో నిండి కలహరంగములుగ పరిణమించుచున్నవి. గ్రామములు చెల్లించు పన్నులు పరస్థలములందు ఖర్చుపడునటుల గ్రామములందు ఖర్చుపడుట లేదు. గత మాసమునందు కలరా వ్యాపించినపుడు ప్రజలు నిస్సహాయులై మృత్యు దేవత వాతపడిరి. గ్రామాదాయమునందు కొంతభాగము గ్రామ సౌకర్యములకు గ్రామస్థులవశముచేసినగాని గ్రామపునర్నిర్మాణమునకు ప్రధానమైన సాధనము గలుగజాలదు. గ్రామస్థులు కక్షలను మాని కలిసి పనిచేయనంతవఱకును గ్రామపునర్నిర్మాణము దుర్లభముగా నున్నది. గ్రామమునకు జీవనాధారమైన వ్యవసాయమును వృద్ధిచేయుట, గృహపరిశ్రమలను ఉద్ధరించుట, పరపతిని వ్యాపింపజేయుట, నీటివసతులను, బాటలను నిర్మించుట మొదలగుకార్యములు పునర్నిర్మాణమునకు సాధనములుగ నున్నవి. పునర్నిర్మాణము క్రియారూపమున సాధ్యమగునుగాని మాటల వలన సాధ్యము కాదు. ప్రభుత్వాధికారులు, నాయకులు, ప్రచారకులు వితండవాదములను, నివేదనలను కట్టిపెట్టి క్రియారూపమునను

గ్రామపునర్నిర్మాణమునకును, స్వరాజ్యస్థాపనమునకును పూనుకొనుట ప్రయోజనకరము.

* * * *

స్వరాజ్యము

స్వరాజ్యము కేవలము మానసిక స్థితి గాదు. సిద్ధాంతములందుగల స్వరాజ్య ధర్మమనుభవమునకు వచ్చినపుడు స్వరాజ్యము సార్థకమగుచున్నది. స్వరాజ్యాశయము కేవలము రాజ్యాంగముల కేకాకను సాంఘిక నైతికార్థికాది వ్యవస్థలకును వ్యాపించుచున్నది. గ్రేటుబ్రిటను స్వరాజ్యము ననుభవించుచున్నను కార్మికులు స్వరాజ్య సంపాదనమునకు సంరంభమును జేయుచున్నారు. గ్రేటు బ్రిటనునందు సంపన్న వర్గమునకును, కార్మిక వర్గమునకును సంప్రాప్తమగుచున్న సంరంభము విశ్వవ్యాప్తమైన స్వరాజ్యానుతాపమును విశదము చేయుచున్నది. స్వాధీన రాజ్యములకన్నను పరాధీనరాజ్యములందు స్వరాజ్యానుతాపము ప్రచండరూపమును దాల్చుచున్నది. స్వాధీన దేశములందు భోగాభ్యుదయమునకు సాధనంబైన సంరంభము పరాధీన దేశములందు ప్రాణరక్షణమున కవసరంబుగ నున్నది. బ్రతుకు సాధ్యమైనపుడు సుఖములకు వేచి యుండవచ్చును. బ్రతుకె దుర్భరమైనపుడు నిరాశగలుగుచున్నది. పిల్లికి చెలగాటలు ఎలుకకు ప్రాణసంకట మను సామెత గ్రేటుబ్రిటను స్వదేశమునందును, విదేశములందును నవలంబించుచున్న రాజనీతికి నిదర్శనముగనున్నది. గ్రేటుబ్రిటనునందు కార్మికబలమును నిర్మూలము చేయుటకు బ్రిటీషుప్రభుత్వము పట్టు పట్టినది. పరదేశములందు స్వాతంత్ర్యాశయములను ధ్వంసము చేయుటకు పూనుకొను చున్నది. చీనాహిందూదేశములపట్లను బ్రిటీషు ప్రభుత్వ మవలంబించుచున్న నిరసవభావము ప్రాజ్ఞులకు సంతాపమును గలుగజేయుచున్నది. కాలాంతరమునను కార్మికులును, పరాధీన ప్రజలును ప్రబలుట తథ్యమైనను ప్రస్తుతము విషాదమును గలుగజేయు చున్నది. చీనాయందు ప్రత్యక్షమగుచున్న స్వయంవ్యక్తిత్వము భరతఖండమునందును సూక్ష్మముగను ప్రత్యక్ష మగుచున్నది. చీనాయందు భరతఖండమునందుగల సాంఘిక విభేదములు లేక పోయినను పక్షములు ప్రబలి యంతఃకలహములు ప్రబలుచున్నవి. భరతఖండమును, చీనాయును జాతీయప్రసవవేదనాదుఃఖము ననుభవించుచున్నవి. ఈదుఃఖసమయమునందు దుఃఖోపశమనమును జేయుటకు సామర్థ్యముగల బ్రిటీషు రాజ్యనీతిజ్ఞులు ధిక్కరించుటయును, తిరస్కరించుటయును, పరిహసించుటయును విచిత్రముగ నున్నది.

* * * *

అంతర్విభేదములు

స్వరాజ్య సంరంభమునం దారంభ దశయందు ప్రజాదృష్టి స్వప్రయోజనము లందు లక్ష్యమగుట సహజము. బ్రాహ్మణులు,బ్రాహ్మణేతరులు- హిందువులు, మహమ్మదీయులు- సంస్థానములు, బ్రిటీషుభాగములు-పరస్పరము ప్రతిఘటించుట సహజము. కాని ఈయవిశ్వాసము చిరకాలము నిలువజాలదు. సర్వసంహారము చేయుచున్న శత్రువుల సమక్షమునను

నంతర్విభేదము లంతరింపగలవు. చీనాయందు జరుగుచున్న స్థితియె హిందూదేశము నందును నడచుచున్నది. హిందూమహమ్మదీయ విభేదములు నంతరింప జేయుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. బ్రాహ్మణేతరులు, జస్టిసుపక్షాశ్రయులు కాంగ్రెసు నందు చేరుచున్నారు. కోయంబత్తూరుతీర్మానానుసారముగను బ్రాహ్మణేతరనాయకులు రామస్వామి మొదల్యారు గారు మొదలగు వారు కాంగ్రెసునందు జేరుచున్నారు. స్వదేశసంస్థానాధీశులు స్వరాజ్యాశయముల పట్లను సుముఖత్వమును జూపుచున్నారు. మైసూరు మహారాజాగారిర్విను ప్రభువునకు స్వాగతంబు నొసంగుచు సంయుక్త భరతవర్షమునందుగల యభిలాషను విశదము చేసిరి. స్వదేశసంస్థానములు రాష్ట్రములతో పాటు గౌరవస్థానమును గలిగియుండుట సకల జనులకును సమ్మతముగనుండగలదు. హిందువులును మహమ్మదీయులను విశ్వసించుట యవసరము. మహమ్మదీయులు హిందువుల నాదరించుట యుక్తము. కాంగ్రెసు ప్రచారకులు బ్రాహ్మణేతరులకుస్వాగతంబు నొసంగుట యవసరము. జస్టిసుపక్షము కాంగ్రెసుపట్లను భక్తిని వహించుట ధర్మము. దేశమునందు వ్యాప్తమైన యంతర్విభేదములు పోనంత వరకును ఇర్విను ప్రభువులధర్మోపదేశములు, ఓడ్వయరుల నిరసనభావములు, వింటర్టనులవ్యంగ్యములు, బర్కెనుహెడుల నిర్లక్ష్యములు సహజావస్థలు. భారతీయుల కార్యపరత్వమె అంతర్విభేదములను బోగొట్టుటకును, నిరంకుశాధికారమును నిర్వీర్యము చేయుటకును సాధనముగ నున్నది. భారతీయు లందరును గాంధి మహాత్ముని యుపదేశములను పాలించి, వాగ్వివాదములను కట్టిపెట్టి, కార్యపరాయణులై స్వరాజ్యమును బడయుటకు భగవంతుడు తోడ్పడు గాత!



Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No.7, Thumbu Chetty Street, G.T., Madras